# భారతీదేవి స్మృతులు





ఆచార్య రంగా

# భారతీదేవి స్మృతులు





ఆచార్య రంగా

# భారతీదేవి
## స్మృతులు

ఆచార్య రంగా

౧౯౬౭

కిసాన్ పబ్లికేషన్స్
నిడుబ్రోలు

ప్రథమ ముద్రణ :
ఏప్రియల్, 1975

వెల : రు. 16/-

డిస్ట్రిబ్యూటర్స్ :
నవోదయా పబ్లిషర్స్ - విజయవాడ-2
దేశీ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ - విజయవాడ 2
నవజీవన్ బుక్ లింక్స్ - విజయవాడ-2
నవయుగ బుక్ సెంటర్, విజయవాడ-2




శ్రీ ప్రింటర్స్
విజయవాడ-2

---

భారతీ దేవి
నీ మాతృదేవి వెలుగు పిచ్చమ్మ
పూజ్యులు తండ్రి వెలగా సుబ్బయ్యగారికి
అంకితముగా అందిస్తున్నాను

— రంగ

---

భారతీదేవిజీ తల్లి దండ్రులు



తల్లి పిచ్చమ్మగారు



తండ్రి సుబ్బయ్యగారు

# తొలిపలుకు

భారతీదేవి స్వర్గీయులైన తరువాత ప్రథమ వర్ధంతికి, దేవీ శ్రీ 1935లో ప్రారంభించిన 'వాహిని' పత్రిక, అప్పటికి నా హృదయ ఫలకంపైన పెల్లుబుకుచున్న కొన్ని మధుర స్మృతులను ప్రచురించిరి. ఆ వ్యాసంచదివిన శ్రీ దివ్యప్రభాకర్ తనసంపాదకీయంపు దృష్టితో-

"ఎక్కడెక్కడి సంఘటనలో, కెరటాలుగా ఉప్పొంగివస్తున్నాయి. వాటికి ఎక్కడెక్కడివో మాటలు, చిట్టి చిట్టి వాక్యాలు ఆలంబనమౌతున్నాయి." - యిలావ్రాస్తుంటే యీ మధురస్మృతి "వాహిని" మహాకావ్యముగా 'రూపొందు'ననుకున్నారు.

ఆ 1973 అక్టోబరు 8వ తేదీన నేను, వాహిని, సంపాదకులు శ్రీ గోగినేని నాగేశ్వరరావు కీ॥ శే॥ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య గారికి స్మృత్యంజలి అందించుకోవాలని, పండిత గొ॥ వెంకటసుబ్బయ్య గారి కోరికపై ఘంటశాలకు వెళ్ళితిమి. అప్పుడు పండితులు తమ సోదర ప్రేమతో, "వాహిని"లో అందించిన స్మృతుల ధోరణిలో భారతీదేవి అనుభవములు, ఆలోచనలు, మా యిద్దరి స్నేహ, సహకార అనుభూతులతో ఓ పుస్తకము వ్రాసి తీరాలన్నారు అదొక అసాధారణమైన సాహిత్య ప్రయత్నమగునే, అంతటి స్మృత్యాలోచనలలో నేను వుండగల్గే సత్తా, సావకాశం సాధ్యమా అనుచుంటిని. తప్పక తమకోర్కెను సఫల పరచాలన్నారు. ఆ నాటి వారి ప్రబోధం వల్ల యీ ప్రయత్నం చేసినాను. యీ స్మృతులకు మాటల స్వరూపము యిచ్చినాను ఇంకెన్నో ఆలోచనలు, అనుభవాలు మా దంపతుల మధ్య 1924 నుండి 1972 వరకు అందుచుండేవి! ఒక వరుసగా

అవ్వి తిరిగి మనోఫలకమున అందవు! కన్పించుతూనే కదిలి పోతూ వుండును. ఇంతలో యీ నాటి రాచకీయాలలో, సాంఘిక సమస్యల లోని బాధ్యతల నందుకొంటూ వుండాలిగదా? భారతీదేవిని స్మరించు కొంటూవుండడం నాకెప్పుడూ అందే ఆనందం, బలం ,కనుక నే యీ గ్రంధం రూపొందించడం సాధ్యమైనది. ఈ నిర్మాణ కార్యమునకు తన ప్రేమపూరిత పట్టుదలనాకందించిన పండిత గోరెపాటికి ప్రత్యే కంగా కృతజ్ఞుడను!

దేవి రెండో వర్థంతి సందర్భముగా ఇంగ్లీషులో "**Agony and Solace**" అనే 620 పేజీల గ్రంధాన్ని "యింగ్లీషులో ప్రచురించితి ! ఆమెకే అంకితము చేసితిని. దాన్ని ఆచార్య రాజన్న తెలుగులోకి తెస్తున్నారు.

ఈ గ్రంధాన్ని భారతీ దేవిని పెంచి, నాకు అందించిన వారి దివ్య మాతృదేవి, తండ్రికి అంకితము చేసుకుంటున్నా.

16-2-75 — రంగ

# మధుర కవి

ఆచార్య రంగా దంపతులకు 'భార్యాభర్తలు' అనేమాట ఏ విధంగానూ నప్పదు. ఈ జంటపదం ఆర్థికంగా, సాంఘికంగా, సాంసారికంగా ఒకరు మరొకరిపై ఆధారపడటాన్ని సూచిస్తుంది. పోనీ ఆధునికులు కావాలనుకుంటున్నట్టు వీరిరువురు సమానులా? అదీకాదు. వీరికి-ఒకరిదృష్టిలో ఇంకొకరు అధికులు. రంగాజీకి భారతీదేవి అంటే భక్తి, గౌరవం. భారతీదేవికీ రంగాజీపట్ల తిరిగి అదే భావం. కనుక వీరు సమాన హక్కు- బాధ్యతలుగల 'ఆధునిక దంపతులు' కూడా కారు. ఒక విధంగా ఆలోచిస్తే ఆదిదంపతుల పోలిక వీరికి సరిపోతుంది.

ఇంతటి విశిష్టమైన జంట విడిపోవటం విధి క్రౌర్యానికి - లేక పోతే 'లీల'కు నిదర్శనం. ఇక ఆయనకు ఆలోచనలు, కథలు,స్మృతులే మిగిలాయి. అయితే ఆలోచనలను, కథలను, స్మృతులను అందరూ కాగితంమీద పెట్టగలరా? అనిపించినదానిని అనిపించినట్లు చదువరికి అందించగలరా?-- ఈ విశిష్టతకూడా ఇక్కడే పరిమళించింది. ఆ దాంపత్యానికి అక్షరత్వం ప్రాప్తం కావలసి వుడటం చేతనే ఇది సాధ్యమైనదనుకోవాలి.

సుప్రసిద్ధ హాస్యరచయిత మునిమాణిక్యం నరసింహారావు తన 'భార్య' కాంతాన్ని గురించి ఎన్నో కథలు, సంఘటనలు వ్రాశారు. అవి హాస్యోత్పత్తిచేసే విధంగా రూపొందాయి. అంతేగాక వాటిలో సామాన్య సంసారులైన భార్యాభర్తల కోపగింపులు, ఈసడింపులు, వేవగింపులు వగైరాలే కనిపిస్తాయి. ఈ అవాంతరాలకు చివరి ప్రతి సంసారీ అనుభవించే కించిత్ సాంసారికానందం గోచరిస్తుంది. అంతటితో సరి. కానీ రంగాజీ తమ అర్ధాంగిని గురించి వ్రాసిన రచనలలో వ్యక్తి వైశిష్ట్యం కనిపిస్తుంది. కళాదృష్టి కనిపిస్తుంది. పరిణతి చెందిన ప్రేమ ప్రకాశిస్తుంటుంది. భక్తి గౌరవాలు వెల్లువలై - ఆ ఉల్లాలిని

ఎన్నడు చూడనివారిలోకూడా ఆమె యెడల గొప్ప గౌరవభావం మొలకెత్తడానికి దోహదం చేస్తాయి.

తమ గృహిణిని గూర్చి గృహస్థు వ్రాసిన రచనలు తెలుగులో అరదు. ఒక నాయకుడు-నాయకిని గురించి వ్రాసిన రచన అసలు లేనే లేదనవచ్చు. ఈ విధంగా ఈ గ్రంథంలోని భావపరంపర తెలుగు సాహిత్య సీమకే ఒక క్రొంగొత్త ప్రయోగంగా అవతరిస్తోంది.

ఇక ఈ రచన నడిచిన తీరు !

—ఆయన జీవితం సమస్యలు; పరిష్కారాలు; జయాలు; అపజయాలు - ఈ గొడవల్లో పడిన వాళ్ళకి మధుర భావన సాగటం సాధ్యమా? కానీ చిత్రం! శ్రీ రంగా మధురంగా భావిస్తారు. వివరంగా చెవుతారు. చతురంగా వ్రాస్తారు....కన్యాకుమారిని ఎందరు చూడలేదు? అక్కడ సూర్యుడు—ఆ సాగరత్రయ సంగమంలో—అక్కడే ఉదయించి అక్కడే అస్తమించటాన్ని ఎందరు గమనించ లేదు? అయితేనేమి? మధురానుభూతి పొందనిదే ఎంతసేపుచూచినా, ఎన్నిసార్లు చూచినా వ్యర్థమే!... దేవిజీ రవి బింబాన్ని చూస్తున్నారు. అది ఆమె నుదుటి కుంకుమ బింబంలాగా వుంది— రంగాజీకి ! అనగా దేవిజీ రవిబింబాన్ని చూస్తుంటే-రంగాజీ దేవిజీని చూస్తున్నారు !

ఆ కాశ్మీరులో-తామిద్దరేనట, చిన్నపిల్లలై పోయారట! తేటులు ముసిరే తోటల్లో, తోటల పూలబాటల్లో చేయి చేయి కలిపి చెంగు చెంగున గెంతారట! సరస్సులో యే పడవటింటిలో పలుమాటలు, పలుచేతలు-పడుచువాళ్ళే అయినారట!

"ఆమెకు పూలంటే ప్రాణం" అంటారు-కానీ తమకూ అంతకంటే మిక్కిలిమక్కువ-అని చెప్పరు! అయినా మనకి తెలిసిపోతుంది.

అప్పుడేమి, ఇప్పుడైనా, ఎప్పుడైనా ఆయనకు - పూలన్నా, పూలదండలన్నా ఎంతో అపేక్ష. ఆప్తుల్ని, మిత్రుల్ని, పెద్దల్ని - ఎవరిని గౌరవించాలన్నా ఆయన చేతిలో పూలో, పూలమాలో ఉండ వలసిందే !



ఎక్కడెక్కడి పూలజాతుల్నీ ముచ్చటగా తెచ్చుకొని గోభూమిలో ప్రేమతో పెంచుకొన్నారట! ఎక్కడో, ఎప్పుడో మద్దమందారాలు కనిపిస్తే, వాటి ముగ్ధత్వాన్ని గమనిస్తే - దేవిజీ స్మృతికి వచ్చారట! వాటిని ఆమె చూస్తే ఎంతగా గౌరవిస్తారో, ఆదరిస్తారో, శిరోధార్య మనుకుంటారో గదా. అని రసార్ద్రి భావన.

ఎప్పుడైనా పూలనుచూసి, ఆయన అలా భావిస్తే; భావించానని చెపితే మన మనసెంత కరిగిపోతుందో గదా ! పూలను గురించీ, పూలకూ - తమ నెచ్చెలికీ గల చెలిమిని గురించీ ఒక రచన !

సరే, ఇవన్నీ సంతోష సమయాల్లో పొంగి వచ్చిన మధుర భావనలనుకొందాం.

ఒకసారి ఈ ప్రేమదంపతులు పయనిస్తున్న ఓడకు నిప్పంటుకున్నది. ఇక్కడ రసం భీభత్సమే! ఇద్దరూ సాహసించారు. ఇంతచిన్న పడవలో అంత పెద్ద అలలమీద - ఒకసారి కుదుటపడి, మరోసారి మింటికెగిసే ప్రాణాలతో జంటగా-చీకటిలో-ఎటో వెళ్ళిపోతున్నారు. తమకిక రేపన్నది ఉన్నదో, సున్నో! "భయమా? ఇద్దరం కలిసే ఉన్నాముగదా! ఉంటే ఇద్దరం - పోయినా యిద్దరమే". "ఒకవంక నిప్పు. మరొకవంక నీరు-దేనికర్పిద్దాము ప్రాణాలను!" 'నీరే సుఖం' అని కూడబలుక్కున్నారు చేతులు కలుపుకొని ముందు దూరికారు.

అబ్బా! ఎంతటి భయంకరమైన, భీతావహమైన సమయం! మానవుల నిజరూపాలు, సొంత ప్రాణాలమీది తీపి, స్వార్థాలు అప్పుడేగదా బయట పడేది!

కానీ, ఇవెక్కడున్నాయి. వీటి నామరూపాలైనా లేవు. అంతకు మించిన మధురభావన మాత్రం సాగరమంత గంభీరంగా ఉన్నది.

ఆపదలు, ఆనందాలూ అనుభవించటమే తెలుసు కొందరికి. కానీ అంతటి ప్రమాదకర పరిస్థితిలో, తన్మయ స్థితిలోకూడా-పరిశీలన ఆలోచన, వీటితో పాటు మరెంతో తీపి!

ఈ రాజకీయవేత్తలో, ఈ సిద్ధాంతకర్తలో, ఈ గంభీర మూర్తిలో, ఈ కష్టకార్తిహర్తలో ఏ మూల ఉన్నాడో ఈ మధురకవి!

రంగుల కుంచెపట్టి తేటతెనుగు మాటల్లో చిట్టిపొట్టివాక్యాల్లో ఏ సమయంలో ఈ కవి- ఈ సుందర చిత్రాలను గీస్తారో!

"భాగవతం వ్రాస్తూ పోతనగారు మధ్యమధ్య తన గంటాన్ని పంచదారలో అద్దినాడేమో, ఈ పద్యాలింత తియ్యగా ఉన్నాయి" అంటాడు కరుణశ్రీ.

అలాగే మధురభావ విలసితాలైన ఈ అందాల బొమ్మలను గీస్తూ తమ కుంచెను పంచదారలోనో, పాయసంలోనో, పట్టు తేనెలోనో ముంచరుగదా రంగాజీ!

కాదు, కాదు.

ఉభయ సంధ్యల్లో ఆయన-నిడుబ్రోలులో అయితే గోభూమి పూలమొక్కల నడుమను. విజయవాడలో అయితే 'సత్యంఆరామం' లోని సుమ మంజరుల నడుమను తిరిగేటప్పుడు ఆస్వాదించే సుమ సౌరభాలలో సమ్మిళితమై అందే పూదేనెల తీపి కావచ్చు!

ఆ కవిత తీపిని గురించి చెప్పిచెప్పి నోరూరించటం భావ్యం కాదు. చదవండి.

—o—

... శ్రీ ఆర్. డి. ప్రభాకర్

# దేవీజీ మధుర స్మృతులు

మేము జవహరు హాలులోకి చేరుతున్నాము. అది ఆయన జన్మదినము. నవంబరు 14. కోకిల కంఠముతో పల్కు వినబడ్డది. అట్టే చూచినాను, సరోజినీదేవి! "భారతీ వస్తున్నావా, ఎంత ఆనందం, నెమ్మదిగా నడిచిరా! నీవు నడుస్తుంటె చూచి తీరాలి. ఖద్దరుకెంత అందమిస్తున్నారు" కాళ్ళు తన పడకకుర్చీ ముందున్నపీట పరుపుపై వున్నవి. అంతనోరు, మరెంతటివో ఆ కళ్ళు! ఆపైన అఘనమగు కంఠము. ఆమె సరోజిని, మన సరస్వతి!

అందుకున్నాము ఆమెను, "భారతీ, నీ నయనాలెంత అమృతాన్ని, చంద్రకాంతుల్నీ అందిస్తున్నవి. అలా ఉండాలికళ్ళు! 'భారతీదేవి కళ్ళు భారతమాత కళ్ళలాగానే కరుణకాంతుల వెదజల్లుతుంటాయి'- అని, నీ సంగతి చర్చించుకున్నప్పుడెల్లా, బాపూతో, జవహరుతో చెప్పుతుంటాను" అన్నారు.

"రంగాజీ జన్మదినోత్సవానికి, సందేశం పంపించాను. చదువుకున్నారా" అని అడిగిరి.

"మీపేరు చెప్పుకుంటేనే మా కుటుంబానికి ఆనందంగదా!" అన్నారు దేవీజీ.

ఆమె తృప్తితో "చూచినావా, మిమ్ము నేను మాత్రం మరువను! అందులో మా భారతిని" అంటూ ఆమె నెన్నుదురును స్పృశించిరి.

జవహర్‌లాలుకు ఒకనాడు మరెందరెందరో అతిథులు. రంగు రంగులవారు, వేర్వేరు కళలు, కాంతులు విరజిమ్మువారున్నా, అంత మూరాన్నుండే, దుడుకుగా, తిరిగి మరి అందరేమోనన్నట్లు వచ్చి, భారతీదేవిని ఆహ్వానించి, "మా వేషాలు మీకు నచ్చవుగా! ఐనా, ఈ ఆర్భాటం తప్పుతుందా" అన్నారు. ప్రతిమారు ఆమెను అలాగే గౌరవించేవారు.

నేనా ఖద్దరుమాలను వారికి జన్మదిన గౌరవంగా అందించుచుంటే, సరోజినీదేవి చమత్కారంగా "చూచిరా, జవహర్, నీవైనా మరుస్తావేమోగాని, రంగా మాత్రం ఖద్దరును మరువడు. ఆతడు నిజమైన రైతు. ఎందుకు రైతులపై దాడిచేస్తా"వన్నారు. భారతీదేవి దేవి మొగము ఆకాశమందినది ఆనందంతో.

వల్లభపంతునకు వల్లమాలినంత గౌరవం, ప్రేమ-భారతీదేవి యందు! మరింకెవ్వరు ఆయన్ను కాదని, మంత్రిపదవి వద్దని, ఆయనచే మొక్కించుకొన్న వారు కలరు!

రాజేంద్రబాబును కలుసుకున్నప్పుడు, ఎన్నోమారులు, దేవిజీని అభిమానిస్తూ, "నిన్ను పొగడని సమయమే వుండదు బాపూజీకి" అనేవారు! "ఏమండీ నీవెంత అదృష్టవంతురాలవు" అని నేనంటే, "మర్యాదకొరకు ఆ పెద్దవారు అలా అంటూ వుంటారులెండి" అనేవారు దేవీజీ. బాపుజీకి దేవీజీపై గొప్ప ప్రేమ, గౌరవం! ముఖ్యంగా 1933లో గుంటూరుజిల్లా పర్యటనలో, భారతీదేవి వారి దృష్టికివచ్చిరి. నిడుబ్రోలులో, వారికి తానే కుట్టిన చిన్న సంచి దానిపై బాపూజీ రూపాన్ని దారంతో అల్లి అందు వసూలుచేసినడబ్బు, తన గాజులు చేర్చి వారి కందించిరి.



అప్పుడు వేదికపై తన ప్రక్కనే ఆశీనులైన ఆమెతో "మా తల్లి మంగమ్మ" అంటూ అచ్చటజేరిన వేలాది జనాల వృత్తులగురించి పాటలు, పదాల ధోరణిలో మావృత్తి వ్యాసంగముల గురించి ఆమె ద్వారా తెలుసుకొనిరి. నేరేడుచెట్ల సౌందర్యమును గ్రహించుకొనిరి

తాళ్ళపాలెం పోతున్నప్పుడు, కొంతదూరం నడుస్తూవుంటె' ఎండిన మట్టిగడ్డ గట్టిగా తగిలి, భారతీదేవి వ్రేలునుండి బొట బొట నెత్తురు వస్తూవుండెను. అదిగమనించి బాపు బాధపడిరి. ఏమీ పరవా లేదనిరి భారతీదేవి! మరేదో మాట్లాడుతూ "ఎందరో తమ హృదయ రక్తాలను అర్పిస్తున్నారు మీ సమ్ముఖంలో. యీ నాలుగు రక్తపు బొట్లు వాటంతటవే మీకు భజనచేస్తుంటే చూచుకొనే అదృష్టవంతురాలను" అన్నారు దేవీజీ! ఆ మాటలకు ముగ్ధులై "రంగా నీ భారతి కవీశ్వరి" అన్నారు. "ఆమె ఆర్టిస్టుకూడా" అన్నాను. వారిద్దరునవ్విరి.

మరునాడు చేబ్రోలునుండి జైళ్ళకు వెళ్ళివచ్చిన పదికి మించిన వీరవనితలు వచ్చిరి. వారందరిని పరిచయపరచిరి బాపూజీకి. తెనాలి రైల్వేస్టేషన్ లో కూర్చుండగా డబ్భైకి మించిన వయోవృద్ధురాండ్రు వేదాంతి రత్నమ్మగారితల్లి పిచ్చమ్మ, చంద్రశేఖరరావుగారి తల్లి శ్రీమతి తాయారమ్మ వారిలోవుండినారు. హెచ్చుమంది ఆ తెనాలిలో విదేశీవస్తు బహిష్కరణయందు ఎంతో బాధల ననుభవించిరి. రైలు బయలుదేరేముందు "భారతీదేవి! నీవు సిసలైన భారతీదేవివి. నాతో రైలు యెక్కుతావా?" అన్నారు. "వెంకటగిరిలో తిరిగి కలుసుకుంటా"నన్నారు దేవిజీ!

వెంకటగిరిలో జమీందారీ రైతు నాయకులు శ్రీ కటికినేని కళ్యాణరావుగారింట్లో బాపూజీకి బస. ఆ వెలమవారి నారీమణులను వారికి పరిచయంచేయడం, వారికి తోడుగా బాపూజీకి అన్నీ అంది

చడం భారతీదేవి భాగము. చర్చలు సభలు పూర్తయిపోయిన తరువాత స్టేషనుకు వెళ్ళితిమి. ట్రైను రావడానికింకా సమయమున్నది. నెల్లూరుజిల్లా సత్యాగ్రహయోధులలో పేరెన్నికగన్న మహిళానాయకులు శ్రీమతి పొణకా కనకమ్మ, భారతీదేవి, బాపూజీతో షికారు చేసిరి. వారిద్దరితో తన సంచారములోని అనుభవాలను కొన్ని ముచ్చటించిరి. కనకమ్మగారి జైలు జీవితాన్ని తెలుసుకొనిరి. ఆశ్రమ నిర్వహణ బాధలను తలచిరి. భారతీదేవితో పాశ్చాత్య దేశాల స్త్రీ వుద్యమాలగురించి చర్చించిరి. ఆంధ్ర స్త్రీలలో పురుషులకున్న ఉత్సాహమేగాక ఓర్పు, కార్యశూరత్వమూ కలవంటూ, 'కనకమ్మను నీవు తోడు చేసుకున్నందుకు సంతోష"మనిరి.

రైలుబండి యెక్కుతూ "రంగా! భారతీపై మాకందరికి ప్రేమ. నాకు మరీ మక్కువ! మీరిద్దరూ మాతో చేరాలి" అంటూ "సరేనా భారతీ" అనిరి. "మేమిదివరకే మీతో చేరితిమిగదా" అన్నారు ఆ మహిళాద్వయము.

ఈ కబుర్లను కొంతగా సూచించితిని 'బాపూజీ దీవెనలు' అనే యింగ్లీషు పుస్తకంలో. ఆ గ్రంథాన్ని అతి సుందరంగా కవులు, పండితులు, దేశసేవకులు డాక్టరు చిట్టూరు సత్యనారాయణ తయారు చేసి అటు బాపూజీకి—యిటు భారతీదేవికి అర్పణ చేసినారు 1969-70లో.

టాండన్‌జీ కాంగ్రెసు ప్రెసిడెంటు అయినారు. ఆ పిమ్మట మేము కాంగ్రెసును వదలితిమి- వారి అన్యాయాలకు రోసి. పిమ్మట ఆరునెలలైనా, మేము కృషికారు లోక్ పార్టీ పెట్టినా కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యత్వమునందే నన్నుంచిరి. తిరిగి భారతీదేవిని కలుసుకొనుట తటస్థించగా ఆ వృద్ధ టాండన్‌జీ 'భారతీదేవీ! నీమాట



కొరకే మీరు కాంగ్రెసును వదలినా మిమ్ము నేను కాంగ్రెసులో లేరనుకోవడంలేదు. నీపై నాకేగాదు సర్దారుకెంతో గౌరవం!- ఆ రంగా యెన్నో బాధలు పడేవాడు ఆయన్ను మనలను కలిపి వుంచగల్గేది ఆ భారతీసుమా! అని చెప్పుతుండేవారు. కనుక తిరిగి కాంగ్రెసుకురండి' అన్నారు.

ఎన్నో మారులు అందుకున్నాం వైసు ప్రెసిడెంటు, ఆ పిమ్మట ప్రెసిడెంటుగా పెరిగిన శ్రీ రాధాకృష్ణను. "భారతీదేవీ, అప్పుడా ఆక్సుఫర్డులో వుంటివే! ఆ సుకుమారమగు ఆ చిరునవ్వుల రంగా రాణిగానే కన్పడుతావు. ఈ గుడ్డలు, గాజులు తృప్తేనా! ఈ రంగా వల్ల నీకెన్ని బాధలు" అనేవారు. ఒకమారు "రమణ మహర్షిని కలుసుకొంటిరా" అని అడిగిరి.

"ఇంకెందరినో కలిసితిని. మీవలె. మన ధర్మ సూత్రాలను మనోహరంగా, మాకుకూడా తెలిసేటట్లు పల్కు వారెందరండీ" అన్నారు దేవీజీ. "సురచితి, చిన్మయానందస్వామి భగవద్గీత బోధను ఎంత బాగా చేస్తారండీ" అన్నారు దేవిజీ! ఎక్కడవింటివని అడుగగా హైదరాబాదులో నన్నారు.

"రంగా, నీవేమో నా ఆక్సుఫర్డు ఉపన్యాసాల సారాంశము ఆ 192[illegible]లో ఆంధ్రపత్రికలో వ్రాసితివి. భారతి నా మాటలకుతోడు తనమాటలుకూడా చేరుస్తున్నది" అంటూ చమత్కరించిరి డాక్టరు రాధాకృష్ణ. పారిస్‌లోనున్న యునైటెడ్ నేషన్సువారి యునెస్కో సంస్థ పెద్దలతో చర్చించి, వొప్పించి, 'ప్రపంచ ఉపాధ్యాయులదినం' రాధాకృష్ణ జన్మదినోత్సవంగా గుర్తించునట్లు చేయగల్గినందులకు నన్ను ఆమె అభినందించిరి. 'నేనొక్కడనేకాదమ్మా దానిని సాధించి

నది' అన్నాను. 'వారందరిలో నా రంగా వున్నారనుకొని ఆనందం పొందుచున్నా'ననిరి.

మనోహరమూర్తి శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయను 1926-27లో వుదకమండలంలో వేసవికాల సుఖవాస సమయమందు భారతీదేవి కలుసుకొనిరి. నిండు యౌవనమందున్న ఆ యిద్దరు మోహనమూర్తులు తమ ఆర్టిస్టు అనుభవాలను తెల్పుకొంటూ వుండిరి. తిరిగి 1927 డిశంబరులో మద్రాసులో కాంగ్రెసు సమావేశములందు ఖాదీ ప్రదర్శనాన్ని బాపూజీ తెరుస్తూవుండిరి. ఆ వుత్సవమందు కమలాదేవి సరసరవచ్చి నా ప్రక్కన అంతదూరానవున్న భారతీదేవిని కౌగలించుకొని తన ప్రక్క నేవస్తూన్న కమలానెహ్రూకు పరిచయంచేసిరి. 'ఈమె ఆర్టిస్టు! వస్త్రాభరణాలు ఎవ్వరు ఎట్లు ఏయే రంగుల మేళవింపులతో ధరించాలో ఈ భారతినుండే నేర్చుకోవాలి. ఆక్సుఫర్డులో చదివిరి. ఎంత సౌజన్యమో! ఆ కళ్ళు, ఆ చిరునవ్వు, ఆపైన నీలాంటి హృదయం' అంటూ, నెమ్మదిగా గంభీరంగా కమలమ్మకు చెప్పిరి! ఆ సమయాన 'అఖిలభారత విద్యార్థి సమావేశముల ఆహ్వాన సంఘమందున్నా'మని భారతీదేవి చెప్పిరి! 'అవునవును డాక్టరు కజిన్సు చెప్పినారు–'రంగా చాలా సహాయం చేస్తున్నారు. అయితే ఆయన భార్య భారతిని చూచితివా?' అన్నారు. ఆ భారతి మా భారతియే కావచ్చు అనుకుంటున్నాలే?' అన్నారు కమలాదేవి.

ఏవేవో ఆలోచనలు తట్టినపుడు దేవీజీ యేమందురో అని ప్రక్కన చూడాలనిపిస్తుంది. ఆ ఫిబ్రవరి–మే 1971లో అంతటి రాజకీయ సంక్షోభము పిమ్మట ప్రజాసేవ చేయుటకు అభివృద్ధిమార్గమెద్ది–అనుకుంటూ మేమిద్దరం ప్రతిదినం భోజనం చేస్తున్నప్పుడు విశ్రాంతి సమయాలలో ఆ రైతుకూలీలు ప్రజాసామాన్యపు టవసరాలు ఆశ



యాలు, ఆశలు, ఆలోచనలను పరామర్శించుకొనేవారం. ఎప్పటి నుండో ఇందిరమ్మపై ప్రతిపక్షాలు, కొందరు కాంగ్రెసువారు విసురుతున్న విపరీత విమర్శలకు వారు విముఖులై యుండిరి. 'ఇన్ని త్యాగాలు చేసిన వీరులు కోపతాపాలను ద్వేషాసూయాలను ఆమెపై యేల విసురుతారు! ఇప్పుడైనా దేశాన్నీ, ప్రజలనే చూచుకుని, ఆమెపై రాగద్వేషాలు లేకుండా ఆలోచించుకుందాం" అనేవారు. తేల్చుకున్నాం పదేపదే సవిమర్శ చేసుకుంటూ వుండినాం. 1971 పూర్తి అయ్యేసరికి ఇందిరాజీ ప్రజలకు చేసిన వాగ్దానాలు సార్థకమగుటకు సహకరించుదామనుకున్నాం! అలాగా ఆ జటిల సమస్యలు నన్నెదుర్కొంటునప్పుడల్లా ప్రక్కన ఆ దేవీజీ అందడంలేదే వుత్తరానికి, తంతికి, మంతికి అనిపిస్తుంది.

నాతో సెంట్రలు అసెంబ్లీ, పిమ్మట కాన్స్టిట్యూయంటు అసెంబ్లీ, ఇంటరిమ్ పార్లమెంటు వరకు, నాలుగు పార్లమెంటు టరముల పర్యంతం, భారతీదేవీజీగూడ అనుభవములను పంచుకొంటూ వుండిరి కనుక, తానే ప్రత్యేకంగా ఆ, యీ సభలందు వుంటేనేవ్యక్తిగత అనుభవము, తృప్తి కల్గుననే తాపత్రయం వారికి కలుగలేదు.

మేము యెరుగున్నవారు, మావద్ద పెరిగి, పెద్దలైనవారు, మా రాజకీయానుభవములందు వేర్వేరు రీతుల మాతో కలిసియో, వేర్పడో వుంటున్నవారు, మేము వలదనుకుంటున్న స్థానాలకు, పదవులకు, పద్ధతులకు, వ్యవహారాలకు అర్రులు చాచుకొంటున్న వారెందరో క్రమంగా మంత్రులు, ఉప మంత్రులు, శాసనసభ సభ్యులు అగుచుండిరి. ఆ దశాబ్దాల తరబడి, వారివారి అవతారాలు నైతికంగా వున్నతస్థాయికి అందుతుంటే తృప్తి జెందుతూ వుంటిమి–ఎందరెందరో జరజర జారిపోతూవుంటే 'అయ్యో!' అని వాపోతుంటిమి, కనుక దేవీజీకి, మంత్రులపై మితిమించిన ఆదరాభిమానాలు కలుగలేదు. ఆపైన

మా వద్ద తయారై, మమ్మే తల్లితండ్రులుగా చూచుకొంటూ, వస్తున్న వారెందరో మంత్రులుగా వచ్చిరి. రాణించిరి. రాచరికం సాగించిరి. తర్వాతెందులకో దూరమగుచుండిరి. కొందరు ఎటెటో జారిపోయిరి. కనుక దేవీజీకి మంత్రులంటే గొప్పగాని భయంగాని, ముఖమోటమి గాని కలుగలేదు ఆ మెట్టులలో ఉండే మనోతత్వము మాకు కలలో కూడ దాపురించలేదు.

మంత్రిపదవులంటే తక్కువభావంలేదు 1930 నుండి 1947 వరకు, వుండిన మంత్రులను ఆశ్రయించాలనిగాని మంత్రి పదవులంటే మమకారంగాని, భయము, ఆశ్రయభావంగాని దేవీజీకి కలుగలేదు.

మా మంత్రులనేవారూ వారివద్దకు వచ్చేవారు. మనమంత్రులనేవారు వారి సలహాల పొందేవారు. మంత్రులనే వర్గము వారి యెడల గౌరవంగావుంటూ వుండేవారు. కనుక తానుకూడావో మంత్రి అయితే ఎంతబాగుండుననే చిన్ని తలంపులామెను బాధించలేదు. తాను తప్పక మంత్రియైతేనే. సంఘ గౌరవము రాజకీయపు పైస్థాయి పొందగలదనే తాపత్రయం వారికి కలుగలేదు.

ఆ నైతికస్థాయి మనో పరిపక్వత నాకెంతో తృప్తి కల్గించుతుండేది.

కాంగ్రెసు శాసన సభ్యులలో తానొక పెద్దగా వుంటున్నప్పుడు గవర్నరు, ముఖ్యమంత్రి, మంత్రులు, వారందరి మధ్య పెత్తనాలు చేసేవారంతా తన్ను గౌరవిస్తూనే వుండిరి. తాను మాత్రం వారె వ్వరివద్దకు, ఏ అవసరం ఎవ్వరి వుద్యోగం, మరేదో సౌకర్యం మరెవ్వరికో కల్పించుటకై పోలేదు.

అంతటి వున్నత నైతిక స్థాయి. రాజకీయ గాంభీర్యము సభ్యుల స్వాతంత్ర స్థేటసు నిల్పుకోగలిగిరి. ఏ కొద్దిమందికో, ఏ దేశంలోనైనా



ఏ పార్లమెంటరీ నాయకులకైనా ఇహాలు అరుదుగా అందగల్గిన అనుభవం. అందుకే వారి సభ్యత్వకాలం పూర్తియినప్పుడు, వారు సభలో లేకున్నప్పుడే; అప్పటి ముఖ్యమంత్రి— తన్నొకప్పుడు సభ్యురాలుగా కోరినవారు.— "ఎంతో గౌరవ భాజనంగా, దేవిజీ తన శాసన సభ్యత్వమును సాగించిరి. ప్రజల సేవించి"రని పొగడ గల్గిరి.

సభ్యులుగా వుంటూ, దేవిజీ గ్రామీణ సమస్యలపై రైతుకూలీల రక్షణకై, వారి స్త్రీలవిద్య, ఆరోగ్యం గృహ వసతుల కొరకై పదే పదే వుపన్యసిస్తూ, మంత్రుల హెచ్చరిస్తూ ప్రభుత్వ డిపార్టుమెంట్లనడకలను చర్చిస్తూ వుండిరి. భూమి శిస్తులు రోడ్డు రవాణా రేట్లు పవరు (ఎలక్ట్రిసిటి) రేట్లు పెంచరాదని వత్తిడిచేసే వారు. అదనపు శిస్తు బిల్లులను తీవ్రంగా యెదిరించిరి. గ్రామాల్లో వైద్యసౌకర్యాల కొరకై ఎన్నోమార్గులు బడ్జెటు— ప్రసంగాలను చేసిరి. ప్రభుత్వ దుబారా ఖర్చులను నిరసించిరి ధాన్యములకు సరియైన ధరలు నిర్ణయించాలని, నిర్బంధ ధాన్య సేకరణ తొలగించాలని, జోనలు కంట్రోళ్ళు వలదని, చౌకదుకాణాలు పెట్టి బీద కార్మికులకు అందుబాటులో వుండే ధరలకు అమ్మించాలని ఆందోళన చేస్తూ. చేయిస్తూ వుండిరి. ఎరువులు, వ్యవసాయ పరికరాలూ విత్తనాలు, పశుగ్రాసము, సులువుగా ధారాళముగా. చౌకగా సప్లయి చేయాలనిరి. పంటలకు పశువులకు భీమాలు ఏర్పరచాలని, వరదలు వుప్పెనలు, అనావృష్టివల్లవచ్చే కరువులు, దీర్ఘకాలపు నిరుద్యోగ బాధలనుండి ప్రజలను రక్షించుటకు ప్రత్యేక నిధుల నేర్పరచాలనిరి. పంచాయితీ రాజ్యమును సహకారోద్యమమును మంత్రులు, రాజకీయ పార్టీల పెత్తనాలనుండి వేరుచేయాలనిరి పంచాయితీల, సహకార సంఘాల కమిటీలను నేర్పరచమనిరి పరపతి రైతులకు, బీదరైతులకు, కూలీలకు, చౌక వడ్డీ రేట్లకు ధారాళంగా అందజేయాలనిరి. వ్యవసాయ కూలీలు, ముఖ్యంగా హరిజనులు వృత్తుల వారందరికి వుచితంగా యింటి స్థలాలు, చౌకగా యిళ్ళు అందించాలని ప్రతి సంవత్సరం బడ్జెటు ప్రసంగాలు చేస్తూవుండిరి.

భారతీదేవి ప్రసంగాలు వినుటకు ఎంతో వుత్సాహకరంగా వుండేవి. ఆమె కంఠ మాధుర్యమునకు సి. ఆర్. రెడ్డిగారే ముగ్ధుల

య్యేవారు. ఆమె జీవితపు అనుభవము వయస్సులో రాజకీయంలో పండినవారికే అందే స్థాయికి చెందినది. తొందరపాటులేక బాధ్యత నెరిగి, ఎదిరి పక్షమువారిపై గౌరవము ప్రకటిస్తూ, కార్యాచరణను కాదనకుండా ప్రజాసేవయే ప్రధాన లక్ష్యముగా. మాటామంతి ధాటి, ధైర్యము, అనుభవము, ఆచరణయోగ్యత సూచించే వారి ప్రసంగాలు, ఎందరెందరో మంత్రులకు, ప్రజా సేవలకు, ఆనందము అభిమానము సేవాకార్యనిర్వహణకై ఆతురత కలిగించేవని ఎందరో చెప్పగా వినే భాగ్యం నాకు కలిగినది.

వారు ప్లానింగు కమిటీలో ఒకరు సభ్యులు. రైతాంగములో కూలీలు భాగస్థులని కౌలుదార్లు చేరెదరని-ఆ ముగ్గురుని రక్షించాలని చెప్పేవారు.

17వ సవరణను, మూలచట్టముపై చేయరాదంటూ, వారు చేసిన సుదీర్ఘ వుపన్యాసం చరిత్రాత్మకము. మంత్రుల హృదయాలను వ్యాపించివేసినదట! అంతటి మహత్తర శక్తి ఆ సరోజనీదేవిలోనే చూడ గల్గితిమన్నారు.

శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యకే ఆ మండలి సభ్యత్వము అందినట్లుగా వుంటే, ఇంకెంతో సామర్థ్యముతో, శ్రద్ధతో, గ్రామీణ సమస్యల చర్చించేవారుగదా అనుకొనేవారు. తాను సభ్యులగుటకే అంత కష్టమైనదిగదా వారినెట్లా గెలిపించడం అనినేనన్నాను. ప్రతి సెషనుకు వెంకటసుబ్బయ్యగారి సలహాలు పొందేవారు. ఏయే అవసరాలగురించి మాట్లాడాలో వారినడిగేవారు. మరెవ్వరూ అంత పట్టుదలతో, గౌరవముతో తన అనుభవాలను, ఆలోచనలను అందుకొనడం లేదని నాతో చెప్పి వారు సంతోషపడేవారు. మండలిసభలో కృషికార్ గ్రూపుకు నాయకులుగా వుండిన ఆ పరశురామానాయుడు మాత్రం అంత శ్రద్ధతో దేవీజీతో సంప్రదిస్తూ, సలహాలను పొందుతూ తన వుపన్యాసాలను సాగించేవారు.

“రంగా భవనం”లో అందరికి అమ్మగా వుంటూవున్నా, శాసన సభ్యులు రైతుకూలీలు వారి నాయకులకు తన సలహాలనిస్తూ, తన తపస్సును ధార్మికంగా సాగించేవారు.

# విషయ సూచిక

---

శ్రీమతి పుష్ప, శ్రీ సుబ్బరామయ్యగారల ప్రకరణములను
శ్రీ తాళ్లూరి సత్యనారాయణగారు అనువదించిరి;

(సం॥)
1-5-1975

# ప్రధాన జీవిత పర్వంలు

భారతీదేవిగారి జీవిత చరిత్రను సంగ్రహంగా ఇంగ్లీషులో, శ్రీమతి వెలగ పుష్పకుమారి M. A. 1956లో వ్రాసిరి. దానిని పండితులు, కవులు, నిడుబ్రోలు బుచ్చినాయుడు కాలేజీలో తెలుగు లెక్చరర్ శ్రీ తాళ్ళూరి సత్యనారాయణగారు తెలుగులోనికి తర్జుమా చేయగా 1957లో ప్రచురించబడినది. దానికితోడుగా, సంస్కృతాంధ్ర కవులు, ఇంగ్లీషు సాహిత్యమందు గొప్ప విద్వాంసులు, నెల్లూరు, నిడుబ్రోలు కాలేజీలలో ప్రిన్సిపాలుగా వుండిన శ్రీ గుజ్జం సుబ్బరామయ్యగారు దేవీజీ సేవావ్రతము గురించి సవిమర్శచేస్తూ వ్రాసిరి. ఈ రెండు రచనలలో ప్రధాన భాగములను యీ ప్రకరణయందు చేర్చుచున్నాము.

(సం.)

# 1

## (పుష్పకుమారి)

ఆంధ్రనారి అసదృశ సాహస విక్రమములకు నిలయము. మంత్ర తంత్రాంగ నైపుణ్యమున కునికిపట్టు. విజ్ఞానమునకు ఖని. పరిపాలనా దౌరంధర్యమున నిపుణ. గత ఆంధ్రుల చరిత్ర పరిశీలనమున ఈ విషయము సుస్పష్టము. కాకతీయుల కాలమున ఆంధ్రమహిళ గౌరవోచితస్థాన మలంకరించినది. నేల నాలుగు చెఱంగులేలిన రాజ్ఞులు, మంత్రాంగ మొనర్చిన మగువలు, సమర రంగమున శత్రువ్యూహముల చీల్చి చెండాడిన అతివలు నాడు లెక్కకు మిక్కిలి. నాడాంధ్ర మహిళకు స్వర్ణయుగ మనదగు నాటి వారిచరిత్రలు యావద్భారతదేశమునకు పరిచితములు. కావుననె అభినవ తిక్కనగారు "తెలియవలెగాని తెలుఁగు కాంతల చరిత్ర కోహినూర్లకు నూర్లకే కొదువలేదు"అని శ్లాఘించినారు. కాకతీయ రుద్రమతో సదృశయని కవినుతులనంది అసదృశకీర్తి నందిన మిన్న భారతీదేవిగారు. వీరి చరిత్రము అతిపవిత్రము, సంస్తుతిపాత్రము. భావిభారత నారీలోకమునకు ఆదర్శప్రాయము కాదగినది.

భారతీదేవిగారు 1908లో జన్మించిరి. జన్మస్థలము బాపట్ల తాలూకాలోని మాచవరమను గ్రామము. వీరు ప్రముఖ రైతు కుటుంబమునకు చెందినవారు. వెలుగు (వెలగా) సుబ్బయ్యగారు వీరి జనకుడు. సేద్యమునందు ఆరితేరిన దిట్ట. గ్రామీణ పశు వైద్యమునందు ప్రవీణుడు. ఉత్సాహవంతుడగు కృషీవలుడు. వీరి జనయిత్రి పిచ్చమ్మగారు. దైవభక్తి వీరికి ఉగ్గుబాలనుండి అబ్బిన దొడ్డగుణము. పవిత్రశీలి. ఆదర్శగృహిణి. పవిత్ర మాతృ హృదయ



ముతో నొప్పారు రైతుకుటుంబిని. దంపతు లిరువురును తరచుగ చెన్నపట్టణము కార్యావసరములపై నేగుచుండెడివారు. కావున నాగరిక జీవిత విధానమును నగరవాసములోని సౌకర్యములను పట్టణమందలి వివిధములగు వినోద విజ్ఞాన కార్యక్రమములను - అవగత మొనర్చుకొనినవారే. భారతీదేవిగారికి సోదరులు నలువురు గలరు వారెల్లరును మాధ్యమిక రైతుకుటుంబశ్రేణికి చెందినవారే. విశేష పరిశ్రమ నొనర్చు కృషీవలులు.

భారతీదేవిగారు తమ బాల్యమును తెనాలితాలూకా అమృతలూరు గ్రామమునందు వీరి సోదరీమణియగు చదలవాడ బుల్లెమ్మగారింట గడపెను. బుల్లెమ్మగారి మాతృహృదయమే తదుపరి భారతీదేవిగారికికూడ ఆదర్శప్రాయమైనది.

1924 వ సంవత్సరములో భారతీదేవిగారికి రంగాగారితో పరిణయమాయెను. వారి సహచర్యముతో భారతీదేవిగారి ప్రతిభా విశేషములు రాణకెక్కి నిత్యనూతనములై వెలుగొంద సాగినవి.

ఈమె బాల్యమునం దభ్యసించిన విద్య తక్కువ. గృహమునందే ఆంధ్ర, ఆంగ్లములను అభ్యసించిరి. 1923వ సంవత్సరమున శారదానికేతనములోను, 1925లో చెన్నపట్టణమందలి "విద్యోదయ పబ్లిక్ స్కూల్" నందును సాగించిరి. 1925–1926 సంవత్సరములలో ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమునకు చెందిన "రస్కిన్ స్కూల్ ఆఫ్ ఆర్ట్సు"లో విద్య నభ్యసించిరి.

వీరికి తత్త్వశాస్త్రమన్నను వేదాంత పరిజ్ఞానమన్నను అభిరుచి అధికము. 1926లో రాధాకృష్ణపండితుడు ఆక్సుఫర్డులో "జీవిత విధానముపై హిందూ దృక్పథము" అను శీర్షికపై నొసంగిన ఉపన్యాసములు వీరి నాకర్షించినవి. వేదాంతులతోటి పరిచయమునకు తాపత్రయ పడుచుందురు. కావుననే 1950లో రమణమహర్షిని,

హైదరాబాదులో చిన్మయానందస్వాములను, సత్యసాయిబాబాను దర్శన మొనర్చిరి. హృషీకేశమునందలి శివానందాశ్రమమును సందర్శించిరి.

వీరు విద్యాభ్యాస కాలముననే విదేశ పర్యటనలు పెక్కు సలిపిరి. ఇంగ్లండులో పలుప్రదేశములు తిలకించిరి. పారిస్‌నగరము, వెర్సైయిల్స్, మార్సైయిల్సు, ఈజిప్టులోని సూయజు, అలెగ్జాండ్రియా. ఫ్రెంచి సొమాలీ ప్రదేశములు, సిలోనులో పర్యటించిరి. రంగాజీ సాహచర్యముతో వివిధదేశములలోని కార్మిక సామ్యవాద నాయకులతో సంప్రదింపులు సలిపిరి. సహకార సంస్థల నిర్వహణ విధానమును పరిశీలించిరి. వయోజన విద్యాకేంద్రములను, రైతు కూటములను, మహిళా సమాజములను, గ్రామీణ గ్రంథాలయ సంఘములను, వాని కార్యక్రమములగూర్చి వివిధ పర్యటనలయందు సంక్షిప్తముగా నెఱింగిరి.

రంగాగారు పచ్చియప్ప కళాశాలలో ఆచార్యుడుగా నున్నయప్పుడు Y.W.C.A. సాంఘిక కార్యక్రమములయందు అవిరళ కృషినొనర్చిరి. నాటినుండి వీరి సేవావ్రత దీక్ష నానాటికి వృద్ధి గాంచెను.

వీరు విద్యాభ్యాసముననేగాక పలుసారులు చెన్నపట్టణమందు నివాసముండిరి. క్రమముగా 1924, 25, 27, 30, 33 సంవత్సరములలో చెన్నపట్టణవాసస్థులైరి. తమిళభాషను నేర్చుకొనిరి. దాక్షిణాత్యుల ఆచారవ్యవహారములు, సాంఘిక జీవిత విధానము వీరిని ప్రత్యేకముగా ఆకర్షించినవి. చెన్నపట్టణ నివాసకాలమున పలువురు ప్రముఖులతో సహవాస భాగ్యము లభించినది. విజ్ఞానవేత్తలగు ఆచార్యుల, పత్రికా సంపాదకుల, న్యాయాధిపతుల, ప్రముఖ పరిపాలనా నిర్వాహకుల సన్నిధిలో సంచరించుచుండెడి వారు. జాన్‌మత్తయ్, ప్రాంకో, థామస్, రెడ్డినాయుడు, కృపానిధి, ఖాసా, వేపా పాండురంగారావు, టోమ్‌పో, ఆరోగ్యస్వామి మొదలియార్ మొదలగువారెల్లరు వీరికి సన్నిహితులే. వారి



సహవాస ప్రభావముతో భారతీదేవిగారు వివిధవిషయాల ప్రావీణ్యము గడించిరి.

నగరవాసమును, ఉద్యోగ ప్రవృత్తిని పరిత్యజించి, గ్రామీణ వాతావరణమున కనికిపట్టగు "నిడుబ్రోలు" గ్రామమున రంగా దంపతు లిరువురు 1931లో నివాస మేర్పరచుకొనిరి. వాస్తవిక గాంధేయ మార్గమున సేద్యవృత్తి నొనర్చుచు తక్కువగల విద్యావంతులగు కర్షక మహిళలకెల్ల నాదర్శప్రాయమగు జీవితము గడపుచుండిరి. 1930లో సత్యాగ్రహోద్యమమున పాల్గొనిరి.

1931 వ సంవత్సరమున భజనసమాజము నొకదానిని స్థాపించి, అంటరానితనము నిర్మూలించుటకై కృషి నొనర్చిరి. ఆ సంవత్సరముననే కాంగ్రెసు ఆధిపత్యముక్రింద విదేశవస్త్ర బహిష్కరణోద్యమ ప్రేరేపకురాలుగ ఆరుమాసములు తెనాలిలో మహిళలను తనయాధిపత్యముక్రింద సమర్థతతో, దీక్షతో నడపించెను.

1931 నవంబరునుండి 1932 ఫిబ్రవరి వరకు 'పన్నుల నిరాకరణోద్యమము'న మూల్పూరి చుక్కమ్మగారికి అండ దండగా నిలిచి గుంటూరు, కృష్ణా, ఉభయగోదావరి మండలముల నిర్విరామముగ కృషిసలిపిరి.

1932లో జాతీయపోరాటమున గుంటూరు, కృష్ణా మండలములందలి మహిళలను తన ఆధిపత్యమున నడపుచు సత్యాగ్రహము నిర్వహించుచుండెనని ప్రభుత్వము ఒక సంవత్సరము కారాగార ప్రవాసశిక్షను, అయిదువందల రూపాయలు జరిమానాను వీరిపై విధించిరి.

1933 వ సంవత్సరమున కారాగారమునుండి విడుదలైన పిదప భారతీదేవిగారు తిరిగి రైతు ఉద్యమములో కృషినొనర్ప సర్వసన్నద్ధురాలాయెను. "భూమిశిస్తు పునర్వ్యవస్థీకరణ" యెడ అయిష్ట సూచకముగా రైతులెల్లరు తండోపతండములుగా జిల్లా

కలెక్టరుగారి ఆఫీసుముందు గోడును వినిపించుటకై నుద్యమించిరి. ఆ యుద్యమములో భారతీదేవిగారు ప్రముఖ పాత్రవహించిరి. ఇట్టివి 1933-34 మధ్య పెక్కుసారులు సాగినవి. నిడుబ్రోలులో "హరిజన వారోత్సవము" నిర్వహించి హరిజనుల సహపంక్తి విందు భోజనము లారగించిరి.

1933-34వ సంవత్సరమున మహాత్మాగాంధి నిడుబ్రోలే తెంచిరి. అప్పుడు భారతీదేవిగారికి ప్రత్యేక పరిచయ భాగ్యము లభించినది. వేంకటగిరిలో గాంధి - భారతీదేవిగారి పరిచయము వృద్ధినొందినది. దేవిగారి నిర్విరామకృషి, వారి ఆదర్శ భావములు తెలుసుకొని మహాత్ముడు చాల సంతోషించెను. స్త్రీయుద్యమములపై గల ఆమె భావములయందు మహాత్ముడు ప్రత్యేకశ్రద్ధ బొందెను. భారతీ దేవిగారి వ్యవసాయిక కృషికి మహాత్ముడు ప్రత్యేక అభినందనల నొసంగిరి. తదుపరి మహాత్మునితో 16 సంవత్సరములు స్నేహసంబంధము పెంపొందుచుండెను. మహాత్ముడు రంగాగారితో "భారతీ దేవిని తన కొమార్తెగా దత్తత గైకొంటి"నని వాక్రుచ్చెను.

రంగాజీ, వారి సోదరులగు లక్ష్మీనారాయణ, వేంకటప్పయ్య గారలు, మేనల్లుడగు పాములపాటి బుచ్చినాయుడు, భారతీదేవి నిడుబ్రోలులో రామానీడు విద్యాలయ స్థాపనకై కృషి సల్పిరి. ఆ విద్యాలయమే తదుపరి భారత కర్షక విద్యాలయమై విఖ్యాతి కెక్కినది.

విద్యాలయమందు రంగాగారి ఆధిపత్యమున 1934ఏప్రియలు మాసమునుండి వేసవి పాఠశాలలు నిర్వహింపబచుచుండెడివి. వందలాదిగా ప్రతిసంవత్సరము విద్యార్థులు పలు ప్రదేశములనుండి వచ్చుచుండెడివారు. కళాశాలనుండి పాఠశాలలకు ఏతెంచెడివారికి తగువసతులు గ్రామమునందు కల్పించవలెనన్న దేవీజీకి దుర్భరమగు కార్యమే. ఇవిగాక వ్యవసాయమునకు చెందిన పనులు మరియొక వంక చూచుకొనవలసి వచ్చెడిది. ఉపన్యాసకులను, అతిథులను,



రంగాగారిని ప్రత్యేకశ్రద్ధతో చూడవలెగదా. ఈ విధముగా పాఠశాల నిర్వహణ కాలమెల్లను భారతీదేవిగారికి కండలు కరగించు శ్రమతో నిండియుండెడిది. ఇరువది రెండు వత్సరము లిట్టి దుర్ఘట కార్యమును నిర్వహించిరి. నేటికిని ఆంధ్ర, తెలంగాణా, తమిళనాడు, కన్నడ, ఒరిస్సా ప్రాంతములలోని ప్రజాసేవకులు వేలాదిగా భారతీదేవిగారిని "అమ్మా"యని సంబోధించుటకై గర్వపడుచుందురు. బాపూజీ ఈ విషయమంతయు నెఱింగి, "తాను గూడ భారతీ దేవిగారిని మాతగా స్వాగత మొసంగెద" నని తెలిపెను.

1934 కేంద్ర శాసనసభా ఎన్నికలలో పాల్గొని ప్రచార మొనర్చిరి.

1935లో అఖలభారత కాంగ్రెసు కమిటీ సభ్యురాలైరి. 1936లో వీరిని జిల్లాబోర్డు సభ్యురాలుగా ఏకగ్రీవముగా నెన్నుకొనిరి. ఇవి గాక వీరు నిర్వహించిన పదవులు పెక్కు గలవు. 1927 సంవత్సరమునుండి ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ నిర్వాహక సంస్థ, 1931 నుండి రైతు రక్షణ కమిటీ సభ్యురాలుగా కృషి సల్పిరి. 1934వ సంవత్సరమునుండి భారత రైతాంగ విద్యాలయ స్థాపకులుగాను, పోషణ కర్తలుగాను గణన కెక్కిరి.

1935వ సంవత్సరమున "భారత కిసాన్ సమ్మేళన్" పాలక వర్గమున సభ్యురాలాయెను. నాటినుండి ఆ స్థానమున నిర్విరామముగా కృషిసలుపుచుండెను.

1936లో "ఆంధ్ర మహిళా రాజకీయ సంస్థ" వ్యవస్థాపక వార్షికోత్సవమున ప్రారంభోపన్యాస మొసంగిరి. నాటి సభలో కట్టమంచి రామలింగారెడ్డిగారు భారతీదేవిగారి ప్రతిభావిశేషములను ప్రస్తుతించిరి.

1937-38-39 సంవత్సరములలో అఖలభారత కిసాన్ కాంగ్రెసు అధ్యక్షుడగు రంగాగారితో ఉత్తర ప్రదేశ్, బీహార్

ఆంధ్ర, పంజాబ్, గుజరాత్ నందలి గ్రామీణ ప్రాంతములు పర్యటించిరి. పెక్కుసారులు శీతకాలమున ఢిల్లీలోను, వేసవిలో సిమ్లాలోను నివసించెడివారు. ప్రజాసేవకులు కాలము వ్యయమొనర్పజాలరు. కావుననే ఢిల్లీలో వసించునప్పుడు తన భావప్రకటనమున కావశ్యక మగునంతవరకు హిందీ నభ్యసించిరి. ఢిల్లీలో వ్యవసాయిక పరిశోధనా కేంద్రములను తరచుగా సందర్శించుచుండెడివారు. నీలగిరి, సిమ్లా పర్వతశ్రేణులపై నివాసమున్న వేసవులలో కొండజాతుల సమస్యల నెఱుంగుటకు శ్రమించిరి.

గయ, పలాసా, బిహాటాలలో జరిగిన అఖిలభారత కిసాన్ సమావేశములలో పాల్గొని ప్రముఖపాత్ర నిర్వహించిరి. పలాసా సమావేశమున అనర్గళముగా నుపన్యసించిరి.

రంగాగారు 1940వ సంవత్సరమున కారాగార వాసియైన సమయమున "ఆంధ్ర కిసాన్ కాంగ్రెస్"నకు భారతీదేవి ఉపాధ్యక్షురాలైరి. "ఆల్ ఇండియా కిసాన్ కాంగ్రెసు" ఉపకార్యదర్శిగా ఎన్నికైరి 1940 సెప్టెంబరులో ఆంధ్రకిసాన్ కాంగ్రెసుకు అధ్యక్షురాలైరి. 1940 నవంబరు అఖిలభారత కిసాన్ కాంగ్రెసుకు అధ్యక్షస్థాన మలంకరించిరి. ఆంధ్ర, బీహారు, బెంగాలు, ఒరిస్సా, తమిళనాడు, మైసూరు మొదలగు ప్రదేశములు పర్యటించిరి. బాధ్యతాయుతముగ పెక్కు కార్యముల నిర్వహించిరి. 1952 'మే'లో జరిగిన బిహాటా సమావేశము వరకు బ్రిటీష్ ప్రభుత్వ వ్యూహముల నెదుర్చుట కనువగు విధమున ప్రవర్తించిరి. 1940-42 మధ్య ఈమె నిర్వహించిన కిసాన్ నాయకత్వము గణనీయము. ప్రశంసార్హమైనది. ప్రముఖ ఐర్లాండు దేశ యువతి మిసెస్ కజిన్స్ భారతీదేవిగారి కృషికి తన "హిందూదేశ మహిళలను" పుస్తకమున జోహారు లర్పించిరి. ఇయ్యది భారతీదేవిగారి అవిరళ కృషికి సాక్షి.

రంగాజీకి తక్కిన కాంగ్రెసు అగ్రనాయకులకు అభిప్రాయ భేదములు మొలకెత్తిన రోజులవి. భారతీదేవిగారు అట్టి విషమ



సమయములలో ప్రజ్ఞాన్వితమగు నాయకత్వము క్రింద యావద్భారతదేశమున రైతుసేవకుల నైతిక ధర్మములను నిలబెట్టినది. మందసా కిసాన్ బాధితుల పోషణార్థము ధనమును వసూలుచేసిరి. 1940-41లో గోదావరి వరద బాధితుల సహాయార్థము, 1941-43 సంవత్సరముల మధ్యకాలములో రాయలసీమ కాటక నివారణమునకై కృషి సలిపిరి. స్థానిక నివారణ కమిటీలద్వారా ప్రోవుచేసిన నిధులను బాధితుల ఉపయోగార్థము సద్వినియోగ మొనర్చుచుండెడివారు. ఈ కార్యము నతి జాగరూకతతోడ క్రమమార్గమున నిర్వహించిరి. నాటినుండి భారతీదేవిగారు దక్షతకు నిస్స్వార్థ ప్రజాసేవలకు ప్రసిద్ధికెక్కిరి

వీరి గృహనిర్వహణ కనువగు విషయము లన్నియు 1940 వరకు తండ్రి సుబ్బయ్యగారు స్వయముగా చూచుచుండెడివారు. వ్యవసాయమున; పశుపోషణమున భారతీదేవిగారికి అండదండగా నిలచెడివారు. 1941 ఫిబ్రవరిలో సుబ్బయ్యగారు దిగవంతులగుట గృహకార్య నిర్వహణము పూర్తిగా భారతీదేవిగారి భుజస్కంధములపై బడెను. "గోరుచుట్టుపై రోకటిపో" టనునట్లు తదుపరి వారం రోజులకు రంగాగారిని ప్రభుత్వమువారు తిరిగి బందీకృతు నొనర్చిరి. తిరుచ్చిలో తత్పూర్వమే సంవత్సరము, ఆరు మాసములు కారాగారశిక్ష ననుభవించి, మరల వెల్లూరు జైలులో కారాగారవాస మనుభవించవలసివచ్చినది.

భారతీదేవి ఇట్టి స్థితిలో పాలికులకు బాధాకరములుగా ఆంగ్లేయ ప్రభుత్వ మొనర్చు యుద్ధసమయ విధానముపై పోరాటము సాగించెను. కిసాన్ కాంగ్రెసు అధ్యక్షురాలుగా దక్షతతో పోరాటమును కొనసాగించెను. సాంఘికముగ, రాజకీయముగ వేదనాకరములగు ఆ దినములను నిర్మలము; నిశ్చలము అగు ఆమె హృదయము భరించినది.

ప్రభుత్వమువారి ఆగ్రహమునకు గురియగుట "వాహిని" పత్రిక నిర్వహణమునకు నిధులను వసూలు చేయవలసిన అగత్య

మేర్పడెను. ఆ పిమ్మట క్రమంగా "క్రాంతి" "గోభూమి" పత్రికల నిర్వహణము జయప్రదముగా సాగిపోవుచుండెను. ప్రభుత్వము వారు ఈ పత్రికలకు "హామీచర్యలు" ద్వారా పెరి యత్నములు భగ్నము లొనర్ప యత్నించుచుండిరి. ఇట్టి విషమకాలము మూడు సంవత్సరములు; మొక్కవోని స్థైర్యముతో రంగాగారి సోదరుల సాయముతో, బాలిరెడ్డి, ఓబులరెడ్డి, లచ్చన్న మొదలగు అనుచరుల సారథ్యముతో ఎట్టులనో భారతీదేవిగారు గడపిరి.

రైతాంగ విద్యాలయమును 1940లో గుంటూరు జిల్లాలోని "ఇడుపులపాడు"లోను, 1941లో కడపజిల్లా చెన్నూరులోను భారతీదేవిగారు నిర్వహించిరి. 1945లో నిడుబ్రోలు స్త్రీల పక్షమున రైతాంగ విద్యాలయమును నిర్వహించిరి.

మహాత్మ గాంధీగారు, 1933, 45 సంవత్సరములలో వీరి కృషికి ఏదేని ఆర్థిక సాహాయ్య మావశ్యకమా యని ప్రశ్నించిరి. రంగాజీ పిత్రార్జిత భూములనుండి తమకు కావలసిన ఆర్థిక సహాయము సమకూరుచుండెననియు, తమకేమి సాయమవసరము లేదని భారతీదేవి నుడివెను. అంతియేగాక ఆర్థిక సాహాయము వాస్తవముగా నావశ్యక మగువారికై వినియోగించవలసినదని పల్కొనిరి. భారతీదేవి ప్రత్యుత్తరము గాంధీగారిని బాగుగా నాకర్షించినది. వారి నిస్వార్థ సేవాదీక్షకు నిదర్శనముగా దీనిని పేర్కొనుచుండువారు. వీరి నిస్వార్థ ప్రజాసేవ, ఉదాత్తత; సౌశీల్యము మొదలగు సుగుణములు గాంచి సుభాష్‌బోసు, దేశాయి, పటేలు, పంత్ రాజాజీ మొదలగువారు అభినందించుచుండెడివారు.

1946నుండి 1951వరకు రంగాజీని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా నెన్నుకొనిరి. జిల్లాబోర్డు, శాసన సభాసభ్యుల నిర్ణయములో భారతీదేవిగారెట్టి ప్రమేయమును కలుగజేసుకొనలేదు.



బాపూజీ నిర్యాణము భారతీదేవిగారికి వేదనాకర మైనది. తన స్వంత కన్నతండ్రిని కోల్పోయిన భాతిని చింతించిరి.

రంగాగారు కారాగార ప్రవాసమున ఉండునప్పుడు భారతీదేవిగారు భారత నారికి గల ఆత్మగౌరవము, ఆత్మత్యాగము వెలువరించిన దిట్ట. కావుననే వీరి చరిత్రము పురాణ వీరచరిత్రోదాహార్యమై యొప్పుచున్నది. వీరి స్థైరం, ధైర్యములను నిదర్శనములగు కొన్ని ఘట్టములు నెఱింగెదము గాక.

1931 వ సంవత్సరమున రంగాగారికి ప్రభుత్వమువారు మరల కారాగారశిక్ష విధించిరి. కాని "తాత్కాలికపు పూచీ"పై రెండు వారములవరకు గృహమునం దుండుటకు అనుజ్ఞనొసంగిరి. రంగాగారు 'తాత్కాలికపు పూచీ'పై విడుదలైనచో "వేంకటగిరి" ఆటవికుల సత్యాగ్రహవిధానమునకు, కృష్ణా, ఉభయ గోదావరీ మండలములలోని 'శిస్తు నిరాకరణోద్యమము' నకు ఒక రూపు నొసంగి, తీర్చి దిద్దుట కవకాశ మేర్పడియుండెడిది. అదియునుగాక కొన్ని గృహోచితకృత్యములు నెరవేర్చుకొనుటకుగాని, తగిన సలహా లొసంగుటకుగాని అవకాశ మేర్పడెడిది. 'తాత్కాలిక హామీ' నొసంగుటకు రంగాగారు నిరాకరించి ఈ విషయమున భారతీదేవిగారి అభిప్రాయ మడిగిరి. ఆమె రంగాగారి యభిప్రాయమును బలపరచుటయేగాక, వారిని ప్రోత్సహించిరి. సమరరంగమున కేగు మగనికి శోణిత తిలకము తీర్చిదిద్ది, ఐహికవాంఛల నిరసించిన 'మగువ మాంచాల'ను మించినది భారతీదేవి గృహకృత్యముల తాను స్వయముగా నిర్వహించెద ననియు, వేంకటగిరి, గోదావరి సత్యాగ్రహ మిత్రులతో తాను కలసి సత్యాగ్రహమును దక్షతతో నడపించెద ననియు హామీయొసంగిరి. ఔరా! ఎంతటి ధీరచరిత.

1940 వ సంవత్సరమున అఖిలభారత కిసాన్ కాంగ్రెసు 'పలాసా'లో నిర్వహించిన ఉజ్జ్వలమైన సమావేశముల యనంత

రము రంగా దంపతులు 'గోభూమి'కి మరలిరి. అచ్చట ఒకదినము గడపి రంగాజీ గూడూరు రైతు సమావేశముల కేగి అటనుండి చెన్నపట్టణ మేగెను. ఆ నగరమున ప్రభుత్వమువారు రంగాగారిని ఇరువది నాలుగు గంటల లోపల నిడుబ్రోలు వెళ్ళవలసినదని ఆజ్ఞాపించిరి. అట్లు కాకున్న మరల కారాగారశిక్ష విధించెదమని వారి పర్యటనలను నిషేధించిరి. అట్టి క్షణమున వారికి తగిన సలహాల నొసంగుటకు అనుచరు లెవ్వరును లేరు. ప్రభుత్వ ఆజ్ఞలను ధిక్కరించి మరల కారాగార ప్రవాసమున కేగుటకు వారు సిద్ధపడెను. భారతీదేవికి తక్కిన సహచర నాయకులకు తన నిశ్చయము నెఱింగించెను. రంగాగారిని రక్షక భటులు తీసికొనిపోవు కాలమునకు ఒక గంటముందు భారతీదేవిగారు వాహిని ఆఫీసులో వారిని కలుసుకొనెను. ఆ సమయములో విద్యాలయమున వేసవి పాఠశాలలు నడుపవలసిన విధానమునుగూర్చి, దక్షిణ భారతదేశమున రైతు ఉద్యమవిధానమునుగూర్చి, జాతీయపోరాటమున సామ్రాజ్యవాదుల కెదురుగా నొనర్పవలసిన రైతుధిక్కారములనుగూర్చి, యుద్ధకాండములందు హిందూదేశ విధానమును గూర్చి సంప్రతించిరి. అంతియేగాని వారి గృహనిర్వహణమును గూర్చి ఆవంతయు ప్రసంగించరైరి. గృహనిర్వహణ బాధ్యత లన్నియు భారతీదేవిగారిపై నుంచిరి.

భారతీదేవిగారు రంగాగారి అభిప్రాయము దృఢమొనర్చుచుండెడివారు. ప్రభుత్వము విడుదల యొనర్చిన రెండువారము లైన గృహమున సుఖజీవితము గడపక ఇట్టి ఇక్కట్టులు తెచ్చిపెట్టుకొందురేల? యని భారతీదేవిగారి స్నేహితులు ఎందరో హితము చెప్పుచుండెడిరి. అట్టివారిలో ఉన్నతోద్యోగుల సతీమణులు గూడ కలరు. భారతదేశప్రజల ఆత్మగౌరవ స్థాపనకై రంగా దంపతు లిరువురు తమ వ్యక్తిగత భోగములను, సుఖములను అర్పణ మొనర్చిరి.



ఇట్టి ఘట్టము లెన్నియో భారతీదేవిగారి ఆత్మత్యాగమున కుదాహరణములై వారి యశమునకు ఆలంబము లగుచున్నవి. ప్రముఖ కాంగ్రెసు నాయకులందరు 'తాత్కాలిక హామీ'పై జైలు నుండి విడుదలయై ఉద్యమమున కొకరూపు కూర్చుడని కోరుచుండినారు. కాని భారతీదేవిగారు వారి పలుకులనిరసించి, తానే రంగాగారి ప్రతినిధిగా మందసా కిసాన్ బాధితుల రక్షణకు. జాతీయపోరాటమున కిసాన్ ప్రజాభివృద్ధికి విశేషమగు కృషి సల్పుచుండెడివారు.

దేవిగారిలో స్వచ్ఛందములగు నాయకత్వ లక్షణములు, వీరోచిత సాహసకృత్యములు, అనుభవైక వేద్యము; ఆచరణ యోగ్యమగు దీర్ఘదృష్టి స్వభావసిద్ధములు. ఎట్టి క్లిష్ట సంఘటనల యందు నైన అధినాయకగా నాహ్వానింపబడెడివారు.

స్వరాజ్యసిద్ధి చేకూరిన యనంతరము కాంగ్రెసు సంస్థ అధికారదాహము, లంచగొండితనము ప్రచారతత్వములతో కళంకితమయి నానాటికి లోపభూయిష్టము కాజొచ్చెను. కావున ప్రదేశ కాంగ్రెసు పక్షమున ఎట్టిజోక్యము తీసికొనక మిన్నకుండిరి. తదుపరి కాంగ్రెసు వాతావరణమునుండి వైదొలగినందులకు చాల సంతోషించిరి.

కాంగ్రెసు సంస్థనుండి విడివడి నిస్వార్థ ప్రజాసేవా తాత్పర్యముతో నిరంతరము కృషిసలుపసాగిరి. 1952లో రాయలసీమలోని కాటక పరిస్థితులలో ఆ ప్రదేశమంతయు పర్యటించి, వారి స్థితిగతుల నవలోకించి వారి సహాయార్థము యావదాంధ్రదేశమును 1952 వేసవిలో పర్యటించిరి. నాటికి ఆంధ్రలో ఎన్నికలలో ప్రజాస్వామిక పక్షములన్నియు పరాజయము పొందెను. ఆ సమయమున రాయలసీమ క్షామ నివారణకై లక్షల రూప్యములు విలువగల నిత్యావసర యోగ్యములగు వస్త్రాదుల ప్రోవుచేసి

సక్రమముగా బాధితులకు పంచిపెట్టిరి. వీరి సేవావ్రతదీక్ష నెఱింగినవారు వీరిని "రైతుల యన్నపూర్ణ"యనియు, అన్నాలదేవి యనియు పేర్కొన జొచ్చిరి.

ఆ ఎన్నికల యనంతరము మద్రాస్ శాసనసభలో కాంగ్రెస్ పార్టీ బలహీనమైనది. ప్రకాశం పంతులుగారితో కలసి, నియంతృత్వ శక్తులు మద్రాసు ప్రభుత్వమును వశమొనర్చుకొన యత్నించుచుండిరి. ఆ సమయమున కాంగ్రెసును బలపరచకున్న ప్రమాదమని రంగాగారు గ్రహించి రాజాజీ మంత్రి వర్గమును బలపరచెను. భారతీదేవిగారు రంగాజీ అభిప్రాయమును బలపరచి కాంగ్రెసును అధికారపక్షముగా నుంచిరి.

1954లో ఘంటసాలలో జరిగిన 'ఆంధ్ర రాష్ట్ర మహిళా సమావేశమున'కు అధ్యక్షోపన్యాస మొసంగిరి. అందు వారు సూచించిన అభివృద్ధి కార్యక్రమములు నిర్మాణాత్మకములగు విధానములు ప్రజాసేవకులచే పత్రికలచే కొనియాడబడినవి.

19 4లో భారత కిసాన్ సమ్మేళనమునకు మరల ఒకసారి అధ్యక్షస్థాన మలంకరించిరి.

రైతుసంఘములకు, చేనేత పనివారలకు, విద్యార్థి ఉద్యమములకు బాధ్యతాయుతమగు నేస్తురాలుగా వారికి సలహాలనొసంగి తగు మార్గమున తన నాయకత్వమున నడుపుచుండును. ప్రియతములగు మిత్రులవలె ప్రజ్ఞాన్వితమగు సలహాదారులవలె భారతీదేవిగారు ప్రవర్తిల్లుచుందురు.

ఆంధ్రసారస్వతముపై వీరికి అభిలాష అధికము. తుమ్మల, వేటుకూరి, అడివి బాపిరాజు, కవిరాజు, పల్నాటి కవులు, పండిత సత్యనారాయణ, వెంకటకవి, స్వామి శివశంకర దేవయ్య, రామమూర్తి మొదలగు కవిశేఖరులు వీరికి హితులే.

సహజశైలిలో వీరు మంచి రచయిత్రి. కాని వీరి రచనలు చాలా స్వల్పములు. వీరిబాబులు ప్రజాసేవకులను ఆవేశపూరితు



లుగా నొనర్చును. వానిలో వీరి స్వానుభవమంతయు ప్రతిబించుచుండును. స్వభావసిద్ధమగు లలిత వ్యంగ్యముతో విజ్ఞానయుతములుగా ఈ బాబు లొప్పుచుండును.

భారతదేశ ప్రముఖ రాజకీయ వేత్తలలో పెక్కురతో భారతీదేవిగారు మిత్రత్వము వృద్ధి పరచుకొని వారికి సన్నిహితులుగా మెలగుచుందురు. బాపూజీ, రాజాజీ, నెహ్రూ, రాజేంద్ర బాబు వీరికి ఆప్తులు. స్వరాజ్య కాంగ్రెసు ప్రసాదించు పదవీ బహుమతులకై ప్రాకులాడు స్వభావము మాత్రము అలవరచుకొన జాలరైరి.

ఆచార్య రంగాగారి జీవిత చరిత్రమను గ్రంథమును గొర్రెపాటి వేంకట సుబ్బయ్యగారు భారతీదేవిగారికి కృతి నొసంగిరి. అభినవతిక్కన బిరుదాంకితుడగు తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు కాకతి రుద్రాంబ రేఖారమ భారతీదేవిగారి వదనమున తోచుచున్నదని శ్లాఘించిరి. వీరిని రాజనీతిజ్ఞతయందు, విజ్ఞానమున సాహసమునందు, రాణి రుద్రమతో పోల్చదగును. అదియునుగాక ఇనుపురును కమ్మనాటి నాయకులగుట సామ్యమునకు మరింత తగియున్నది.

## భారత కిసాన్‌వుద్యమముల భారతీదేవిగారి పాత్ర

భారత కిసాన్ ఉద్యమ నిర్మాణమునకు సహకరించిన అగ్రనాయకులలో భారతీదేవిగారొకరు. వీరి సహాయ సంపత్తి దృఢవిశ్వాసముతోడుగాకున్న నిరాశాపూరితమై తమోమయమై వెనుకబడియున్న రోజులలో (1923-25) రైతుఉద్యమము సాగించుటకు వీలుపడెడిది కాదేమో.

నెలకు 1200 రూప్యములు వ్యయించి రాజభోగము లందవలసినవారు, 1930లో నూరురూపాయలతో జీవయాత్ర నెట్ట

వలసిన దశకు వచ్చిన రోజులవి. తరిగిపోవుచున్న రంగాగారి స్థిరాస్థులను తనబాధ్యత క్రిందకు తీసికొని అండదండయై భారతీదేవిగారు స్వయముగా పోషణభారము తీసికొనిరి. రంగాగారికి ప్రజాసేవ నొనర్చుటకు అగు ఖర్చులకు పరులపై నాధారపడకుండ, క్రమముగా వారి ఆస్తుల సక్రమ నిర్వహణమున లభ్యమగునట్లు భారతీదేవిగా రొనర్చిరి.

అదియునుగాక వీరి "గోభూమి" ఎల్లప్పుడును, ప్రత్యేకంగా 1942 ఆగష్టు విప్లవమున రక్షకభటు లెల్లవేళల పర్యవేక్షణ మొనర్చుచుండెడివారు. భారతీదేవిగారు వివిధ సంఘముల ఆధ్వర్యమున నాయకత్వము వహించుట ప్రభుత్వ మొకకంట కనిపెట్టుచుండెడివారు. వీరి నివాసస్థలము ఊరికి దూరముగా పొలములమధ్యనున్నది. అదియునుగాక రక్షకభటుల హుకూములు విపరీతముగా నుండెడివి. ఈ విధముగ భయంకరములగు ఆరోజులలో భారతీదేవిగారు నైతిక బలసంపదతోడను, సాహసముతోడను ముప్పదియైదువత్సరములు ఏకాంతముగా "గోభూమి" యందు వసించెడివారు. 1948-50 మధ్య కమ్యూనిస్టుల హింసా కాండలధికమగు సమయమునను తన ధైర్యమును కోల్పోలేదు. నేడు ప్రజాబాహుళ్యమున వెలువడు సాంఘికోద్యమములకు రంగాదంపతు లిరువురు మూలస్తంభము లనుట అతిశయోక్తి కానేరదు.

1948లో భారతీదేవిగారు పాముకాటు మూలమున ఆరోగ్యము కోల్పోయిరి. దానివలన దుర్భరములగు విషఫలితములు పెక్కు పొడచూపినవి. ఏ పదార్థము తినినను సరిపడక దేహమునకు విరుద్ధ ఫలితము లొసంగుచుండెడిది. ఇదిగాక అంతకుముందు 1945లో ప్రేవులకు నొనర్చిన శస్త్రచికిత్స మూలమున పెక్కుబాధలకు గురియయిరి.

తాను ప్రజానాయకులుగా, ప్రముఖ నాయకుని సహధర్మచారిణిగా, ఆదర్శ రైతుగా, గృహిణిగా సంఘమునకు ఆదర్శ



మార్గదర్శి యగుచున్నారు. ధనములోగల విలువ నెఱింగి వినియోగించు నేర్పరి. వీరి నేర్పరితనము గుర్తించియే పండిట్ జవహార్‌లాల్ నెహ్రూ ఆమె సూచించినవారికి 50,000 రూపాయలు పంచవలసినదనిరి. ప్రజాసంస్థలకు సంబంధించిన ధనములో ఒక నయాపైసకూడ దుర్వినియోగము కాకుండా చూచుట దుర్ఘటకార్యము. నిజముగా అది అసిధారావ్రతచర్యవంటిదేయగును. అట్టి అసిధారావ్రతమును నేర్చిన నేర్పరి. భారతీదేవి. ద్వివిధమగు ప్రజాసంబంధ బాధ్యతలను ఒకేమారు నిర్వహించిన నిపుణ.

ఈ బాధ్యతలు అన్నిటికన్న వేదనాకరమగు విషయము ప్రతిపక్ష రాజకీయవేత్తల విమర్శలు. వానికన్న తన పక్షమందు శల్యసారధ్య మొనర్చువారి వర్తనము మరియు బాధాకరము. ఇట్టివారలతో 1923వ సంవత్సరమునుండి వీరు బాధపడుచునే యుండిరి. రాజకీయ పరాజయములన్నిట వీరు వేదనపడుట సహజము. ఎదుట "అమ్మా! తమ బిడ్డలమని" వందనము లొనర్చుచు, చాటుగా మోసపు టెత్తులు ప్రకటించువారు వీరి కన్నులు తెరపించిరి. ఆమె నిస్సంతోషియగు జననియన్న ఆశ్చర్యపడవలసినది లేదు.

వీరి సంభాషణాచాతుర్య మెన్నదగినది. నిశితమగు వ్యంగ్యము వీరి సంభాషణమున కాననగును. మనస్తత్వ పరిశీలనమున ప్రజ్ఞానిధి. పరేంగితావగాహియైన బుద్ధి వీరి విశేషము.

హరిజనులు, యానాదులు, వడ్డెలు, ఉప్పరలు, కోయలు నిమ్నజాతుల సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక పురోభివృద్ధి కనువగు సూచన లొసంగి ప్రోత్సహించెడివారు.

సాంఘికముగ తరతమ భేదములతో నున్న అన్ని తరగతుల స్త్రీ పురుషులను, వృత్తి సంఘములను ప్రోత్సహించుట వీరి నైజగుణము. మహిళాసంఘములను తమ సంఘపరిధులలో మాత్రమే

నియమితముగా నుండరాదని హెచ్చరించువారు. వర్ణాంతర వివాహములపై వీరికి దృఢవిశ్వాసము. వరకట్న నిషేధమునకై యత్నించుచుండిరి. స్థిరాస్తులలో స్త్రీ పురుషులకు సమాన ప్రాతినిధ్యమొసంగవలెనని వీరి గాఢవాంఛ. అంధపరంపరా ప్రాప్తమగు పూర్వవిధానమును నిరసించి తానే స్వయముగా బీద, మాధ్యమిక రైతుకూలి కుటుంబవలకు మార్గదర్శి ఆయెను. స్త్రీలు సహితము వ్యవసాయము మొదలగు విషయముల శ్రద్ధ చూపవలెనని వీరి వాదము. ఉద్యోగములయందు, పరిశ్రమలయందును వారికి పురుషులతో సమాన ప్రాతినిధ్య మొసంగవలెనని వీరి అభిప్రాయము. తన ఆస్థి నిర్వహణమున కంతయు తానే ఆధారమై; ఆదర్శమార్గము చూపుచుండిరి. చరిత్రలో రైతుఉద్యమ ఆవశ్యకత నెరింగి పల్లెప్రజలకై, స్వయంవృత్తివారికై రంగాజీ యొనర్చు సేవలనిన దృఢవిశ్వాసము చూపుచుందురు. గృహపరిశ్రమలపై వీరికి నమ్మిక అధికము. కళాకారులకు, చేనేతపనివారలకు తగు ప్రోత్సాహ మొసంగుదురు. వయోజనవిద్యావశ్యకము గుర్తెరింగిరి. రంగాజీ ప్రచురణములకు, గ్రంథాలయమునకు, రైతాంగ విద్యాలయమునకు ఈమె సహాయకురాలు.

రంగాగారు నూతన విధానముల, నూతన చట్టముల భావ ప్రపంచమున నూహించుచుండ, ఆ ఆదర్శముల నాచరణయోగ్యములుగా నొనర్చులకు భారతీదేవిగారు జతన మొనర్చుచుందురు. రంగాజీ కార్యసాధనమునకు భారతీదేవిగారు అనుబంధముగా కృషినలుపుచుండిరి.

ప్రదేశ కాంగ్రెసు కమిటీ దర్బారులో ఆంధ్రదేశ భక్తి ప్రబోధక కవులను గౌరవించవలెనను ఊహ వీరొసంగిరి. రంగాజీ తమ్ముడు యన్. వి. సుబ్బయ్యగారు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ ఆధ్వర్యమున 1947లో ఆకార్యము నిర్వహించెను.



పాములపాటి బుచ్చినాయని కళాశాల స్థాపనకాలమునుండి ఆ సంస్థ పురోభివృద్ధికి అండదండగా నిలబడెను. సంగీతశాఖ వీరి పేరనే ఉంచిరి. బుచ్చినాయుడుగారు రంగాగారి జన్మదినోత్సవ సందర్భమున నొసంగిన విరాళమును ఈ శాఖకై వీరు వినియోగించిరి.

1946-47 సంవత్సరములలో మద్రాసురాష్ట్ర విద్యావిషయక సలహాదారుల సంఘములో సభ్యురాలుగానుండెను.

ఆంధ్రశాసన ఎగువ సభాసభ్యురాలుగా ఆరు సంవత్సరముల కాలము (1958-64) వీరిని ఎన్నుకొనిరి. ఆ సభా సమావేశములలో రైతు ఉద్యమ ఆదర్శములను వెలువరించుటకై తన యావచ్ఛక్తిని వినియోగించుచుండిరి. రైతుల, కౌలుదారుల రక్షణకై సతతము వారి దృష్టిని కేంద్రీకరించుచుండిరి. గ్రామీణ రైతాంగము యొక్క స్వేచ్ఛా స్వాతంత్ర్యములకు హానికరమగు సహకార వ్యవసాయమును ప్రతిఘటించుచుండిరి. ప్రజా స్వామ్య ముసుగుతో నియంతృత్వమునకు త్రోవచూపు కార్యము లొనర్ప యత్నించు కాంగ్రెసు ప్రభుత్వ చర్యలను ప్రతిఘటించుచుండిరి. భూములపై గల హక్కులను భగ్న మొనర్ప యత్నించు కమ్యూనిష్టు, కాంగ్రెసు ప్రణాళికల విమర్శించుచు, రైతు శ్రేయోభివృద్ధిని కోరనినాడు యావద్భారత దేశమునకే పురోభివృద్ధి ఉండబోదని నొక్కి వక్కాణించుచుండిరి.

భారతీదేవిగారి ప్రసంగములు సభారంజకములు. విజ్ఞానయుతములు. అంతమాత్రమే గాదు. పరపక్షములకు సహితము సమ్మతము గలిగించునట్లు ప్రసంగించు నేర్పరి. వ్యవసాయమునందు ప్రయోగాత్మకమగు విశిష్టానుభవమును పొందిన దిట్టగా, శాసన సభలో పరిగణింతురు. రాష్ట్రమునందలి విజ్ఞానవేత్తలగు సలహాదారులలో వీరు గణనీయులు. "ఆంధ్ర ప్లానింగ్ కమిటీ"లో సభ్యురాలుగా వీరెన్నుకొనబడిరి. కాని నెహ్రూ హయాములో వెలువడుచున్న రైతాంగ వ్యతిరేక విధానానుసరణములగు పథకము

లను నిరసించి ఆ పదవికి రాజీనామా యొసంగిరి. భారతీదేవిగారు చరిత్రాత్మకమగు పుణ్యక్షేత్రములుగ, సాంస్కృతికములుగ ప్రసిద్ధిగన్న ప్రదేశములకు వైజ్ఞానిక యాత్రలు చేయుచుందురు. 1936లో రంగాదంపతులు నాగార్జునకొండ కేగిరి. భారతీదేవిగారు వస్తు ప్రదర్శనశాల నిర్మాణ మొకటి ఆవశ్యకమను అభిప్రాయము వెలువరించిరి. రంగాజీ ఆ విషయమై శ్రద్ధ చూపెను. తత్ఫలితముగ ప్రభుత్వమువారు మ్యూజియము నిర్మించిరి. 1938లో హంపీనగరము సందర్శించిరి. అట విజయనగర ఆంధ్రసామ్రాజ్య వైభవము నొక్కసారి స్మృతిపథమునకు తెచ్చుకొని నిర్వేదము పొందిరి. 1953లో సప్తశిలా దేవాలయముల సందర్శించి పల్లవులనాటి శిల్ప ప్రావీణ్యమునకు అచ్చెరువందిరి. 1953లో కాశ్మీరుదేశమును సందర్శించిరి. మొగలుల హృదయములనుండి వెలువడు ఉపవనగీతికల నాకర్ణించిరి. 1939లో రంగాగారితో బర్మాదేశయాత్ర సాగించినారు. మూడువారములల పర్యటించిరి. పెక్కు బహిరంగ సభలలో పాల్గొని అనర్ఘళోపన్యాసము లొసంగిరి. 1941 సంవత్సరములో కొండవీడు, మహానంది క్షేత్రములు దర్శించిరి. 1938లో వారణాశిక్షేత్రము 1943లో హరిద్వారము, 1953 లో హృషీకేశము, 1959లో బెల్లూరు, హేలోకైలు; 1929, 53, 54, 72లో తిరుపతి సందర్శించిరి.

ఆగ్రాపట్టణము పెక్కుసారులు సందర్శించి తాజ్‌మహాలు నిర్మాణమును, ఆగ్రా పోర్టును కాంచి స్తుతించిరి పరస్పరానురాగముతో అత్యంత సన్నిహితులయిన షాజహాన్ ముంతాజ్‌ల ప్రణయగాథను తలచి పులకించిపోవు చుండెడివారు. సిక్రీ దర్శించి నిరర్థకములు, నిష్ప్రయోజన కరములగు సామ్రాట్టుల చర్యలను నిరసించిరి. కాని అక్బరుకు గురువుల యెడగల సేవాతత్పరతకు; అన్యమత సహనమునకు సంతోషించిరి. మధ్యభారత పర్యటనలో నల దమయంతులు విడివడిన-కోటుల తిలకించిరి. 1957 స్వాతంత్ర్య సమరయోధులగు తాంతియాతోపీ, ఝాన్సి లక్ష్మిబాయిగార్లకు



జోహారు లర్పించిరి. అమరావతి చిత్రలేఖనమును లండను వస్తు ప్రదర్శన శాలయందును, అమరావతియందును దంపతు లిరువురు తిలకించిరి. ఢిల్లీ, కలకత్తా మ్యూజియములందుగూడ కొన్నిటిని తిలకించి హిందూదేశ చరిత్రలోని ప్రాచీనయుగ వైభవములకు సంతోషించిరి. జుమ్మా మసీదు, రెడ్‌ఫోర్టు, రాష్ట్రపతి భవనము, ఢిల్లీలోని పార్లమెంటు భవనము కాంచునపుడు అత్యధికమగు ఆనందానుభూతి నొందిరి. రమణమహర్షి ఆశ్రమమును సందర్శించి; పెద్దమ్మ, చిన్నమ్మ, కురుముద్దాలి పిచ్చమ్మ సత్యశాయిబాబా మొదలగు ఆంధ్ర ఋషులతో సంభాషించిరి.

సాంచీస్థూపమును సందర్శించి దంపతు లిరువురు అశోక సామ్రాట్టు పట్టపుదేవిని స్మృత్యంకమున జోహారు లర్పించిరి. సేవాగ్రామ్ ఏగి తరచుగా మహాత్మునితో సంభాషించుచుండెడివారు. మహాత్మునితోపాటు ప్రార్థనలయందును, విందులయందును పాల్గొనుచుండెడివారు.

1958-59 సంవత్సరములలో రంగాగారితో దక్షిణ భారత దేశ పర్యటనమొనర్చిరి. బెంగుళూరులోని హెచ్.యం.టి., ఐ.,టి.ఐ.,టి.ఐ., బి. ఇ.యల్. మొదలగు యంత్రాగారములు పరికించిరి. 'భద్రావతి'యందు ఉక్కునిర్మాణకేంద్రము,కాగిత యంత్రాగారములు మొదలగునవి సందర్శించిరి. జోగ్ జలపాతపు సౌందర్యము, 'షర్వావతి' 'హైడల్' కట్టడములు తిలకించిరి. ఆల్‌వాయ్, కొచిన్, త్రివేంద్రం మొదలగు ప్రదేశములు పర్యటించిరి.'మంటపము'లోని మత్స్యపరిశోధనా కేంద్రమును తిలకించిరి. తిరుచునాపల్లిలోని రైల్వే యంత్రాగారమును, నేవెల్లి ప్రాజెక్టును, అన్నామలై విశ్వవిద్యాలయమును, మద్రాసులోని చర్మపరిశోధన కేంద్రమును భాక్రానంగల్ హైడెల్ ఇర్రిగేషన్ వర్కునను తిలకించిరి. రంగాజీ "పబ్లిక్సు ఎకౌంట్సు కమిటీ" ఛెయిర్మన్‌గా నియోగింపబడి వీనిని పరిశీలించు సమయమున వారితో భారతీదేవిగారుకూడ ఏగిరి. చాముండి, తివేంద్రం, కన్యాకుమారి,

మధుర, రామేశ్వరము, శ్రీరంగము, జంబుకేశ్వరము, చిదంబరము, కంచి మొదలగు పుణ్యక్షేత్రముల దర్శించి మధుర, చెన్నపట్టణములలో గాంధీమంటపములను చూచిరి. వాని ఉదాత్త శిల్ప సౌందర్యమును, వాస్తుశాస్త్ర ప్రజ్ఞావిశేషమును, ముగ్ధమోహన కళాతత్వమును గమనించి తన్మయులైరి.

సి. వి. రామన్; యమ్. విశ్వేశ్వరయ్య మొదలగు ప్రముఖ శాస్త్రజ్ఞులకు ప్రణామము లర్పించిరి.

స్థానికములగు పొన్నూరు భావనారాయణ దేవళము, మంగళగిరిలోని రాజరాజేశ్వర దేవాలయము సందర్శించి అయ్యవి వారి పూర్వులగు వేంకటాద్రిగారిచే స్థాపితములగుట ఆ మహామహునకు జోహారు లర్పించెడివారు. 1960లో వ్యాసపౌర్ణమినాడు జరిగిన పొన్నూరు సంస్కృత కళాశాల వ్యవస్థాపక వార్షిక మహోత్సవమున కేగిరి.

ఆంధ్రదేశముననేగాక యావద్భారతదేశమున స్వచ్ఛంద ప్రజాసేవకులకు సన్నిహితురాలుగా, సమకాలీనగానుండు నవకాశము వీరికి లభించినది. ప్రముఖ నాయకులలో పెక్కురు వీరికి పరిచయస్థులేగాక ఆత్మీయులుగూడ.

కుటుంబ నిర్వహణ బాధ్యతనుండి, వ్యవసాయిక బాధ్యతలనుండి, గ్రామస్థుని విధులనుండి విముక్తునిగా నొనర్చి భారతీదేవిగారు తన కుమారుని సేవించుచున్నదని రంగాగారి తల్లి పెక్కుసారులు అనుకొనేవారు. "గోభూమి" నిర్వహణ బాధ్యత తనపై నిడుకొని రంగాగారికి ముఖ్యములగు కార్యక్రమములలో పాల్గొనుట కవకాశ మొసంగుచుందురు. పెక్కురు నాయకుల స్తుతుల నీ విషయమున వీరందుకొనిరి.

రంగాగారు బహిరంగసభలలో ఉపన్యసించుటకుగాని వివిధ సమావేశముల పాల్గొనుటకుగాని స్నేహితులతో కులాసాకబుర్లు మాట్లాడుటకుగాని అలసత వహించి ఎఱుంగరు. ఎల్లప్పుడును



నిర్విరామముగనే యుందురు. అట్టి బాధ్యతాయుతములు, భారములు నగు కార్యములను నిర్వహించుటలో భారతీదేవిగారికి రంగాగా రెంతఋణపడిరో? ఊహాతీతము. నేటివరకు "గోభూమి" నిర్వహణమునకై ప్రజలడబ్బు అణుమాత్రము తీసికొనవసరము కలుగనీయ రయిరి. ముప్పది ఐదు వత్సరములనుండి ప్రజలధనము ఆశింపకయే నిస్స్వార్థ సేవాతత్పరులై కృషి సలుపుచుండిరి. "గోభూమి" నిలయమున రంగాగారుండునప్పుడు వారికి భారతీదేవిగారు తగు సదుపాయముల సమకూర్చుచుందురు. ఇది వారి ఆదర్శ దాంపత్యమునకు సాక్షీభూతము కాగలదు. మిగిలిన కుటుంబములలో కుటుంబ నిర్వహణమునకు ధనము సంపాదించు బాధ్యత యజమానిదై యున్నది. భార్యకు, సంతతికి, నిత్య నూతనములు, పరిణామయుతములగు వినోద జీవితముల కనువగు పరికరముల సేకరణకు నలయు ధనముగడింపజాలక యజమాని బాధపడుచుండును. రంగాగారి విషయము దీనికి పూర్తిగా విరుద్ధము. భారతీదేవిగారు చాల జాగరూకతతో ధనములోని విలువ నెఱింగి రంగాగారి అవసర కార్యములకు వెచ్చించుచుండును. రంగాగారు డాబు దర్పములు చూపక, నిరాడంబరముగా ప్రవర్తిల్లు స్వభావము గలవారు. నిర్విరామమగు పర్యటనలలో రంగాగారు మతిమరపుచే వస్త్రములవంటి నిత్యోపయోగములగు వస్తువులను పోగొట్టుకొనుచుందురు. ప్రాపంచిక వస్తు సామగ్రియన్న అలసత్వము వహించుటయే అజాగ్రత్తకు కారణము. వారి కవసరమగు వస్తువులు లోటులేకుండ సమకూర్చుటకు భారతీదేవిగారు తగిన జాగ్రత్త తీసికొందురు. భారతీదేవిగారు వ్రాక్రుచ్చినటుల రంగాగారు పసిబాలురకన్న అజాగ్రత్త కలవాడు. కాని దేవిగారు "కంటను వత్తిపెట్టుకొని" రక్షణభారమువహించును.

భారతీదేవిగారిలో భారత గృహిణీ ధర్మము పుంజీభవించినది. ఆదర్శ మహిళా లక్షణముల నేర్చి విధిసృష్టించిన చైతన్యరూపిణియన నొప్పుచుండును. పతి కొసంగు వీరి సేవలు మనపురాణ ప్రసిద్ధ నారీలోక చరిత్రముల కుద్దియగునట్టివి. రంగాగారికి మాతృస్వరూపి

ణిగా; సోదరిగా, పత్నిగా, నేస్తముగా; అనుచరురాలుగ, సహచారిణిగా, సలహాదారుగా తగువిధులన్నిటిని సక్రమముగా నొనర్చుచుండును. పరస్పరము వారిరువురు దోహద మొనర్చుకొందురు. భారతీదేవిగారి సేవ అద్వితీయము. రంగాగారి వ్యక్తిగతములు సామాజికములగు కార్యక్రమములలో భారతీదేవిగారి సాయము లేక రంగాగారొనర్చిన కార్యములను గుర్తింపజాలము. రంగాగారు నిష్కపటి. సమాజ పురోభివృద్ధికై తన జీవితమెల్ల నంకిత మొనర్చిన నిస్స్వార్థ ప్రజాసేవకుడు. కావుననే ఇతరులను సైతము తనవలె జతన మొనర్ప గోరుచుండును. తన అనుచర నాయకులను వారి కార్యనిర్వాహణ విధానము కృతార్థత నందనపుడు రంగాగారి పరుషవచనములకు బాధపడకుండ భారతీదేవిగారు ఓరిమితో వారి హృదయములు చల్లార్చుచుండెడిది. రంగాగారు ఐహిక భోగములకు ప్రాముఖ్య మొసంగరు. వారి అనుచరులనుండి మానవాతీతమగు త్యాగనిరతిని, సేవావ్రతదీక్షను, సౌహార్థమును కాంక్షించుచుండును. కాని భారతీదేవిగారు వారిని ప్రాపంచిక ధర్మములకు కట్టుబడిన మానవులుగా చూచుకొందురు.

భారతీదేవిగారికి ఆడంబరత్వమన్న గిట్టదు. పారంపర్యానుగతములగు విందుభోజనములను, ఉత్సవములను వీరు నిరసింతురు. ఆభరణములకై ధనము వెచ్చించుట వీరికి నచ్చదు. నవీన నాగరిక లోకమునగల అలవాట్లను బాగుగా నెరిగినవారైనను ఆడంబరత్వమన్న అభిరుచి అల్పము. పాశ్చాత్య దేశములలోను, క్రొత్త ఢిల్లీవంటి హిందూదేశ ముఖ్య నగరములలోను స్వరాజ్యానంతరము వ్యాపించిన ఆడంబర జీవితమును వీరు పూర్తిగా నిరసింతురు. ఇట్టి సంఘమున నాయకత్వము వహించు నవకాశములున్నను, వీనియెడల విముఖత చూపుచుందురు. సాంఘిక ఉత్సవములకై అనవసరముగ విపరీతముగ కోట్లకొలది ఖర్చు భారతదేశమునందు పెట్టుచుండిరని వీరెప్పుడో గ్రహించిరి. మన ప్లానింగ్ కమిషను ఆ సత్యమును నేటికిగాని అవగత మొనర్చుకొనరైరి. వినోద ప్రదర్శనమునకై ధరియించు నగలను వీరు పూర్తిగా నిరసింతురు.



మన వివాహమహోత్సవములయందు ఖర్చు తగ్గించుట ఉత్తమమని వీరివాదన. ఖద్దరు వస్త్రధారణముతో వీరు చాల ఆకర్షణీయముగా నొప్పియుందురు. వివిధవర్ణములలో ఖద్దరు వస్త్రములు నిత్య జీవితమున ధరించుచు మంచి ఆకర్షణీయముగా నొనర్చుచుండుట వీరి ప్రత్యేకత. ఖద్దరు ప్రచారమునకు వీరి ఖద్దరు వస్త్రధారణ దోహదకారి. వీరు పారిశుద్ధ్యమును, క్రమబద్ధమును, సౌందర్యమును ఆకాంక్షించుదురు. చేతివృత్తుల ఉత్పత్తిద్వారా స్వల్పవ్యయముతో కళాన్వితముగ ఆవేశపూరితముగ గృహవాతావరణమును తీర్చిదిద్దుట వీరి ప్రత్యేక నేర్పు. స్వల్పములగు పరికరములలో పవిత్రత సౌందర్యము కలదను కమలాదేవిగారి వచనము వీరి ఆదర్శము. దేవీజీలోని ఈ గుణములనుగాంచి సరోజినీ నాయుడుగారు ప్రత్యేకముగ అభినందించుచుండెడివారు.

భారతీదేవిగారికి వ్యవసాయ వృత్తిలోగల కష్టనష్టములు సుపరిచితములు. కండలుపిండి, నడుములువంచి కృషియొనర్చుట ఎంతటి కష్టసాధ్యమో వారు గుర్తెరిగిరి. 1935 నుండి వ్యవసాయమును వారు స్వయముగా చూచుకొనుచుండిరి. ప్రాతఃకాలమున 5 గంటలకే నిద్రమేల్కాంచి పశుకొట్టమును పరిశీలించి, గృహకృత్యముల నిమగ్నయగుచుండును. వంటపని ప్రారంభించి పాలేళ్ళకు తమకు తయారొనర్చును. నిత్యమేతెంచు అతిథుల కొరకు మరి కొంత శ్రమించును. సాయంత్రము 10 గంటలకు నిద్రపోవును. పనుల ఒత్తిడిసమయములో రాత్రి 11 గంటల వరకు మేలుకొనియే యుండును.

ఆమె వహించుభారము వేదనాసహితము. పొలమునందలి సేద్యమును చూచుకొనుటయేగాక పశుకొట్టమును జాగరూకతతో చూచుట, జత ఎడ్లను జత ఆవులను కొన్ని గేదెలను లేగదూడ

లను పోషించుట, కోళ్ళ పెంపకమొనర్చుట మొదలగు బాధ్యతలు యేగృహిణికైనను, సత్తువపిండునట్టి చాకిరియే. వ్యావసాయమున కగు ఖర్చు అనుక్షణము పెరిగిపోవుచున్నది. తలకుమించిన ఖర్చుల భారముతో రైతు నానాటికి నలిగిపోవుచున్నాడు. విద్యావంతురాలయ్యును, రాజకీయముగ సాంఘికముగ బాధ్యత కలవారయ్యు వార్తాపత్రికల చదువుటకే అవకాశము లభించుటకష్టము. ప్రపంచమందలి రైతులెల్లరు ఇతరములగు విషయములలో జోక్యము కలిగించుకొనక ఇతరులపై అట్టి భారములుంచుటకు గల కారణమేమిటో తాను అనుభవపూర్వకముగ గ్రహించితినని చెప్పుచుండును.

నేటి కృషీవలులు జాతీయ రాజకీయములలోగాని గ్రామ సంబంధములగు పనులలోగాని తగినపాత్ర నిర్వహింపవలెనన్న వారి మానసికవ్యథ, శారీరకకష్టమును తగ్గించవలసియున్నదని ఆమె గుర్తించెను. కండలు కరగించు చాకిరితో నీటికొరత లేక ముంపు, పురుగులు, ఎలుకలుతో నిలుకడలేని ధరలతో రైతులు మానసిక వేదన ననుభవించుచున్నారు. ధరల స్థిరీకరణమొనర్చి, ప్రభుత్వము తగు ఋణసాహాయము నొనర్చినగాని రైతుల స్థితికి స్థాయి చేకూరదని వీరి గాఢాభిప్రాయము. ఎక్కువ వడ్డీలతో రైతులు పీల్చి పిప్పిచేయబడుచున్నారు.

విద్యావంతులగు యువకులు వ్యవసాయిక వృత్తిపై వైముఖ్యము చూపుటకు కారణములు - శ్రమతో కూడుకొనుట - ఎక్కువకాలము కష్టించవలసి వచ్చుట - ఫలితములయందు నమ్మకము లేకుండుట - యే భీమాలు లేకుండుటని వారు గ్రహించిరి. ప్రజలెల్లరులు విజ్ఞానవంతులైనచో వ్యావసాయిక పరిశ్రమ నేటివలె వేదనాకరముగానుండే తగు ఫలితము లొసంగకున్న,



నానాటికి క్షీణించును. వ్యవసాయముతోపాటు పశువులు, కోళ్ళ పెంపకముగూడ కష్టతమములె.

విజ్ఞానాభివృద్ధినొందు ఈ దినములలో రైతులను పరిణయమగుటకు యువతీ యువకులు సంకోచించుచున్నారు దీనికి అచ్చెరువందవలసిన పనిలేదనివారి అభిప్రాయము. ఇతర ఉద్యోగములవలె ఫలితములు లభించుచు; చాకిరితగ్గి; యంత్రపరికరములతో వ్యవసాయమును సులభముగా నొనర్చవలయును. వ్యవసాయక ఆదాయములందు ఎగుడు దిగుడులేక, అవ్యవస్థను రూపుమాపి; ధరలను స్థిరీకరించవలెను. జీవిత గమనముకై, వ్యవసాయ రంగమున ప్రవేశమొనర్చి; నేర్పరై, దీర్ఘదర్శియగు రైతు కుటుంబినిగాపరిపక్వత బొందిన అనుభవముతో మనజాతీయ నాయకులనెల్ల రైతులస్థితి అధ్వాన్న మొనరింపకుడని ప్రబోధించుచున్నారు. తగు సౌకర్యములు రైతులకుసమకూర్పుడని మదలించుచున్నారు. రైతుపురోభివృద్ధి జరిగిననాడే మనదేశములో సుస్థిరమైన ప్రజారాజ్యపాలనము నెలకొనినట్లు భావించవలెను. వారికై తగు జాగ్రత తీసికొని కనీసము ఇతరులు పొందు లాభములతో తుల్యమగు లాభముల నందునట్లైన చూడవలసిన బాధ్యత ప్రభుత్వమునకెంతేని గలదన్నారు.

1954లో ఆచార్య రంగాగారు జపాన్ దేశ పర్యటన మొనర్చిరి. అచ్చట వ్యవసాయ శాస్త్రిబోధకులతో సంప్రదించిరి. వారలు తదితరబోధకులవలె మానసికముగా మాత్రమేగాక శారీరకముగాకూడ కృషి నొనర్చుచుండినందులకు అధికములగు వేతనముల నందుచుంటిమని తెలిపిరి. వారి వాక్కులలో భారతీదేవి గారికి ఎంతయో వాస్తవము కన్పించినది. భారతీదేవిగారు ముప్పది సంవత్సరముల స్వానుభవముతో ప్రపంచ రైతాంగమునకు అన్యాయము జరుగుచున్నదని గ్రహించిరి. దోపిడివిధానము కొనసాగించిరి రైతుల సేవలకు తగిన ఫలితము సమకూర్పక; సాంఘిక ఆర్థిక

రంగములలో వారిపై చిన్నచూపు పరపుచు; ప్రపంచ స్థితి నెఱుంగుటకుగాని అవలోకించుటకుగాని అవకాశము కల్గింపక హాలికుని నేటిసంఘము చాల నీచస్థితిలో నుంచుచున్నది.

భారతీదేవిగారి అనుభవ పూర్వకమగు కృషియే యీ సాంఘిక నిరసనమునుండి రైతుజాతి నుద్ధరించుటకై నాయకులను దీక్షాకంకణ ధారులనుగా నొనర్చినది. రంగాగారి "ప్రపంచ హాలికులారా! ఏకముకండ"ను నినాదమునకు, రైతుకూలీ ప్రజారాజ్య స్థాపనతో సుస్థిర సుఖమ్ము కాంచుడను ప్రత్యేక పథకము కూర్చుటకు హేతు భూతము వీరి అనుభవమే.

ఆంధ్రుల ప్రముఖ మాసపత్రికయగు "ఆంధ్ర మహిళ"లో జాతీయ నాయకులలో ఆదర్శ దంపతుల జీవిత చరిత్రలు వుదహరించిరి. అందు రంగాదంపతులకు సముచిత స్థానమొసంగిరి. భారతీదేవిగారు ఆదర్శగృహిణిగా ప్రఖ్యాతి వహించినది,

—:o:—

# 2

## ప్రిన్సిపాలు శ్రీ గుత్తంసుబ్బరామయ్య

ప్రభువర్యులు సామ్రాట్టులు విలసిల్లగ నశియింపగ
తృటికాలమె సరిపోవును క్షణమొక్కటి చేయునటుల
దేశ గర్వకారణమౌ సాహస రైతాంగమ్మది
నశియించిన యొక్కసారి లోకెన్నడు పూర్తికాదు - అను

సుప్రసిద్ధ ఆంగ్ల మహాకవి గోల్డుస్మిత్ వచనము రంగాదంపతుల కిసాన్ ఉద్యమ సంస్థాపనకు గారణ ప్రదము. నలుబది కోటుల భారతీయులలో, నూటికి ఎనుబదివంతుల ప్రజలు గ్రామములందు వసించుచుండిరి. నగరముల యభివృద్ధికి పారిశ్రామిక పురోభివృద్ధికి తగినసన్నాహములు ప్రభుత్వమువారొనర్చుచున్నను, విశేష దేహ పరిశ్రమ కాకరమని ఆదాయమునఅల్పమని గుర్తెఱింగియు గ్రామీణులలో పెక్కురు వ్యవసాయమునే ముఖ్యవృత్తిగా గోరుచుండిరి. మనము రాజకీయముగా స్వాతంత్ర్యము నందిన దశాబ్దములనుండి స్వయంపోషక వర్గముల స్థితిగతులు ముఖ్యముగా రైతుల స్థితి గతులు నానాటికి దుర్భరములగుచున్నవి. సామ్యవాద సిద్ధాంతమును బురఖాతో - భూసంస్కరణములు, సహకార సేద్యము మొదలగు విధానములతో ప్రభుత్వము ప్రజలపై పరోక్ష దండయాత్ర లొనర్చి వారల కల్లోలమునకు హేతువై వారి స్వాతంత్ర్యమునకు భంగము కలిగించుచున్నది. తన జీవితమును హాలికుల పురోభివృద్ధికై అంకిత మొసంగిన రంగాగారికి షష్టిపూర్త్యుత్సవము ఇట్టి అనువగు తరుణమున నొనర్చుకొనుట ముదావహము. హైందవ

సంస్కృతి; హైందవ జీవితవిధానము, హైందవ పవిత్రాత్మ, హిందూదేశ గ్రామముల భద్రమొనర్చుటతోడను, హాలికులకు స్వేచ్ఛనొసంగుటతోడను ముడివడియున్నది. హిందూదేశమున పురాతన ఆధ్యాత్మికౌన్నత్యము కొలదిగానైన నిలచుటకు - విశేష ప్రజానీకమునకు తగిన భౌతిక బలసంపద నొసంగుటకు కారణభూతులగు నిరాడంబరులు, ఉదాత్తాశయులు, శ్రమజీవులు స్వంతవుద్యోగులు నగు రైతాంగమున కెంతయో ఋణపడియుండిరి.

రంగాదంపతు లిరువురు రైతుల విముక్తికై కష్టించి సృష్టించి ప్రపంచమందంతట రైతు ఉద్యమ నినాదము మార్మోగించిరి. తత్కారణముగా వారు మనకు జాతీయనాయకులు. వారి జన్మదినోత్సవములు మనకు జాతీయ ఉత్సవములవంటివి. నేడు మనము రంగాగారి షష్టిపూర్త్యుత్సవమును మాత్ర మొనర్చుకొనుచుంటిమి.

రంగాదంపతులను విడివిడిగా భావించరాదు. వారలు అర్థనారీశ్వరులు. ఒకేఆత్మకు సంబంధించబడిన రెండు దేహభాగములు, అందు భారతీదేవిగారిది ఉత్తమపార్శ్వమన్నను రంగాగారు హృదయపూర్వకముగ సంతోషింతురు. రంగాగారి స్వయంకృతాపరాధములనెల్ల దేవిగారు సక్రమమార్గములలో తీర్చిదిద్దు ప్రజ్ఞావిశేషమునుగూర్చిన ప్రసంగమె రంగాగారికి ప్రీతిపాత్రము. పరిపూర్ణ సహకారము వారి కుటుంబ జీవితమున కొక్కదానికే పరిమితమని భ్రమింపరాదు. భావములు, ఆదర్శములు, అభిరుచులు ఇరువురకును సామాన్యములు. వీరిని స్రష్ట వినోదముగ నొనర్చిన ప్రత్యేక సృష్టిగా నెంచవచ్చును. రంగాగారి భావములు, ఆదర్శములు భావోత్తుంగ శిఖరాగ్రముల విహరించుచుండుట తద్వ్యాప్తి నొనర్ప దూరదేశముల సంచరించుచుందురు. భారతీదేవిగారు వారికి ఆధారమై, రంగాగారికి గృహముతో సంబంధము విడివడకుండ నిలుపుచు తగు పత్నీ సపర్యలతో సంతోషపెట్టుచుండును. ఆమె వాస్తవముగా రంగాగారి 'ఇలవేల్పు'.



రంగాగారి ఉపన్యాసములు, కార్యక్రమములు భారతీదేవిగారు తన స్వంతములుగా భావించును. రంగాగారి అనుచరులను, సహచరులను తనవారిగా ఆతిథ్య మొసంగుచుండును. సోదరభావముతో భక్తిప్రపత్తులతో రంగాగారి ననుసరించును. భారతీదేవిగారు విశ్వమునకే 'జనయిత్రి' యన నొప్పును. రంగాగారి జయంత్యుత్సవములు భారతీదేవిగారి స్వంతములుగా నెంచదగును. ఈ సందర్భమున (1970) దేవిగారి చరిత్రము వెలువరించుట సందర్భోచితమగుటయేగాక, రంగాగారికి ప్రీతిదాయకము కాగలదు.

మహిళామణులలో ముఖ్యముగా గ్రామస్థులకు భారతీదేవిగారు మేల్బంతి. ఖద్దరు వస్త్రధారణమున వీరు నాగరికముగా, సుందరముగా నొప్పుచుందురు. అనారోగ్యము వీరిని బాధించుచున్నను మందహాస భాసితమగు వీరి వదనము ఉత్సాహపూరితముగ నుండును. వీరి పరిధుల సతతము కాంతిపుంజమును వెదజల్లుచుందురు. వీరు వాక్రుచ్చు కొలది వచనములు విజ్ఞానదాయకములు, ఆనందప్రసాదితములై యొప్పుచుండును. 'గోభూమి' దర్శనమునకేతెంచు ఆగంతుకులకు హృదయపూర్వక ఆతిథ్య మొసంగుచుండును. వీరు పరులను గౌరవముగ ప్రీతిపాత్రముగ స్వగృహమునందలి వారలవలె సంభావింతురు. వీరి ప్రభావమును ఆశీర్వచన రూపమున అందరందుకొందురు.

రైతుకుటుంబమున జన్మించి, గ్రామవాతావరణమున పెరిగి, పెక్కు దేశములు పర్యటించి, ఉన్నత సంస్కృతినంది పెక్కుర కీర్తి కాముకుల సాహచర్యము నొనర్చి ఆచార్యుడుగా, రాజనీతిజ్ఞుడుగా ప్రఖ్యాతి వహించిన రంగాగారికి సహధర్మచారిణియైయుండియు గ్రామప్రాంతములకు శోభను, శుభము కల్గించుచున్నారు. భారతీదేవిగారు, స్వల్పాభిరుచులతో జీవితమున పొదుపరియై, నాగరక భోగములకు విముఖియై పశుపోషణ, వ్యవసాయముల అనుదినము నిర్విరామకృషి నొనర్చుచు, హాలిక గృహిణులకు ఆదర్శమూర్తియగుచున్నారు. వీరి నిర్విరామ సేవాతత్పరత, త్యాగ

దీక్ష అగరుధూపములతో మహిషశృంగము నలంకరించి దేవతల ప్రీతికర్పించు † వేడుకలతో తుల్యమయినది. వీరికి గోభూమి యొక్కటియే వాసస్థలము కాదు. యావత్ప్రపంచము వీరి స్వగృహము. రస్కిన్ పండితుడు గృహమును శాంతినిలయముగా వర్ణించెను.

మరియు ఆదర్శవంతమగు పత్ని ఎట నిలచునో గృహమంతయు శాంతి, సుఖము ఆమె పరిధులలో నెలకొనును. తారకలు ఆమె శిరోభాగమున నొప్పుచుండును. నిశాసమయముల శీతలమైన పచ్చికపై వెలుగొందు "మిణుగురు" వెలుగులు ఆమె పాదప్రదేశముల అగ్నిపుంజముగా రూపొందును. ఆమె నిలచిన ప్రదేశమే గృహమునకు నిలయము. సౌశీల్యవంతమగు మహిళ తనచుట్టునున్న పరిధి నింకను సువిశాల మొనర్చును. చెక్కకూరుపులు కన్న గట్టిగాను; వివిధ చిత్రవర్ణములకన్న భాసురముగను ఆమె గృహమును నిర్మించును. దాని స్వచ్ఛమగు ప్రకాశము దూరస్థులయిన గృహవిరహితులపైగూడ ప్రసరించుచుండును.

భారతీదేవిగారు రస్కిన్ అభిప్రాయము ప్రకారము "ఉత్తమ గృహిణిగా, సౌశీల్యవంతమగు మహిళ"గా నొప్పియున్నారు.

గమనార్హుడగు భాగస్వామితో పూర్తిగా సహకరించి ఐక్యత నొందుటయందే వీరి ఉదాత్తలక్షణములతో వీరి మహోన్నత సంపద వెలుగొందుచున్నది. ఆచార్య రంగాగారిని కేవలము భర్తగాగాక, ప్రియమగు దేశికునిగా; నాయకునిగా; వీరునిగా భావించి, తన జీవితమునకు పరమావధిగా, తన ఆత్మకు పరమాత్మగా, తన సర్వస్వమునకు అధినేతగా నెంచుకొనును. వారి ఉన్నతి తనదిగా స్వీకరించును. ఛాయవలె అనుసరించుచు, అతని ఉన్నతికి రక్షణ వహించి సౌకర్యముల సమకూర్చుచు సర్వవేళల వారి రక్షణభారము తీసికొనుచున్నారు. వర్డ్సువర్తు మహాకవి వ్రాసినట్లు భరద్వాజ 'పరంగము'వలె దేవిగారు సైతము—

† ఈ ఉత్సవములు పురాతన గ్రీకుల ప్రసిద్ధములు.



జ్ఞాన సంఘము పోవు విధానములను
గీమునుండియు పై సర్గధామ మరుగ
ఉన్నతోన్నత పథమున కురుకుగాని
ప్రక్క పరిధుల సంచరింపంగబోదు.

వర్డ్సువర్తు మహాకవి ఊహామాత్రములగు సౌశీల్యవంతమగు స్త్రీ లక్షణము లీమెలో ప్రత్యక్షముగ గోచరించును. దృఢమగు మనోనిశ్చయముతో ఓరిమిగలిగి; దీర్ఘదర్శియై నైపుణ్య బలములుగల పవిత్రాత్మయగు స్త్రీ విశ్వస్రష్ట ఉదాత్తమగు సృష్టి.

హెచ్చరిక లొనర్చుచు, సౌకర్యము లొనర్చుచు ప్రజల నాజ్ఞాపించుట ఆమె ధర్మము. దవ్య ప్రకాశముతో కాంతివంతముగ వెలుగొందు దేవతాస్వరూపిణి ఆమె.

రంగా దంపతులకు సర్వమయుడు దీర్ఘాయురారోగ్యముల నొసంగి, విశ్వశ్రేయమునకై వారొనర్చు జతనములు సఫలీకృత మొనర్చుగాక.

# తొలి చదువు

భారతీదేవి (తొలి) చదువులు పొందినది అమృతలూరులో. అప్పటికే (1915) ఆ గ్రామములో ఉభయభాషా గ్రంథాలయము బయలుదేరుచున్నది. సంస్కృత విద్యాలయము ప్రథమ రూపు రేఖలు దిద్దుకొనుచున్నది. బ్రాహ్మణేతరులుగూడ సంస్కృతము చదువుకొనవచ్చుననుకొంటూ, సంస్కృత విద్యాభ్యాసమును ఆ గ్రామస్థులలో కొందరు పొంద ప్రారంభించినారు.

వారు ప్రారంభవిద్య కొనసాగించు కాలములో, స్థానిక పెద్ద కుటుంబమునుండి శ్రీ శరణు రామస్వామి ఆంగ్లవిద్యకు అఱ్ఱులు చాచకుండ బందరులో జాతీయోద్యమ నాయకులు స్థాపించిన జాతీయ కళాశాలలో చదువుకొనుటకు వెళ్ళుచుండిరి. అట్టి జాతీయోద్యమ, సాంఘిక అభివృద్ధి వాతావరణమునందు భారతీదేవిని వారి అక్కయ్య బుల్లెమ్మగారు పెంచుచుండిరి.

1920లో మా యిద్దరికి వివాహము చేయుటకు పెద్దలు నిశ్చయించిరి. అప్పటికే నేను జాతీయోద్యమము ఆంధ్రోద్యమము, సాంఘిక విప్లవ ధోరణులకు హృదయార్పణ చేసికొంటున్నాను. నేను పెండ్లి ప్రధానపు మర్యాదలకు భారతీదేవిగారి పుట్టింటికి (మాచవరము) వెళ్ళినపుడు, వారి నాన్న శ్రీ వెలుగు సుబ్బయ్య వారి పరిసర గ్రామములైన చింతలపూడి, ములుకుదురు, ఈతేరు, గుడిపూడి, యాజలి, ప్రాంతాల మాగాణి రైతుల నీటి సప్లయి యిబ్బందుల గుఱించి, రేయింబవళ్ళు పి. డబ్ల్యు డిపార్టుమెంటు



వారితో ఆందోళన చేయుచుండిరి. ఎంతో ధనవ్యయము, శ్రమ పొందుచుండిరి. నేను అప్పటికే ప్రజాందోళనలలో కొంత అనుభవము పొందియుంటిని కనుక సుబ్బయ్యగారి యుద్యమములో శ్రద్ధ చేసితి! అవసరమైన పిటీషనులు, ఉద్యోగులతో సంప్రదింపులు, వారి పెద్దలతోపాటు నేనును చేయసాగితిని. నా చొరవ, శక్తి వారందరి మన్ననలను పొందుచున్నవి. అదంతయు భారతీదేవి హృదయమును అమితముగ ఆకర్షించినవని ఆమె ఇంగ్లండులో నాకు చెప్పుచుండెడివారు.

ఎన్నెన్నో పుస్తకాలు (అబలా సచ్చరిత్రరత్నము, ఆంధ్ర నాయకులు, భాగవతము...) ఆమె కొరకై తెచ్చి, వారి నాన్నగారికి ఇచ్చుచుంటిని. నా యొద్దకు ఆ చిన్ని అమ్మాయి రాదుగా! సిగ్గు, భయము! ఆపైన వారి కుటుంబపు ఘోషా, ఆచారము. ఒకనాడు ఆమె పాదము నిప్పుల వేడికి కమిలిపోయిందట! అది విని నేనెంతో బాధపడితిని. వెంటనే పొన్నూరు నడచి వెళ్ళితి! డాక్టరు వద్ద మందులు తెచ్చితిని, అందించితిని! ఇదంతయు వారందరకు ఆశ్చర్యము. అలా సిగ్గుపడకుండా, స్త్రీలకై శ్రద్ధచేయడం ఆనాటి యువకులకు, అందులో పెళ్లి ప్రధానమైనవారికి పరిపాటికాదుగా? అయితే వారి కుటుంబాల వారందరికి లోలోపల తృప్తియే. వారి మిత్రులు, స్థానిక బ్రాహ్మణులలో పెద్దలయిన శ్రీ గుంటూరు అచ్చయ్య పంతులుగారు మాత్రము వచ్చి "సుబ్బయ్యా! నీకు గొప్ప అల్లుడే అందుతున్నాడయ్యా! పండితుల హృదయ మాయనది" అన్నారట. ఆ "సర్టిఫికెట్టు" భారతీదేవి హృదయముపై గొప్ప ముద్రగా ఉండిపోయినదట.

కనుక నేను ఇంగ్లండు వెళ్ళగా ఆమె బంధువులందరు ఆమెకెంతో అదృష్టము కలుగుతుందనుకున్నారు. 'ఐ. సి. యస్‌గా వచ్చి, గొప్ప కలెక్టరై, ప్రభుత్వపు పెద్ద అవుతారు భారతీదేవి భర్త' అని తలి వూరు మాచవరములో, అక్కయ్యగారి వూరు అమృతలూరులో, మా వూరు నిడుబ్రోలులో అందరూ భారతీదేవిని ఒక

లక్ష్మీదేవిగా లెక్కవేసికొనుచుండిరి. అందువలన ఆమెకు బాగా చదువుకొనవలయునను కోర్కె బలపడింది. ఇంగ్లీషు, తెలుగు, కొద్దిగా సంస్కృతము చదువుల ఆమె ప్రధానకర్తవ్యమై పోయిందట. నేను **1923-1924**లో ఇంగ్లండునుండి తిరిగి వచ్చుసరికి ఆమె స్కూలు ఫైనలు చదువుల వరకు ప్రైవేటుగానే చదువగలిగిరి. ఆపైన మహాత్ముని స్వరాజ్యాందోళనము, అందు వారి తండ్రి, పెద తండ్రి శిస్తు నిరాకరణోద్యమమందు పాల్గొని, శిస్తు నిరాకరణ చేసినందులకై అదనపు అపరాధ శిస్తులచే శిక్షింపబడడం, వారిద్దరు కాంగ్రెస్ వాలంటీర్లుగా ప్రచారము చేయడం జరిగినది. ఇంగ్లండునుండి నేను వ్రాయుచున్న జాబులద్వారా, నేనుకూడ మహాత్ముని ఉద్యమానికె హృదయాన్నర్పణచేస్తున్నానని, ఐ. సి. యస్‌కు పోవడానికి నిరాకరించానని, ప్రజాసేవలో చేరుతానని ఆమె తెలుసుకొన్నారు. ఐ. సి. యస్ వారికంటె గొప్ప బిరుదులే పొందుచున్నానను వార్తల మూలమున, అట్టి వాతావరణములో, భారతీదేవి నాపై మమత పెంచుకొన్నారు.

నేను తిరిగి వచ్చినవుడే శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు, వారి సతీమణి లక్ష్మీబాయమ్మగారితో కలిసి గుంటూరులో శారదా నికేతనాన్ని స్థాపిస్తున్నారు. అయితే వారిహాస్టలులోనే యుంచి, ఆ పట్టణములో తమ ఆడబిడ్డలను చదివించుకొనుటకు, ఆనాటి రైతు కుటుంబీకులు సాహసించుటలేదు. అందువల్ల వారు నా సహకారమును కోరిరి. నేను మామయ్య సుబ్బయ్యగారితో సంప్రదించితిని! ఆయన "మనవారి ఆచారములకు విరుద్ధము. మీ రిద్దరు కాపురము పెడితే ఫరవాలేదు" అన్నారు. "ఇంత తొందరగా కాపురమెందుకు? ముందు కొంతవరకైనా చదువున సాగనివ్వండి" అన్నా. వారికి ఇష్టము కలుగలేదు "మీ అమ్మాయినే అడగండి" అన్నా. మా అమ్మ, అమ్మమ్మ అంగీకరించలేకుండిరి. తుదకు భారతీదేవి అక్కయ్య బుల్లెమ్మగారు ఆమెను మా యింటికే తీసుకొని వచ్చిరి. నేను ఆమెతో అన్నివిషయములు చెప్పితిని. "శారదా



నికేతములో ఒక్క సంవత్సరమైన చదువుకొంటే, ఆ పిమ్మట కాపురము ప్రారంభించుదాము. నే నింకా పెద్దచదువులు (రిసెర్చి) పూర్తి చేయలేదు. తిరిగి ఇంగండు వెళ్ళవలసియుంది! అవసరమనుకుంటే మా అమ్మ వచ్చి తోడుగా ఉంటారు" అని చెప్పితిని. వారి పెద్దలకు బహు కష్టముగా నున్నదట! అప్పటికి భారతీదేవికి ఇంకా ఇరువది సంవత్సరాలైనాలేవు. అయినా! వారితో తెంపు చేసి చెప్పిరట.

"ఎట్లయినా మే మిద్దరము కాపురము చేయవలసిందేగా! మన ధర్మము ప్రకారము మేము దంపతులము. మన ఆచారాలెట్లాయుంటేనేమి, వారి తల్లి గారి వెంటవెళ్ళి వారందరితో కలిసియుండి' శారదానికేతనములో చదివితే తప్పేమి? చదువుల కొఱకు కలసియుంటే మీ రెందుకు కాదనడం? వారితోటే నా జీవితం జరగాలి కదా? అది యీ సరస్వతీదేవి పూజద్వారా ప్రారంభించనివ్వండి." ఆ చిన్నమ్మాయి నోటినుండి యింత పెద్ద ఆలోచనలు మాటలు వస్తుంటే వారి తల్లీ, అక్కయ్య లెంతో తృప్తిపడినారట! ఆ మాటలువిన్న మా అమ్మమ్మ ఆనందానికి అంతులేదు. "అబ్బాయీ! రంగయ్యా! మనయింటికి దేవతే వచ్చింది. తీసికొనివెళ్ళు అమ్మాయిని గుంటూరుకు" అన్నారు ఆమె.

గుంటూరులో శారదా నికేతనములో వారితో కలసి చదివినవారిలో శ్రీమతి అన్నపూర్ణమ్మ మైసూరునుండి, సంగం లక్ష్మీబాయి తెలంగాణమునుండి ఎం.పిలుగా పెరిగిరి. మా చెల్లెండ్రు అనసూయ, పుష్కరాంబ విద్యావతులైరి. పుష్కరాంబ స్వాతంత్ర్య యోధురాలై జైలుకు వెళ్ళి ఆర్టుటీచరుగా పెరిగిరి. ఉన్నవ దంపతులకు భారతీదేవి ప్రియపుత్రికలలో ప్రథమశ్రేణికి పెరిగిరి. తెలుగులో ప్రావీణ్యమును పొందిరి. ఇంటివద్ద నేను ఇంగ్లీషు నేర్పుచుంటిని. సరసర విశ్వవిద్యాలయ పట్టభద్రులకంటే విజ్ఞానాన్ని, విశాల దృక్పథాన్ని భారతీదేవి **1923-1925**లో అందుకొనగల్గిరి.

శారదా నికేతనములో నుండగా దేశసేవా నిరతులై ప్రసిద్ధి బొందిన (శ్రీ కొండా వేంకటప్పయ్య, సీతారామశాస్త్రి), మద్ది వేంకట రంగయ్య, కాశీనాథుని నాగేశ్వరరావు మరెందరో ఉపన్యసించుచుండిరి. వారందరికి భారతీదేవి ప్రత్యేకముగా పరిచయము చేయింపబడుటవలన ఆమెకు దేశభక్తులపై అనురాగము పెరుగుచుండెను. వివిధదేశాల స్వాతంత్ర్యోద్యమాల గురించి చదువులు పొందిరి. వీరేశలింగం పంతులు సాగించిన స్త్రీ) ఉద్యమము, వితంతువుల రక్షణోద్యమములందు లక్ష్మీబాయమ్మగారు ఎట్లు సేవచేసిరో తెలిసికొనిరి. ఆ సమయములోనే కాకినాడలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సభా సమాచారములతో పరిచయము పొందిరి. అలాగ నేను శిరసావహించుచున్న దేశసేవా వ్రత ధోరణులతో భారతీదేవి చదువులు సాగినవి.

ఆ సంవత్సరాలలోనె (1) రైతు సంఘాల ఆవశ్యకత 2) పంచములకు ఆర్థిక, రాజకీయ ప్రణాళిక 3) వృత్తి సంఘాలు-స్వయంవృత్తి వారి రక్షణకై 4) కూలి దుకాణాలు **(Labour Exchanges)** కావాలి 5) గ్రామీణ నిరుద్యోగనివారణ చేయడం యెలాగా? 6) పంచములకు వయోజన వోటింగు హక్కువుండాలి అనే విషయాలపై తెలుగులో చిన్నచిన్న పుస్తకాలు వ్రాసితిని. ఆంధ్ర పత్రికలో వాటిని కీ॥ శే॥ చల్లా శేషగిరిరావుగారు సీరియలుగా ప్రచురించుతూ వుండిరి. గుంటూరుజిల్లా ప్రథమ రైతు సభను అప్పికట్లలో; రైతు - వ్యవసాయ కూలీల ప్రథమ సభను నిడుబ్రోలులో - యిప్పుడు గోభూమి వున్నచోట నడిపితిమి. నేను అధ్యక్షత వహించితిని. అట్టి సాంఘిక విప్లవ వాతావరణములో ఆమె తన విజ్ఞానాభివృద్ధి బొందుచూ, నాపై విశ్వాసము గౌరవము పెంచుకొనుచుండిరి.



# సముద్రంలో ఉపద్రవం

"మునుగుతామా, ఇద్దరం ఒకే సమయాన - యీ సముద్రంలో కలిసిపోతాము. బ్రతుకుతామా, ఒడ్డు అందుకుందాము. కలిసేవుందాం." అంటూ ఆ లైఫ్‌బోట్‌లో చేరితిమి. ఇంకొ ఇరవై మంది యూరోపియన్, సయామ్, ఇండో చైనా వారున్నారు మాతో.

త్వరగా పొద్దుగూకుతుందేమో, అనిపిస్తూంది. ఎగిరెగిరి సముద్రపుటలలతో ఆడుతుంది మాబోటు! మైలు దూరంలోవున్న భూమివద్దకు, దాన్ని సాగించడానికి - స్టీమరులోని 'కళాసులు' మాతో రాలేదు.

నేను చుక్కానివద్ద - మరొకరితో కలిపివున్నా, నాకేమి తెలుసు? అయినా ఏదో ధైర్యం!

మేము వదలివచ్చిన స్టీమరునుండి పొగ నల్లగా, గొప్పగా ఆకాశానికి లేస్తున్నది. వందలాది ప్రయాణికులు 'డెక్కు'మీద నిలబడి చేతులు ఆడిస్తూ మాకు ఆశీర్వాదాలు అందిస్తూ అరుస్తున్నారు. కొందరు చేతిరుమాళ్ళు విసరుతున్నారు. వారికీలేదు. మాకూలేదు ఆశ??

స్టీమరును ఆపి లైఫ్ బోట్లలో అందరినీ ఒడ్డుకు చేర్చమన్నాం - కాని కెప్టెన్ ఒప్పుకోలేదు.

"ఫరవాలేదు - ఆనిప్పును ఆర్పివేస్తా"మన్నారు.

అలాంటి విపత్తును గురించి చదివుండినవాళ్ళం "నిప్పు బాగా రాజుతుంది ఉప్పునీరు దానికి ఆజ్యం అవుతుంది స్టీమరును

వదిలివేయాలిసిందే ముందు మమ్మ రక్షించాలి" అన్నాం. కెప్టెన్ ఒప్పుకోలేదు.

"పోనీ, మేమునెడతాం, మాకు కళాసులను యివ్వండి' అన్నాం, వల్లకాదన్నాడు.

మేము తిరగబడ్డాం. కాలుస్తానన్నాడు. సత్యాగ్రహమే నన్నాం. తుదకు "మీఅంతట మీరు వెళ్ళం"డని విసుక్కున్నాడు.

అప్పుడు అడిగినా భారతీదేవిని - "వెళ్ళుదామా?" అని.

"అబ్బో ఇంతసముద్రంలోనికా?" అంటున్నారు యూరపిన్ యువతులు! "నడిపేవాళ్ళుకూడా లేరే?" అంటున్నారు. వారివారి భర్తలను భయపెడుతున్నారు.

భారతీదేవిమాత్రం. "ఇందులో వుంటే తగులబడిపోతాం. సముద్రంలో అయితే మునిగిపోతాం కానీ అదృష్టం వుంటే బ్రతుకుతాం. కాలిపోవటంకంటె మునిగిపోవటంలో కష్టం తక్కువ. ఏమో, బ్రతుకుతామేమో! ఏమైనా ఇద్దరం ఒకేమారు మునిగిపోతే అది మన దాంపత్యం, భారతీయ సంప్రదాయం, ధర్మం గదా?" అన్నారు. ఆ నిండు యౌవనవతి. భారతీయ యువతి. రైతుబిడ్డ భారతీదేవి?

అలాగా, సముద్రపు టలలపై ఆశ. నిరాశలమధ్య ఊగుతూ దిగినాము.

అది ఇండియన్ మహాసముద్రం! ఆ దగ్గరలోనే వుందన్నారు గాని కనబడలేదు, జిబూతీ రేవు ఫ్రెంచివారి సోమాలీలాండ్‌లో (అది యెప్పుడు స్వతంత్ర దేశమైనది.)

మేము కదులుతున్నాము. గంటకొకమైలా, ఫర్లాంగా? అందరం ఆకసంవంక చూస్తున్నాం సూర్యుని కోరుకుంటున్నాం.



మరింత నెమ్మదిగా దిగమని! ప్రొద్దు గూకకమునుపే ఒడ్డు కను చూపులోకి రావాలిగా!

గంటలు సాగినవి. చిరుచీకట్లు క్రమ్ముతున్నాయి. చిన్నవిగా వుండే అలలుకూడా కొండలుగా కనిపిస్తున్నాయి. భయం పెరిగిపోయింది. మరి ఆశలు అస్తమిస్తాయా?

"ఏమమ్మా! భయంకరంగావుందా?" అంటున్నా.

"మీతోనే ఉంటినిగా, ఇదిగోనాచేయి. ఇద్దరం కలిసే వున్నాం. ఇక భయమెందుకు! అంటూవున్నారు. పలుమారులు ఆ భారతీదేవి!

ఇరవై సంవత్సరాలనిండు శక్తుల ఇల్లాలు!

"అదిగదిగోభూమి!" అన్నారు. ఎందరో లేచిరి. బోటు మరీ కదిలిపోయింది.

"కూర్చోండి, భద్రం" అంటూ పెద్దలమైన మేము హెచ్చరిస్తూ వుంటిమి.

చీకట్లు దట్టంగా క్రమ్ముచున్నవి. టార్చిలైట్లు వేశాం. సముద్రపు నాలుకలు మరీ భయంకరముగా వున్నవి.

"అందుకొంటున్నాం" అంటున్నాము. అందినాము ఒడ్డు వచ్చింది... ఐతేనేమి పోర్టు గోడమెట్లు నీటికి పదిఅడుగులపైన! మాబోటుకింద!! బోటులోనుంచి పదిఅడుగుల ఎత్తులోవున్న గోడ మీదకు ఎక్కాలి! ఎలాగా ఎక్కడం! నిలబడ్డాం అందడంలేదు.

...ఎట్లానో, గోడపైనవున్న ఇనుపమేకును మోకును చుట్టాం!......'అందింది' అనుకుంటాం. అలపైకి ఉబికినప్పుడు. అంతలో అల ఆగిపోయింది. అది అందలేదు. నిలబడ్డవాళ్ళం కూలిపోతున్నాం.

ఇలా పది పది హేను ఊపులైన తరువాత, పట్టుకున్నాం మేకును. నిల్పినాం బోటును! అంచుతో ఆటాడుతున్నాం.

ఇక పైకి ఎక్కాలి. ఎవ్వరు- తేలికగా వుండేవారు! వాళ్ళలో నేనొక్కడిని! ఎగిరాం, మోకాళ్ళు పెళ్లునుంటున్నాయి. రాసుకు పోతున్నాయి. ఐనా, ప్రాకినాము. ఐదుగురం. పదిమందిమి!...

ఇక స్త్రీలను అందుకోవాలి. సులభమా? ముందు ముసలి వారా? వయస్సువారా? పిల్లలా? ....పిల్లలనే అందించారు. పైకి లాగినాము. వయసులోవున్న వారిని కొందరిని తెచ్చుకున్నాం. వారు, వీరుచేరి కొందరు ముసలివారిని అందించారు.

"ఏవమ్మా! భారతీ!" అంటున్నా నేను.

"అవునవును. ఆ సుందరిని ముందుకు పంపండి." అంటున్నారు ఫ్రెంచి పెద్దలు.

"కాదు, నేను వీరిని అందించాలి నాకు తొందరలేదులే!" అంటున్నారు భారతీదేవి.

"మేము మగవాళ్ళం, ముందు మీరే పైకి వెళ్ళాలి" అంటూ ఫ్రెంచి, ఇటాలియనులు - భారతీదేవిని బలవంతాన పైకి పంపినారు. పాపం, ఎన్నో దెబ్బలు తగిలాయి. పైన కోకచుట్టు కొని, ఎంతో బాధపెట్టినది. అయినా, పైకివచ్చి తెల్లవారివలెనే, నన్ను కౌగలించుకొన్నారు.

"ఇద్దరం బ్రతికాముగదా? ముందుజన్మలోకూడాయింతే" నన్నారు.

"ఔనమ్మా! ఇంతే!" అంటూ ఓనిమిషం నేను గంతులు వేసినా.

"బాగానేవుంది. మరి మిగతావారో? వారిని అందు కొందాం. రండి" అంటూ వుండిరి.



అందరూ పైకి వచ్చినారు. గొప్ప శ్రమమీద రెండుమైళ్ళ దూరంలోవున్న "జిబూతీ" అనే పట్టణానికి చేరుకున్నాం. హోట లులో చేరాం. దెబ్బలు తిన్నవారికి శుశ్రూషచేస్తూ రాత్రి ఒంటి గంటవరకూ భారతీదేవి శ్రమిస్తూనే వున్నారు. తన కాలికి కట్టు తోనే!

ఇంతలో గొప్ప బాంబు ప్రేలినట్లు ఆ స్టీమరు నిప్పు నాలు కలలో దగ్ధమైపోయింది. ఆ అగ్నిదేవుని విశ్వరూపం మాకు కన్పడ్డది.

ఒకరివంక ఒకరం చూచుకుంటూ — "మనం బ్రతికాం. మన దాంపత్యం అగ్నిదేవుని సాక్ష్యంగా నిల్చింది. భద్రమైన దేలే!" అనుకున్నాం.

ఇది 1926లో... మేము చదువులు, యూరపు పర్యటనలు పూర్తి చేసుకొని తిరిగివస్తున్న బోటు ప్రయాణపు చరిత్రలో ఒక అంశం.

అంతటి ధైర్యం, ప్రేమబంధ, సేవాశక్తి ఆమె సొత్తులు! అనుభవాలు!

ఆ బోటులోనే ఉండిపోయినవారిలో, అది మునిగిపోయే ముందు ప్రాణాలు రక్షించుకొనుటకు బైటపడినవారిలో - నలుగురు మరణించారు. పదిమంది వికలాంగులైనారు. ఎందరికో ఒళ్ళు కాలి పోయినది. ఎన్నో నష్టాలను పొందిరి.

నిడుబ్రోలు, మాచవరంలో, మా బంధువులకు యేవార్తా తెలియక, నెల పర్యంతం - మాబోటు తగలబడిపోయింది. మేము యేమైపోయినామోనని గొప్పదిగులులో వుండిపోయిరి కొలంబో చేరి, మేము తంతి యిచ్చేవరకు!

—:o:—

## "సముద్రమే జయిస్తే" - అన్నారు దేవి

తూర్పు ఆఫ్రికాలోని, జిబూతీ - ఆనాడు ఫ్రెంచి సామ్రాజ్యములో భాగమైన, సోమాలీ లాండునకు ముఖ్యపట్టణము.

మా స్టీమరు బ్రద్దలై దగ్ధమై పోయిన తరువాత మరో పదునాల్గు దినాలు అచ్చటే, ఫ్రెంచివారి మరో స్టీమరు వచ్చువరకు ఉండవలసి వచ్చెను. భరింపరాని యెండలు! ఆకలితీరని, రుచించని తిండి, అంతా అసౌకర్యమే! ఖర్చులకు డబ్బులేదు. భవిష్యత్తు అయోమయం.

అయినా, అలాగా దిగబడిపోయిన వారికి నేనుకూడ నాయకుడను. ఫ్రెంచి గవర్నమెంటుతో సంప్రదింపులు జరుపుచుండినాము. అలాగా మూడురోజులు గడచిన తరువాత ఆదేశపు నీగ్రో ప్రజల ఆర్థిక సాంఘికపరిస్థితుల గురించి సర్వేచేయుట మొదలు పెట్టినాను. వారిని వీరిని అడిగి తెలిసికొన్న విషయాలు వ్రాస్తూంటిని.

ఇదంతా చూస్తూ ఓ సాయంకాలం భారతీదేవి కండ్ల నీరు పెట్టుకుంటూండిరి. "ఏమమ్మా బాధ?" అని అడిగితిని.

"ఆస్టీమరులోనే; మనము౦డిపోతే, ఆ స్వర్గీయులైన వారిలో మనమే చేరితే ఈ సర్వేచేసేవారెవరు! ఈ దీనులైన నీగ్రోల అవసరాలను తెలుసుకొనేవారెవ్వరు? ఎన్నెన్నో జిల్లాలు తిరిగి రైతులు, కూలీలు, చేనేతవారు, ఎలా జీవిస్తున్నారో సర్వేచేశారే! ఎన్నో గ్రంథాలు వ్రాసి ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమునకు అందించిరే! అన్ని గొప్పపట్టాలు పొందిరే! అవన్నీ యేమైపోయేవి?



సముద్రములో మునిగిపోతేనో? అప్పుడు మనమిద్దరం ఆక్సుఫర్డులో, థేమ్సు నదీతీరమున విహరిస్తూ భారత మహిళాలోకమునకు సేవ చేయటానికై యెన్నో ఆలోచనలు చేస్తిమే! మన ఆడవారికి చదువులు పెంచాలనుకొంటిమే! ఘోషాపద్ధతిపై పోరాడాలనుకొంటిమే! వ్యర్థపు ఆచారాలను త్రోసివేయాలనుకొంటిమే! రాజకీయపు చదువులు స్త్రీలకు అందజేయాలనుకొంటిమే! గ్రామీణ ఉత్సవాలు జాతీయస్వాతంత్ర్యపు తిరునాళ్ళుగా మార్చుకోవాలను కొంటిమే!" అన్నారు. "ఇట్టి, ఆలోచనలు నన్నుకూడ ఆసాయంకాలము సముద్రపు కెరటాలు మనలను ముంచివేస్తున్నట్లు పొంగుతున్నప్పుడు ఆందోళన పరచినవమ్మా?" అన్నా. "నాకు అట్లే దిగులు దుఃఖం కలిగిం"దన్నారు.

"ఎంత ధైర్యంగానుంటిరి! ఏభయంలేని వారిలాగే అందరినీ నడపిరే!" అంటూ తన కన్నీరు తుడిచివేసికొనిరి.

మరోనాడు నాతోబాటు వారుకూడ నీగ్రోల ఇళ్ళకువచ్చిరి. వారి గుడారాలు, గుడిసెలు, రేకులక్రింద మండిపోతూన్న వారి గదులు చూస్తూండిరి. వారి కుటుంబాలు పెద్దవి. బిడ్డలు కోల్లలు. గుడ్డలు ఎవ్వరికీ చాలవు. బిడ్డలు దిశమొలలతోటే, బొమికెలో, మరేవో చీకుతూ, ఈగలతో పోరాడుచుండిర.

ఆ దౌర్భాగ్యమంతా చూస్తూ, విషాదముతో క్రుంగిపోతూంటిమి. దీనికంతా కారణం సామ్రాజ్య పిశాచమేనా? అదికూడా నిజమే! మరెన్నో కారణాలు లేవా? వీళ్ళ "ట్రైబు"ల నాయకులు స్వార్థపరులు, వీరికి స్వరాజ్య ఉద్యమమే లేదు. ప్రతి కుటుంబానికి ఇంతమంది పిల్లలైతే ఎలా? "నిజమే!" అన్నారు ఆమె. అందుకే కుటుంబ నియంత్రణ అవసరమంటున్నా. అదే బర్ట్రాండ్ రస్సెల్ చెపుతున్నారు.

"పిళ్ళకు చదువులేవి? ఇంత పట్టణానికి ఒక్క హైస్కూలు కూడ లేదన్నాం. ఆఖరకు అందరు పిల్లలకు ఎలిమెంటరీ స్కూళ్ళ

యినా ఉంటే, వీళ్ళు యిలా యెండలో; వీధుల్లో ఇంత అధ్వాన్నముగా నుందురా?"అన్నారు. మనదేశంలోకూడ ఇంతేగా, మన పల్లెల్లోని పంచములు, కూలీల బిడ్డలకు చదువులేలేవుగా? ప్రాథమిక విద్యకిచ్చేది కొద్ది డబ్బైతే, పాఠశాల స్థాపించి నడపగల్గేది పదియూళ్ళకొకటికూడ అందకుంటే, ఊరికొకటి, పల్లెకొకటి వుండాలంటారు. ఈ పిచ్చులన్నీ యెప్పుడు పోయేది." "రంగా! మనం వీటన్నిటిమీద పోరాడగలమా?" అన్నారు ఆమె.

"ఆ సముద్రముతో పోరాడితిమిగదా! అలాగే" అన్నా. తిరిగి వారికళ్ళు స్రవించుచున్నవి.

పొగతో నిండిపోతున్న ఆ స్టీమరు అలల మధ్య ఊగిపోతున్న మా చిన్నిబోటు, కవ్విస్తున్న మృత్యువు మా హృదయాలను కదలించివేశాయి. ఆపైన దిక్కులేని నీగ్రోజనాలు! మృత్యువునుండి రక్షింపబడినామనే తృప్తి, అంతలో తప్పిపోయినది, ఆపద అనే ఆశ్చర్యం, ఇద్దరం అన్నాళ్ళుగా అల్లుకొన్న, సాంఘిక సేవాకార్యక్రమాలు; రాజకీయ తిరుగుబాటు ధోరణులు, సాహసికంగా నడుపదలచిన దేశసేవావ్రతాలు, హృదయపూర్వకంగా ఆచరింపదలచిన ఆశయాలు, ఆ సముద్రపు ఘోషల ద్వారా మరింత బలం పుంజుకున్నవి! మా యిద్దరి హృదయాలు పెనవేసుకున్నవి! అన్నారు ఆమె! "అన్ని ఆశలతో మీ అమ్మ అచ్చమ్మ మిమ్ము కన్నారే, అన్నిత్యాగాలు మీవారంతా మీకొరకై చేశారే! మా నాన్న, మా అమ్మ మీ సంబంధముతో నేనేన్నో ఆనందాలు పొందుతాననుకున్నారే!

ఇన్ని చదువులు పొందారేమీరు! విసుగులేకుండా అన్ని విషయాలు నాకు చెప్పుతున్నారే! ఎన్నో ప్లానులు వేసుకొన్నామే మన గ్రామాలను బాగుచేసుకుందామని? అన్నీ ఆ నీళ్ళపాలు కావలసిందేనా! అబ్బ, ఎంత కష్టమనిపించిందని "

—:o:—

# ఆశయాలు - ఆశలు - స్త్రీల సేవలో యూరపులో వుండగా నా ఆలోచనలు

నాకొక అదృష్టము. మా కుటుంబములో, మా అమ్మమ్మ, అమ్మ, అక్కయ్య మా వ్యవసాయం, వగైరా వ్యవహారాలన్నిటిని సాగించుతూండే వారు. నాకు పదిసంవత్సరములు వచ్చేసరికే పెత్తనము చేసే పురుషులెవ్వరు లేకపోవడం, ఆ ముగ్గురు తల్లులే మమ్ము పోషిస్తూ పెత్తనము చేస్తూవుండడము మా ముగ్గురు అన్నదమ్ములకు అనుభవము. మాది పెద్ద వ్యవసాయం. వారు సమర్థవంతముగా వ్యవహరించినారు. గ్రామంలో అన్ని కుటుంబాలకంటే మిన్నగా మర్యాద మన్ననలను అందుకున్నారు. మాకు చదువులు చెప్పించారు. నేను భారతీదేవికి, తమవలెనె సాంఘిక స్థాయి అందించాలంటే సమ్మతించారు. ఆమెను మద్రాసుకు నాతోబాటు తీసుకెళ్ళుతుంటే, పెద్ద చదువులను అందిస్తూవుంటే, స్వతంత్ర సభ్యత కలిగిస్తూవుంటే ధైర్యంతో అంగీకరించేవారు. కనుకనే నేను భారతీదేవిని ఇంగ్లాండుకు ఆ 1925 లోనే తీసుకువెళ్ళుటకు సాహసించినాను. భారతీదేవికూడా వారివలె పెత్తనం చేయగల్గాలనుకున్నా ప్రపంచధోరణులు తెలుసుకుంటున్న చదువులు పొందుటేగాక, వ్యవహారము లనడుపుచున్న మా అక్కయ్య లక్ష్మమ్మతో నా ఆలోచనలు తెలుపుతూవుంటిని. వీరేశలింగ మహాశయుని ఆలోచనలు వారికి తెలుసు. స్త్రీలు కూడా విద్యావంతులైతే, వ్యవసాయము, తదితర వృత్తులలో బాధ్యతాయుత సేవాధర్మములను స్త్రీలుకూడా సాగించితేనే మన

దేశం బాగుపడునని నేను చెప్పుతుంటే ఆమె అంగీకరించేవారు. "తెల్లవాళ్ళ స్త్రీలు డాక్టర్లయి; నర్సులై, లెక్చరర్లయి మన దేశాలకు వచ్చి ఇంత సేవలు, పెత్తనాలు చేస్తూవుంటే మనవాళ్ళు మాత్రం అలాగా తయారుకావద్దా? "అనేవాణ్ణి. అవునవేవారు" అనిబిసెంటమ్మ మన దేశానికి స్వరాజ్యము కావాలంటూ అంత ఆందోళన చేసిరి. కాంగ్రెసుకే ప్రెసిడెంటైరి. అలాగే మన అమ్మాయిలు తయారు కాగూడదా! నీకేగనుక అంత చదువుంటే, అవకాశాలు కలిగివుంటే అంతటి నాయకులయ్యేవారు అక్కయ్యా!" ఇంతకూ అలాగా మన భారతిని తయారుచేయాలనా నీ ఆలోచన?"

అనేవారు. "అంతేకాదు మన స్త్రీలకు అన్నిఅవకాశాలు యివ్వాలి. చదువులు, బుద్ధులు మాత్రమేగాదు. తమ కుటుంబాలకు మంచి సంఘాన్ని ఉద్ధరించాలనే తాపం వారికి కలిగించాలి. స్వరాజ్యం రావాలంటే, స్త్రీపురుషులు త్యాగాలుచేయాలి. వ్యవసాయాభివృద్ధి కావాలంటే పురుషులేగాక, స్త్రీలుకూడా పొలాల్లో వ్యవసాయపు పనులన్నిటిలో సమానంగా పెత్తనముచేయాలి. శ్రమించాలి? ఈఘోషాఎందుకు? ఇంట్లోనే ముణగదీసుకోవడమేమిటి? హరిజనులు తదితర శ్రమజీవుల స్త్రీలు పురుషులతో బాటు బాధ్యత వహించడంలేదా?

"అప్పుడు ఆడవాళ్లు తమ్ము తాము రక్షించుకొనే శక్తి పొందుతారు. మగవాళ్ళమీద తను అనుదిన ఆర్థిక అవసరాలకు ఆధారపడనవసరం వుండదు. వితంతువులైతేనేనా యింటిబైటకి రావడం, పెత్తనం అందుకోవడం?" అంటూ వుండేవాణ్ణి. బిడ్డలకేదైనా పెట్టుకోవాలన్నా? దానధర్మం చేయాలనుకున్నా, తండ్రినో భర్తనో బ్రతిమాలవలసివుండదులే! నీవు చెప్పేదిసరే, అయితే అడవివాళ్ళవలె, హరిజనులు వడ్డె, వుప్పరవారివలె విడాకులు కావాలంటే, మనసంసారులు, అంగీకరిస్తారా?" అనుకుంటూ వుండేవారు.



పరదేశంలో పతిదేవునితో ...
శ్రీమతి భారతీదేవి, ఆచార్య రంగాజీ
ఆక్స్ఫర్డ్ (ఇంగ్లాండు) లో (1923)



1930లో జాతీయోద్యమంలో ప్రవేశించినప్పుడు
భారతీదేవి, రంగాజీ.



"ఏమైతే! హక్కువుంటే సాగించమని వుందా" ఆ హక్కు వుంటేనే. భర్తలు భార్యలుగురించి గౌరవంగా వుంటారేమో? మన బిడ్డలుమాత్రము భారతీయ ధర్మాలను గౌరవిస్తూనేవున్నారు. అసలు యీ సంఘాన్ని అదుపులో, ధర్మాలలో వుంచుతున్నది స్త్రీలే కదా?" అన్నా.

"ఈ మాటలనే నీవు పత్రికలలో పలుకుతున్నావట! మంచిదే ననుకున్నా! భారతిని యిలాగా పెంచాలనుకున్నావా! నాకూ ఇష్టమే. మీ అమ్మ, అమ్మమ్మలకు చెప్పతాలే" అన్నారు.

"ఏమబ్బాయి, మాలలు మాదిగలు అందరిని మర్యాద చేస్తానంటే ఒప్పుకున్నా. మన బావులు అందరికి తెరపించమంటే తెరపించినా. అందరికి సమానంగా చాపలమీద భోజనాలు వడ్డించ మంటే వడ్డించినా. వడ్డె వుప్పర్ల మధ్య-లంబాడీలు, చెంచుల మధ్య వున్న మారుమనువులు మంచివన్నావట. అది మంచిదా? మన వంశంలో సతీ ఆదెమ్మ వుండి నారయ్యా!" అన్నారు మా అమ్మ మంగమ్మ.

"అవునమ్మా! ఆహక్కు వుంటే వారిలో ఏకొద్దిమందో మాత్రం మారుమనువులకు వెళ్ళుతారు. సహగమనం మంచిది కాదమ్మా! అది అమానుషం, రాక్షసత్వం. అందుకే దాన్ని మాన్పించారు దేశనాయకులు రామమోహన్ రాయ్. ఈ పుస్త కంలో వారి జీవిత చరిత్ర వుంది.

భర్తపోతే ఆబిడ్డ ఎంతచిన్నదైనా తిరిగి పెళ్ళిచేయరాదా? ఆజన్మాంతం వైధవ్యమేనా? ఇష్టం లేకుంటె పెళ్ళివద్దు, చేసుకోవా లనుకుంటె ఎందుకు పెళ్ళిచేసుకోరాదు? ఆ చెడ్డబోధలు పురో హితులు చేశారు. అందుకే వాటిమీద దండెత్తినారు వీరేశలింగం గారు. వారి శిష్యులు మనయింటికి వస్తూవుంటారే ఉన్నవ దంప తులు" అన్నా. "ఈ బోధలన్నీ మా తరంవారికి రుచించవులే!

భారతికి నేర్పుతున్నావా? దేవుని దయవుంటే మీతరం బాగుంటుందిలే." అన్నారు మా అమ్మ.

అర్థ శతాబ్దము క్రింద, 6,000 మైళ్ళదూరంలోవున్న మహా సముద్రం దాటగా అందే పాశ్చాత్యదేశాలకు యౌవనవతి భార్యగా క్రొంగ్రొత్త అనుభవాలలో వున్న భారతీదేవిని తీసుకు వెళ్ళడానికి ఎలాగా సాహసించితిని? ఎలా సాధించితిని? ఎందులకు అనే ప్రశ్నలకు ఎంతో గాథ వుంది.

నేనేమో నా హృదయాన్ని వివేకానంద, రామతీర్థ, రామ మోహనరాయులు, వీరేశలింగం, గాంధీమహాత్ముల బోధలకు అంకితము చేసినాను. బ్రిటీషు, ఫ్రెంచి, ఇటాలియను, జర్మను ప్రజల్లో స్త్రీలకు అందుచున్న చదువులు స్వతంత్రములు, హక్కులు అనుభవాలు చూచినా! జాన్ స్టూవర్టు మిల్లుగారు తనభార్యను గురించి, వీరేశలింగం వారి భార్యగురించి వ్రాసినదంతా చదివినా. అలాగా భారతీదేవి తయారైతే, నిజమైన సహధర్మచారిణిగా పెరిగితే దేశస్వాతంత్ర్య సంపాదనలో, సంఘసంస్కరణలో, ప్రజా విప్లవములో నేను అందించ దలచిన సేవలు, త్యాగాలకు బలం ద్విగుణీకృతమగునని నా ఆశ. అందుకే ఆమెను అలాగా ప్రపంచ మంతా చూచుటకు అవకాశం కలిగించదలచితిని. అందులకు మా అక్కయ్య రహస్యంగా అంగీకరించిరి. ధనమును అందించిరి.

"ఎందుకింత మైమరపు కలిగించేంత, మనుష్యమాత్రులు భరించజాలనంత బాధలను పిల్చితెచ్చి నెత్తిపై అదేపనిగా మోపు చున్న యీ రంగాపై ప్రేమ?" అని భారతీదేవిని అడిగేవారట, అప్పుడప్పుడు కొందరు ముత్తైదువలు.

ఒక్కొక్కమారు వారిపై కోపం, విసుగు కలిగేది! మరో మారు జాలికలిగేది! 'పాపం వారి వారి కేయే గృహచ్ఛిద్రములో, ఎన్నెన్ని మనస్పర్థల్లో, భారతీయ గృహిణి ధర్మనిర్వహణమందు భరింపజాలని బాధలు కలిగినవా' అనిపించేది.



"ఆయా సమయానుకూలంగా ఏదో ఒక సమాధానం అందించకలిగితిని" అన్నారు వారు. ఎందరు భర్తలు తమ భార్యలను తమవెంట సముద్రాలు దాటించి, ఎంతో ఖర్చులుపెట్టి, ఖండాతరములకు ఆ 1925లో తీసుకెళ్ళిరి! నామాట అటుంచి ఎంతధైర్యం ఆమెకి వుండాలి? ఎందుకు? నేను పరీక్షలు పాసై, ఉద్యోగాలు చేస్తాననికాదే! నాకుకూడా ప్రపంచపరిస్థితులు తనకువలెనే తెలిసి వుండాలని! వివిధదేశాల సంస్కారములు, నాగరికతలు తెలియాలనే గదా! మా ఇండ్లలో ఘోషా! మా రైతుల పురుషులకే సాధారణముగా చదువులులేవు. మా స్త్రీలకు చదువులుండాలి. ఘోషా తొలగాలి. స్త్రీ పురుషు లందరిమధ్య సమానంగా,గౌరవ ప్రదంగా, స్వతంత్రించి వ్యవహరించాలి. పురుషులతో బాటు స్త్రీలు పెత్తనం, ప్రచారం కలిగివుండాలని అనుకున్నవారే తక్కువ. వారిలోనూ అనుభవములో తమ భార్యకు నాడు స్వాతంత్ర్యము, సమానసభ్యత, అవకాశాలు కలిగించువారెందరు? వారితో విదేశాలలోవున్న విద్యావ్యాసంగముల నందించినవారు పదులు లక్షల్లో ఒక్కొక్కరైన వుండినారా? అటువంటి మహత్తరావకాశములే కలిగించిన రంగాగారు యీనాడు యీ బరువులను తాను మోస్తూవుంటే వారికి చేదోడుగా వుండడము ఒక బరువని పించదండి" అని భారతీదేవి చెప్పేవారు.

మిగతా భారతీయులలో కొందరు, బ్రిటీషు స్నేహితులు కొందరు, అప్పుడప్పుడు ఆక్సుఫర్డులోని థేమ్సు నదీతీరం ప్రక్క విహరించుతూ ఎన్నెన్నో ప్రపంచ సమస్యలను చర్చించుకొనే వారము. ప్రతిమారు ఏదో సందర్భములో భారతీయ స్వరాజ్యోద్యమము గురించి ఆలోచనలు వస్తూనే వుండేవి. ఎన్నో ఆశలతో మన పెద్దలు మనలను ఇంత దూరదేశానికిపంపిరే! మనం, దేశానికి ఎలాగా సేవచేయగలమని ఆలోచించేవారం, ప్రతిపర్యాయం. మనదేశస్థులలో సగపడివున్న స్త్రీలోకం ఎంతో వెనుకబడివున్నారే! వారినెట్లా వెలుగులోకి తెచ్చుకోవడం, అనే ఆలోచన వస్తూ

వుండేది. యింత చిన్నవయస్సులో పెండ్లిండ్లు చేయడం ఒక దౌర్భాగ్యం. వరకట్నాలు పెరుగనివ్వడం అన్యాయం. ఇందరు బిడ్డలు కనడం మరీదరిద్రం! స్త్రీ పురుషులు సమానంగా సంఘసేవ చేయాలి.

సరోజినీదేవి కుమార్తె, లీల పూపుగావుండేవారు. స్త్రీలు ఉద్యోగాల్లో చేరాలి' అనేవారు! మంచిదే। అందరు ఉద్యోగాల్లోకి వెళ్ళితే, ప్రజాసేవ చేసేవారెవ్వరు' అందుకేగా మహాత్ముడు 'ఉద్యోగాల్లోనుండి బైటకిరండి' అని పురుషులను కోరుచున్నారు. ఏకొద్దిమందో స్త్రీలు విదేశాలలో చదువుకుంటే వారుకూడా ఉద్యోగాల్లో చేరితే సాంఘిక సేవచేసే వారెవ్వరు. "పండితులై ఆనాటి గార్గివలె సంఘములో ప్రతిష్ఠ సంపాదించితే మనకుటుంబాల్లోని పురుషులు స్త్రీలకు విద్యా సౌకర్యాలు హెచ్చుగా కలిగిస్తా"రన్నారు. డాక్టరేటుకు చదువుతున్న భగవతీగారు" నీ ఆలోచన ఏమిటి భారతీ" రంగాజీ గ్రామీణ ప్రజలకు సేవచేద్దామంటున్నారు. నాకూ అదే మంచిదనిపిస్తున్నదన్నారు.

"బస్తీలలో చదువుకున్న తరగతులలోనే కష్టము. గ్రామీణ జనాల్లో చదువులేని కుటుంబాల్లో ఎలాగా సేవచేస్తావు! అది అసాధ్యముకాదా!" అన్నారు వారు."

"రంగాగారు రైతు కూలీ సంఘాలు పెట్టుచున్నారు. మా సభలకు కొద్దిగానైనా స్త్రీలు వస్తున్నారు. వారిద్వారా పని చేయవచ్చు" అన్నారు.

నాతో చర్చించుతూ "ఎలాగండి, మనవారి ఆచారాలనుఎదిరించడము? మీరు మాట్లాడేటప్పుడు అంతా సాధ్యం అనిపిస్తుంది. కాని నాలో నేను ఆలోచించుకుంటే, మన స్త్రీలు మన ధోరణికి వస్తారా, అనేభయం పీడిస్తూవుంటుంది.

"భజనలు జరుపుతుంటారుగదా ముందువారితో చేరి క్రమంగా సాంఘిక స్నేహమార్గానికి కొందరినైనా తీసుకురావచ్చు



గదా. మహాత్మాజీ ఖాదీ వడకడం మర్యాద చేస్తున్నారు. ఆ మార్గంలో కొందరిని దగ్గరకు చేర్చుకొనవచ్చు. చదువుకుంటున్న ఆడపిల్లలకు 'గరల్ గైడ్సు' ధోరణి కలిగించవచ్చు, గృహవైద్యం నేర్పవచ్చు" అనుకునేవారము, చౌదరి, శ్రీకృష్ణుతో కలిసి.

సంతాన నిరోధమంటే మనవారికి చాలా చిరాకు కలిగిస్తుంది. ఎంతోమంది సంతానం పొందితే ఆమెను పూజించే మర్యాద మనకున్నదే! పైగా అలా హెచ్చరించడం అమర్యాదగా వుంటుందే!

"ఉన్న చిన్నచిన్న ఆస్తులు పంచితే, క్రమంగా కూలీతనం, నిరుద్యోగం తప్పదు. కనుక ఓముగ్గురు బిడ్డలైతే మంచిదేగదమ్మా" అనరాదా? ఇది తప్పుగా తలుస్తారండీ. సభలంటే మనవారికి అలవాటు లేదాయె. ఎలాగా ఒంటరిగా ఒక్కొక్కరిని కలియడం? "పేరంటానికి పోవచ్చుగదా!" అన్నా. "చాలాకష్టమండీ!"అన్నారు. "మనమిద్దరం కలిసే సభలు సాగిద్దాం. ఉపన్యాసాలు యిద్దాం! వచ్చిన స్త్రీలలో కొంచెము, ప్రపంచం తెలిసినవారితోటే వారి వారి బిడ్డల చదువులు ప్రోత్సహించుదాము. నోములు, భజనల సమయాల్లో మరీ, మరీ వారిని కలుసుకుంటూ వుందువుగాని!"

"ఈవరకట్నాల బాధలను ఎదిరించడం సులభం కాదండీ' చదువుకొంటున్న యువకులు కట్నాలపై చదువులకొరకు ఆధారపడుచున్నారు. మీలాగా వీరేశలింగంగారి బోధలను గుర్తించేవారు బహుకొద్దిమంది. 'వీలైనపుడే పెండ్లి జరుగును' అన్న ఓపిక మనతల్లి దండ్రులకు వుండదు. వయస్సు వచ్చిన యువతులను పెళ్ళిలేకుండా మనవాళ్ళు నిలుపుకోజాలరు. ఈ పాశ్చాత్యులు కూడా తమ పిల్లలను, యీ డాన్సులు, డిన్నరుపార్టీలు ఇంకేవో సాంపర్కాలకు యెందుకు పంపుతారో తెలుసుకదా? హెచ్చుగా పెళ్ళిళ్ళ జంటలు కుదుర్చుకోడానికే; వీరిమధ్య, పెళ్ళిగాక, ముప్పైనలభై సంవత్సరలవరకు వుంటున్న కన్యలు పడే మనోవేదన, మన వితంతువులుకూడా పొందరండి! చెప్పుకోరాని కష్టాలు, దావు

డులు ఎన్నో! కనుక అవి బాల్యవివాహాలు చెరుపే. ఆలస్యపు కన్యాత్వం చెరుపే, ఆజన్మాంత వైధవ్యం దౌర్భాగ్యమేనండీ.

"భారతీయ ధర్మధోరణికి సరిపెట్టుకుంటూవుంటూ మన యువతులకు స్వతంత్రము - కుటుంబాల సరళిలో - ఇచ్చుకోవడం మంచిదంటే బాగుంటుం"దన్నారు.

ఈలాగా మేము ఆ సంవత్సరంన్నర విదేశయాత్రా సందర్భములో మన దేశీయ సమస్యలు ప్రత్యేకంగా స్త్రీజనరక్షణ, పోషణ, ప్రోత్సాహం స్వాతంత్ర్యము గురించి ఆలోచిస్తూ వుండేవారం.

ఎన్నికష్టాలు ఎదుర్కోవలసి వచ్చినా విప్లవాత్మక సేవా కార్యాలను ఉభయులం సాగించాలనుకుంటూ ఉండేవారం.

అప్పుడనుకున్నాము మేమిద్దరము - పదే పదే. సభల్లో ఆమె నాప్రక్కనే కూర్చోవాలి! నాతోపాటు ఉపన్యాసాలు ఆమె చేయాలి. మేము ప్రచారము చేస్తున్నపుడు కలిసే వుండాలి, ప్రజలలో కలసిపోయి ఆమె స్త్రీలమధ్య అరమర లేకుండాచేరి చర్చించుచూ, ఆలోచనల పెంచుకోవాలి. క్రమంగా ఆడపిల్లలందరిని చదివించుకోమంటూ చదువుకుంటున్నవారిని ప్రోత్సహిస్తూ, పెండ్లిండ్లకు ముందు ఎవరెవ్వరిని, ఎందులకు ఏయే విద్యాబుద్ధులు కలిగితే తల్లిదండ్రులు రికమెండుచేస్తున్నారో తెలుసుకుంటూ వివాహ నిర్ణయాలు చేసుకోమని ప్రచారం చేద్దామనుకున్నాం.

ప్రపంచయాత్రచేసి, పెద్దచదువులుబొంది, అనుభవజ్ఞులై అంతర్జాతీయ ప్రతిష్ఠ పొందినవారి స్నేహభాగ్యం పొందినమాకు అదే ప్రతిష్ఠను పూర్తిగా ప్రయోగించి ప్రజాసామాన్యములో ప్రచారం చేయాలనుకున్నాము.

—:o:—

# చదువు సంధ్యల తల్లి

వంద సంవత్సరముల క్రితము స్త్రీలకుగూడ పెద్ద చదువులు. వ్యావహారిక చదువులు అవసరము, ఉపయోగమనీ. వారి వారి కుటుంబాల సౌభాగ్యము కొఱకేకాక, వారి వ్యక్తిగత వికాసము కొరకే కాక, దేశాభ్యుదయముకొరకు, సంఘఅభివృద్ధికొఱకు గూడానని శ్రీవీరేశలింగం పంతులు ప్రచారము చేయ మొదలిడిరి. అదియొక విప్లవాత్మక వ్యవహారమయ్యెను. వారు ప్రారంభించిన ప్రత్యేక బాలికాపాఠశాల విడ్డూరముగనుండెను. స్త్రీవిద్యా ప్రచారము కొఱకై వారుచేసిన శ్రమ అద్భుతము. స్త్రీలు సమాజములో సమానమర్యాద మన్ననలను పొందునట్లు వారు చేసిన ప్రచారము అప్పుడు ఎంతో సాహసం; త్యాగముతో కూడినట్టిది. స్త్రీలకు సంస్కృతముకూడ చెప్పించాలన్నారు. వేదాలు వారిచే పఠింప చేస్తామన్నారు. వారికి ఇంగ్లీషు నేర్పుతామన్నారు. వారికి మానవతాహక్కులన్నీ సమానంగా ఉండాలన్నారు. అందుకై ఎన్నో బాధలు సహించారు. వారి బోధలవల్ల నేనెంతో ప్రభావితుడనైతిని. ఆ బోధలను భారతీదేవికి అందించితిని. వారి పుస్తకాలను ఆమెతో కలసి తిరిగి చదివితిని. మేమిద్దరము వారిధోరణిలో స్త్రీజనసేవ చేయనిశ్చయించుకొంటిమి. వీరేశలింగంగారికి వారి ధర్మపత్ని రాజ్యలక్ష్మమ్మవలె నాకు భారతీదేవి చేదోడు వాదోడుగ నుండుటకు నిశ్చయించుకొనిరి.

మా వయస్సు వచ్చుసరికె (1920-25) వీరేశలింగం శిష్యులైన ఉన్నవ దంపతులు వితంతువులకు వివాహములు చేయు

చుండిరి. శారదా నికేతనాన్ని నడపుచుండిరి. బ్రాహ్మణ బాలికలు విరివిగా పెద్దచదువులకు వచ్చుచుండిరి. ఎందరో రైతాంగపు స్త్రీలు కొంతగా ఇంగ్లీషు, సంస్కృతం చదువులు పొందగలుగుచుండిరి. అది అంతయు వీరేశలింగంగారి ప్రభావమువలననే.

రైతుకూలీల మధ్య ఆడబిడ్డలకు పెద్ద చదువులు అందించాలనే తహతహ అప్పటికి బయలుదేరలేదు. కుటుంబ నిర్వహణలో అచ్చటచ్చట పెత్తనం చేయించుటకు అవకాశాలు పొందకలుగుచున్నా, రాజకీయ సాంఘిక వ్యవహారాలలో, సభలలో, ఉత్సవాలలో ఆడవారిని ప్రధానస్థాయికి పెద్దలు ఆహ్వానించడంలేదు. ఆ సందర్భములో భారతీదేవి ముందుకు వచ్చిరి. ప్రథమ శ్రేణిలోనే స్త్రీలు వ్యవహర్తలుగ బాధ్యత వహించవలెనంటూ, వీరేశలింగం ధోరణిని అక్కయ్య లక్ష్మీదేవి సహాయంతో ముందుకు సాగించజూనిరి.

1925 లోనే భారతీదేవియే ప్రథమ రైతాంగ బిడ్డగా పాశ్చాత్య దేశాలకు ఉన్నత విద్యకైనాతో వచ్చిరి. ఇప్పుడు కొన్ని వందలమంది రైతాంగపు కుటుంబాలలో పుట్టి పెద్ద చదువులు పొంది మరెక్కువ చదువులకై తమ భర్తలతో అమెరికా, ఇంగ్లండు, కెనడా, ఫ్రాన్సు, రష్యా దేశాలకు వెళ్ళగలుగుచుండుట మాకెంతో ఆనందం కలిగించింది. కాని! ఆమె ఆనాడు ఎట్లు సంఘసేవ చేయుటకే ప్రత్యేకానుభవము పొందగోరిరో, అట్లు తర్ఫీయతు పొందుట కీనాటి విద్యావంతులు, తగినంతగా ఉత్సాహపడుటలేదని ఆమె విచారించేవారు. మామనుమరాండ్రు కొందరు వారిలో పాప, విజయ వివాహాలకు దేవీజీ స్వయంగా వెళ్ళి ఆశీర్వదించిరి. అమెరికాలో నున్నారు. రైతునాయకులు, ఆదర్శ ప్రజాసేవకులైన శ్రీ రాజగోపాల్ గారి ఏకైక పుత్రిక అమరకుమారి కూడ అమెరికాలో చదువుకుంటున్నారు. ఇదంతా దేశాభ్యుదయమే! అయినా! వేలకుమించి ప్రతి రాష్ట్రమున సంఘసేవ



చేయుటకై, రాజకీయ ప్రచారము కొరకై సర్వశక్తులను, స్వార్థత్యాగధోరణిలో వినియోగించుటకు, విద్యావతులైన స్త్రీలు అవసరమని మాతలంపు. వారందడం లేదని మాబాధ. మన దేశంలో ఈనాటికీ (1974) వేలకువేల గ్రామాలలో ప్రాథమిక పాఠశాలలేలేవు. 1920-30 లోని దుస్థితి ఎంతోగదా? ఆరోజులలోనే నిడుబ్రోలులో ఆడపిల్లలకుకూడ ప్రత్యేకముగ ప్రాథమిక పాఠశాల యేర్పరచుటకు మేముకూడ కృషిచేసి జయమందితిమి.

గ్రామాలలోనే ఉన్నత పాఠశాలలేర్పడుచుండగా, తాము సంచారము చేసినప్పుడెల్ల ఆయాప్రదేశాల స్త్రీలను తమ బిడ్డలను పాఠశాలకు పంపించునట్లు ప్రోత్సహిస్తూ వుండిరి.

క్రమంగా గ్రామాలలోనే మా బుచ్చినాయుడుగారి మార్గదర్శకత్వములో, గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలో కళాశాలలు అధికముగ స్థాపింపబడుచున్నవి. ఆ కళాశాలలకు, రైతుకూలీల ఆడపిల్లలను ఉత్సాహముతో పంపించుటకు భారతీదేవి ప్రోత్సాహము కలిగించుతూ వుండిరి.

ఎందరెందరో బి. ఏ., బి. యస్‌సి. మొదలగు పట్టాలనందుకొనిన ఆడపిల్లలు ఉద్యోగములు పొందుటకై వారి సలహాలకొరకు వచ్చుచుండెడివారు. వారికి సహాయము చేయుటకై తానుగా శ్రమించుటేగాక, నేను ఢిల్లీలో లేక మద్రాసచ్చటయున్నా నాకన్ని విషయాలు తెలుపుతూ నేనెవరికి ఏలాంటి సానుభూతి సహాయమునకై వ్రాయాలో నాకు తెలుపుతూ, నాచే ఆయాసేవలు చేయించేవారు.

స్త్రీలు చదువులు పొందకున్నందువల్ల, దేశానికెంతో అనర్థకము కల్గుచున్న దనుకొనిరి - భారతీదేవి! తమతల్లి, అక్కయ్య; మాయమ్మ, అక్కయ్య వగైరా లెందరెందరో మా రైతుల కుటుంబాలలోని స్త్రీలు గొప్ప విజ్ఞానము గల్గినవారే! వ్యవహార

దక్షులే! ఐనా వారికే గనుక యీకాలపు చదువులు కూడా యుంటే, మరెంతో దేశాభ్యుదయం కల్గునని వారి నమ్మకం!

అందువల్లనే తన సలహా కోరుచున్నవారికి ప్రత్యేకంగా' జనులందరికి సమయానుకూలంగా బిడ్డలందరికి, అందునా ఆడ పిల్లలకు అథమం ప్రాథమిక చదువులు, వీలైనంతవరకు విశ్వవిద్యాలయపు చదువులు అందించమని ప్రచారం చేస్తూవుండిరి. శతాయుష్కులు శ్రీకార్వే స్త్రీలకే ప్రత్యేకంగా విశ్వవిద్యాలయాన్ని పూనాలో నలభై సంవత్సరాలక్రితమే స్థాపించినందులకెంతో ఆశ్చర్యము, ఆనందం బొందుచుండిరి.

తనకు తానై తమ కుటుంబములోని ముగ్గురు ఆడబిడ్డలు ఎం. ఎ. వరకు, మరొక్కరు మెడికల్ కాలేజీవరకు చదువుకొనునట్లు ప్రత్యేక శ్రద్ధతీసుకొనిరి. మరో ముగ్గురు మనుమరాండ్రు ఎం.ఎ.లో ప్రథమ శ్రేణిలో ప్రకాశించునట్లు ప్రోత్సహించిరి. నిడుబ్రోలు పి. బి. నాయుడు కాలేజీలో ఈనాడు రెండువందల వరకు ఆడబిడ్డలు ఉన్నత విద్యావసతులు పొందగలుగుటకు కారణము వారి ప్రాథమిక పట్టుదలయే.

ఆనాడు శారదానికేతనంలో, రైతాంగ బిడ్డలు హాస్టలులో కూడా చేరి చదువుల పొందుటకు కారణం ఆమె చిన్నవయస్సులోనే మార్గదర్శకముగా చూపిన సాహసమే.

శ్రీమతి సాధువమ్మగారు ఎన్నో త్యాగాలుచేసి, యెంతో కష్టంమీద సత్తెనపల్లిలో స్థాపించి సాగించిన మహిళా ఉన్నత పాఠశాలకు భారతీదేవి యెంతో ప్రోత్సాహ మొసర్చిరి. అటులె, నెల్లూరులో కస్తూరిబా మహిళశాలను, దేశభక్తురాలు, తన మురిపంపు స్నేహితులు పొణకా కనకమ్మ స్థాపించునపుడు భారతీదేవి వారికెంతో ప్రోత్సాహం అందించగల్గిరి.



ఒక బీదసైన్సు గ్రాడ్యుయేటు, ఏమిచేయడమా, అనుకొంటున్నప్పుడు, 'రేడియో ఇంజనీరింగు చదవం'డని సలహా చెప్పిరి. ఈ మధ్య ఆయన రాష్ట్రస్థాయి రేడియో ఇంజనీయరుగ రిటైరైరి. ఓయువకుడు, పొలంలో ఆదర్శంగా కృషి చేయుచుండగా పేదలైన వారి తల్లి దండ్రుల ప్రోత్సహించి, క్రమంగా ఉన్నత పాఠశాలకు కళాశాలకు పంపునట్లు చేసిరి. ఇప్పుడాయనొక అడ్వకేటు! అటులే, యిద్దరు హరిజన యువకులు తనదగ్గర చిన్న నౌకరులుగావుంటే, వారిని చదివించి సైన్యములో చేర్చి, వారు అంతగా పైకి వచ్చునట్లు చేయగల్గిరి. ఎందరో కళాశాలలలో, ఉపన్యాసకులుగ, డాక్టర్లుగ, ఇంజనీయరులుగ తర్ఫీయతు పొందుటకు ప్రోత్సహించిరి. దశాబ్దాలక్రితం, వారి సలహాల పాటించి, చదువుల నేర్చుకొన్నవారెందరో అప్పుడప్పుడు తమ భార్యాబిడ్డలతో వచ్చి వారి ఆశీర్వాదములు పొందుచుంటే "ఇదేగదా మన కుటుంబం, ఇదే చాలు మనకు తృప్తి'' అంటూండేవారు.

1950లో ఇంట్లోనే దాగొనియున్న చిన్నతల్లి మనోహరంను ప్రోత్సహించి, తన సెక్రటరీగా పిల్చుకొని, సభాప్రవేశముల నందించి, ఉపన్యాసకురాలుగా తయారుచేయగా, ఆమె క్రమంగా ఉత్సాహమొందిరి. పెద్ద చదువులు పొందిరి. లాయరుగా రాణించిరి. మ్యునిసిపల్ కౌన్సిలులో పెద్దలైరి. విజయవాడ ప్రజాజీవితములో, నిజమైన మనోహరంగా వ్యవహరించ గల్గిరి.

అట్టె, మాచెల్లెమ్మ పుష్కరాంబకు ఎన్నోకుటుంబ బాధలు కల్గితే, వాటినుండి ఆమెకు స్వతంత్రం కల్గించిరి! రాజమండ్రిలో మాకు పూజ్యులగు వీరేశలింగం శిష్యురాలు ఆదుర్తి సుందరమ్మగారి సేవాశ్రమంలో చేర్పించిరి. ఆర్టు నేర్పించిరి. తుదకామె పేరొందిన కళాకారులై, ఉన్నత పాఠశాల, కళాశాలలలో చిత్రకళా ఆచార్యులైరి, ఆమెనే గోదావరివరద నివారణ సంచారమందు తన సెక్రటరీగా ఆహ్వానించిరి. ఆ చెల్లెమ్మ పుష్క-

రాంబయే, తనతోబాటు స్వాతంత్ర్య యోధురాలుగా జైలుకు వెళ్ళిరి. దేశసేవ చేయగల్గిరి.

తన కందిన పరిమిత బలములతో శ్రీమతి ఎర్నేని శేష మాంబ (కవయిత్రి) నడుపుచుండే సంఘసేవా కార్యకలాపములకు ప్రోత్సాహము కల్పించుచుండిరి. అటులే, గుడివాడలో శ్రీలింగయ్య సతీమణి, కూచిపూడిలో మహిళాసంఘము, కావూరులో దుర్గాంబ గారు సాగిస్తూవుండిన సంఘసేవా కార్యక్రమాలకు తోడ్పడుచుండిరి.

క్రమంగా స్త్రీల కళాశాలలు, ఉన్నత పాఠశాలలు, వాటితోకూడిన హాస్టళ్ళు పెరుగుచున్నా, భక్త సమాజములు బయలుదేరుతున్నా, అవసరానికి తగినంత బలం కల్గుటలేదనుకునే వారు. నిరక్షరాస్యత ఇంకెంతో యుందే, వయోజన విద్యావ్యాసంగాలు పెరుగుటలేదే, విజ్ఞానప్రచారమున కవసరమైన పుస్తకాలు, స్త్రీలకై ప్రత్యేక వారపత్రికలు రావడంలేదే యని విచారించేవారు. స్త్రీ రచయితలు, నవలాకారులు కథలల్లువారు పెరుగుచున్నారు. కాని వారుచాలరు. సమాజసేవ, రాజకీయసేవ, చేయుటకు, నాయకత్వము పొందగల్గుటకు, తగిన తర్ఫీయతు నిచ్చే విద్యాలయాలు-మేము 1930-70 మధ్య సాగించినట్లు-ఈనాటి యువతులు ఇంకెంతో హెచ్చుగా నడపాలని ప్రచారముచేసిరి ఎంతోకాలము నుండి అనాథ, అభాగ్య స్త్రీల రక్షణార్థమై శ్రీమతి ఆదుర్తి సుందరమ్మగారు నడుపుచున్న సేవాశ్రమము - లాంటివి స్థాపించమని సభలలో ఘోషించేవారు. అటులె, హరిజన బాలికల విద్యాలయాన్ని నడుపుచున్న వేముల అంజనీదేవిగారలను శ్రీమతి తాయారమ్మను పొగడుచుండేవారు. క్రిష్టియను మిషనరీలు మన హరిజన బాలికలకు అందించిన విద్యావిధానాన్ని శ్లాఘించేవారు. మావూరిలో వున్న సాల్వేషన్ ఆర్మి ఆస్పత్రి డాక్టరు రాండు గారు హరిజన బాలిక, "జీను"ను పెంచిరి, పెద్దచేసిరి. అక్స్ఫర్డుకు



పంపిరి. ఆ "జీను" మాకు సన్నిహితులు. అలాగా మనవారు మన హరిజనుల దగ్గరకు తీసుకోవడం అవసరమనేవారు. తానెందరో హరిజన బాలికలకు ఎన్నెన్నో సహాయములను అందించుచుండిరి.

ఈనాడొక దినపత్రికకు, "వాహిని"కి ప్రసిద్ధ సంపాదకులుగ నున్నవారు, వరుసగ సంపాదకులుగా అంచిన వారిలో నల్లూరు, ఎందరో గ్రామీణ కవులు, పల్నాటికవులు, పండితులు; భారతీ దేవియొద్ద తమ ప్రాథమిక ప్రోత్సాహము, భావనై శాల్యము గావించుకొను తర్ఫీయతు బొంది తల్లిప్రేమ అందుకొనే భాగ్యము పొందిరి.

నాకు ముక్కోపము, త్వరితంగా, వారు పైకి రావడం లేదని తాపము! చిన్నచిన్న పదవులకో, పనులకో కాలం వృథా చేస్తుండనేలయని బాధ! కుటుంబ భారం పెంచుకుంటూ బిడ్డల నదే పనిగా కనుకుంటూ ఆర్థిక బాధల్లో పడిపోతున్న వారెందరి పైననో కోపపడుతుంటాను! వారికది ఇష్టంకాదు. ఆమెది అమృతహృదయం నా విమర్శలకు వారెంతగా బాధపడతారో యనే దుగ! వీలుంటే ముందుగా నన్ను సమాధానపరచి వారికి ఏవిధమైన ఆందోళన కలగనీయకుండా చూచేవారు. ఒక్కొక్కప్పుడు నేను త్వరపడి, ఆయాసంగావారిని విమర్శించితే, వారిని చల్లగా తన మాతృ హృదయానికి చేర్చుకొనేవారు. "రంగాజీకి మీపై ప్రేమవల్లనే అలా చీకాకు పడుతున్నారు. పాపం మీరుమాత్రం మరేమి చేయ గలరు; ఫరవాలేదులే" అంటూ వారికి భోజనాలు అందించి హృదయాలు పల్లవింపజేసి, తిరిగి తమ గృహబాధ్యతలను సర్దుకో గలిగే ధైర్యము కలిగించేవారు. అవసరమైనప్పుడు తన శక్తికొలది ఆర్థిక సహాయం అందించేవారు. ఎందరో తోడి సేవాపరుల పెండ్లిండ్లకు తానై వెళ్ళేవారు, కొంతగా డబ్బో, వస్త్రమో ఆఖరుకు కుంకుమ, అత్తరునైనా పెండ్లి కుమార్తెలకు అర్పించేవారు.

ఆమె చదువులతల్లి, సలహాల కేంద్రము. తోడి సేవకులు వివాహాలు చేసికొంటామంటే 'అప్పుడేనా?' అనడం నాకు అల అలవాటు. "ఎన్నాళ్ళు బైరాగులుగా నుంటారు. ఎంత సంఘసేవకులైనా, భార్యాబిడ్డలు వద్దా?" అంటూ వారిని ఆశీర్వదించేవారు. "ఇదిగో! ఎక్కువమంది బిడ్డలు వద్దు"అని భార్యాభర్తలైన సేవకులను నేను హెచ్చరిస్తే, "బాగానే ఉంద. మనం బైరాగులమని, అందరూ బిడ్డా, పాపసౌఖ్యంకూడా పొందవద్దా?"అంటూ, వారి కుటుంబములను పరామర్శించేవారు. మేమిద్దరం ఒకేకంఠముతో పల్కేవారం, "చదువులుమాత్రం మరువవద్దు. త్యాగమైనా చేస్తూ బిడ్డలకు చదువులు చెప్పించండి." వారి బంధువు పండిత సుబ్బయ్య తనకున్న భూమినంతా అమ్మి తన బిడ్డలు ఐదుగురికి పెద్ద చదువులు అందించినందులకు ఎంతో ముచ్చటపడేవారు! ఆ భారతీదేవిలాంటి చదువు సంధ్యలతల్లి ప్రతియింట వెల్గాలి!

—:ం:—

# పికెటింగు

యూరపులో చదువులు పూర్తి చేసికొని 1926లో తిరిగి వచ్చిన తరువాత 1927 నుండి 1929వరకు మూడు వేసవి ఋతువులలో భారతీదేవిని, ఊటీ(ఉదకమండలము) లేక కూనూరు, కోటగిరి, అనగా దక్షిణాదిన 5000-7000 అడుగుల ఎత్తున్న చల్లని ప్రదేశాలలో నుంచితిమి. ఆ రెండు నెలలు ప్రత్యేక కళాశాలల్లో, తాను చదువుకుంటూ, ఇతరులకు చదువు లందిస్తూండేవారు. నెలకు నాల్గు, ఐదువందల రూపాయలు ఖర్చు అయ్యేది. రాను పోను 600 మైళ్ళ ప్రయాణం తానుగా చేయగల్గేవారు. అట్టి సౌకర్యం అదృష్టం యే కొద్దిమందికో అటు ఉద్యోగాల్లో ఇటు సాధారణ సంసారంలో నుండేవారికి అందేది; ఆకాలపు చదువులు భారతీదేవి యూరపులో పొందిన తర్ఫీయతుకు మరింతబలం, వైశాల్యం కల్గించినవి.

ఆ సమయములందే, ప్రసిద్ధ వైజ్ఞానికుల చిత్రకారుల వివిధ కళలలో ప్రముఖులగు వారితోడనూ, శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయలాంటి వారితో వారికి పరిచయం కల్గుతుండేది.

1927-30లో నేను పచ్చయప్ప కళాశాలలో, యం.ఏ. తరతులవారికి, ప్రధాన ఆర్థిక, రాజకీయ శాస్త్రములలో ప్రొఫెసరుగా నుంటూండి, 1928నుండి, మద్రాసు ప్రభుత్వమునకు గౌరవ ఆర్థిక సలహాదారుగా నుంటూ, ఎండలకాలంలో, గ్రామాలలో వడగాడ్పుల కష్టించుచుంటిని. నేను ఆ వడదెబ్బలకు తాళుతూ, భారతీదేవిని మాత్రం వడదెబ్బనుండి రక్షించుటకు తన ఉన్నత

విద్యాభివృద్ధికొరకు, సౌఖ్యముకొఱకై, ఉదకమండలంలో నే యుంచేవాడను. అంత ప్రేమవారిపై నాకు! అంతటి గౌరవము, ఆదరణ మా దాంపత్య జీవితములో ప్రస్ఫుటిత మగుచుండెడిది.

అలాగా ఆదరించుకుంటూండిన ఆ భారతీదేవితో, 1930లో మేమిద్దరము మహాత్ముడు ప్రారంభించిన ఉప్పు సత్యాగ్రహ వేడి తాపములలో ఆ వేసవి గాడ్పులలో అందించుటకు సేవలు, ఆ సత్యాగ్రహ వాతావరణమును ఆహ్వానించుటకు సాహసింపగల్గితిమి! అంతటి గాటమైన ప్రేమ మాకు భారతదేశమందుండినది. ఎన్నిటికైన తెగించుటకు మేమిద్దరము తయారైతిమి. నాకప్పుడు ప్రతి నెలా రు 1200 ఆదాయముండెడిదిగదా! అదంతా మేమిద్దరమే వాడేవారం.

గుంటూరునుండి చీరాల, ఒంగోలు, వరకు సాగుచున్న సత్యాగ్రహ శిబిరాలలో భారతీదేవి ఉంటూ, సత్యాగ్రహులతో పరిచయము చేస్తూ, పోలీసులు జరుపుచున్న అత్యాచారాలను విమర్శిస్తూ, మా స్నేహితులైన కలెక్టరు. హోంమెంబరు గవర్నరు సతీమణికి రిపోర్టులు పంపించుతూవుండేవారు.

ఆ యెండల్లో, సత్యాగ్రహులు అనుభవిస్తూన్న లాఠీ దెబ్బలు, క్రూరబాధల తాపమునకు సున్నితమగు ఆమె కమిలి పోతుంటే, నే నెంతో దిగులుచెందుతూ, అంతా దేశస్వాతంత్ర్యము కొరకేగదా, అనుకొనేవాణ్ణి! ఆపైన గుజరాతు,బొంబాయి సముద్రతీరాలలో సరోజినీదేవి, కమలాదేవి, సోఫియా మొదలగు వారు ఎండలను, వాటికి మించిన సామ్రాజ్య పిశాచపు నిప్పుల నెదుర్కొంటున్నప్పుడు, మన బాధలొక లెక్కా యను కొనే వాళ్ళము.

1931లో గాంధీ - ఇర్విను ఒడంబడిక సాధ్యమయినది, ఆ గొడుగు రక్షణక్రింద, విదేశ వస్త్ర బహిష్కరణకై, కల్లు - సారాయముల ప్రొహిబిషను కొఱకై పికెటింగు చేయించాలని



కాంగ్రెసునుండి నేను తిరిగివచ్చితిని. అచ్చట, ప్రాథమిక హక్కుల ప్రణాళిక స్వరూప నిర్ణయము జరుచున్నప్పుడు నేను సాగించిన ప్రచారమువల్ల భారతీదేవికి సంతోషముకల్గినది. సుభాస్‌చంద్ర బోస్‌ను కలుసుకొని, దీర్ఘ చర్చలు సాగించడం, మామధ్య పరస్పర స్నేహసంపద పెంపొందడంవల్ల ఆమెకు ఆనందం కల్గినది.

స్వాతంత్ర్య యోధులందరు జైళ్ళనుండి తిరిగివచ్చిరి. మరెందరో దండి సత్యాగ్రహపు విజయదుందుభులతో నుత్సాహులై, కాంగ్రెసును బలపరచుటకు ముందుకొస్తూండిరి. అందరిని జేర్చుకొని, పికెటింగు ఉద్యమాన్ని నడపుటకు, గుంటూరులో, తెనాలిలో, చీరాలలో శిబిరాలు పెట్టాలనుకున్నారు. తెనాలి శిబిరమునకు, భారతీదేవికి ప్రియపాత్రులైన శ్రీ నాగళ్ళ కృష్ణయ్యా దంపతులు నాయకత్వము వహించిరి.

తెనాలి శిబిరములో, స్త్రీల విభాగము నడపాలనుకున్నారు కృష్ణయ్యగారు. దాన్ని నిర్వహించడం బహుకష్టమని తోడి కాంగ్రెసు పెద్దలు శ్రీ శరణు రామస్వామి, కల్లూరి చంద్రమౌళి, చింతమనేని భావయ్య, కన్నెగంటి సూర్యనారాయణ ప్రభృతులు హెచ్చరించిరి. వారికి వేరేయిండ్ల వసతి, భోజనపు ఏర్పాట్లు, శానిటేషన్, కాలోచిత సౌకర్యాలు అవసరం. వారి ఆరోగ్యరక్షణ, మర్యాద మన్ననల సర్దుబాటు చేయడం సులభంగాదన్నారు. అన్నిటికి మించి అప్పటికెంతోగా పేరుకొనియున్న "ఘోషా" మర్యాద నతిక్రమించి, ఆరుబయలునకు వచ్చి, ఎర్రటి యెండల్లో, దుకాణాలముందు ప్రత్యేక ఆరోగ్య సౌకర్యములు లేకుండునప్పుడు "ఎండ కన్నెరుగని" ధోరణిలో నుంటున్న మధ్యతరగతి రైతాంగ గృహిణులు పికెటింగు చేయగలరా! పికెటర్లుగా రావడానికి సాహసిస్తారా? అందినవారికి ఏపొరబాట్లు కలుగకుండా గౌరవ మర్యాదలు కల్గించి, వారి ప్రతిష్ఠ నిల్పుచూ, కాంగ్రెసునకు, కస్తూరిబాకు, తగినట్లు వ్యవహరించకల్గుదుమా, అనే భయాలు అందరికి కల్గుచుండెను.

రామస్వామిగారు, "అంత ప్రయత్నం చేయదలచితే, శ్రీమతి భారతీదేవిగారే పూనుకోవాలి! వారంటే రైతాంగపు స్త్రీ పురుషులెల్లరు గౌరవించుతా"రన్నారట? అనంతవరం కృష్ణయ్యగారు కొండంతమనిషి, గాంధీభక్తుడు, గుంటూరులో అందరికంటె హెచ్చు లాఠీదెబ్బలకు సహించినయోధులు. అందరికి పూజనీయులు. వారే నిడుబ్రోలువచ్చి భారతీదేవిని స్త్రీలకాంపును నడుపవలసినదని ప్రార్థించిరి.

నవ్వుతూ, అంతటి భారం తాను అందుకోలేనని, అప్పుడప్పుడు వస్తూ ప్రోత్సహిస్తూండగలనని అన్నారు.

"లేదమ్మా! మీరు స్వయంగా అక్కడ యుంటేనే, అందరికి అన్నీ చూచుకుంటేనే, తమ తమ స్త్రీలను పంపుతామని మన రైతాంగ సత్యాగ్రహులు - బాపట్ల, తెనాలి, రేపల్లె తాలూకాలలో అంటున్నారు. మీ రొక్కరే ఇంతటి బాధ్యతను నడుపగలరని మాయందరి యాలోచన" అన్నారు వారు.

"ఆలోచించుకొని తరువాత తెల్పుతా"నన్నారు భారతీదేవి కృష్ణయ్యగారు వెళ్ళినతరువాత, "ఏమంటారండి మీరు"అన్నారు

"నా సంగతి తెలుసుగదా! నేనైతే యీ రోహిణీకార్తె నిప్పుల్లో వేగగలను. నీవు ఎలాంటి యెండల్లో కాగిపోవడమన్నా, నే భరించగలనా! అందుకేగా, ఆ ఊటీలో నిన్నుంచుతూ, ఆవేసవులన్నీ, నేను గ్రామాల్లో తిరుగాడేవాడను."

"అంత ప్రేమ ఉన్నమాట నిజమే? నాకు ఈ యెండలు, అందులో గుంటూరు వేసవిలో కాగిపోవడం సులభమా? ఐతేనేమి? ఈ కష్టాలిట్లుండునని 1930లో మీకు తెలియదా? ఆ ఉద్యోగం వదలివేసేటప్పుడే, ఇవన్నీ తలచుకొంటిమిగదా! సౌఖ్యాలన్నీ వదలుకొనడం, అప్పులు, కరిగిపోతునన్న భూవసతిం



అందుతున్న పేదతనాన్నైనా స్వీకరించడం, మన ధర్మమన్నారుగదా। 'మహాత్ములు అలాగా నిప్పుల్లో కాగిపోతుంటే, మనమూమద్రాసు, ఊటీ సౌఖ్యాలను ఇంకెన్నాళ్ళు భరించగలమంటిరి!" అన్నారు. వారు.

"అదంతా నిజమే, నేను తయారే, అన్నిటికీ! కాని నిన్ను ఈమండు వేసంగిలో, ఈ పికెటింగుకు అర్పించాలని కలలోగూడా! అనుకోలేదు. అటూ బాధ పడుచుంటిని.

"అగ్గిలోకి దూకాలనుకున్నాముగదా? దూకినాము. కారు వదలితిమి. బస్తీలనుండి వచ్చేస్తిమి. పన్నెండువందలుపోయె. రెండు వందలన్నా అందడంలేదు. ఐనా దేశభక్తికే ప్రథమ ప్రణామమనుకొంటిమి ఇక......"

"అంటే! ఈ నిప్పుల్లోకి దూకడం నీకిష్టమేనా!"

"ఇష్టమో, కాదో అనేదేమున్నది. ఈ కష్టాలు ఇక తప్పునా, అనేదే నాఆలోచనండీ"

"నీవింత తెంపుచేస్తుంటే నాకుసంతోషమే! ఐనా, నాభారతీదేవి యీ అగ్నివర్షంలో నిలువునా నీరైపోవాలా?" అనుకుంటున్నా!

"అన్నీ త్యాగం చేస్తూన్నప్పుడు ఇది అడ్డమా?" అన్నారు. దీనిలో చేరితే మరెన్నెన్ని, యెట్టెట్టి కార్యక్రమాల్లోకి రమ్మంటారో? అలాంటి బాధలకు తట్టుకోగలమా? అలాగా, పదేవదే రెండురోజులు సతమతమగుచుంటిమి! "ఎన్నాళ్ళో యీ ప్రోగ్రాం" అని! తిరిగి కృష్ణయ్యగారు వచ్చిరి.

"ఏమండీ రంగాగారు! భరతమాతకు మీ భారతీదేవిని ఇవ్వండీ," అన్నారు.

"ఆమె భారతమాతను కౌగలించుకొన్నారండీ" అన్నా! కృష్ణయ్యగారు ఎంతగానో ఆనందపడిరి.

"ఒక్కమాటండి, నేనుమాత్రం ఆ శిబిరాలకు నాయకత్వం వహించను. మీ భార్యను ముందుబెట్టుకొని, వ్యవహారాలు చూచుకుంటూంటా, సరేనా?" అన్నారు భారతీదేవి.

ఆవిధంగా ఆమె తెనాలి సత్యాగ్రహ శిబిరములోని మహిళల భాగానికి అందిరి. వారు వస్తున్నారని, వచ్చిరని తెలియడంతోటే, యెన్నెన్నో గ్రామాలనుండి ఎంతెంతో గౌరవ ప్రతిష్ఠలు పొందిన కుటుంబాలనుండి, 60,70 సంవత్సరాల చేబ్రోలులో వేదాంతి గోళ్ళమూడి రత్తమ్మ, వారితల్లితో సహా 20,25 సంవత్సరాల నిండుయువతీ మణులు వందకు పైగావచ్చిరి. వారందరు ప్రతిదినం ఆరు గంటలసేపు, దుకాణముల ముందు నిలబడుచూ, కాంగ్రెసు జెండాలను చేబట్టి పికెటింగుచేయబూనిరి. ఎన్నడూ అందరుగా, అంతబాహాటంగా. అంతసేపు, ఆరుబయలున కన్పడియుండని, కమ్మ, తెలగ, బ్రాహ్మణ, వైశ్య మహిళామణులు అంత గౌరవభాజనంగా పికెటింగు చేస్తూఉంటే, చూడాలనుకొని, తిరునాళ్ళలాగా వారాల పర్యంతం, రెండు మూడు జిల్లాలలోని దేశభక్తులు సేవకులు వచ్చుచుండిరి. అంతటివారే తమ సున్నిత సుఖాలను మరచి, అంత వేడికి తాళుకుంటూ, కాంపు జీవిత కష్టములను లెక్కింపక, పికెటింగు చేస్తూంటే, తాము కాంగ్రెసును బలపరచడం, మహాత్ముని నాయకత్వమును అంగీకరించడం, పరమధర్మమనుకుంటూ, పదులవేల యువజనులు దేశభక్తి ప్రపూరితులగుచుండిరి.

వారందరికి, ఎన్నిక లేకనే, పేరుపెట్టి పిలువబడకనే, తలమానికమువలె వెల్గుచుండిరి భారతీదేవి!



నేను ఆ నెలల పర్యంతం, ప్రతిదినం, ఎదో యొకచోటగల పికెటింగు, బహిరంగసభ, వర్కర్ల సమావేశం చూచుకుంటూ, ఆంధ్రరాష్ట్రమంతటా సంచారము చేస్తూంటిని. అటూయిటూ వస్తూ పోతున్నప్పుడు; వీధిలో ఏదో షాపువద్ద పికెటింగు చేస్తున్న భారతీదేవిని చూచుకొనేవాణ్ణి! గొడుగు వేసుకోరే! ఆంధ్రపత్రికను మాత్రము ఎండకు అడ్డం పెట్టుకోగల్గుచున్నారే! అయ్యో! యీ దుకాణంవారు ఆమె ప్రక్కనున్న (స్త్రీ) వాలంటీరుకు ఇవ్వక, ఆమెకుమాత్రం, కుర్చీ యిస్తే, తాను కూర్చొనక, నిలబడే యున్నారే! అని బాధపడుచుంటిని?

నేనుమాత్రం సాహసించి, ఆగి, ఆమెను పల్కరించి, "ఫరవాలేదుగదా!" అంటూ, "మంచినీళ్ళు ఇచ్చేదా? సోడా తెప్పించేదా?" యని ఆందోళన చేస్తుంటే, "ఏమీ అవసరంలేదు! అంతా బాగున్నదిలెండి" అని సిగ్గుపడుతూ మందహాసం చేసేవారు.

నేను నిటారుగా బూట్లతో సరసర నడచివస్తూంటే నా వెంట గుంపులుగా యువకులు, పెద్దలు చేరుతుంటే, చూస్తూ, చాలా సంతోషం బొందేవారట; "అంత దూరాన్నే, ఆ నడక తీవి గమనించే మీరు వస్తూన్నారు" అనుకొంటూండడం, అదేపనిగా చూస్తుంటే వారు వీరు ఏమనుకుందురోయని సర్దుకోవడం నా పని!! "అంత భయమెందుకూ?"అని నేనంటే, "ఇది యూరపుకాదుగా" వారు.

రెండు వారాలకో, పదిరోజులకో, ఎట్లనో కృష్ణయ్య సతిని ఒప్పించి నా కోరికపై నిడుబ్రోలుకైవచ్చేవారు. ఆ ఒక్కరోజు ఆమెకు ఊటీలో అందిన స్వర్గతుల్యపు విశ్రాంతి అందేది.

"పాపం ఎలాగా కందిపోయిరమ్మా! ఇంత బాధ కల్గిస్తానని నేను అనుకోలేదమ్మా"

"మనదేశపు స్త్రీల ధోరణే అదండీ! ముందుగా కష్టాలు తలచుకొని, నిదానంగా గాని తీర్మానించుకోము. అదంతా స్త్రీల కన్సర్వేటిజమ్. వెనుకచూపు అనుకొంటారు మీరు. అది పొరబాటు. ఒక్కమాట! కష్టాలను కౌగలించుకొనడానికి, తీర్మానించుకున్నామా, ఆ తరువాత మన స్త్రీలు వెనుకచూపుకు రారండీ! మహాత్ముని శిష్యత్వము అందుకున్న తరువాత కష్టాలేగదా మనకందేవి! అన్నిటికి సహించితేనే మనం గట్టు, యెక్కేది! కనుక, నేను కందిపోయినానని మీరు దిగులుపడితే యెలాగా? మీరు సంతోషంగా వుంటే నాకూ బలం గల్గును. నాకంటే సుకుమారంగా పెరిగిన పిల్లలున్నారు. వారూ అన్నిబాధలు పడుచున్నారు. పెద్ద తల్లుల అవస్థలు చెప్పతరమా! రాత్రయ్యేసరికి ఎన్ని నొప్పులో! నేనే వారి కాళ్ళుపిసుకవస్తే చూచి ఎందరో అమ్మాయిలు నాకూ తోడవుతుంటారు. వారందరకూ వున్న ఓపిక నాకు లేకపోతే యెలాగా! వయస్సులో వున్న అమ్మాయిల భర్తలెంత వుదారులో ఒర్పుగలవారో! స్త్రీలు చేస్తున్న శ్రమ, త్యాగం యువకులకంటె పదిరెట్లు హెచ్చు. ఇదంతా చూస్తుంటే నాకు గొప్పశక్తి కల్గుతున్నది." అన్నారు భారతీదేవి.

"కాంప్‌లో అందరు తల్లులు, అమ్మాయిలు బాగుంటున్నారా?"

"అయ్యో నాకైతే ముప్ఫైయేండ్లు నిండలేదు, అంతంత ముత్తైయిదువులు అన్నిటికి నామాటమీదనే వుంటామంటారు. అదేమిచిత్రమో! పాలుగారుతున్న క్రొంగొత్త పెళ్ళికూతుళ్ళను "అమ్మా! మీరు మీ యిండ్లకు వారానికొకమారైనా పోయి రాండి. కాపురాలు కల్యాణమందిరాలుగా వుంచుకోవాలమ్మా" అని నేను బుజ్జగిస్తూంటే "భారతమ్మగారూ, అన్నీ అందుకున్న మీరే ఇన్నాళ్ళు ఆ దేవుడు వస్తేకూడా, మమ్ము వదలకుండా వుంటే మేము మీతో వుండలేమా! యిళ్ళకు పోతే కలిగే ఆనందం, అమ్మ, అమ్మమ్మలాగా వుంటున్న మీ ప్రక్కనే అందుతుంది."



అంటారు! నాకు ఒక్కొక్క పర్యాయం భయంవేస్తుంది. ఈ పికెటింగు పని పూర్తయ్యేసరికి, 'రంగాగారికి ఈ ముసలమ్మ యెందుకులే' అనుకుంటారేమోనని!" అన్ని బాధ్యతలు. అంటె, అంత బాధలా! అంతగా రోజే నెలగా ఉంటున్నదా, పాపం, అని ఓదార్చాలనుకున్నా!

కాదు కాదు బాధలనేవి లేవు. అందరినీ ఆదరిస్తూ, అందరికి అంత పెద్దగా ఉండగలగడం అదృష్టం. ఐతే, ఆ బాధ్యతల తరువాత, నవ్వుకోవడం, ఉషారుగా వుండడం సులువుగాదనిపిస్తూంది. ఒక్కొక్కరి కుటుంబములో ఎన్నెన్ని త్యాగాలు అవసరమగుచున్నవి! ఎందరు నిండు యౌవ్వనులకు ఎట్టెట్టి కష్టాలు. అత్తలవల్లనో, భర్తలవల్లనో తోడువారివల్లనో కల్గుచున్నవని! ఎందరెందరు, అంతా సహించి, యెంత త్యాగమూర్తులుగా, జీవిస్తున్నారు! ఇదొక గొప్ప విద్యాలయం మనకు" అన్నారు.

మా ఒక్కరోజు సంసారం ఇట్టి చర్చలతో! అలాగా ఆరు మాసాలవరకు, ఆ తెనాలి శిబిరాన్ని ఆదర్శప్రాయంగా, హైందవ మహిళల యోగ్యతా ప్రదర్శనంగా వారు సాగించగల్గిరి.

"మనం అదృష్టవంతులమండీ! ఇన్ని నెలలు ఇందరు సుందర సతీమణులను చేర్చుకొన్నా, ఇంతగా అందరిలో కన్పడుచున్నా, ఒక్కరుకూడా యే యొక్కరివల్ల మాటపడటంలేదు. పల్లెత్తుపాటు పలుకు ఎవ్వరినీ వెంటాడలేదు. ఎన్ని తరగతుల కుటుంబాలనుండి, ఎన్ని యాచారాలలో నుండి వస్తున్నారు. అందరు మహాత్ముని ముద్రలో మునిగిని తల్లులవలెనే యుంటున్నారు. ఇదంతా మన దేశపు సంస్కారము అనుకుంటూండిరి.

"నిన్ను జూచికూడా వారికి ఉల్లాసమనుకొందు"నన్నా!

"అది కాదనను లెండి! అందరూ ఎంత మర్యాదస్థులండీ!"

ఎన్నో ప్రదేశాలలో కంటె మిన్నగా, తెనాలి వర్తకుల వద్ద, విదేశీవస్త్ర బహిష్కరణకు, ఒప్పందం తెల్పే, అగ్రిమెంట్లు, కాంగ్రెసు శిబిరనాయకులు సంపాదించగల్గిరి. ఆ విజయానికి ప్రత్యేక బలం, అచ్చట సాహసోపేతంగా, గౌరవ మర్యాదలతో, అధికారులందరి మన్ననలతో సాగించబడిన మహిళా కాంపు వలన కల్గినది. కాంగ్రెసు నాయకులు, ప్రజానాయకులు, అధికారులు దుకాణదారులంతా హైందవ స్త్రీలోకమునకు, తెనాలిలోని సత్యాగ్రహ సమర మహిళలు మర్యాదను సంపాదించిరి. కాంగ్రెసు ప్రతిష్ఠను పెంచిరి. స్వరాజ్యోద్యమానికి బలం అందించిరని, పొగడిరి. వారందరికి నాయకురాలుగా భారతీదేవిని పూజించిరి కనుకనే 1932 మార్చి ప్రాంతమున, వారికి తెనాలి సబ్ కోర్టులో శిక్ష చెప్పుతున్నప్పుడు, వేలాదిగా స్త్రీ పురుషులు చేరి వారికి 'జేజేలు' చెప్పుతూ తమ మాతృదేవత భారతీదేవి! ఆ భారతీదేవే యీ భారతీదేవని నినాదాలు చేసికొనినారట.

అటులే, నెల్లూరులో భారతీదేవికి పూజనీయులుగా నుండిన శ్రీమతి పొణకా కనకమ్మగారు మూడునెలలు మహిళా శిబిరాన్ని నడపిరి. ఐతే! ఆంధ్రలో తెనాలి శిబిరం, అందునా మహిళా విభాగం అత్యధిక విజయాన్ని సాధించినదని మహాత్మా గాంధికందిన రిపోర్టుల ప్రకారం తేలింది.

అందుకే 1933 డిశంబరులో ఆంధ్ర పర్యటనకు వచ్చినప్పుడు, భారతీదేవిని ప్రత్యేకంగా మహాత్ముడు అభినందించిరి. వెంకటగిరిలో, భారతీదేవిని, కనకమ్మను గౌరవించిరి. వారిద్దరి భుజాలపై చేతులువేసి, స్టేషనువద్ద నడుస్తూ మీ రిద్దరు ఆంధ్ర కాంగ్రెసు మహిళా నాయకత్వమునకు, కుడి యెడమ భుజస్కంధాలని ప్రోత్సహించిరి.

ఆయూరు నెలలు శిబిర శిక్షణసేవ, నాయకత్వ భారముల ద్వారా, ప్రాచ్య పాశ్చాత్య నీలగిరుల ద్వారా అందిన సోయగం,



సొగసు, కాంతులు జారిపోయినవి. భారతీయ శోభ వారిని కౌగిలించుకొన్నది.

ఆ మహిళా శిబిర నిర్వహణలో భారతీదేవికి గొప్ప తర్ఫీయతు, శక్తి, అనుభవములు కల్గినవి. అసలే సహనానికి ఆమె పుట్టిల్లు! ఈ అనువభమునల్ల, సహనము, సానుభూతి, సాహచర్యపు సొగసు, సంతోషమును వెదజల్లే శక్తి హెచ్చైనది. ఆ క్రొత్త శక్తి 1932-33లో వేలూరు జైలులో నుండగా, వందలాది స్త్రీ సత్యాగ్రహులతో కలిసి, మెలసి యుండగల్గి వారందరికి కల్గుచుండే యవసరాల తీర్చుచు, అందరి తలలో నాలుకవలె, జైలు అధికారులద్వారా తగు సౌకర్యములు సాధించుచూ. సేవలొనర్చిరి. అలాగా పెరిగిన నాయకత్వ నిర్వహణశక్తియే, 1934 నుండి 1969 వరకు మేము సాగిస్తూ వుండిన రైతాంగ విద్యాలయములు, పౌరసత్వతరగతులలో, వందలాది యువజనులను, తర్ఫీతు చేయడంలో, నాకు యెనలేని సాయం, సలహా అందించగల్గిరి. 193.లో వారితో కలిసియుండిన సత్యాగ్రహ శిబిరమహిళలు 1972లో వారు స్వర్గీయులైనప్పుడు ఎంతగా బాధపడిరో వర్ణించగలనా? ఆ నలభై సంవత్సరాల సేవారంగ జీవితంలో, భారతీదేవిని ప్రేమించడం, పూజించడం, కౌగలించుకొని, సలహాలను బొంది, తమ నిత్యజీవితాన్ని శోభాయమానంగా చేసుకొన్న వారెందరినో, యెన్నో జిల్లాలలో కలుస్తూ వుంటిని. వారందరికి ఆమె తల్లియే!

—:o:—

# ఢిల్లీ, ఆగ్రా - మొగలాయి సృష్టి

ఢిల్లీలో 1935 నుండి 1970 వరకు మేము కాపురం చేసితిమి. ఎన్నో సెవన్లకు భారతీదేవి రాలేక పోయేవారు. వ్యవసాయపు పనులు, రాష్ట్రశాసనమండలి బాధ్యతలు, వారికి వస్తూండిన "దురదల (ఎలర్జి) బాధలువల్ల. ఐనా మాకు నిడుద్రోలు లోకంటె ఢిల్లీలో నున్నప్పుడు కలిసియుండుటకు హెచ్చు అవకాశాలుండేవి. వారు ఢిల్లీలో నుండగానే, తానదివరకు జైలులోకూడా పెంపొందించుకున్న హిందీ భాషలో పల్కుట, చదువుట, వ్రాయుట, ప్రత్యేకంగా ఉపాధ్యాయుని సహాయంతో నేర్చుకొన్నారు. తమిళం, ఇంగ్లీషు అంతకుముందే చదువుకున్నారుగా! నాకంత సులువుగా హిందీరాలేదు. కొంచెంగా జైలులో స్వబోధినిద్వారా తదితరంగా వినికిడి ద్వారా పొందిన హిందీని వారివద్ద పెంచుకొన్నా!

ఎర్రకోటకు, జుమ్మా మసీదుకు, కుతుబ్ మీనార్‌కు, ఇంద్రప్రస్థానికి, అశోక శిలాశాసన ఫలకంవద్దకు, కేంద్రభారతీయ వ్యవసాయ పరిశోధనాలయానికి మరియు ఆర్టై క్రవుసుకు, హరిజన కాలనీకి, భంగీకాలనీకి, బిర్లాభవనానికి, లక్ష్మీనారాయణ మందిరానికి, అనేక మారులు వెళ్ళాము. ఎందరో స్నేహితులను అలాంటి వాటికి మరెన్నిటికో తీసికొని వెళ్ళుచుంటిమి.

ఒకమారు శ్రీ బుచ్చినాయుడు వారి భార్య శ్రీమతి వెంకట సుబ్బమ్మ, భారతీయ పరిశ్రమల ప్రదర్శనానికి వచ్చి, మా అతిథులుగానుండిరి. వారిని రెడ్‌ఫోర్టుకు తీసికొనివెళ్ళితిమి. భారతీదేవి,



ఆనాటి మొగలాయి జనానాలో, ఆ రాణులు, చక్రవర్తి భార్యలుండే భాగాలను ఆమెకు చూపించుచు "ఆకాలాన అన్నిభోగాలు వారికున్నా, ఆఘోషా, మొగలాయి బహుభార్యాత్వము, వారందరి మధ్య చెలరేగు చుండిన కుట్రలు, కార్పణ్యాలు తలచుకుంటే, చాలా బాధగా ఉంటుందమ్మా!" అన్నారు. "అంత భోగమే కాక, చక్రవర్తిత్వపులధికారమంతా అన్నేళ్ళు అనుభవించిన, ఆభూలోక సుందరి నూర్జహాను తన భర్త జహంగీరు పోయిన తరువాత తుదకు ఎంత మానసిక దౌర్భాగ్యముతో చివికి పోయిందో! లాహోరులో ఆమె సమాధి చూచితిమి. 'ఎవ్వరూ నన్ను తలుచుకోవద్దు, నా సమాధిపై అందచందాలు చేర్చవద్దు' అని వ్రాయించుకొన్నారు. ఎందుకో? తన కుమారునకు సామ్రాజ్యం రాలేదని, తన సవతి కుమారుడు షాజహాను 'చక్రవర్తి' ఐనారని! ఆయనైనా తన అన్న అల్లుడే! అలాంటిది రాజ్యాల పై కాంక్ష! తమతోపోదు వంశ పారంపర్యం అదే పీకుస్తూంటుందమ్మా!" అన్నారు.

ఔరంగజేబు మశీదు సౌందర్యమును మెచ్చుకొంటిమి! లాభమేమి, ఆయనకు సమాధి, దక్షిణాదిన, ఔరంగాబాదులోనే అందినది.

"అబ్బ, ఎంత కఠినాత్ముడమ్మా! శిస్తులభారం భరించలేక, ప్రజలు ఘోషించితే, తాను జుమ్మా మసీదులో ప్రార్థనలు చేయడానికి పోయేటప్పుడు, ఏనుగులచే వారిని త్రొక్కించి, చంపించాడట! చదువలేదా, తెలుగులో - విమలాదేవి - అనేనవల!"

ఆ దంపతులతో ఋషీకేష్, హరిద్వారము వెళ్ళాము. వారు గంగానదిని గాంచి ఆనందం పొందినారు. హరిద్వారములో సాయంత్రంవేళసిక్కులు, హిందువులు భజనల్లో పాల్గొన్నారు ఎంతో బిడియంగా ఉండే వెంకటసుబ్బమ్మను భారతీదేవికి అందించినాము. వారిద్దరు ఆ లక్ష్మణ ఝూలామీద కొంచెంకొంచెంగా ఉయ్యాలలూగి యానందించినారు.

మరొకసమయాన, మా తమ్ములు లక్ష్మీనారాయణ కుమార్తె ఇందిర, భారతీదేవి అక్కయ్య మనుమరాలు అనసూయ మా అతిథులుగా వచ్చిరి. వారికి ఇవన్నీ చూపుసమయంలో తాజ మహల్ దర్శించితిమి.

"ఎందరో ఏమేమో చెప్పుకుంటారు ఈ భువనైక సౌందర్య శిలాసృష్టి గురించి! నాకు ఎన్నో ఆలోచనలు కల్గుతుంటవి! ప్రేమ-మానసికంగా, దేహముతో కూడుకొని, సరసము, సంతోషము, పరస్పర విశ్వాసము, అభిమానములతో, మరెన్నిటితోనో కూడుకొన్న దైవికానుభవము. తాము పరస్పరంగా అనుభవించిన ప్రేమ ఇంత అభిమాన పూర్వకంగా, ప్రకటించిరి. ఇంత సున్నితంగా కవులకు, శిల్పులకు, దేవుళ్ళకు అందే స్వరూపమే యిదమ్మా!'

ఆమెకు చివరిసారి దర్శనం వారి అన్నకుమార్తె, వారి జీవితచరిత్రను ప్రథమంగా వ్రాసిన పుష్పకుమారితో కల్గింది. ఢిల్లీ, ఆగ్రా, ఫతేపూర్ సిక్రి, సికిందరాలకు వెళ్ళాము. ఫతేపూర్ సిక్రీగేటు పై భాగాన్ని చూచుటకు తలయెత్తి "అబ్బో వెనక్కు పడిపోతున్నా" నంటూండగా నేను నవ్వుతూ వారిని నిల్పుకుంటూ, "ఇంత ఎత్తున ఆర్చి మరొక్కటిలేదు" అన్నా!

"అన్ని మతాల నాయకుల సభను ఎప్పుడో, హర్షవర్థనులు తక్షశిలలో నడిపితే, అక్బరు ఈ హాలులో నడపిరట! అందరు చెప్పిందీ, శోధించిందీ, ఎంతోగా, ఎన్నాళ్ళోవిని మననం చేశారుట! తుదకు తానొక ధోరణిలో, సర్వమతసార సంగ్రహంగా మరొకమతం ప్రారంభించారట. దానికి తానే అధిపతి! అలాగే యీజిప్టు "ఫారో" కూడ స్థాపించినారు గదా! ఆయన శిలా విగ్రహాలను, కైరో, అలెగ్జాండ్రియా, మ్యూజియములలో చూస్తిమి గదండీ!" - అన్నారు.

"మరి అక్బరు మతం నిల్వలేదుగా?" అన్నారు.



"దానికి పురోహితులు, పురాణాలు పుట్టలేదమ్మా! ఉలేమాలు, ఫకీరులు, బ్రాహ్మణులు, సన్యాసులు, చక్రవర్తికంటె బలం కలవారైనారులే ఇదిగో, చూడండి, ఈ మహలులో హిందూ దేవళాల, భవనాల సొగసులు అవతారాల చిహ్నాలున్నా" యన్నారు.

"అక్బరు రాణి, జైపూరు బిడ్డ, యిందుండేవారు. అయితే ఆయనెంతో మత సహనంగలవారు, అందుకే ఆయన్ను మహాచక్రవర్తి అన్నారు. ముత్యపు చిప్పల తళ్కులతో అద్దాల పల్కులతో ఎంత సుందరమైె జ్ఞాపక చిహ్నము, తనగురువుకై కట్టించాడు అక్బరు! చూడమ్మా!" అన్నా. ఆనందించిరి.

"ఇంతలో అంత వేదాంత వేత్తయైన ఆ చక్రవర్తి ఎంత క్రూరంగా, హిరణ్యకశిపునివలె, రాణాప్రతాపుని కోటనుండి తరిమి అడవులలో తిండి తిప్పలు లేకుండాచేసి, అన్ని సంవత్సరాలు పోరాడెనే! ఏమి ధర్మాలో, ఏమి అధికార పిపాసో!" అన్నది పుష్పకుమారి.

"తన్నెదిరించేవారు మరొకరుండరాదనేగా మన యింద్రాది దేవతల పంతం," అన్నా! "అందుకే పార్లమెంటరీ పాలనం కావాలంటూ, జవహర్‌లాల్‌తో తిరుగబడితిమి. అంత పెద్ద మెజారిటీ తనకున్నా, ఇటు రంగా, అటు కృపలానీ, అంబేర్కర్, డాంగే అశోక్ మెహతా అలాగా ఇతర ఆర్గురు ప్రత్యర్థి పెద్దలుకూడ పార్లమెంటులో ఉండరాదనే పంతంతోకే కదా, మమ్ములను ఓడించినారు.

"తుదకు 1962-1967లో నన్ను పదేపదే యెదిరిస్తూ, ఎన్ని బాధలు కల్గించిరి. అత్యంత అధికారం గలవారికెప్పుడూ ఎదురాడువారి యెడల సహనం వుండదు! అక్బరు అందుకే ప్రతాపుని అట్లు వెంటాడినారు"అన్నా!

"ఎదిరి పార్టీ పెట్టి ఇన్నిబాధలు - ఇన్ని ఓటములు అనుభవిస్తున్నాముగా! ఆనాడు రాణాప్రతాపు, భార్యాబిడ్డలెంత గాసిలిరో! ఊహించుకోవాల్సిన పనేముంది? మన అనుభవం చాలులే" అన్నారు కోపంతో భారతీదేవి.

ఆగ్రా కోటలోనికి రొప్పుకుంటూ వెళ్ళాము. ఆచిన్ని చారిత్రక అద్దం చూచాము. దానిలో బంధింపబడ్డ షాజహాను తన ప్రేమ స్వరూపమైన దేవతలకే ఊహింప అసాధ్యమైన తాజమహాలు స్వరూపాన్ని, దాని ప్రతిబింబాన్ని తలచుకున్నప్పుడల్లా ఆ యద్దంద్వారా దర్శించుకునేవారట!

'ఔరంగజీబును ఇందులో ఈ తండ్రి జయించినా'రని ముంతాజ్ పోయినా తాజమహల్ దూరమైనా వారి భావస్వరూపము ఆయన పిలిస్తే రూపొందేదని అనుకున్నాము. "వాళ్ళదేమి సభ్యతలే. నేనా 1917 లో కొమర్రాజు లక్ష్మణరావుగారి 'మహమ్మదీయయుగము' అనే పుస్తకం చదివి నప్పటినుండి, జదునందన సర్కారు పుస్తకాల వరకు (194[illegible]) ఈ మహమ్మదీయ ప్రభువలకు నీతి, ధర్మము తెలియవనే అసహ్యం కలుగుచునే యున్నదమ్మా!"

"అదేమిటండీ, ఆ నూర్జహాను తనకు పూర్వావు పెళ్ళివల్ల కలిగిన పిల్లను, తన క్రొత్త భర్త జహాంగీరుకు పాత భార్యవల్ల కలిగిన ప్రిన్స్‌కిచ్చి పెళ్ళిచేశారు! ఔరంగజీబు తన అన్నలను చంపటమూ, చంపించటమూ, చక్రవర్తియైన తండ్రిని బంధించుటామూ! ఆ తరువాత తానే చక్రవర్తి కిరీటాన్ని తలపైని పెట్టుకుంటాడూ! తిరిగి తన కొడుకు తనపై తిరుగపడితే వాళ్ళు 'నీవు నేర్పిన విద్యయే' అని సమాధానమిస్తారూ! అందుకే సనాతన ధర్మమంటూ ఎన్నో వెఱ్ఱికథలు అందుచేర్చి యెంతో నష్టం కల్గించినా, కుటుంబ ధర్మాలను మనమధ్య ప్రచారం చేస్తోన్న రామాయణం, భారతం కవనాలెంతో ఉపయోగమేనని కదా నేను అంటూ ఉండటం! ఆ భరతుడు చూడండి ఎంత ధర్మాత్ముడో!" అన్నారు.



"అన్నీ చెప్పుకుంటూవుంటూనే వుంటారు మనవాళ్ళు, ఆచరణలో ఈ కాంగ్రెసులోని కుళ్ళు, కుట్రలు, అన్నార్తు. ఈ ఉద్గ్రంథాల పారాయణే లేకపోతే, మొగలాయీల రాక్షస పాలన పశుత్వమే మనవారికింకా పురాణ మయ్యేదండీ" అన్నా!

"అదీ నిజమేనండీ!" అన్నారు.

వొకమారు సుశీలను తీసుకొచ్చాము. అప్పుడు రంగా గారే మన్నారో తెలుసా? ఇంత మహత్తర సౌందర్యరాశిని నిర్మించుట లక్షలాది రైతుకూలీలు శ్రమించిరే! వారికి నిండుగాతిండి, గుడ్డలు గుడిసెలు వుండెనా? వారిని శ్రమింపజేస్తూ, ఆ మేస్త్రీలు వారికెన్ని వాతలు పెట్టిరో? ఎందరిని చంపిరో! వారి రక్తం, స్వేదబిందువులు కన్నీరు మున్నీరై ఈ ప్రక్కనున్న యమునానదికెంత బరువెత్తిరో! అది కాదనముకాని మన జీవితాలంతా అలాంటి బాధలతోనే నాగుతునవి. వాటన్నిటికీ ఫలితం ఇలాంటి, ఈ అందాల ప్రోవుగా ఇచ్చటేగా వున్నది. అన్నారు ఆమె.

ఆ రాత్రి పూర్ణిమ. ఆ పున్నమి వెల్గులో తాజమహాలు కాంతులు చల్లగా, వెండితీగల అల్లకంగా, చూచినకొలది క్రొంగ్రొత్త అందాల సరస్సులుగా ఉన్నవి! ఆనందించితిమి. అప్పుడనుకున్నాము, 'అమృతానైనా అదేపనిగా ఆరాటంగా అనుభవింపలేముగా,' అని! రాత్రి యొంటిగంటయైనది. చలి హెచ్చినది. గాలి గాటంగా ఒత్తుకుంటుంది. అంతగా ఆత్మకే అతుక్కుపోతున్న, ఆ తాజమహాలును వదలలేక వదలుకుంటూ వెళ్ళినాము.

తాజమహాలును ఎన్నెన్నో మారులు చూస్తూండినాను. అన్నిమారులు భారతీదేవికి ఆ ప్రేమావతారాన్ని వర్ణిస్తూనేయున్నా! అలాగా పెరిగినది. వర్థిల్లినది మా ప్రేమగూడా! తాజమహాలు గురించే తిరుగు ప్రయాణంలో మా తలపులు!

"ఎంత అందమండీ! ప్రపంచనాయకు లెందరు వచ్చినా, 'ఇది మానవ నిర్మితమా! ఈ అందాన్ని ఎలా వర్ణించడం? మరింకేదీ ప్రపంచములో లేదే, పోల్చుటకు" అంటున్నారు. ఈ దేశం వాళ్ళం! ఎన్నోసారులీ బొమ్మలు చూస్తున్నాం! వేల సంవత్సరాల నుండి వాల్మీకి, కుశలవులద్వారా. సీతమ్మ శ్రీరాముని ఎట్లు తన హృదయపీఠమందు నిల్పుకొన్నారో, వాల్మీకి చెప్పించితే, కావ్యమల్లితే; చదివించుకొంటున్నాం! అలాంటి భావాలెన్నిటికోమించిన స్వరూపంగా ఉన్నదండీ యీ దివ్యశిల్పాచార్యుల సృష్టి. ఏది గొప్ప! ఆలోచన చేసినవారా? సృష్టించినవారావారు? చేయించిన ఇంతటి భాగ్యాన్ని నిల్పుకొన్న మనమా? ఆ షాజహాను కెందరో భార్యలు. అందరివలె జనానా! ఐతే ఏమి, ఆ ముంతాజు మీదనే మమత, ప్రేమ. అదేగా మన కవీంద్రులు రుక్మిణీ, సత్యభామ పోటీః ఊహించుకొని రుక్మిణీ దేవియొక్క తులసీ దళముతో సరిగాదు సత్య సౌందర్యము, భాగ్యము, భోగ్యము, శౌర్యము, మరెంతో మరేదేదో; అన్నారు. ఈ దేహమేనా; ఈ చర్యలేనా; ఈ అనుభవాలేనా; ఇంతకాలం కలసి మెలసి ఉండటమేనా? ప్రణయ కలహాలా? విరహతాపాలా? అందరివీ కాదనుకుంటూ తమలో తాము నిండిపోవడం; అర్థనారీశ్వరులు కావడమేనా? ఇవేకాదు మరెన్నో. ఇంతకూ ఈ తాజ్ మహల్‌ను నిర్మించిందెవరు? భారతీయ శిల్పులేనంటారే! కాదండీ ఇరాను ఇటలీ మరెన్నో నల్లసముద్రం, కాస్పియన్ సముద్రం వరకున్న దేశాల నుండికూడా వచ్చి ఉంటారు. ఆ కాలంలో మొగలు దర్బారు ప్రపంచంలో అత్యంత ప్రఖ్యాతి పొందినది. కనుక ఎచ్చటెచ్చటి నుండో ఎందరెందరో సుప్రసిద్ధ ప్లానర్లూ, శిల్పాచార్యులు వచ్చియుండాలి. ప్రధానమైనవారుకూడా వివిధదేశాలకు చెందినవారైవుండాలి. ఇది అంతర్జాతీయశిల్పాచ్యారుల సృష్టి. కనుకనే అందము, ఆనందమూ మరెచ్చటా అందనంతగా ఇచ్చట అందుచున్నది గదా!



"ఆ లతలు చూచినామే! ప్రతిమారు మనం వాటి సొగసులు, సంపదలందుకుంటున్నామే' అవి ప్రత్యేకంగా మొగలాయివారివనే భ్రమలోనుంటిమి. కాని! దక్షిణాదిన మన చోళులు వేయి సంవత్సరముల క్రితమే, తంజావూరు, మధుర, రామేశ్వరం, దేవళాల కంబాలమీద చిత్రించిన పూలలతలు చూచింతరువాత, ఎంతగా భారతీయ శిల్పాచార్యులు ఈ తాజమహాలమీద తమ ముద్రలు వేసిరో అనుకొంటిమి, జ్ఞాపకమేనా?"

"అవునమ్మా! షాజహాను; ఆకాలంలో భారతదేశాన్నొక అంతర్జాతీయచిత్ర, శిల్ప, సౌందర్యశాలగా రూపొందించినారు! స్వతంత్ర భారతం ప్రపంచం తరఫున వీటన్నిటికి గొప్పట్రస్టీ" అన్నా! ఆమె అవుననిరి.

అన్నీ అనుభవిస్తూ, పలుమారులేగాదు, దశాబ్దాలవఱకు, జీవితాంతమువరకు హృదయాలను ఆనందపరుస్తూ, పెంచుతూ, వికసింపచేస్తూండడమా? ఆత్మానందమును, మరపురాని విధంగా, మనస్సును గట్టిగా పట్టుకొన్నట్లుంచుకోవడమా ప్రేమ! అది క్షణికం కాకుండా! మరపురానిది కాకుండా! అన్ని అనుభవాలు, ఆలోచనలకు మించినట్లుగా ఉండేదేనా? నెమ్మదిగా, నాతోటే, యిలాగా ఇంకెన్నో రీతుల ఆకమ్మని ఆగ్రా స్పెషలు ట్రైనులో వెళ్ళుతూ ఆమె అంటున్నారనిపిస్తూంది." వింటున్నారా? మీరేమి ఆలోచిస్తున్నారు? ఆ తాజమహాలు అందరికి మనోజ్ఞమైన జ్ఞాన దీపము, జ్ఞాపకచిహ్నమండీ! ఆయన చక్రవర్తి గనుక, అంతగా అట్టి దివ్యదేవతాసృష్టి అందించినా రనుకోకూడదు; ఆ స్పటికపు రాళ్ళు, ఆ చలువ ఫలకాలు, ఆ నవరత్నరాసులు, అట్టి ఇంజనీయర్లు, శిల్పబ్రహ్మలు, అన్నిదేశాల్లో లేరా? చక్రవర్తులు మరెందరు లేరు. ఆయనే నిర్మించునట్లు చేయగల్గినారు! నా మనస్సులో ఆయనపై కృతజ్ఞతయే! నాకెల్లప్పుడు ఆ ప్రేమభావుక సృష్టిపైననే మనస్సు! అలాంటి ప్రేమయే మన సీతమ్మది. సావిత్రిది. అలాగే! మన కస్తూరీదేవి వరకు. మీ కలా అనిపిస్తుందా? ఏమో! నాకుమాత్రం అదే

కావాలి" అంటున్నారు. ఇలా ఎన్నోసారులు ఏమేమో అనుకునేవారము. ప్రేమయోగుల కందుచుండే భక్తి ప్రపూరిత ప్రేమ ఆగ్రాలోని తాజమహలును చూచినప్పుడల్లా ఆమె అనుకునేవారు మాలాంటి సాధారణ ప్రేమ తపస్వులకు అది యాదర్శప్రాయ మనిపిస్తుంది.

బుద్ధ పార్కుకు పుష్పతో వెళ్ళితిమి. పిల్లలు, పెద్దలు, మనసార ఆనందమును అందుకొనుటకు అనువైన విహారమది. దిబ్బలు మిట్టపల్లాలతో, చంద్రుని సౌకుమార్యముతో సూర్యుని కాంతులపై పందెము వేస్తున్న ఆ పచ్చికబయళ్లెంతో ఆనందం కల్గించును. వసంతకాలంలో, పరుషలుగా మెరుపులతో పుష్పాలు కళ్ళకొక బలం, మనస్సులకు ముచ్చట కల్గించుచుండును. దానిలో ఎన్నోమారులు మేము తిరుగాడితిమి. శ్రీ పరుచూరి మమ్మెన్నో సారులు, బుద్ధునిపేరిట వెలిసిన ఆ వనాన్ని మాకు అందించేవారు. ఆపైనున్న సర్కిలు మిట్టనుండి, దూరానవున్న కుతుబ్ మీనారును, గాలిలో ఓసూదైన స్తంభమువలె చూచాము.

ఈనాడు ఆకాశాన్నందుకొనే స్కైస్క్రేపర్లు అంత అందంగానుండునా? అన్ని శతాబ్దాలు నిల్చునా? అంత చరిత్ర తెల్పునా! అనుకున్నాం!

మరునాడు అచ్చటికే వెళ్ళితిమి. "ఆ మంటపాలకు వాడిన స్తంభాలపైనున్న చెక్కడాలు కొన్నిటిపై హిందూదేవాలయపు బొమ్మలు, తీవెలుగా నున్నవిగదా!" అన్నది పుష్ప! అదే మహమ్మదీయ సుల్తానులు, వాళ్ళ శిల్పకారులు చేసిన దుర్మార్గం; మన దేవళాలెన్నిటినో నాశనంచేశారు. మన శిల్పసంపదను దుమ్ము చేయాలనుకొంటూ, అపజయమందినారు. అందాన్ని యెవ్వరు ఓడిస్తారు. కొంతగా వారి దౌష్ట్యాన్ని జయించిన అందాల ముక్కలను ఈలాగు తమ కట్టడాల్లో నిల్పుకొన్నారు. ఈ యుత్తరాదిన, మన దక్షిణాత్య శిల్పఖండాలు కన్పడవు. చిన్నిచిన్ని మందిరాలే!



అన్నీ గొప్ప మసీదులే! వాటన్నిటినీ కట్టించెవ్వరు? పరాయి దేశస్థులు! నేనొకమారు 'రంగాజీతో యింగ్లండులో చదువుకొని, ఢిల్లీలో ఇంజనీయర్ల మధ్య డైరెక్టరుగానుండిన శ్రీఅక్కయ్య చౌదరి గారిని అడిగితిని.

వారు, వారిభార్య, అల్లుడు శ్రీ శివరాం, వారి భార్య, చిన్నపిల్లలు, ఇలాగే ఇచ్చటికి వచ్చినాము, పిక్‌నిక్ గా! అక్కయ్యగారన్నారు. 'ఆ శిల్పులలో అత్యధికులు మన దేశస్థులే! వారిలో హెచ్చుమంది హిందూ శిలాఖండాలను నిర్మించు సిద్ధహస్తులే! అయితేనేమి, మహమ్మదీయ రాజులు ప్లానులు వేయించారు. వారి ప్రధాన శిల్పులు సూపరువైజు చేశారు. మనవారు వారికోర్కె ప్రకారం, వారి యుప్పు, కారం తింటూ వీటన్నిటినీ నిర్మించారు. కొందరు బలవంతం వల్లనో; లాభంకోరకో, స్వేచ్ఛగానో "ఇస్లాము" మతాన్నికూడ శిరసావహించి యుండవచ్చు"అన్నారు. "అంటె, ప్రతి ప్రధాన శిల్పాచార్యుడు తానే యేమత సంప్రదాయపు శిల్పాలను చెక్కుతాడో; వాటికి వెనుక ఉన్న మత ధర్మాచరణలో తన్మయుడు కావలసిన పనిలేదన్నమాట."అన్నాను. "కొందరు అలాతన్మయులయ్యే వారుండవచ్చు," అని అనుభవం కల్గిన అక్కయ్య చౌదరిగారన్నారు."

"పృథ్వీరాజు కాలపు ఈ ఉక్కు స్తంభాన్ని చూడమ్మా! ఎట్టి పోతపోశారో; వేయి సంవత్సరాలనుండి నిల్చియున్నది. ఎందరో సుల్తానులు వచ్చిరికదా! తమ ప్రతిభకై దీనికి మించినది సాంధింపలేకపోయినారులే. తంజావూరు. మధురలో గోపురాలు. దేవాలయముల నేయే ఇంజనీరింగు సూత్రాల ననుసరించి నిర్మిచారో, ఈ కంబాన్నెలా పోతపోసిరో; తెలుసుకోడానికి పాశ్చాత్య ఇంజనీయర్లు పరిశోధనలు చేస్తున్నా"రని అక్కయ్యగారు చెప్పినారు.

"పృథ్వీరాజంటే రంగాగారి చదువులు జ్ఞాపకానికి వస్తవి, రాణీ సంయుక్త నవలను చదువుటద్వారా, యీ నాటికి నాతో పోటీ పడుతున్న, పుస్తక ప్రేమ పిచ్చివారికి పట్టింది?" అన్నారు. పిల్లలు అనసూయ, ఇందిరలను, పుష్పను అశోకుని పిల్లరు వద్దకు తీసుకెళ్ళినాము. అప్పుడు నేను అశోకునిద్వారా, బుద్ధధర్మ ప్రచారం జన సామాన్యం మధ్య ఎంతగా జరిగిందో తెల్పుచుంటిని. "ఆరాతి శాసనములను చదువగల్గెడి వారెందరో ఆ రెండు వేల సంవత్సరాల క్రితం," అన్నారు ఆమె. "ఇప్పుడే నూటికి పాతికమంది లేరే! అయినా, ఆలాగా బహిరంగ ప్రచారసాధనాలను ఆ కాలంలో ప్రయోగం చేయడం మహత్తర కార్యంగదా" అన్నా నేను!

"నిజమేనండీ! 'మా మంత్రాలు మరెవ్వరూ చదువ కూడదు, ఉచ్ఛరించకూడదు, అసలు తెలుసుకోకూడదు, అవన్నీ మా దగ్గరే రక్షణపొందాలి, మాకే తెలియాలి, మేమేపల్కాలి,' అంటూండే హిందూమతోద్ధారకులెంత అన్యాయం చేశారు."

"మన సాంచీ స్థూపం చూస్తున్నప్పుడు, మీతో అంటిని! జ్ఞాపకమున్నదా! మన హిందూ ఆచార్యులు స్త్రీలను, శూద్రులతో జమచేసి, వారికే విజ్ఞానము, వేదాలు, ఉపనిషత్తులు, అలాంటి గొప్పచదువులు అందించరాదంటూండే దౌర్భాగ్యము కల్గెనే! బుద్ధుని బోధలను అశోక చక్రవర్తి హృదయమార అవలంభించినారు గనుక, తన కుమార్తెనే, ఆఖరుకు, సాంచి ప్రాంతపు బిడ్డ, తన భార్య శ్రీదేవినే బుద్ధబోధల ప్రచారానికై సింహళానికి బంపిరి! ఆనాటి మనజాతీయ సంస్కారము, నాగరికత, స్త్రీపురుషుల సమానత్వపు శోభ యెంతిగా పెరిగెనో? వెల్గెనో!" అన్నారు.

"అందుకే నమ్మా, మహాత్ములు మీలాంటి వారందరిని వేలకువేలుగా ప్రజాసేవకై ఆహ్వానించినారు. కనుకనే మన మూల చట్టంలో స్త్రీ పురుష భేదములతో నిమిత్తం లేకుండా, అందరికి



వోటు, రాజకీయాధికార నిర్వాహణావకాశాలు కల్పించుకున్నాము" అన్నాను.

నేషనల్ మ్యూజియంకు వెళ్ళాము. దానిముందే అశోకుని శాసనభాగం భరిస్తున్న గొప్ప రాయి ప్రదర్శింపబడియున్నది. దానిపై తన హస్తము అద్దిరి, యెంతో ఆనందముతో - ఆనాటి నాగరికత వారికెంత ప్రీతి.

లోపల యెన్నో శిలాఖండాలు, వివిధ యుగాల నాగరికతా లక్షణాలు గుర్తింపుచేస్తూవున్నాయి! చూచాము తిరిగి. వరంగల్లు శిల్పాలు కాకతీయుల శిల్పాచార్యులు, శిల్పగ్రంథాలు, హెళెబిడు, మేల్కోటే, నల్లశిలలలోని, ఆ శోభనంపు సొమ్ములతో విఱ్ఱవీగుచున్న దేవేరులు, గాంధారమునుండి తేబడిన గ్రీకు సాంప్రదాయపు శోభలు. వాటిని చూస్తూ ఆమె అన్నారు. "రంగాజీ బ్రిటీషు మ్యూజియంలో పదిరోజులు, క్యూరేటరు సహాయంతో, మీరు నాతోటే ఓపికతో ఉండగా ప్రపంచ చరిత్రలు పిక్చరుసగా చూచే అవకాశం కలుగకపోతే, యీనాడు, యీ అందాల రాసులను, ఇంతగా ప్రేమించగలనా". నేను పొంగిపోయినా! "అందుకే గదమ్మా, విజయవాడ, నాగార్జున, అమరావతి మ్యూజియములను పెంచాలని శ్రద్ధ చేసితిమి; భట్టిప్రోలు స్థూపమును భద్రపరచుకొంటిమి - మన యువజనాల విద్యకై.

చిత్రకళా విభాగమునకు మరల పోతిమి. అంతఃపుర కథలెన్నిటినో ఆ రాజపుత్ర కళాకారులు, మొగలాయీల మీనియేచరుల (Miniatures) సాంప్రదాయములో తమ చిత్తరువులను వ్రాసిరి. వాటిని జెపూరు మ్యూజియంలోకూడా మేమిద్దరం చూచితిమి. నాతో నెమ్మదిగా పల్కుతూ "యూరప్, అమెరికా వారు ఈనాడు సముద్రతీరాన ఎలాగా విహరిస్తారో ఆనాడు ఆరాజులు, రాణులు తను దేవదాసీలున్నారనే సంశయములేకుండా ఆనందించారు కాబోలు. లక్ష్మీనారాయణ దేవళంకు వీలు కలిగిన

ప్పుడల్లా వెళ్ళేవారం. అచ్చట సాయంకాలపు సంగీత రాగాలాపన, భజనలు, అనుభవించే తీర్చాలి.

అందు చిత్రించబడ్డ శ్రీకృష్ణుడు, అర్జునుడు, అభిమన్యుడు, భీష్ముడు, వగైరాల చిత్తరువులు బాగున్నవి. "పాలరాతి కృష్ణుని విగ్రహాలు అంత హృదయాకర్షకంగా లేవు. తెల్లని శిలాఫలకం బాగానేయుంది. మొగము సొగసుగా, కరుణ రసమునుగాని, గాంభీర్యమును గాని అందించుటలేదు" అని వారితో అన్నా!

"సోమనాధ్‌లోని గీతామందిరములో హృదయానికి ఉత్తేజము కల్గించు మోహన కృష్ణుని స్ఫటికపు రాతివిగ్రహం చూచినానండి! స్వరాజ్య భారతంలో ఆ సోమనాధంను తిరిగి లేపాములే.

"జానాను. ఆ కృష్ణుని ఫోటో తెస్తిరిగదా! మనోహరంగా ఉంది. మన ప్రార్థనా మందిరములో గుర్తుకై నిల్పినాను" అన్నారు. భంగీ కాలనీలో మహాత్ముని చెంతనే. ప్రార్థనలు చేశాం. హరిజన కాలనీలో నాల్గువైపుల వాయుదేవుని ఆహ్వానిస్తున్న, అందమైన. ప్రార్థనా మందిరంలో 1935 నుండి అందిన బాపూజీ ప్రార్థనావతారాన్ని తలచుకున్నాము. సునేరి బాగువద్ద రోడ్డు ప్రక్కనున్న చిన్ని శివాలయంలో ప్రార్థనలు చేశాము. ఆమూలలో నున్న, బంగారు బొంగులు ఋషీశ్వరులుగా నుంటే. అక్బరు రోడ్డువెంట సాయంకాలపు వేళల మల్లెల, నైటుక్వీనుల సువాసనా పరిమళాల నెన్నోమారులు, ఎంతగానో అనుభవించాము.

—)o(—

# రెడ్ ఫోర్టు

రెడ్ ఫోర్టులో ఇప్పటికీ చూడ ముచ్చటగానున్న "దివానీ ఖాజ్" దర్బారు హాలుకు; ఎన్నో సారులు వెళ్ళితిమి. 1935లో మొట్టమొదటిసారి, అది యెంతో దర్జాగా కన్పించింది. చక్రవర్తి ఆసీనులగుచుండే మంటపం యెంతో యెత్తున నున్నది. క్రింద; జాగీరుదారులు; సుల్తానులు; రాజులు; మహారాజులట! ఐతే వారెవ్వరు కూర్చోడానికి హక్కుండేదా? నిల్చునే; వారివారి తాహతు ప్రకారం బారులు తీర్చుకొని; చక్రవర్తి ఆజ్ఞల కొరకై యుండేవారట. వెలుపల ఆవిస్తారమైన బయలులో; సాధారణ ఆఫీసర్లు తీర్చియుండేవారట. మధ్య మధ్యయున్న పెద్దలు; చక్రవర్తికి అర్జీలు అందించడం, వారి తీర్పులు సభవారికి తెల్పుతూ యుండేవారట!

"ఐతే యిది సభాంగణం కాదుగా" అన్నారు భారతీదేవి! కథల్లో, సినిమాల్లో హిందూరాజులు సింహాసనంమీద కూర్చుంటే, అంతంత దూరాన మిగతావారు మిత్రులు; పెద్ద, చిన్న రాకుమారులు; రాజులు ఆసీనులగుచున్నట్లు తెలుసుకుంటున్నామే! ఈ మొగలాయి చక్రవర్తుల వద్ద అలా యుండేదికాదా! అప్పుడు సభ్యుల సమానత్వమా? చర్చలు? ప్రశ్నలు? వుండేవా? సమాధానాలే! అదొక నిరంకుంశసభ్యత, ఈ సెంట్రలు అస్సెంబ్లీకి రాష్ట్రి అస్సెంబ్లీ జిల్లా బోర్డులో వలె అందరు సభ్యులు సమానంగా కూర్చుని చర్చించుకొనే సభ్యతలేదు. ఈనాడైనా మహారాజుల ఆస్థానాలలో అట్టి మర్యాద కన్పించడం లేదుగా" అన్నా.

మొగలాయి చక్రవర్తి మంత్రుల చర్యలు విమర్శించుటకు' బ్రిటిషువారు తమ రాజు ఛార్లెసును. చక్రవర్తి ఆజ్ఞల నధిక్షేపించడానికి ఆ కాలంలో ఎవ్వరికీ హక్కు లేదుగా! అందుకేగదా! బ్రిటీషువారు తమ రాజుచార్లెసును పదవీచ్యుతుణ్ణి చేయడం. జార్జిరాజుల కాలంనుండీ మాత్రమే యెదిరిపక్షమును రాజు గౌరవించి వివిధ విషయములపై చర్చించమని కోరడమనే సాంప్రదాయం ఏర్పరచడం జరిగిదని అనుకున్నాము.

"ఆ మొగలాయి రోజులలో మనం లేము, ఎంత అదృష్టం! అబ్బో! ఆ చక్రవర్తి ముందు, చేతులు కట్టుకొని మీరు నిలబడేవారా! అసలే తిరుగుబాటు ధోరణి! ఆ చక్రవర్తుల ఆగ్రహానికి మీరు క్షణంలో గురియైపోయేవారు! అప్పుడు నాగతి యేమైపోయేదో" అనుకున్నారు.

"అప్పుడూ మన మిద్దరం దంపతులమేగదా అన్నా!"

"కాక. మరి. అప్పుడూ ఇప్పుడూనూ! ఇదేగదా మన నమ్మకం" అన్నారు. "అవునమ్మా!" అన్నా!

మరో పర్యాయం ఆసభాంగణానికి వెళ్ళితిమి. అప్పటికి స్వరాజ్యం అందినది. ఆగద్దెపైన నెమలి సింహాసనముండెనట. దానిలో నవరత్నాలు పొదిగిరట! ఆఫ్ఘను పర్షియా ప్రాంతాల నుండి దండుతో వచ్చిన నా దిర్షా కాబోలు దాన్ని తీసుకుపోయిరని మా ప్రక్కనున్న వారన్నారు. "పీడ వదలిపోయిందిలే! అదే యుంటేదాన్ని "స్పీకరుకు యివ్వాలా, లేక రాష్ట్రపతికా? ప్రధాన మంత్రి కెందుకు తక్కువచేయడం" అనే చర్చ వచ్చేది! 'ఎవరికివద్దు. మ్యూజియంలోనే యుంచుదా' మనుకొనేవారం" అన్నా!

"ఈ రోజుల్లో, కాంగ్రెసు పార్టీలోనే యుంటూ, జవహరులాలుగారిని యింత తీవ్రంగా విమర్శించుతూంటారే. ఐనా మన



ఆస్థులు, పౌరసత్వపు హక్కు లేగాక, పార్లమెంటులో పెత్తనానికేమాత్రం ఇబ్బంది కల్గించటంలేదుగా! ఆ మొగలాయి చక్రవర్తుల ముందు మీరిట్లు నిలబడగల్గేవారేనా?"

"రాజకుమారులనే, నిలువున చంపించినారు గదమ్మా - కొంతగా విభేదించినందులకు, ఈ హాలులోనో, ఆబయలుననో, చక్రవర్తికి అయిష్టులైన రాజుల్నే గాదు. నవాబుల్నే గాదు, రాకుమారుల కళ్ళను పీకివేశారట! నిందితుల తలలను నరికివేసేవారట! ఇది యొక కసాయి దుకాణమే. అదివారి రక్త ధారల బలిపీఠమే"

"కనుక చక్రవర్తుల పెత్తనమే కాక, యీనాటి స్వదేశ సంస్థాన ప్రభువుల పాలనం పోవడంమంచిదే! పార్లమెంటరీ సాంప్రదాయం తెచ్చుకోవాలని కాంగ్రెసు నిర్ణయించుకోవడం, ప్రభుత్వ పక్షం, ప్రత్యర్థి పక్షం అనే పార్లమెంటరీ సాంప్రదాయం పెట్టుకోవడం బాగున్నది గదూ?" అన్నారు.

"అక్బరులాంటి చక్రవర్తులు పనికిరారా"? అన్నారెవరో!

"ఆయనేగా తనమాట నెదిరించిన జాగీరుదారును ఏ విచారణ లేకుండా, నిలువున చంపివేశారు" అన్నా!

"తన్ను పెంచి పెద్దచేసిన వజీరును అకస్మాత్తుగా తొలగించిరే పదవినుండి" అన్నారు భారతీదేవి,

"అదేగాదు ఒకరోజున ప్రధానమంత్రి! మరోరోజున ఫకీరనే ధోరణివారిద"న్నా!

"మొన్నచక్రవర్తిగా వచ్చినవారిని, యీరోజున నిలువునా గ్రుడ్డివాణ్ణిగా ఈ దర్బారుహాలులోనే చేసినారట!! ఏమోనండీ! యీ దర్బారుహాలు ఎన్ని దౌష్ట్యాలకు సాక్ష్యమిస్తున్నది? ఆపీడాకారపు రోజుల్లో మనం లేము! ఐతే, మన పూర్వీకులు ఎన్ని బాధలు పడ్డారో? ఎంతభయమో! ఎలా బ్రతికారో! తలచుకుంటే దుఃఖము కల్గుతుం" దన్నారు ఆమె!

"ఆ మొగలాయి చక్రవర్తులు పోయినారు. కాని! వారు నిర్మించిన, చక్రవర్తిత్వపు భారతీయ ఐక్యతకు, ఏదో యొక విధంగా, చిహ్నంగానున్న యీ రెడ్ ఫోర్టు, (ఎర్రకోట) మీద మాత్రం మనకు ఇంత మమకారం యుంటున్నదిగదా!" అన్నాను!

"ప్రక్కనేయున్న ఇంద్రప్రస్థమీద కూడ మనకు ఎంతో గౌరవముండీ" అన్నారు ఆమె!

"నిజమే, నేతాజీ 'యీ కోటను పట్టుకుందాం పదండి ముందుకు' అని ఆజ్ఞాపించారు. ఐ.యన్.ఏ. సైన్యాలకు! స్వరాజ్య సాధన ఐన ఆగష్టు పదిహేను ఉత్సవాన్ని ఈకోట పెద్ద బురుజు మీదనుండే జవహరులాలు సాగించినారు."

"ఈ కోటలోనేగా, బ్రిటిషువారు మన ఐ. యన్. ఏ. వారిపై విచారణ జరిపారు." అన్నది పుష్ప. అలాగా చరిత్ర యెంత బలంగా మన హృదయాలను పట్టుకుంటుంది! 185 లో యీ కోటను పట్టుకునేగదా.' బహదూర్ షాను బందీగా చేసుకొని, విక్టోరియాను మనదేశపు చక్రవర్తిగా బ్రిటిషువాళ్ళు ప్రకటించారు. అందుకే మనం దీనిపై స్వరాజ్య భారతాన్ని ప్రతిష్ఠించుకున్నాం!

"ఏమి భారతావనిలే! ముక్కలుగా చేసుకున్నాముగా!" అన్నారు భారతీదేవి!

"అందినంతవరకే మన భారతదేశం" అన్నా!"

"అలాగే నన్ను అనుకుంటారా!"

"లేదు లేదమ్మా! నీవు నిండుగా నాకు అందినావు, దేవుని దయవల్ల! నీ ధర్మపాలనానికి తగినట్లు మనరైతాంగం, మన ప్రజలు మన సలహాలను గ్రహించడం లేదనే నా బాధ!"

"ఐతే యెల్లప్పుడూ మనం ఈ ఢిల్లీకి ముడిపెట్టుకోవడమేనా! మన చరిత్రను వాల్మీకి, వ్యాసులు వ్రాస్తున్నప్పటినుండి యీ ఢిల్లీ పరిసరాలే ఇంత కొంపదీస్తున్నవిగదండీ? ఏమి, దక్షిణ-



ఉత్తరాలమధ్య ప్రదేశంలో మనదేశపు రాజధాని ఉంటే రక్షణ, బలంగాదా?" అన్నారు! అప్పుడేమో ఆఫ్ఘనిస్తాను, ఇరాన్ మధ్య ఆసియాల నుండి, ఇప్పుడు పాకిస్తాను, చైనాలనుండి వచ్చే దాడులకు ఢిల్లీ యింతదగ్గరే!

"ఎంతగా ఎన్నిమారులు చెప్పినా యీ జవహరు లొప్పుకోవడం లేదమ్మా! ఈ ఉత్తరాదివారికి ఢిల్లీబాగా రాచకీయ పెత్తనానికి అనువుగా ఉంది.

"దక్షిణాదివా రెప్పుడైనా యీ ఢిల్లీలో ఈ దేశానికి ప్రధానమంత్రి కాగలరా? ఎప్పుడో చోళ రాజరాజు గంగమ్మ వరకు అందుకున్నారట!

"అంతదూర మెందుకులే! దేశవిరోధుల దాడులకైనా దూరంగావుండాలిగదా! చైనావారి దాడి వచ్చినప్పుడు ఏమన్నారు జవహరులాలుగారు! ఒక్కగంటలో, వారి విమానాలు ఢిల్లీపైకి వచ్చి బాంబులువేసి, మనల తారుమారు చేయగలరని వాపోయినారు! వాటి నెదుర్కొనటానికి తగినంత శక్తిగల శతఘ్నులు ప్లేనులు లేవన్నారు! అవి రాబోయే ముందు కనుగొనడానికి తగినన్ని రాడారులు లేవన్నారు.

"అప్పుడైనా రష్యావారు రెండో ప్రపంచయుద్ధకాలంలో మాస్కోకు తోడు మరొక రాజధాని నిర్మించుకొన్నట్లయినా మనం చేస్తే బాగుండును గదా?"

"అందుకేగదమ్మా! నేను ఆయన్ను వూపేసింది. "మరో దేశంలో అయితే, ఇలాంటి నిర్వీర్యపు దూరదృష్టిలేని ప్రధానమంత్రిని డిస్మిస్ చేసేవారు' అని సవాలుచేసితి. పదిహేడు సంవత్సరాలు పెత్తనం చేసినా, దేశానికింత పరాభవం తప్పక పోయుండే యీ పార్టీ యీ ప్రధానమంత్రినే శిరసావహిస్తున్న దౌర్భాగ్యం కల్గుచున్న"దంటిని

"అవునండీ యెంత ధైర్యంగా పల్కితిరి! ఆ తెంపు మరెవరికీ లేకపోయెనే!. ఎందుకుంటుంది? ఏదో పదవో, మర్యాదో కావాలనుకొనే వారేగా వారి పార్టీలో నున్నది. కాంగ్రెసువారెవరైనా మిమ్ము బలపరచగల్గిరా?"

"ఏమైనా ఆయన మన ప్రజలు, మనం ప్రేమించే మన జవహరులాలేగా! ఆయనే ఏ మొగలాయి చక్రవర్తో హిట్లరో, స్టాలినో అయితే, మీరంత సవాలుచేసినందుకు ఏమిచేశేవారో! అదండీ! ఆయన గొప్పతనం, మనదేశపు అదృష్టం! ద్వితీయ యుద్ధానంతరం ప్రపంచ వాతావరణం ద్వారా అందిన చరిత్రలో ప్రజాబలం! ఎదిరి పక్షాన్ని అంగీకరించారు. నిల్వనిచ్చినారు. ఎదిరి మాటాడువారిని బ్రతుక నిచ్చినారు.

"ఈ ప్రజాస్వామ్య ధర్మాన్ని యీ రెడ్ ఫోర్టుమీద ప్రతిష్ఠాపించినాములే! ప్రతి పక్షములలో బలమైన పార్టీని పెంచుకు రాగల్గుచున్నామనే తృప్తి ఉందమ్మా!"

"ఏమి ప్రతిపక్షములే! ఆ బొంబాయివారిని, యీ మాజీ రాజులను చేర్చుకొంటేగాని, దానికొక బలం కల్గలేదాయెను! మన రైతు కూలీలు యీనాటికి, మీకుగాని, రాజాజీకిగాని యింత మాత్రపు బలమైనా ఇవ్వలేకున్నారు."

"వారికొరకే యీ పార్టీ యేర్పరచితిరి! వారేమో మిమ్ములను మనపై నిండుహృదయం లేనివారిపై ఆధారపడే గతి కల్గిస్తున్నారు. మిమ్ము పదేపదే పడేస్తున్నారు! అబ్బ! విసుగుగాదా?"

"అదేనమ్మా! చరిత్ర గతిలో ముందు బడేవారికి కల్గే బాధలు"

పూర్తిగా ప్రజాస్వామిక పార్లమెంటరీ రాజ్యాంగం కావాలనుకొనేవారితో బలమైన ప్రతిపక్షం యేర్పరచ గల్గుతామా!



నాకు నమ్మకం కల్గడంలేదు. రాజాజీ ఇంకెన్ని దశాబ్దాలుంటారు. మనకు మాత్రం వయస్సు పెరగడంలేదా? ఈలోపల డిక్టేటరుషిప్పు తప్పదనే కమ్యూనిస్టు త్వరితంగా పెరిగిపోతూ, వారే ప్రధానమైన ప్రతిపక్షము కావచ్చునే! రకరకాల వారిని కలుపుకున్నా ప్రధాన ప్రతిపక్షమై కాంగ్రెసుకు బదులు మనమే రాజ్యాధికారాన్ని అందుకోగలమా! ఈ కోటీశ్వరులను, రాజులను కాంగ్రెసే కొంత అదుపులోవుంచగల్గునేమో? మనకు సాధ్యమా? అన్నారు

"ఆ భయాలన్నీ యుండే కాంగ్రెసును పోగొట్టుకోకుండా, యీ రాజులు, పెట్టుబడిదారులకు లోబడకుండా యుండాలంటే, ప్రజాస్వామ్య పక్షాలన్నీ చేరి, జాతీయ ప్రభుత్వం ఏర్పరచుకోవాలంటున్నా! ఈ ఆలోచన రాజాజీకి అంగీకరిస్తూన్నారు. అయితే, జవహరులాలుగారు అంగీకరిస్తారా! లేదు. అందుకేగా నేను ఆయనను ఎదిరిస్తున్నది" అన్నా.

ఈలాగా ఎన్నెన్నో ఆలోచనలను అటు యిటు సాగిస్తూ, యమునానదీ జలాలపై వెళ్ళుచున్న సూర్యకాంతులను చూస్తూ ఎర్రకోట యాత్రను సాగించినాము. అదే! భారతీదేవియొక్క తుది చూపులైనవి, ఆ కోటపై.

—:o:—

# స్త్రీలు రాజకీయం

స్వరాజ్యం వస్తూనే, శ్రీమతి విజయలక్ష్మిని, యునైటెడ్ నేషన్స్ ఏర్పడుటకుగా పిలువబడిన సభకు, భారతదేశపు డెలిగేషన్‌లో ఒక సభ్యురాలుగా, బ్రిటిషువారే పంపిరి. ఆమె ఫ్రాన్సిస్కోలో జరిగిన సభలో మహాత్ముడు కాంగ్రెసు ఆశయాలకనుగుణంగా ప్రపంచ శాంతిని సాధించుటకై, ప్రపంచ సమాఖ్య 'యునైటెడ్ నేషన్' వుండాలనిరి. అంతటి స్థాయిలో భారతీయ వనిత వ్యవహరించుట భారతీదేవికి ఆనందము కల్గించెను. అటులే క్రమ. గా' స్త్రీలు మంత్రి వర్గములో చేరడం! గవర్నరులుకావడం, ముఖ్య మంత్రులుగా వ్యవహరించడం, ఆనందం కల్గించింది.

తానై 1936తోనే జిల్లాబోర్డు సభ్యులైరి పోటీ లేకుండానే. జాతీయ ఆదర్శముల కనుగుణంగా వ్యవహరించిరి.

తిరిగి 1946లో మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వం ఆమెను రాష్ట్రవిద్యా సలహా సంఘమందు సభ్యులుగా పిల్చిరి. అప్పటి వైస్ ఛాన్సలరు రామలింగారెడ్డిగారి మెప్పుల బొందిరి. ఆడబిడ్డల చదువుల నెలా అభివృద్ధి పరచాలో వివరించుచుండిరి.

1952, 1970 సార్వత్రిక పార్లమెంటు ఎన్నికలో ప్రజాస్వామిక ప్రత్యర్థి పక్షము పేర మా అందరి బలవంతా మీద నిలబడిరి. కాని 'విజయలక్ష్మి మాకు దక్కలేదు. భారతీదేవి నిరుత్సాహ పడలేదు. ప్రజలింకా బలహీనులుగానే యున్నారు. ప్రాథమిక విద్యగూడా పొందని ఓటరులు, డబ్బూ అధికారం లేని మనలను గుర్తించకపోతే దగులెందు కన్నారు.



1958లో ఆంధ్రరాష్ట్ర శాసనమండలి సభ్యులుగా ఎన్నుకోబడిరి అప్పటి కాంగ్రెసు సంఘము, తాముగా శ్రద్ధతో వారిని నిలబెట్టుకొనిరి. ఆమె నామినేషన్ ఫారంమీద సంతకం పెట్టుటమినహా, మిగతా ఎన్నిక భారమంతా మండలి సభ్యులే నడపిరి. తమవద్ద రాజకీయ చదువులు పొందుచూ, తమ ఆదరణ, ఆశీర్వాదములతో పైకెదిగివచ్చిన అసెంబ్లీ పెత్తందార్లెందరో, తన ఎన్నిక విషయమై తగిన శ్రద్ధచేయకపోయారనే రిపోర్టులు తనకు అందినా, ఆమె వారి యెడల మాతృభావముననే వుదారులై వుండిరి.

వారు సభ్యులు కావడంతోడనే ఆమెను మంత్రివర్గంలో చేరనివ్వవలసినదని, కేంద్రరాష్ట్ర ప్రముఖులగు మంత్రులు నన్ను వత్తిడిచేసిరి. ప్రముఖ ఆంధ్ర దైనిక పత్రిక సంపాదకులు ఆంధ్ర మంత్రుల తరఫున నన్ను ప్రత్యేకంగా కోరుచుండిరి. వారితో నేను సంప్రదించితే "మనకెందుకీ మంత్రిత్వ పెత్తనాలండీ! మనవద్ద తయారైనవారు మంత్రులైతే, వారికి సలహాలు మనము ఇస్తూ; వుండే భాగ్యం పొందాలనుకున్నాం. కొంతగా ఆ అదృష్టం పొందినాం. తగినంతగా ఆసక్తి కలుగకపోతున్న"దన్నారు.

నేనేదో అడ్డగిస్తున్నా ననుకున్నారు ఆ సంపాదకులు, కేంద్ర మంత్రులలో కీ॥ శే॥ వల్లభపంత్, లాల్‌బహదూర్ శాస్త్రిగారలు! కనుక వారే దేవీజీతో సంప్రదించిరి. "ఆమె ఒప్పుకుంటే మీకు అభ్యంతరం వుండదుకదా! ప్రతిఒక్కమారు మీరేల అడ్డగిస్తారు?" అన్నారు వారు. వారిని ఇటు హైద్రాబాదులో, అటు ఢిల్లీలో సంపాదకులు, వారి స్నేహితులుకూడా కలిసిరి, మా స్నేహితులు కూడా వారిని కోరుచుండిరి. ముందుగా మీరు చేరితే పిమ్మట మన బృందానికి బలం పొందగల మంటున్నారు.

దేవీజీ: మంత్రి పదవులకై నేను తర్ఫీదు బొందితినా? మంత్రులుగా వ్యవహరించ దగువారిని రంగాజీ తయారు చేస్తుంటే వారికి ప్రోత్సాహం, నైతికబలం అందించ ప్రయత్నిస్తూ వుంటిని.

మా బిడ్డలుగా వుంటున్న వారు మంత్రులై ప్రజాసేవచేస్తూవుంటే. మా ఆశయమగు రైతు కూలీ ప్రజారాజ్య సాధనకై కృషిచేస్తూ వుంటే చూడగల్గు భాగ్యమే మేము కోరేది.

సంపాదకులు: వారేగాక మిగతా కాంగ్రెసు మంత్రులు గూడ మీ ఆశయ సాధనకై, నైతిక స్థాయిలో వ్యవహరించడానికి, మీరు మంత్రివర్గములో వుండడం మా అందరికోరిక. ముఖ్యులగు మంత్రులకు మీపై గౌరవం కలదు మిమ్మెల్లానైనా ఒప్పించ మంటున్నారు. నామాట వినండి!

దేవీజీ: మీపై మా ఇద్దరికీ గౌరవం. మీరు ఇంతటి సంపాదకులని రంగాజీ గర్విస్తూ వుందురు. ఈ మంత్రివర్గంలో చేరాలనే ధోరణిమాకు లేదు. పైగా ఎందరికో తమకు మేము అడ్డం వస్తున్నామనే భయం గల్గించడం ఎందుకండీ!

సంపాదకులు: తానే వస్తామన్నారు మంత్రులు మిమ్ము ఆహ్వానించడానికి, మీ ద్వారా వివిధవర్గాల సామరస్యం సంపాదించగల మంటున్నారు.

దేవీజీ: మా వారు ముగ్గురైనా మంత్రివర్గం లోనికి ఆహ్వానింప బడడం న్యాయం. నన్నొక్కరినే పిలిస్తే ఏమి ధర్మము!

సంపాదకులు: ముందు మీరు చేరితే, క్రమంగా వారిని కూడా ఆహ్వానించుతారు.

దేవీజీ: ఇంతవరకు మా కృషీకార్ లోక్ వారిపై క్రోధం పొంది వారెవ్వరినీ పిలువక పోయిరి. ఇప్పుడు నన్ను పిల్చుటవల్ల, వారిని కించపరచడమో, లేక వారిని ఆపిమ్మట పిలువక పోవడమో జరుగవచ్చు. వారి కొఱకై రంగాజీ నేనూ శ్రద్ధజేస్తూ వుంటిమి గదా! ఇప్పుడు నన్నేల ప్రత్యేకంగా పిలుస్తున్నారో!

స్నేహితులు: వారివారి మధ్య మనస్పర్థలు ఏర్పడినవి. అవి నమసిపోయి, పరస్పరంగా తిరిగి సుహృద్భావం పెరిగి, అందరూ



కలిసిపోవుటకు, ముందుగా మీరు చేరితే, కాంగ్రెసు మొత్తం బలం పొందును. మీరు మీవారిని క్రమంగా అందరిలో పెద్దలుగా చేర్చుకోవచ్చు గదా!

ఆ సంప్రదింపులు అలాగా సాగుతూ వుండగానే, జవహరులాల్జీ రైతాంగముపై, సహకార వ్యవసాయ ప్రణాళికను - బ్రహ్మాస్త్రాన్ని విసరజూస్తున్నారు. దాన్ని బలంగా నేను వ్యతిరేకిస్తున్నాను. ఎలాగైనా భారతీదేవిని ఆంధ్ర మంత్రివర్గములో చేర్చితే, వారిద్వారా మరికొందరు కృషీకార్ లోక్ నాయకులు, ప్రధానంగా లచ్చన్న, ఓబుల రెడ్డిగారలనుగూడా చేర్పించితే, జవహరు-రంగా వివాదం విపరీత పరిణామాలకు దారితీయకుండునని యిటు ఆంధ్రమంత్రులు, సంపాదకులు, అటు పంత్, శాస్త్రి తలంచుచుండిరి కాబోలు.

అప్పుడు పంతుగారు నన్ను చేరి "నీవైనా ఒప్పించు భారతీదేవిని, ఆమె ఇప్పుడు మంత్రివర్గంలో చేరితే, ఆ పిమ్మట; ఉభయుల ప్రతిష్ఠకు అనుగుణంగానే, ఆమె కోరినట్లే, శ్రీలచ్చన్న ఓబులరెడ్డిని మంత్రులుగా పిల్చుకోవచ్చు"నన్నారు. "వారిద్దరినీ గూడ ఆమెతో బాటే పిల్చితే మర్యాదగదా అన్నాను. ఆపైన, అసలు ఆమె మంత్రివర్గములో తానుగా చేరుటకు అంగీకరించడం లేదుగా" అంటి.

"అటు సంజీవరెడ్డి, యిటు లచ్చన్న వర్గైరాలు పరస్పరంగా తమతమ ప్రతిష్ఠలకై వున్నారు. ఎవ్వరికీ ఒత్తిడిలేకుండా; అందరిని ఒక దారికి తేవాలిగదా! ఎల్లరి ప్రతిష్ఠ నిల్పగల్గింది భారతీదేవియేనని నా నమ్మకం," అన్నారు లాల్‌బహదూరు. "అదీ అసలు విషయం" అన్నారు పంతుగారు.

పంత్ జీ: నీవే అడ్డమని నాభయం. ఎందరో అన్నివైపుల వారు, మమ్మెందుకు పిల్వడం మని వివాదపడుచున్నారుగదా! భారతీదేవిని మంత్రివర్గంలో చేర్చాలి. ఎందుకింత ఆలస్యం అగుచున్నదని చిరాకు పడుచున్నారు జవహరులాలు.

"నేను అడ్డం రావడంలేదు. కాని మిగతా మా వారిని ఎందుకు పిలవడంలేదు? ఒక ప్రక్క భారతీదేవిని మంత్రిగా చూడాలనుకుంటూ, జవహరులాలుగారు రైతులపై ఈ ఆయుధాల నేల తయారుజేస్తున్నారు?" అన్నా. 'కాదంటివే, నీవేల ఆమెను ఒప్పించరాద"ని అన్నారు ఆయన.

భారతీదేవి: అంత భారం నాపై మోపితే యెలాగా! మా వారా, 'తమ్ము. మంత్రులుగా ఎందులకు ఆహ్వానించడంలేదు. తమకు నైతిక హక్కులేదా? మిగతావారికంటె రైతాంగ రక్షణ ప్రధాన బాధ్యతగా చూచుకోవడమేనా తాము జేసిన పాపం' అనుకుంటున్నారు. వారు, వీరు యువకులు. పట్టింపులు, రోషాలుతో వుంటున్నారు. వారికి పెద్దలుగా వ్యవహరిస్తున్న, మేమూ, మనం వుదారంగా వుండవద్దా! ఈమంత్రి పదవి మాకు నాకు అంతపెద్దదా? ముఖ్యమా? అది లేకుంటే మాకు మర్యాద మన్ననలు అందవా?

పంత్ జీ: అలాగా అన్నానా! మీకున్న నైతిక శక్తి మాకందరికీ బలంగా వున్నది. మీవల్ల మంత్రివర్గానికి బలం కల్గిద్దామని. మంత్రిత్వంవల్ల మీకు ప్రతిష్ట వేరే కలుగవలసినది లేదు. అయినా బలం కల్గుతుంది. అది దేశానికి కూడా మంచిదమ్మా!

"మీరే వారిని పిల్చి అడుగరాదా! మేమంతా రైతాంగ సేవకులం. మాతో ఉండేవారు రైతు రక్షణకై కంకణం కట్టుకున్నవారు. అందుల్కే ముందుగా వారిని మంత్రివర్గంలోకి చేర్చవలెనని పట్టుదల" అన్నా. సరే భారతీదేవిగారు పంత్ జీని, వారికై ప్రత్యేకంగా ఏర్పరచిన విందులో కలిసిరి. అన్ని విషయాలు చర్చించిరి.

పంత్ జీ: మీరు మంత్రిగా జేరితే, మీ రైతాంగ వాదనను బలపరచుటకు, మీతో ఇదివరకు చేరివుండి, మీయందు ప్రత్యేక భక్తి కల్గివున్న, శ్రీ తిమ్మారెడ్డి, వగైరాలు మిమ్ము బలపరుస్తారు. కొలది వారాలు లేక మాసాలలో శ్రీ లచ్చన్న,



ఓబులరెడ్డికూడా చేరుతారు. మీ అందరి ఆసరా చూచుకొని, రైతుల గురించి హృదయం కల్గియున్న మా పెత్తందారులు, జవహరులాలుతో సహకార వ్యవసాయం గురించి సమాధానం కొరకు ప్రయత్నం చేస్తారు. అప్పుడు మీరు కోరుకున్నట్లే, రైతు రక్షణ సాధించడానికి, జవహరును సమాధాన పరచడానికి మాకు కూడ సులభమగునమ్మా! నామాట విను! నీవు మంత్రివైతే చూచుకోవాలని నాకెంతోగా వుంది. శాస్త్రికి అంతే. నమ్మ. జవహరులాలుకు రంగాపై గౌరవం, ప్రేమవున్నది. నీపై ఎంత గౌరవమో ఊహించలేవు

భారతీదేవి: మీ కందరికి నాపై ఇంత అభిమానం వుండడం నా అదృష్టం. అంత యోగ్యత నాకేమున్నది. ఏమైనా, ఒకవంక రైతు రక్షణకై, అవసరమైతే, బహిరంగంగా పార్టీనివదలి, జవహరు నెదిరించడానికి రంగాజీ; ఎన్నైనా సహకార వ్యవసాయం ప్రవేశపెట్టాలి జాతీయ పథకంగా - అని జవహరులాల్ జీ పంతం పట్టుచుంటే, ఈ మధ్య నేనేల మంత్రిగా రావడం.

పంత్ జీ: అంత మాత్రమేనా. నీవు చేరితే, ఆంధ్ర సమస్యయేగాదు, అఖిలభారత సమస్యగూడా సర్దుబాటు అవుతుందనే నేను శాస్త్రి భావిస్తున్నాం.

భారతీదేవి: మీరు పెద్దలు, వయస్సులో, అనుభవంలో. కాని యీ మంత్రిపదవి నాకేల! ఎందరో మంత్రులకు దారిచూపగల్గు తర్ఫీదు, అనుభవము, ఆశయాలు గల్గిన రంగాజీయే, మంత్రివర్గంలో చేరకున్నప్పుడు, నేను చేరడంలో స్వారస్యం ఏముంది!

పంత్ జీ: ఆయన్ను ఇప్పుడు కూడా తనతో చేరమంటున్నాడు జవహరులాల్ జీ! రంగా మొండిమనిషి. ఆ విషయాలు వారిద్దరివే. నీవైనా మాకు తోడు కాకూడదా! రంగాకు ఇష్టము కాదేమోనని భయపడుచున్నారా?

భారతీదేవి : మా ఇద్దరిది ఒకే ధోరణి, దారి. కాకపోతే వారు కఠినంగా పల్కినప్పుడు నాకు అన్నిమాటలు రావు గనుక, స్త్రీని గనుక, నెమ్మదిగా ఉభయులతో తృప్తికరంగా పల్కుచుండవచ్చు.

పంత్ జీ : నీవు మంత్రివైన తరువాత, జవహరులాలు రంగా సమాధాన పడవచ్చు. ఒకవేళ సమాధానం అందకపోయినప్పుడు రాజీనామా చేయవచ్చు. అప్పుడింకా అదనం బలం రంగాజీకి కల్గుతుంది గదా!

భారతీదేవి : మీరు తండ్రిలాంటివారు. ఇంత వయస్సులో ఇంత జబ్బుతోకూడా, యింతగా మాతోచే రైతుల ఆదరిస్తూ యీ మంత్రిపదవిలో వుండడం సాధ్యమగుచున్నదిగదా! నేను మంత్రిపదవిలో చేరి, ఆ అధికార పటాటోపములు, సేవా కార్య సాధనావకాశాల తియ్యదనం అనుభవిస్తూ, రంగాజీ పిలుపును త్వరితంగా వినుకోలేక పోవచ్చునేమో! ఎందుకింత పరీక్ష నాకు పెట్టుతారు. మీరు, జవహర్ లాల్జీ, శాస్త్రీజీ, హైద్రాబాదు మంత్రులు సంపాదకులు నన్ను మంత్రిగా ఎన్నుకోవడం కంటె మరేమికావాలి. అది వద్దనుకునే మర్యాద నాది.

పంత్ జీ : మీ రిద్దరూ, ఆదర్శ దంపతులని పత్రికలవారు వ్రాశారు. ఇప్పుడు చూస్తున్నా. మీకు శుభం కలుగాలి. పోనీ ఒక్కమారు జవహరులాల్ జీని కలియమంటున్నారు.

భారతీదేవి : మీకే నా సమాధానం కష్టం కలిగిస్తున్నది. ఇంక వారి నెందుకు కలియడం! వారితో నేనా చర్చించేద. కష్టం కల్గించడం, వద్దండి. వారికి 'రైతులు అభివృద్ధి నిరోధకులు కారు, వారుగూడ సోషలిష్టులే' నని నామాటగా చెప్పండి.

ఇలాగా, సరీగ్గా ఈ మాటల్లో కాకపోయినా, ఈధోరణిలో వారి సంభాషణ సాగింది. తుదకు అప్పటి మంత్రివర్గమందు 'కీలక స్థానము నెందున్న మంత్రి సరాసరి నాకే ఢిల్లీకి టెలిఫోను చేసిరి.



ఎలాగైనా భారతీదేవిని ఒప్పించమనిరి. 'ఆమె తానొక్కరుగా మంత్రి వర్గమందు చేరుట కంగీకరించడం లేదు. తాను చేరకున్నా, మిగతా ఇద్దరినీ చేర్చుకోమంటున్నారని సమాధాన మిస్తిని.

ఇక స్థానికంగా వున్న మిత్రులు ఎంతో ఆందోళన పడుచుండిరి. ఆమె చేరితే, తమకు సన్నిహితులైన యువనాయకులు మంత్రులు కారేమోనని కొందరు, ఇదివరకు మంత్రులై వుండి, అప్పటికి మంత్రి వర్గముపై పెత్తనం చేయువారితో తమ పంతం చెల్లితేనే సరి అనుకుంటున్నవారు; వారి స్నేహితులు, భారతీదేవి గారు ఏల ఈ మంతనాలలో చేరాలి, అని అనుకున్నవారు కొందరు వుండిరట!

ఈలాంటి వడగాల్పులు, అధికార కాంక్షవల్ల గల్గిన వైపరీత్యపు బాధలు, అవేవీ ఆమెను అందుకోలేదు. స్వధర్మపాలనయే ఆమె లక్ష్యం. బీదప్రజల సేవయే ఆమె వ్రతానుష్టానం. అలా ఆదర్శప్రాయంగా అందించబడ్డ, అందుచున్న మంత్రిపదవిని వలదన గల్గినారు. మంత్రిగావున్నవారు, సుహృదయులై, ధార్మిక దృష్టితో బీదజనాల రక్షించుటకై ఎంతయినా శక్తివంతంగా మేలు, సేవ చేయుగలరని, నాతోబాటు ఆమె విశ్వసించిరి. అయినా, ఆపదవికై అర్రులు సాచుట, ఇతరుల వంచించుట, పై వారివద్ద భంగపడుట, తోడుగా వున్నవారి అవసరాల, కోర్కెల ఆశలను అలక్ష్యపరచుట, వారి ధోరణి కానేకాదు.

ఆమె అలాగా స్వధర్మ పాలనం చేయగల్గిరి. 1959 జూన్ 4వ తేదీన జరుగు మద్రాసు సభకు నేను వెళ్ళుచుంటే, "రైతు రక్షణకై కాంగ్రెసును వదలినా పరవాలేదు. కాని వేరే పార్టీ పెట్టరాదు! దాన్ని నడుపలేము. మనతో వస్తున్న వారు దాన్ని నిలిపి, పోషించగల్గిన నైతిక, ఆర్థిక, రాజకీయశక్తి కలవారు కా"దని హెచ్చరించిరి. అయినా స్వతంత్ర పార్టీని స్థాపించడం, దానికి రాజాజీ గురుత్వం వహించడం, నేను దానికి ప్రథమ ప్రెసి

డెంటు కావడం జరిగింది. ఆమెకు ఎంతో బాధ కల్గింది. అదివొక పిడుగు పాటుగా వుండినది. అయినా రాజాజీ ఆశీర్వాదం కల్గిందనే కొంత ఓదార్పు అందుకున్నారు. రైతాంగపు స్వంత ఉద్యోగం, స్వాతంత్ర్యంకొరకేగదా, తన రంగా ఇంత సాహసిస్తున్నది! సరే నంటూ కాంగ్రెసునుండి, శాసనమండలి కాంగ్రెసుపార్టీ, శాసన సభల ప్లానింగ్ కమిటీనుండి వెనువెంటనే రాజీనామా యిస్తూ, అలాగా అధికారం తన్ను వెన్నంటినా, తానుమాత్రం అధికారాన్ని ఆహ్వానించక, లోబడక, శ్రామిక జనాలస్వాతంత్ర్యమును వొక దేవతగా ఆరాధిస్తూ వుండగల్గిరి భారతీదేవి. ఏకొలది మంది దేశభక్తులకో, ప్రజాసేవకులకో అట్టి, అంతటి ధర్మపాలనావకాశం, ఓర్పు, యోగ్యత, వుదారత అంద గల్గును.

స్త్రీలు రాచకీయంగా సేవలు చేస్తూ ఉండాలనుకున్న భారతీదేవి, తన శక్తికొలది శ్రమించారు. రాజకీయ జీవితమందు నైతిక స్థాయిని పెంచుతూ రాణించినారు.

కాని ఆమె **త్యాగములు, సేవలు,** నైతికంగా వ్యవహారములు సాగించు ధోరణులకు **తగినట్లు** ఓటరులు ఆదరించనిమాట నిజమే! అందుకు ఎందరో బాధచెందుచుంటిరి. 1952, 70లో వారు సార్వత్రిక పార్లమెంటు ఎన్నికలలో ప్రజాస్వామిక ప్రత్యర్థి పక్షము తరఫున రైతాంగముపేర నిలబడిరి. గెలువు నందుకోలేక పోయిరి. కాని ఆమెకు ప్రజల యెడల విశ్వాసము పోలేదు. "వారేమి చేయగలరు. చదువులు లేవాయె. ఆర్థిక బలహీనతలు క్రుంగదీస్తుండెను. యుగయుగాలనుండి, ఏదో ఒక స్థాయిలో అధికారంలో వున్నవారికి లొంగి వుండే అలవాటే మన కష్టజీవులందరికి, ఆపైన హరిజనులకు, వెనుకబడ్డవారికి గ్రామాల్లోవున్న పెద్దల పలుకే బంగారమగుచుండెను. అకస్మాత్తుగా ఈ వోటు వచ్చినంత మాత్రాన, అన్ని అధికారాలను వదులుకుంటున్న మనలను ఎట్లా



బలపరచగలరు" అనేవారు. 1970 ఎన్నికల్లో కూడా కష్టజీవులు హెచ్చుగా ఇందిరమ్మ పార్టీనే బలపరచుటకు ఆమె ఆశ్చర్యపడలేదు. "ఆమెగారే ప్రధానమంత్రియై! ఆశలు అందిస్తూవుండిరి. అధికార పార్టీ ప్రజలకు ఆశలు కలిగిస్తే, ప్రజలు వారివైపుకే మొగ్గరా! చదువులు, భాగ్యాలు కలవారే ప్రభుత్వ పక్షాన్ని బలపరుస్తుంటే, యింతకూ ప్రజాస్వామ్యం అన్నమాటలలో వున్న ఆలోచనా ప్రభావం ఎందరికి తెలుస్తుంది. 1952లో కమ్యూనిస్టులకు ఓటిస్తే, ఏదో కొంత పొలం పశువులు అందుతవనుకున్నారు. వారికి అధికారం రాకపోయేసరికి, ఆదారి లాభం లేదనుకొని స్థానికంగా అధికారం సాగిస్తున్నవారి మధ్య మెలుగుతూ వచ్చినారు. ఇప్పుడు ప్రధానమంత్రే ఆశలు చూపెట్టితే, వారికి వూపు కల్గింది, ధైర్యం వచ్చింది. మనందరిప త్రోసి రాజని వారిని బలపరచుకున్నారు.

ఎవరో అంటూ వుండిరి - "ఇక ఎప్పుడు ప్రత్యర్థి పక్షానికి మన లేబరు ఓటువేసేది ఆ ఇంగ్లండులో మాదిరి?" "అదే రంగాజీ వేసుకొన్న ప్లానుల్లో బలహీనత. ఇంగ్లండులో కూడా యాభై ఏళ్ళు పట్టినది-చదువులున్న లేబరు అధికారాన్ని అందుకొనడానికి ఈ బ్రిటీషు పద్ధతి మనకు సరిపోదని రంగాజీకి 1967 నుండి చెప్పుతున్నారు."

"అందుకే గదమ్మా! నేను 1960 నుండి ప్రజాస్వామిక పక్షాలన్నిటిని చేర్చి మిశ్రమ ప్రభుత్వము కావాలంటున్నాను" అన్నా.

"అదే మంచిది. జాతీయ ప్రభుత్వం కేంద్రములో, అన్ని పార్టీల సంయుక్త ప్రభుత్వాలు రాష్ట్రాలలో వుంటే ఏపార్టీకి ఓటుచేసినా తమకు ప్రభుత్వములో భాగముంటుందనుకుంటారు బీద ప్రజలు. అప్పుడు వివిధధోరణులు గల పార్టీల వారందరిని ప్రజలు తమకు తోచినటుల ఆదరిస్తారు. అప్పుడు స్త్రీలకుకూడా అన్ని పార్టీలలో మంత్రివర్గాలలో తగినస్థాయి పెత్తనం అందవచ్చు" అన్నారు. అప్పటి ఆలోచనల ప్రభావం వల్లనే నేను 1960 నుండి

1970 వరకు అన్నిపార్టీలతో చేర్చిన మంత్రి వర్గాల నేర్పరచడం మంచిదనే ప్రచారం చేస్తూవుండినాను. క్రమంగా రాజాజీ ఆధోరణి లోనే బలమైన ఆందోళన సాగించిరి. కాని ఏకైక పార్టీ ప్రభుత్వాధికారానికి యింగ్లండులోవలెనే, అలవాటుపడిన జవహరులాలు, శాస్త్రి, ఇందిరమ్మ అంగీకరించలేదు. ప్రభుత్వపు పార్టీ వొకటి, ప్రత్యర్థి పార్టీ మరొకటి అనే ఇంగ్లీషువారి ధోరణి మనకు పనికిరాదని మేము గ్రహించితిమి. ఇతరులు అందు కంగీకరించరైరి. 1967లో హెచ్చు రాష్ట్రాలలో కాంగ్రెసుకు మెజారిటీ అందలేదు. అప్పుడైనా మిగతా పార్టీలతో చేరి మిశ్రమమంత్రివర్గాలే వచ్చినవి కాని, కాంగ్రెసుతో కూడా చేరిన అఖిల పక్షమంత్రి వర్గములు అందలేదు. స్విట్జర్లండులో అట్టిమంత్రి వర్గములుండినవి. అచ్చట ప్రజలు రక్షణ పొందుచున్నారు. ఆలాగా మేమిద్దరము స్విస్సువారి దారిలో క్రొత్త ప్రజాస్వామిక మంత్రివర్గాలుంటే స్త్రీ పురుషులకు, బీదలు, కష్టజీవులకు రక్షణయని నమ్మితిమి.

తుదకు, 1970లో, తిరిగి 1972లో ఇందిరమ్మ ధోరణికే ప్రజలు మొగ్గినప్పుడు ఆమెనైనా బలపరిస్తే, కొంతవరకు దేశానికి బీదలకు శుభమని వారు, నేను తలంచితిమి. ధైర్యంచేసి రాజాజీకి స్వతంత్ర మిగతా చిన్న పార్టీలు వద్దని చెప్పితిమి.

ఆ విధంగా భారతీదేవి స్వతంత్రించి రాజకీయ వ్యవహారములు నడుపుచుండిరి.

—)o(—



# వరదలు, కరువులు

1940లో రెండు అవాంతరాలను భారతీదేవి ఎదుర్కొనవలసి వచ్చినది. ఆ ఏప్రిల్ - జూన్‌లో, మరోసారి మందసాలో కాల్పులను పోలీసులు సాగిస్తే ఎందరో చనిపోయిరి. మరెందరో గాయాలతో బాధపబడిరి. మరికొందరు జైళ్ళలో పెట్టబడిరి. వారందరిరక్షణకై, కోర్టులో డిఫెన్సుకు విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో పర్యటన చేయవలసి వచ్చి నిధులు వసూలుచేసిరి. పోలీసు దురాగతాలవల్ల భయభ్రాంతులైన పీడిత ప్రజలను రక్షించవలసి వచ్చెను. నేను జైలులో; శ్యామసుందరరావు, లచ్చన్న అండర్ గ్రౌండులో వుంటిమి. ప్రజారక్షణ భారమంతాఆమెపై బడెను.

ఇంతలో ఆ అక్టోబరు, నవంబరులో గాబోలు, గోదావరి వరదలు విపరీతంగా ప్రజలను బాధించెను. ఎందరో మరణించిరి. గ్రామాలే కొట్టుకుపోయినా వనిపించె! ఎన్నో పశువులు చనిపోయెను. పంటలు పోయెను.

పోలవరం ప్రాంతంలో గిరిజనులు, రాజమండ్రి ప్రాంతాల్లో రైతుకూలీలు ఎన్నోకష్టాలకు గురి అయిరి! వారి రక్షణార్థమై స్వా॥ కోదండరామయ్యా భారతీదేవిగారిని పిలిచిరి. కాంగ్రెసు వారంతా వ్యక్తిగత సత్యాగ్రహోద్యమ మందుండిరి. శ్రమ అనుకోకుండా వరద బాధానివారణ సంఘమేర్పరచి రాష్ట్రరైతు సంఘాధ్యక్షులుగా తానే ముందుకొచ్చి తూర్పు, పశ్చిమ గోదావరి

జిల్లాలో పర్యటించిరి. ప్రజల కష్టాలనుగురించి పత్రికలకు వ్రాసిరి. అవసరాలను ప్రజలకు తెలిపిరి. నివారణకు విరాళములు వసూలు చేసిరి. ప్రభుత్వాన్ని "రిలీఫ్" కార్యక్రమం సాగించుటకై ప్రబోధించిరి. రేయింబవళ్ళు ఆ ఉద్యమమందు శ్రమించి సేవించిరి.

జైళ్ళలో నుండినవారు బైట నిల్చిన కాంగ్రెసు పెద్దలు, సేవకులు భారతీదేవి కార్యనిర్వహణ శక్తి సామర్థ్యములు, తెంపును గమనించి అచ్చెరు వందిరి.

ఆ వరద బాధా నివారణ సంఘము ద్వారా కలిగిన అనుభవములను, 1952–53లో రాయలసీమ కరవు నివారణ సంఘ నిర్వహణ మందు భారతీదేవి ఉపయోగించు కొనిరి.

విరాళాలు వసూలు చేయడం కష్టమే! అంతకంటె కష్టము, ఆ సొమ్ములను సద్వినియోగపరచుట దుర్వినియోగం కాకుండా జాగ్రత్తపడుట. ఎన్నో మొగమాటములు అడ్డములు వస్తూ వుండును. ఎవ్వరికి కష్టము కలుగకుండా, ఎవ్వరి ప్రతిష్ఠ దెబ్బ తినకుండా ప్రజాధనం సద్వినియోగమగునట్లు చూచుట, ప్రభుత్వాలకే స్వరాజ్య భారతములో సాధ్యము కావడము లేదని మంత్రుల అనుభవముగదా! ఆ 1921–24లో తిలక్ స్వరాజ్య ఫండు, బీహారు భూకంప బాధానివారణ ఫండు వ్యవహారాలలో గొప్ప కాంగ్రెసు నాయకులకే ఎన్నో కష్టాలు కలిగినవి. సరిగా లెక్కలు చెప్పలేనివారిని మహాత్ముడు విమర్శించితే ఓర్వలేకుండిరి. ఇక భారతీదేవిగారు చేసే విమర్శలను భరించుతారా!

ఆయనుభవాలను మేము చర్చించుకుంటూ వుంటిమి, కనుక 1952లో రాయలసీమ కరవులో ప్రజారక్షణకై భారతీదేవి నాయకత్వమువహించి ప్రజాసంఘముల నేర్పరచినపుడు ఆమె స్వయంగా కర్ణయం చేస్తూ, ఆనాటి కాంగ్రెసు ప్రభుత్వానికి సూచించిరి! ఏమని? కరవు బాధానివారణ కార్యక్రమాలు, వస్త్రాలు, వగైరాల పంపిణీ బాధ్యతలు కాంగ్రెసు రైతు సంఘాలు మరే యితర



రాజకీయ పెత్తందారులకుగాని ఇవ్వరాదనీ అఖిలభారతదేశమందంతటా దీనజన రక్షణలో ప్రజానిధులను పంచుటలో న్యాయానికి నమ్మకానికి ధర్మానికి ప్రసిద్ధిబొందిన, శ్రీ రామకృష్ణ మిషన్ వారు, వారి దారిలో నడుస్తూవుండే స్థానిక ఆంధ్ర జీవకారుణ్య సంఘము వారున్నారు - వారికే ఆ బాధ్యత అందజేయవలె'ననిరి.

నిధులు వసూలు చేయడంలో వారికి గొప్ప సామర్థ్యము కలదని ఆ అనుభవము తెలిపినది. ఆ నిధులను నిజాయితీగా సామర్థ్యవంతంగా, ప్రతిరూపాయికి తగిన ఫలితము బాధితులకు అందునట్లు చూడడంలో ఆమెతో పోల్చతగిన సమర్థులు లేరని అందరు అంగీకరించిరి.

1952లో మేమిద్దరము పార్లమెంటు ఎన్నికలలో, క్రిషికార్ లోక్ పార్టీ తరఫున నిలబడి ఓడిపోతిమి. తనకు నిలబడడానికి ఇష్టములేదు మాకు మరొక అభ్యర్థి లేరు. అచ్చట అసెంబ్లీకి నిలబెట్టబడిన వారిని బలపరచుటకు వారే, నిలబడాలన్నారు మా పార్టీవారంతా. ఐతే "నేను అందులకు ఈ యజ్ఞములో సమిధనా! సరే కానివ్వండి" అన్నారువారు. అందరం ఓడిపోయినాము. ఆ వెంటనే రాయలసీమలో కరవు కంకాళము ప్రజ్వలిస్తూ వుంది అది తీవ్రమైన వేసవి. నేను, వారు చల్లపల్లిలో రైతాంగ విద్యాలయాన్ని నడపాలి.

రైతు నాయకులు గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు 300 రైతుకూలీ యువజనులను అందు చేర్చుచున్నారు. ఐనా ఆ కరవు రాక్షసితో రాయలసీమ లక్షలాది జనాలు పోరాడు చుంటె భారతీదేవి వారికి అండగా నిల్చుట తన ప్రథమ ధర్మమనుకున్నారు.

మా కారు వారి కిస్తిని. వాహిని సంపాదకులు శ్రీ గోగినేని ఉమామహేశ్వరరావు కొంతకాలం, పి. తిమ్మారెడ్డి కొంతకాలం

వారితో సంచారము చేయుటకు తయ్యారైరి. ఉత్తరాది జిల్లాలలో ధనం, గడ్డి, గుడ్డలు, ధాన్యం వసూలు చేస్తూవుండిరి. రాయలసీమలో బాధితుల అనుభవాలను గమనించి పత్రికలకు ప్రభుత్వానికి తెల్పుతూ ఏయే ప్రాంతాలకు ఎంతెంత ఎట్టెట్టి సాయం అవసరమో పరీక్షించిరి.

కష్టాలలో వుండిన ఆ స్త్రీలు, బిడ్డలను ఓదార్చుతూవుండిరి. ఆమెను చూస్తున్నవారు తమ పాలిట 'అన్నమ్మ' "చల్లమ్మ" అచ్చంగా భారతమాతయే అవతారంగా వచ్చిరను కొనేవారు.

మా క్రిషికార్ లోక్ పార్టీపై కినుక వహించియున్నా, మేము, భారతీదేవి నాయకత్వముతో సాగిస్తున్న ఆసేవావ్రతము గమనించి శ్రీ జవహర్‌లాల్ ఆశ్చర్యమొందిరి. కాని తాను పంపించదలచిన ధనసహాయం తమపార్టీవారి ద్వారానే బాధితులకు అందచేస్తూవుండిరి. అది ఆంధ్రులకేగాక ఆనాడు ముఖ్యమంత్రిగావుండి భారతీదేవి ప్రయత్నాలను, ప్రణాళికను హృదయ పూర్వకముగా ప్రభుత్వాధికారుల ద్వారా అంగీకరిస్తూ బలపరుస్తూ వుండిన రాజాజీకి ఎంతయో విచారముకలిగించినది. భారతీదేవి మాత్రం "ఎవరైతేనేమి, ఎట్లయితేనేమి బాధితులకు మరో ముద్ద అన్నం గదా!" అన్నారు.

అయితే ఆమె వసూలు చేస్తూ, మా అందరిచేత వసూలు చేయిస్తూ వున్న నిధులు, ధాన్యాలు, గుడ్డలు లక్షలుగా పెరుగుచున్నవి! వాటిని బాధితులకు అందజేయడం, దుర్వినియోగం కాకుండా హెచ్చుగా బాధితులైన ప్రాంతాలకే అందించడము వారికి ప్రత్యేక శ్రద్ధ అయినది. ప్రభుత్వము అందించే పదులు లక్షలు వృధాగాకుండుట ఎలా అని దీర్ఘంగా ఆలోచించిరి. తుదకు రామకృష్ణా మిషన్ వారికి ఆ బాధ్యతలు తానై అందించిరి. ఆపైన రాజాజీతో వొప్పించి ప్రభుత్వపు కరువు నివారణ నిధులు ముఖ్యంగా అన్నము, గుడ్డలు పంపకం ఆ మిషన్ వారికి, తత్తుల్యా



లకే అందించునట్లు చేసిరి. తహశీల్‌దార్ల దగ్గరనుండి కలెక్టర్లవరకు ఆమె సలహాలను పాటించిరి. రెవిన్యూబోర్డు మెంబర్లు భారతీదేవియే నిజమైన గాంధీ శిష్యురాలనుకుంటూ వారికే కరవు నివారణ మంత్రిగా గౌరవించిరి. ఇక బాధితుల హృదయాలలో ఆమెకు అందిన ప్రేమ స్వరూపమును గమనించి మేమందరము తృప్తిపొందితిమి. ఆపిమ్మటే ఎప్పుడెప్పుడు అటు రాజస్థానములో యిటు బీహారు, ఉత్తర ప్రదేశ్‌లో యీవల మైసూరు మహారాష్ట్రములో ఆమూల సౌరాష్ట్రములో కరవు వచ్చినపుడెల్లా భారతీదేవిగారి ధోరణిలో రామకృష్ణా మిషనువారికే అన్నపానాదులు గుడ్డలు, గుడారాలు పంపకం అందించుటయే శ్రేష్టమనే ప్రభుత్వము అంగీకరిస్తూ వున్నది.

ఐతే ఎంత కష్టపడిరో ఆ యెండల్లో, దుమ్ముల్లో! బాధితుల కష్టాలు తమవిగా తలచుకుంటున్నప్పుడు, తనపై దద్దుర్లు చెలరేగుచున్నపుడు! అటు ఎన్నికలలో ఓటమి, యిటు కమ్యూనిష్టువారి హింసా కాండలు, అటుకాంగ్రెసువారు స్వధర్మమును మరిచి ఉద్యోగాలకై ఆరాటపడడము, యిటు మా పార్టీ వారు తమకు మంత్రివర్గములో తావులను మేము సంపాదించడం లేదనే ఆవేదనల ఒత్తిడులవల్ల. ఆ భారాన్నంతా భగవంతునిమీద వేసిరి. స్వధర్మపాలనే ఆమె లక్ష్యం, అప్పుడప్పుడు, ఒక్కోరోజు చల్లపల్లికి వస్తూ తన కష్టాలను నావద్ద తెలిపేవారు. తిరిగి నిప్పులలో దూకేవారు. ఆమె నిజమైన నిండైన అన్నపూర్ణ.

—:o:—

# ఋషీకేష్

ఋషీకేష్‌కు, హరిద్వారంనుండి మేమిద్దరం వెళ్ళుచుండే వారము. అచ్చట మన ఆంధ్రుల కొరకు, ఆంధ్రప్రతిష్ఠా ప్రదంగా వెస్టుగోదావరి రాజుగారు. సరస్వతీస్వామిగా పెరిగి, ఆశ్రమాన్ని నిర్మాణం చేశారు. వారియందు మాకు గొప్ప విశ్వాసము, గౌరవము. ఆయన నిర్మాణశక్తి అమోఘము, ఇప్పుడైతే ఇరువది లక్షలకు మించునట్లు, అప్పుడు ఐదారు లక్షల రూపాయలతో, ప్రజాభిమానాన్ని పొంది, స్వయంగా, శ్రద్ధతో ఆంధ్ర ఆశ్రమాన్ని నిర్మించిన ప్రజ్ఞాశాలి

వారొక పర్యాయము, ఢిల్లీలో మా యొద్దకు దయచేసిరి. మా బంధువులు గోగినేని వెంకట సుబ్బయ్యగారి కొక ఉత్తరం ఇవ్వాలన్నారు. ఆశ్రమ నిర్మాణమునకు అవసరమగు స్థలాలను గ్రాంటుచేయమని అంతకుముందే యు పి, ముఖ్యమంత్రి శ్రీపంతుకు నేను వ్రాస్తే వారు సరే నన్నారు. కనుక నాయొద్దకు రావడానికి స్వామీజీకి స్వతంత్రం. సంతోషం. ఐతే విరాళాలు ఇమ్మని వ్రాయమనడం అదే మొదలు "లక్షాధికారులు మనమాట వింటారా! స్వామీజీ?" అంటిని!

"వినకపోతే వారిదే బాధ్యత, ఇంతటి స్వామీజీ కోరితే మీరు ఉత్తరం ఇవ్వడానికి ఏల సందేహించడం?" అన్నారు భారతీదేవి. ప్రయత్నం మీద; భయపడుతూ, ఐదువేల వఱకూ మీ కిష్టము వచ్చినంత విరాళము యివ్వవలెనని నాయుడుగారికి వ్రాసితిని! స్వామీజీ మరొక పర్యాయము వచ్చిరి! "రంగాజీ,



మీది దివ్యహస్తమండీ! దేవిజీది లక్ష్మీదేవి పలుకండి" ఆరడుగుల ఆ స్వామీజీ అలా పల్కుతూ వస్తున్నారు. "ఏమండి యిప్పుడేమి చేయాలి." అన్నా! "చేసేశారండీ, ఆ ఉత్తరంతో పాతిక వేలు అందినవండీ" అన్నారు. "ఎంత గొప్పవారండీ నాయుడుగారు. అందమైనవారుకూడా! 'మన వారందరికి పవిత్రమైనది ఋషీకేషా! ఆ పుణ్యస్థానంలో ఆంధ్రులకు ఆశ్రయం కల్గిస్తారా! అన్నీ సన్యశించిన, ఆంధ్రులైన, ఇంతటి స్వాములా! మిమ్ము పంపించినవారు, నా అన్నయ్య, వారి దేవి పుణ్యదంపతులా? వస్తున్నది మావద్దకా? ఇందరిని కలిపి ఐదువేలేనా మా అన్నయ్య కోరడం? బాగా లేదండీ, మీరేమి నిర్మిస్తారిప్పుడు? హాలుగదా? ఎంత ఔతుంది? అంతా ఇస్తా? ఇప్పుడే యిరువదియైదు వేలు - ఒక్కొక్క గొప్పతనాని కొక్కొక్క ఐదు! స్వామీజీ! ఒకవేళ యింకొంత కావలసివస్తే నాకు తెలుపుతూండండి" అన్నారు. తరువాత ఆ హాలును చూచి కొని భారతీదేవి యెంతో తృప్తిని పొందిరి. అందు నాయుడుగారి చిత్రపటమును ఆవిష్కరించిరి. నాయుడుగారు మాత్రం అంత దూరం ప్రయాణం చేయలేదు.

"నాకొక విషయం తోస్తున్నదండీ" భారతీదేవి అన్నారు. ఒక యాత్రలో నేను, స్వామీజీ శివానంద స్వామీజీని దర్శించుకొని లక్ష్మణునికి ప్రణామం చేయబోయే ముందు!

"ఆ మొగలాయి, మరితర మహమ్మదీయ పాలకులు ఎన్నో మార్చివేసి ఎన్నెన్నో దేవళాలను ధ్వంసం చేశారు. కాని! యీ గంగమ్మను, ఈ ఋషీకేష్‌నుండి యెత్తుకెళ్ళలేక పోయినారుగదా! కనుకనే, యెన్నో విధాల ముసల్‌మానుల ఆచారాలు పెత్తనాలకు తల యొగ్గినా, యిచ్చట భారతీయులుకూడా యీ పాండవుల స్వర్గారోహణ మార్గాన్ని, ఆ గంగోత్రినుండి, యీ భూదేవిపైకి తన పాదాలనందిస్తున్న యీ గంగమ్మ తల్లిని త్రోవ తప్పింపలేకపోయినారు! ఎందరో వచ్చిరి. మన విశ్వకర్మలను దొంగిలిం

చిరి. బంగారం, మరెన్నో భాగ్యాలను, నవరత్నములను మోసుకు వెళ్ళిరి. కాని, మన గంగమ్మ మాత్రం మనకేయున్నది!'' అన్నారు.

అందుకే కాబోలు, దేశమందెచ్చట, పెద్ద జలాలు బుగ్గలున్నా, వీటన్నిటినీ ''గంగమ్మ''లన్నారు. "అంతా రామమయం" అనుకున్నట్లు. మనవారి దృష్టిలో, స్తలం, కాలంతో నిమిత్తం లేకుండా అంతా అదే, యిదే"

"లక్ష్మణ దేవళం ముత్యంలాంటిది. గంగమ్మ పాదాల యొద్దనే యున్నది. స్వామి శివానందజీ ఆశ్రమం గంగమ్మ వరవడిని తోడు చేసుకొంటున్నది. ఆఘాట్ గంగమ్మకు పూజ చేస్తున్నది. ఆ గంగమ్మ అందం ఎంతని! ''కనుకనే కాబోలు! ఆనాడు శంతనుడు ఆమెను మోహించి పెండ్లాడిరి'' అన్నారు భారతీదేవి!

"ఆ కథనుండే యీ భారతకథ" అన్నా, నేను.

ఇంతలో "నాకు వాల్మీకితో తృప్తిలేదండీ" అన్నారు. "ఏమి? అంత త్యాగం చేశాడే భరతుడు. మొదట్లో, చివరికి కూడా! అన్నేళ్ళు రాజ్యాన్ని నడిపి, ప్రజలసేవించి, ఆ పాదుకలనే కొలుస్తూండెనే! యే కథలోనైనా మరొక్కరిని అంతటి త్యాగిని చూపెట్టండి? తిరిగి అంతా ఆ రామునికే అందించెనే! సీతమ్మను అన్యాయంగా అడవులకు పంపివేస్తుంటే, అంతగా ఓర్చుకోగల్గెనా! ఆయన గురించి మరెంతగా వ్రాయాలి, చెప్పండి."

"సీతమ్మ తల్లిని అడవికి పంపించిన రాముణ్ణి శిక్షించక పోతే పోయె! సీతమ్మను గురించి తగినట్లు కవనమేది? ఆమె హృదయాన్ని దేవుని కెరిగించు మాటలేవి? సీతారాముల ద్వితీయ వియోగం దుఃఖ స్రవంతికి రూపురేఖలిచ్చే పద్యాలు, పదాలు యేవండీ? మన దేశస్థులైనా, లక్ష్మణునికైనా దేవళాన్ని అర్పించారు, ఆ భరతునికే'' అన్నారు.

''అలా కాదండీ, మనదేశమే భరతునికి దేవళము తల్లీ! ఇది భరతదేశం! మనందరం ఆయన పేరునే శిరసావహిస్తున్నాం!

15)



మీ పేరే ఆయనదమ్మా!" అన్నారు! స్వామీజీ తన గంభీరగళముతో శకుంతల బిడ్డగదా భరతుడు అను ఆలోచన, స్వామీజీ! ప్రకటన ముందు లెక్కలోకి రాలేదు.

మరోమారు, ఆ నిండుజలాల గంగమ్మలో, మా అమ్మాయిలు, అనసూయ యిందిరతో చేరి ఆమె స్నానమాడారు. ''స్నానము చేస్తూ యేమనుకుంటిరమ్మా?"

''మన పెద్దలందరి ఆత్మలకు శాంతి కల్గాలని ప్రార్థించినా! మా నాన్న, మీ మామయ్య రామస్వామి, వారి భార్య, మీ అక్కయ్య లక్ష్మీదేవిని తలుచుకున్నా! ఆస్నిగ్ధ జలాలు, హిమాలయ జలాలు, జిప్సమ్ శక్తుల జలాలు, పంటలను, పుణ్యాలను, ప్రాణాలను పోషించే జలాలు, ముత్యాలు, మురిపాలను, సాలగ్రామములు అందించే జలాలను దైవస్వరూపగా పూజించుకున్నా" నన్నారు

ఆ ప్రేమంపు పవిత్ర జలాలకే, దేవీజీ అస్థికలను 1972 డిశంబరులో మనుమరాలు విజయ, నాగేశ్వరరావు, నేను అర్పించితిమి. ఆంధ్ర ఆశ్రమమందే వారికి చివరి ఆశ్రయం అందినది. ఐతే ఆంధ్ర స్వామీజీ, శివానందజీ లిద్దరప్పటికే స్వర్గారోహణం చేసియుండిరి.

—:o:—

# పొదుపు ఉద్యమం

కుటుంబ నిర్వహణాలో, తమ వ్యక్తిగత అవసరాలలో, తగినడబ్బు, పరపతి లేక స్త్రీలు యెంతగా బాధపడుచుందురో భారతీదేవికి స్వయంగా తెలుసును. మద్రాసు, ఢిల్లీ పట్టణాల్లో జీవిస్తూవున్నప్పుడు అచ్చటి, కడు బీదల ఆర్థిక పరిస్థితులు నేను లెక్కిస్తూ వుండగావారు గమనించేవారు. తానుగా జీతభత్యాల ద్వారా జీవించే నౌకరు తరగతివారి కష్టాలు తెలుసుకుంటుండే వారు. గ్రామాలలో హరిజనులు, వృత్తులవారి స్త్రీల బాధలు వారికి బాగా తెలుసు. సన్నకారు రైతాంగ స్త్రీలు ఎంతెంతగా బాధలు అనుభవిస్తూ వుందురో, గుడ్డలకై, బిడ్డల పుస్తకాలకై పండుగ పబ్బాలలో ఐదు, పదిరూపాయలుకూడ అందక ఎందరు కుటుంబ స్త్రీలు ఎంత దుఃఖము పొందుచున్నారో ఆమె ఎరుంగును. ఎందరో పురుషులు కఠినులు, బాధ్యత లేకుండా స్త్రీల అవసరాలను నిర్లక్ష్యముగా చూస్తూ వుందురు. అసలే అప్పులు తీరక, వ్యవసాయానికి పెట్టుబడులు లేక, శిస్తులు చెల్లక, చీకాకుపడుచున్న రైతులు వారి భార్యా బిడ్డలయెడల అశ్రద్ధ చేస్తే ఆశ్చర్యపడలేమనేవారు.

బస్తీలలో వుండే మధ్యతరగతి స్త్రీలకు ప్రత్యేక బాంకులుంటే మంచిదనుకొనేవారు. అరవవారి మధ్య "చిట్ ఫండు"లు బాగా గృహిణులకు తోడగుచున్నవనేవారు. భర్తలకు తెలియకుండా బియ్యమో, పాలో, నెయ్యో, పండ్లో, కూరగాయలో అమ్ముకొని పదులుగా సంపాదించితే దాచేది యెక్కడ! వూ



యిండ్లలో దొంగలేకాక, ఎలుకలు, నిప్పులు యీ రూపాయి నోట్లను రద్దుచేస్తవే! కనుక యేదైనా సంస్థవుండి, స్త్రీల చిన్న మొత్తాలను భద్రపరచి, ఆపైన వడ్డీ యిస్తుంటె బాగుండును. ప్రావిడెంటు ఫండులు పురుషులకేగదా! పోస్టాఫీసువారి సేవింగ్సు బాంకుదార్లు ఇచ్చే వడ్డీ నలభై పైసలేనావుండదే! ఇరుగు పొరుగు వారికి రూపాయి - రూపాయిన్నర వడ్డీకి ఇవ్వవచ్చుగాని, తిరిగి వస్తుందనే నమ్మకం వుండదే! అని స్త్రీల ఆర్థిక పొదుపు వసతుల గురించి దశాబ్దాలుగా భారతీదేవి ఆలోచిస్తూ వుండేవారు. ఇటులే బస్తీలవారు, ఉద్యోగుల కుటుంబీకుల అవసరాలను గమనిస్తూ వుండిన తమ జైలు, స్వాతంత్ర్య సమర సమయాల తోడి స్నేహితుల, సేవికలైన శ్రీమతి దుర్గాంబ భారతప్రభుత్వం తరఫున అఖిల భారత సంస్థను స్త్రీల పొదుపుకై, అవసరం తీర్చుటకై స్థాపించిరి. స్త్రీల పొదుపు వుద్యమముగా ఆ సంస్థ ద్వారా పెంచుట మంచిదనుకొనిరి వారుభయులు. ఆంధ్ర దేశమందు ఆ వుద్యమాన్ని ప్రారంభించి, తగిన సంస్థను రాష్ట్ర స్థాయిలో నిర్మించి, జిల్లాల వారీగా కమిటీలను యేర్పరచుమని భారతీదేవిని దుర్గాబాయిగారు కోరిరి. నేను ఆమె ఆలోచనలను బలపరచితిని. అఖిలభారత స్త్రీల పొదుపు ఉద్యమ కౌన్సిలులో భారతీదేవిని గౌరవ సభ్యులుగా ఆహ్వానించిరి.

ఆ బాధ్యతను 1953-35లో తాను శిరసావహించగలనా యని ఆమె చాల తడవు ఆలోచించిరి. ఆరోగ్యం బాగాలేదు, ఎండ తగిలితే సరి, దద్దుర్లు, దురద బాధ పెరిగిపోతుంది. తానుగా జైలుదేరి ఆ 1952-53లో కరవు నివారణ ధర్మమును నెరవేర్చే సరికి, అనారోగ్యం పెరిగిపోవడం, దేహబాధ హెచ్చడం జరిగింది, తిరిగి యీ బాధ్యత ఎలాగా భరించడం! ఐనా, అన్ని దశాబ్దాలుగా అందని సౌకర్యం, స్వరాజ్య భారత ప్రభుత్వపు ఆర్థిక ప్రణాళికా సంఘం యెట్లనో స్త్రీల రక్షణకై పూనుకోవడం, తన స్నేహితులు దుర్గాబాయి సమర్థవంతంగా యీ కౌన్సిలును నిర్మించుతూ వుండడం సాధ్యమగుచున్నప్పుడు తాను వెనుకంజ వేయగలరా!

"ఏమంటారు మీరు ! ఇంత బరువు యిప్పుడు మళ్ళా భరించాలా? మిమ్మ అడిగితే లాభమేమి? ఎన్నికష్టాలు. నాకీ కుటుంబం వ్యవసాయం, శరీరారోగ్యం గురించి వుంటున్నా, ఇంకా యేదేదో ప్రజాభ్యుదయకార్యక్రమాలు తలపై పెట్టుకో మంటూనే వుంటారులే! అసలు కష్టాలంటె యేమిటో తెలియని కష్టజీవి నాకు భర్తగా దొరికారు."

"నాతరఫున మీరే సమాధానం చెప్పుకున్నారుగా! ఎట్లనో మన స్త్రీలకు అందుబాటులో వుండే; పొదుపు సదుపాయం కల్గించడానికి ప్రభుత్వం తోడ్పాటు యెలాగో యిన్నాళ్ళకి కల్గుతున్నప్పుడు, మన కుటుంబ ఇబ్బందులనే ఆలోచించుకోమనగలనా? ఏమైనా మీ యిష్టం. మనకారు మీవద్దనే వుంచుతాను. సంచారం చేయడానికి ఆర్థిక వసతులు యేర్పరుస్తాను. ప్రభుత్వ యంత్రాంగం సహాయం కావచ్చును. జిల్లా కలెక్టర్లు, మిగతా వారు మీరీ కార్యానికి పూనుకొంటే, ఎంతో గౌరవంగా సహకరిస్తారని నా నమ్మకము" అని ప్రోత్సహించితిని!

ఆమె అంగీకరించిరి.

ఆంధ్ర సంఘమును నిర్మింపబూనిరి. అన్ని జిల్లాలు సంచారము చేసిరి. కలెక్టర్లు, పోలీసు సూపరింటెండెంట్లు, బారు కౌన్సిళ్ళ వారి భార్యలు, భారతీదేవి సర్కులర్లు చేరడంతోటే ఎంతో ఆదరంతో సహకరిస్తామనిరి. ఆటూరులలో శ్రీ గా॥ ఉమామహేశ్వరరావు, మనోహరం వారితో కలిసివుండి, యెంతో శ్రమకు వోర్చిరి.

స్థానిక శాసన సభాసభ్యులలో చాలామంది వారితో సహకరించుటకై ముందుకొచ్చిరి. జిల్లా బోర్డులవారు, ఉపాధ్యాయసంఘాలవారు, వుత్సాహపడిరి. వివిధజిల్లా మహిళాసంఘాలు, క్లబ్బులు, రెడ్ క్రాస్ సంఘాలవారు సహకరిస్తామనిరి. ఐనా, ఆ యెండలలో వర్షాలలో ప్రతిజిల్లాలలో ఐదారు దినాలు కారులో ప్రయాణం



చేస్తూ, ప్రచారం సాగించడం ఎంతో కష్టం! అందులో స్త్రీలకు! ఆపైన, ఆమెను అనారోగ్యం బాధిస్తూవుంది. అది రాజకీయ ఆందోళనగాదు. బహుళ జనుల కోలాహలమునకు సంబంధించిన వుషారు! ప్రోత్సాహంలేదు. నిర్మాణాత్మకమైన కృషి. ఐనా అంతకష్టము సహించిరి. దుమ్ము, ధూసరితముల లెక్కగొనలేదు. ఉద్యోగుల మధ్య జరుగు మర్యాదలను పాటించిరి. అన్ని భాగ్యాలు అందుకొంటూ, హంగుపొంగులతో సహకొంత సంఘసేవ చేయ తయారగు యీ కాలపు పెద్ద చదువుల మహిళల మధ్య వ్యవహరిస్తూ వుండిరి. అటు చిన్న జీవితస్థాయిలో మర్యాద మన్ననల పెంచుకుంటున్న మధ్య తరగతి మహిళల మధ్య సహకారము పొందగల్గిరి.

రేడియోమీద పలుమారులు, సోదర స్త్రీలను హెచ్చరించిరి. యీ పొదుపు వుద్యమాన్ని ఆదరించమని దిన పత్రికలలో వ్రాసిరి. వారి యీ నిర్మాణ శక్తిని వుద్యోగులు, రాజకీయ నాయకులు శ్లాఘించిరి. అఖిల భారతావనిలో ఆంధ్ర స్త్రీల పొదుపు వుద్యమం ప్రథమ స్థానం బొంద గల్గినది!

అదొక అష్టావధాన మనేవారు. తనకు తోడుగా, కార్యదర్శిని యేర్పరచుకోవాలి! ఎవ్వరు? ఎచ్చట? విజయవాడలో శ్రీ సీతారామయ్యగారి అమ్మాయి, మా మిత్రులు ప్రసాదుగారి చిన్నబిడ్డ ఇంటరు వరకూ వస్తూ, చదువులు మానుకొన్న చి॥ సౌ॥ మనోహరంనుపిల్చిరి. భారతీదేవిగారితో చేరుటే భాగ్యమనుకొనిరి ఆ చిన్నారి బిడ్డ! సంవత్సర పర్యంతం వారితో సహకరించిరి.

ఆ తర్ఫీయతు ఫలితంగా ఆమె తిరిగి చదువులు ప్రారంభించుకొని, డిగ్రీపొంది, లాయరై, విజయవాడ పౌర సేవాసంఘములలో పెద్దయై మ్యునిసిపల్ కౌన్సిలరైరి.

ఆలాగు ఆంధ్రదేశంలో యీనాడు ప్రముఖ ప్రజాసేవా రంగంలో, ప్రభుత్వ స్థాయిలో, స్త్రీల పొదుపు వుద్యమ సంస్థకు బలమైన పునాదులు భారతీదేవి నిర్మించిరి. అదొక నిర్మాణాత్మక

మైన గొప్ప ప్రయత్నము. అందు ఆమెకు, స్వాతంత్ర్య యోధులైన జైళ్ళలో వారితో చేరియుండిన మహిళానాయకులెందరో సహాయ పడిరి. శ్రీమతి కొండా పార్వతీ, కడప రామసుబ్బమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, చుక్కమ్మ ప్రభృతులు వారితో కలసి, మహిళా సేవ చేయడం ఎంతో గౌరవప్రద మనుకొనిరి.

ఆ సంస్థ తన ప్రాథమిక పెంపు పొందగల్గిన స్థితి పొందగనే, తన బాధ్యతలను అఖిలభారత సంఘమువారి కందించివేసిరి! ఎందరోవలె, అందిన పెత్తనాన్ని అంటిపెట్టుకొనే ధోరణి వారికినచ్చేది కాదుగదా!

ఇప్పుడిప్పుడు స్త్రీలకే ప్రత్యేక బాంకులు నిర్మిస్తున్నారు. పొదుపుద్వారా చేర్చు నిధులను స్త్రీలే నడుపుకొనే, చిన్న వ్యాపారాలు, దుకాణాలు, వృత్తులకు పరపతిగా వుండడం అవసరం! అనుభవంలో కల్గే నష్టాలను ప్రభుత్వం భరించడంమంచిది. స్త్రీలు యీ విధంగా పెంచుకొనే మొత్తాలపై, కోర్టులుగాని, శిస్తు వసూలు చేయువారుగాని డిక్రీలు, డిమాండులు చేయరాదు. అనాదిగా వస్తున్న భారతీయ రక్షణ, తల్లి దండ్రులందించు స్త్రీ ధనముకు యెలాగవున్నదో యీ పొదుపులకుకూడా రక్షణ అందించాలని భారతీదేవి ఆలోచన!

స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యమును వారు కోరిరి. పురుషులతో పాటు సమాన హక్కులు వుండాలనిరి. ఆ స్వాతంత్ర్యము, హక్కు బలపడవలెనంటే, స్త్రీలకు, పొదుపు వుద్యమమేగాక, వారసత్వ హక్కు కలుటేగాక, భర్తలకు అందే జీతములో కొంతగానైనా వారి పేర నిల్వాలనేవారు. అట్లే స్త్రీలుకూడా వృథా ఖర్చులు, భేషజములు పెంచుకోరాదని, స్వయంగ కుటుంబపుపనులు చేసుకోవాలని, ఆభరణాలపై పిచ్చి పెంచుకోవద్దని ప్రబోధించేవారు. భర్తకు భారంగా భార్యలుంటే, భారతీయ నాగరికత ధ్వంసమగునని వారి భయం.

—o—

# కాశ్మీరము - 1953

నేనేమో 1916 నుండి సుందర కాశ్మీరము గురించి చదువుచున్నా. ఆ మొగలాయి సౌందర్య పిపాసి, ప్రేమ ప్రపంచ చక్రవర్తి, జహంగీరు, వారి భార్య నూర్జహానుల కథ కాశ్మీరంతో ముడిపడి వుండెను. ఆ సుందరోద్యానముల కాశ్మీరుకు కొలది బలగాలతో వెళ్ళుచుంటేనే గదా తన సైన్యాధిపతి మహాబత్ ఖాన్ జహంగీరును ఖైదీగా పట్టుకొనడం నూర్జహాను తన చాకచక్యముతో, తన భర్తయగు చక్రవర్తిని ఆ చక్రబంధమునుండి విడిపించడం జరిగినది.

యూరపు, అమెరికా ఖండాలన్నీ చుట్టివస్తిని. భారతీదేవిని ఆశియా యూరపు నాగరికతా స్థావరములకు తీసుకెళ్ళగలిగితిని. ఇచ్చటే భారతాంబ శిరమందు వెలుగుచున్న నవరత్న ఖచిత కిరీటాన్ని చూడజాల కుంటిమే!

ఎడతెగని టూరులు దేశమంతటా మేమిద్దరము చేస్తూ రైతుకూలీ ఉద్యమాలు, జాతీయ కాంగ్రెసు పెత్తనాలతో వుంటూ భారతాంబయొక్క ఆ హిమగిరి శిఖరాలను అందుకోలేదు. యూరపుకు స్విట్జర్లండు ఎట్టిదో సౌందర్యానికి, మంచు కణాలకు, అందచందాల యువజనాలకు, ఆశియాకు కాశ్మీరు అలాంటిది "అచ్చట బుట్టిన చిగురు కొమ్మయిన చేవ" అన్నట్లే అచ్చట పసికర, పండ్లు, వృక్షాలు-వాయువులు, యువజనాలు, హృదయ

గమములు, కల్హణుని "రాజతరంగిణి"ని చదివితిమి. ఆ కాశ్మీరును చూడవద్దా!

1953లో తీరుబడి చేసుకొని, కాశ్మీరు యాత్రకు బైలుదేరినాము. మరిం కెవ్వరిని తోడు తీసుకు రావద్దన్నారు. నాకూ అదే ఇష్టము.

ఏయాత్రకు బోయినా, ఏటూరులోవున్నా బండెడంతమంది. భార్యా, భర్తలుగా, ప్రియులుగా, స్నేహితులుగా; సరసంగా, అరమర లేకుండా అటు యిటు చూసుకోవలసిన అవసరం, భయం కలుగుకుండా మేము తిరుగడానికి ఆక్సుఫర్డులో, పారిసులో, స్విట్జర్లండులో ఆ 1925-26లో అవకాశం కలిగెను. తిరిగి 1927-30లో నీలగిరి కొండలపై అందెను. అప్పుడప్పుడు సిమ్లా కొండలు లోయల్లో 1935-39తో సాధ్యమయ్యె! ఆమెకు నాపై విసుగు, ఎచ్చటికి తీసుకెళ్ళినా, అంతమందికి పరిచయం చేస్తూ వుండడం, ఇందరితో కలిపి తిప్పడం, ఎందరెందరో వుంటూవుండగా, సరసమైన చిన్ని కబుర్లు పల్కుటకు నేను సాహసిస్తూ వుండడం.

ఆ ప్రయాణం - రైలు బస్సులద్వారా బాగావుంది, 'బెనుహాలు' పాసులో సాగుతుంటే ఆ చల్లటి గాలి యెంత హాయి గల్గించినది. స్విట్జర్లండులోని, హిమ శిఖరాలతో వున్న ఆల్ప్స పర్వత శ్రేణిలో వుంటిమా?'

శ్రీనగర్ లోయ - వెల్లడిలోకి వెళ్ళుచుంటిమి! ఆకొండలన్నీ దాటిన తర్వాత, తళుకు, తళుకుమంటూ హృదయమంతా పల్లవించునట్లు సూర్యుడు మాసొత్తే, మా స్నేహితు లే అని గర్విస్తున్నట్లు ఆనందిస్తూవున్న ఆ వరిచేల సొగసులు మమ్ము రంజింప చేసినవి. దారి కిరుప్రక్కల సీడారు వృక్షాలు నిటారుగా వేస్తూ కాపలా కాస్తున్నవి. అచ్చటచ్చట పొలాల్లో సూర్యుని కిరణాలకు అందమిస్తూ వుండిన రైతు యువకులకు అద్దాల తళ్కుల చిరు టోపీలు కన్పిస్తున్నవి.



అందుకున్నాం శ్రీనగరు పరిసరాలు, ఇదుగో మార్తాండ దేవళం అన్నారు. అవ్విశిధిలాలు. గొప్ప స్తంభాలు పడిపోతున్న మంటపాలు! ఇది మహమ్మదీయుల స్థావరమే శతాబ్దాలనుండి. అయినా ఈ పురాతనపు హిందూ శిల్ప చక్రవర్తుల పాలనాచిహ్నాలింకా నిల్చేవున్నవి.

సాయంత్రం వస్తున్నది. మాగాణి గట్లపైనున్న రైతులు మెక్కావైపుకు వంగుతూ నమాజు చేసుకుంటున్నారు, "చూడు చూడమ్మా!" అంటున్నా. అలాగా యితర ప్రాంతాల్లో ఎన్నో మారులు నా ఆశ్చర్యం తెలుపుతూ ఆమెను కదిలిస్తూవుంటాను! అప్పుడంతా, "ఉండండి, ఎదుకంత హడావుడి? వారంతా ఏమనుకుంటారు?" అనేవారు. కాశ్మీరు వాతావరణంలో భారతీదేవికూడా నాతో పోటీ పడుతున్నారు - తన ఆనందం, ఆశ్చర్యం, తృప్తి తెల్పుకొనుటకు.

"చూచారా! ఆకాల్వ కట్టలమీద" అన్నారు. అంతకుముందే ఎందరో బంగారు నిగనిగలతో నిలబడ్డారు, కూర్చున్నారు. "చూచాను ఆ బృందావనము. అయితే శ్రీకృష్ణుడు ఆకనాన్నే వున్నారు" అన్నా; "అందుకే చల్లబడుతూ వున్నారు సూర్యకుమారు" లన్నారు. అలాగా చేరినాము శ్రీనగరం.

"దాల్" లేకు లేక సరస్సులో ఒక బోటులో మా కాపురం. ఆసరస్సు ప్రపంచమంతటా ప్రసిద్ధి బొందినది. దాని ప్రతిష్ఠను మించేది జనీవా పట్టణము వద్దనున్న సరస్సే. రెండూ అందమైనవే, హిమగిరులనుండి జాలువారిన జలాలనే అందుకొనును. అంత విస్తీర్ణమైన అద్దాల సరస్సులవి. దాల్ సరస్సుపై బోటులో కాపురం ఎంతో గొప్ప. నిజానికి నిండు పెండ్లి పందిరే ఆ బోటుపైనున్న కప్పు. ప్రపంచ బాధలతో, పరిసరాలతో నిమిత్తం లేకుండా అందు ఆనందించగలము.

ఆ పిమ్మటా! ఆ సరస్సులో అంతా చేరుతుంది. తిరిగి ఆనీళ్ళలో స్నానాలు, తాగడం, ఈతలు - ఇదంతా పరిశుభ్రతనే

పై వస్త్రంగా ధరించే భారతీదేవి కేమాత్రం నచ్చలేదు. ఆ రెండు దినాలు మూడు పగలు మాకు పెండ్లి సమయం! ప్రపంచ వ్యవహారాలన్నీ మనస్సుల్లో త్రిప్పి చూచినాము. ఎరుగున్న వారి జీవితాలను తలుచుకున్నాము. పాశ్చాత్యుల సరసాలు, బర్మావారి, చైనా వారి కుటుంబ వివిధ లక్షణాలు స్ఫురణకు వచ్చినవి. అమెరికావారి కుటుంబ విలయము కన్పడ్డది. మనవారివి, యింకా వెనుచూపులు మాత్రమేగదా.

మే మిద్దరం మరునాడు పెళ్ళిపాకల సొగసులుగల బోటుపై దాల్ సరస్సుపై విహరిస్తున్నాం. ఆక్సుఫర్డులో వలె, నేను బోటు నడుప ప్రయత్నించితి. కొంచెము సేపు నవ్వులు, మరి కొంచెము సేపు పడిపోతామనే భయం, బోటు అటూ యిటూ కదిలి గుడ్డలు తడుపుచున్నది.

బోటును సొగసుగా నడిపే సాహెబు వున్నాడు. ఆయన్ను హుషారుపరచితి. కొంతసేపు పిల్లంగోడు వూదాడు. మరొక్కప్పుడు పాట పాడాడు. అతను తన ధోరణిలోనే వున్నాడు. అదేవారి అలవాటు. అట్లా బోటులో వుండేవారికి తానున్నట్లు అనిపించరాదు. అప్పుడేగదా, ప్రేమ ప్రపంచములో ప్రయాణీకులు, టూరిస్టులుండ కలిగేది.

తిన్నాము ఆ పగడాలను మించిన ధగధగలతో విర్రవీగుచున్న ఆ పెద్దపెద్ద రేగుపండ్లు! వాటిని చూస్తూనే వికసించిపోయిరి భారతీదేవి. పళ్ళు పులిసిపోయేటంతటి! ఆంధ్ర రేగుపండ్లనే ఆ నాగార్జున కొండపై ముళ్ళచెట్ల మధ్యకు విసురుకుంటూ పోతూ తెచ్చుకొని తినగలిగిన ఆమెకు తియ్యని చిరువులు పెక్కడో దాచుకొన్న కాశ్మీరు రేగుబండ్లు పిచ్చి కలిగించవా! పోటీ బడ్డాము మరలా మరలా, తింటూ. ఒళ్ళోవి ఖాళీచేశాము. ఓనాడు స్నానం చేశారు వేడి నీళ్ళలో ఉత్సాహంతో. బోటుపైకి వచ్చారు. ఆదీర్ఘమైన నీలాలు ఆరబోసినారు. ఆ చక్కని నుదురుపై ముంగురులు సరస్సు వీచుచున్న చిరువాయువులకు ఊగుతుంటే "ఎంత అందముగా వున్నారు" అంటిని.



కొంచెము సిగ్గుతో అంత ఆనందముతో "ముసలి తనంలోనా?" అన్నారు. 'అందానికి వయస్సు అడ్డం రాకూడ'దన్నా! 'వచ్చేతీరుతుందిలే'. 'ఏమైనా నాకెప్పుడూ అందంగానే వుంటారు' అన్నా. 'అది నిజమేననుకుందాం. ఇప్పుడేమి స్పెషల్?' 'ఈ దాల్ సరస్సు, యీ స్నేహితంపు సూర్యకిరణాలు, యీ పెండ్లి పందిరి, ఆ విరజిమ్ముకుంటున్న నీలాలు, అందు అల్లనల్లన మెరిసే మురిపెంపు వెండితీగలు, వాటికి రాణింపుగా ఈ నీ ముంగురులు! కాంతులను సూర్యునికి ఎదిరందిస్తూవున్న నీ నవ్వులు. ఆనందమును ఆరబోస్తున్న యీ ముఖారవిందము. హృదయములో కొరతలు లేకుండా పెండ్లి విందులు స్వయముగా కల్పించుకుంటున్న నా భారతీదేవి!" అంటూవుండేసరికి పకపక నవ్వుతూ 'మీరిలా కవిత్వము చెప్పుతూనే కదా ఇన్నేళ్లు నన్ను మోసగిస్తూ, ఎన్నెన్నో బాధలకు అర్పించినది" అన్నారు."

గంట గంటన్నర సేపు దాల్ సరస్సు మెరుపుటద్దాల జలాలపై బోటు విహారం చేస్తూ 'నిషాద బాగు'కు చేరు కుంటున్నాము. ఎంతకాలమునుండో చక్రవర్తి జహంగీరు నిర్మించుకున్న సుందరోద్యానవనాన్ని చూడాలనుకుంటున్నాము. ఎలావుంటుందో? వర్సైల్సులో ఫ్రెంచివారి పదునాల్గవ లూయీ చక్రవర్తి నిర్మించగా ఇప్పటికీ పెంపబడుచున్న ఉద్యానవనాల్లాగానే వుంటుందా? అనుకుంటున్నాం. తినబోతూ, రుచులకై నోరూర చేసుకోవడమెందుకులే! బోటు ఆగింది. దిగినాము. ఎక్కుచున్నాము, రాకపోకలతో ఎందరో ఎంతో హడావుడి చేస్తున్నారు. వస్తూవున్నవారు తిరిగి తిరిగి చూస్తున్నారు, బలేబాగా వున్నది గాబోలు. చేరుతున్నాం! అబ్బో, ఎంత రంగుల రాణువ, అటు యిటు యిన్ని, యింత రంగుల ప్రోవులా! వరుసలు దీర్చి ఒకదాని ప్రక్క మరో రంగు ఆపైన మరోరంగుల పువ్వుల బారులా, ప్రోవులా! ఆశ్చర్యము పెరిగిపోతున్నది! సూర్యుడు నవ్వుతూ, ఆపూల వరుసలను మమ్ము మురిపింప చేస్తున్నాడా? ఒక్క వందగజాలు పైకెళ్లు

తున్నాం. మరో అర్థ ఫర్లాంగు మెట్టు అందినది. ఆ పూలవరుసలు వేరు. రంగుల క్రమం వేరు మరో ఉద్యానవనమనిపిస్తుంది. యిలాగా ఆశ్చర్యం, ఆనందం. సృష్టి సౌందర్యం సూర్యుని స్నేహితబృందాల చిద్విలాసములను, వరుసగా గజిబిజిగా అందుకొంటూ "ఓహో," అనినేనంటే, "అది జూడండి" అని ఆమె అంటె, మమ్మ మేము మరచిపోతూ మధ్యలో వున్న ఆ నల్లని స్ఫటికపు మందిరం వద్దకు చేరేసరికి చిన్న యువజనుల మైపోతిమి.

"కేమెరాయేది?" అన్నారు ఆమె' 'ఇదిగో యీ స్ఫటికపు రాతిపీట, నిలబడతాను, బొమ్మ తీయండి' అన్నారు. 'అలానే' అన్నాను నేను. ఆ జలపాతము సూర్యునితో సరసాలాడుతూవుంది. వెనకనే ఆ క్రిందనే వున్న గూళ్ళల్లో పుష్పాల జొంపాలున్నవి. అవ్వియూ జలపాతపు కాంతులలో మెరసిపోతున్నవి. ఆపైన ఆ స్ఫటికపు పీట! దానిమీద నా హృదయరాణి! ఆమె వెనుక ఆ గొప్ప మందిరం, అటు యిటు పూలచెండ్లు, వాటన్నిటి కిరుప్రక్కల పచ్చిక తివాసీలు, అన్నిటిపై అధ్యక్షత వహిస్తున్న శతాబ్దాల చరిత్ర జూచిన ఆ గొప్ప వనభూజములు! ఆ దృశ్యము దేవతలకే సాటి, ఆ యందచందాలు అచ్చటే అందును. ఆదివారపుటుత్సవాలకై యేర్పరచబడే జలపాతాలలో సూర్యకాంతుల ద్వారా చిన్నవారమై పోయినాము! మమ్మ గుర్తించువారు లేరు గదా అటూ యిటూ యేమి తిరుగాడినాము. తెలుగులో ఎన్ని చిన్నపదాలు పలుకుకున్నాము! ఇంకా పైకి వెళ్ళినాము ఆ గొప్ప భూజములవద్ద కూర్చున్నాము, ఏమేమో తిన్నాము ఆ భోజనమే వన భోజనం, దాని రుచులు ఎంతని! మరి అదొక క్రొత్త ఆకలి. దానికి ఆ సుందర, సుకుమార పరిసరాలే తృప్తి కలిగించగలవు. అలానే మన గ్రామాల్లో భోజనాలు కావాలి.

"కనుకనే ఆనాటి చక్రవర్తులు ఇచ్చటికి వస్తూవుండేవార"న్నారు ఆమె. "మనంకూడా ఐదు సంవత్సరాల కొకమారైనా



వద్దామా" అన్నారు. 'నెహ్రూగారి పంచవర్ష ప్రణాళిక వలెనా' అన్నా. "ఆ ప్రణాళికలు మీవి మాత్రం కావా? ఆ 1925-26నుండి మీరు ప్లానులు వేయడంలేదా? ఈ నెహ్రూగారు ప్రధాని అయిన తరువాత, ప్లాను గురించి మీరేగా తిరిగి చెప్పింది, ప్లానింగు కమీషనుకు ఆయన్నే అధ్యక్షులుగా వుండమన్న ప్రతిపాదన మీదే గదా?" అన్నారు. అన్ని లెక్కించుకుంటూనే వున్నారు భారతీదేవి. "సరే మన ప్లానులే వారివి. వారి ప్లానులే మనవి అనుకుందాం".

"అయితే ఆ మొగలాయిల కాలంలోకూడా ఎంతో శ్రద్ధగా ప్లానులు వేసినవారుండబట్టే శతాబ్దాల పర్యంతం, వాటి ఫలితాలు యింత బాగా నిలిచి, మనందరికి యింత ఉల్లాసం కల్గిస్తున్నది." అన్నారువారు.

"ఇప్పుడు మనం వేస్తున్న ప్లానుల ద్వారా చక్రవర్తులు వారి 'కోర్టులోని' పై అంతస్తులవారికి గాదు అభివృద్ధి సుఖానుభవములు కావలసినది. మన బీదరైతులకు, కూలీలకు, దరిద్రనారాయణులకు. ఈ విషయంమీదే నాకు నెహ్రూతో వివాదం పెరిగి పోవుచున్నది."

"ఆయనకూ బీదలమీద ప్రేమే, కాని ప్రభుత్వపెత్తనం సాగించడంలో తికమక పడిపోతున్నారు. పాపం!" అన్నారు, "అందుకే సరియగు దారిని చూపెట్టడానికి మనం పూనుకున్నాం గదా! అయితే ఆయనకు వ్యవసాయకులపై అంత ప్రేమ యేది!" అన్నా!

మరో రోజున 'చష్మాషాహి' అనే ఉద్యాన వనానికి వెళ్ళితిమి. పెద్దదే. అద్దాలు వరుసలుగా ఆ నీటి ప్రవాహాలు, ఎత్తు-ఎత్తులుగా పూల ప్రదర్శనాలు, సూర్యుణ్ణే మెరిపించే పచ్చిక బయళ్ళు! అందమనే పుప్పొడిని విరజిమ్మినట్లు పొంగుచున్న హృదయానికి స్థలం చాలదన్నట్లు అనిపిస్తూవుంది. పుష్పాల చెండ్లు కొన్నాము. వాటిని విసిరింది. అందుకున్నా? నేను ఊపివేసితి.

అందుకొని కంఠాన ధరించి, ఎంతగా నవ్విరి. ఆ పలుపరుసల సొగసులు, కాంతులు ఆ పుష్పముల కొకఅందము అందించె! అలా ఆడుకొంటూ, ఆ చెట్లమధ్య చకచక నడుస్తూవుంటే గొప్ప నవ్వులు మమ్మువెంటాడినవి. కొంతసేపటికి ఆ మైకంనుండి బైట పడే సరికి నాపేరే ఎవ్వరో పలుకుతున్నారు. చూచాం. విన్నాం. గుర్తించినాము. ఆయనొక పార్లమెంటు మెంబరు. కాశ్మీరువారు, కలుసుకున్నాం. అంతటితో కాశ్మీర విహారోత్సవం పూర్తి.

'పహెల్‌గాం' వెళ్ళాం! ఆ కొండల, అడవుల నిండా దానిమ్మ పండ్లే? 'అబ్బో అన్ని దానిమ్మలా?' అంటున్నారు ఆమె! "ఆ పండ్ల రసము నేగదా గ్లాసులుగా నీకు దద్దుర్ల ఆయాసం తీర్చడానికి నేను అందించింది' అని గుర్తుకు తెచ్చినాను.

"అవునండి ఎంత ప్రేమతో పట్టుదలతో ఆ దానిమ్మ పగడాలనుండి అంత రసం తీసితిరి. నాకిచ్చిరి, బ్రతికించితిరండి "అంటున్నారు - ఆ కారులో నాప్రక్క కూర్చొని నా హస్తమును అందుకొంటూ!

జలజల మంటున్నదా జీలంనది: లోయలు, కొండలు దాటి లోయలద్వారా, తుదకు బయలులో అంత లోతు లేకుండా ప్రక్కనున్న పచ్చికతో సరసాలాడుతూ సాగుచున్నది. ఆ తెల్లటి నురగలు, జారుతున్న జలాల వెన్నెలలు, చల్లగావున్నవి. నవ్వుచున్నవి. అద్దాలవలె మెరుస్తున్నవి. అందుచిన్నవి చిందుచున్నవి- 'మాతో ఆడండి, ఆడుకోండి' అంటున్నవి. ఆ జలాలు.

అచ్చటచ్చట గోచీలవలెనేవున్న పీలికల దుస్తులతో, తమ తెల్లటి విస్తారమైన దేహకవళిక లన్నిటిని వెల్లివిరియబోస్తూ ఒకరినొకరు వేడుక చేసుకుంటున్న తెల్లవారెందరో సరసోల్లాపములలో వుండిరి. వారి హావభావ చేష్టల భాషలను మేమెరుంగుదుము గదా. ఇనుక ఆ యువలోకపు మైకం గమనించుకుంటూ, చేతులు, చేతులు పట్టుకొని నడుస్తూ అవ్వి యివ్వి చెప్పుకుంటూ, సూర్యుని ప్రతిభలను ఆనదీ సొగసులలో కల్పుకుంటూ వుంటిమి.



మరోనాడు 'గుల్మార్గు' 'రోజాలదారి' అనేకొండ - బయలు - హిమగిరుల మార్గానికి వెళ్ళాము. ఆ రోజుల్లో ఆరుమైల్లు గుర్రాలెక్కి వెళ్ళాలి. ఆమె నవ్వుకుంటూ కోకను మట్ట గోచీగా మార్చుకొని స్వారీచేసిరి. ఎలాగా నవ్విరి, ఎంతెంత కేకలు వేసుకుంటిమి. ఆ ఖర్జూరపు చెట్ల సొగసులు, పైనులు (Pines), దేవదారువులు, పోలారులు (Polars) మరెన్నో వృక్షాల గురించి చెప్పుకుంటూ! ఇంతలో 'బాలరసాల సాల నవపల్లవ కోమల కావ్య కన్య' అన్నారామె. కల్హణుడు వ్రాసిన రాజతరంగిణి కథ ఆమెకు చెప్పనారంభించితి! 'మాట్లాడితే ఏదో ఎంతో భాగోతం' అన్నారు. 'పోనీలే' ఆపుస్తకాన్ని ఇంగ్లీషులోకి తర్జుమాచేసింది, విజయలక్ష్మి భర్తే. యీ ఆశ్చర్యహూథులు మా రుద్రమదేవియే.

"అంత అదృష్టవంతురాలు విజయలక్ష్మి" అన్నారు. ఐతే "సరోజనీదేవికా, ఆమె భర్తకా ఎక్కువ అదృష్టము?" అన్నా. 'అహ, పోటీలెందుకు యిద్దరూ అదృష్టవంతులే అన్నారు. 'మనవలె నేనా' అన్నాను నేను. వచ్చి పోయేటప్పుడు, మరి తిరిగి వచ్చేటప్పుడు గమనించుకున్నాం - ఆ కొండలు ఎక్కుతూ, దిగుతూ వున్నప్పుడు మా రోడ్డు ప్రక్కగా. అంత లోతుగా ఆ వెల్తురులతో, వేయి హస్తాలతో విరజిమ్ముకుంటూ, ఆడుతూ అదేపనిగా పాడుతూ ప్రవహిస్తున్న ఆ జీలం నది జిప్సమ్‌తో కూడిన జలాలు. జిప్సం అనే పదార్థంతో ఆ జలాలు మెరుగులు పొందుతున్నవి. కొండ రాళ్ళతో యుద్ధం చేస్తూ అన్నిరాళ్ళను ఆరాధిస్తూ, పరుగెత్తుచున్నదా నది. ఎవరెవ్వరెక్కువ దూకుడుగా నడుస్తున్నారో అనిపించేది. ఆ నదీజలాల - ఆ రాళ్ళ గుంపుల సరససల్లాపములను, కమ్మని తెలుగు పదాల్లో మా పల్లెటూరి కవి దేవయ్య మనకందించారు ఆ సొగసుల వెల్లులను. అలాగా ఆనందంగా సాగింది మా యాత్ర.

192ంలో ఇంగ్లండునుండి తిరిగి వచ్చిన తరువాత 19ం3లో మా దంపతులు కలసి చేసిన ప్రథమ విహారం అదే. తిరిగి నేనైతే

రెండు పర్యాయములు పోయి వచ్చినా, ఆమెను ఆనాటి కాశ్మీరు ప్రధాని షేక్ అబ్దుల్లా మరొక పర్యాయము వారి ప్రభుత్వ అతిథిగా రమ్మన్నారు. ఆ యం.పి. కబురుపైన మమ్మునె్రహుపార్కు ప్రారంభోత్సవానికి పిలిచినపుడు జవహారులాలుగారు 'తప్పక కాశ్మీరు రాండి మీ రిద్దరు' అన్నారు. ఆ పిమ్మట ఆయన ఆ పదవి నుండి జారిపోయిరి. ఆమెకు కాశ్మీరు పోవడానికి తిరిగి తీరికే కలుగలేదు.

కాశ్మీరు ప్రజా సామాన్యం కడుబీదలు. భారత ప్రభుత్వమే ఆ రాష్ట్రంలో రహదారులు ఆస్పత్రులు, విద్యాలయాలు - విశ్వ విద్యాలయం, వివిధ పరిశ్రమలు స్థాపించడానికి అయ్యే ఖర్చుల్లో అత్యధిక భాగం భరిస్తూ వున్నది. అయినా వారికి తృప్తిలేదు. పాకిస్తానుమీద వారికి హెచ్చు ఆసక్తి. షేక్ అబ్దుల్లా పోతే పిమ్మట వచ్చిన ప్రతి ముఖ్యమంత్రి తమ వారందరికీ భారత ప్రభుత్వపు డబ్బులను పంచడంలో పై చేయి.

ఆ జనాల్లో ఎనుబది శాతం మహమ్మదీయులు. వారికి భారత దేశం తమదేననే ప్రేమ కల్గటంలేదు. మనతృప్తి కొఱకు అక్కడ శంకరాచార్య కొండ వుందనుకుంటాం. కల్హణుని పీఠమనుకుంటాం. ఏమైనా మనదేశపు ఎల్లలలో ఆసుందర నందన సౌందర్య స్త్రీలు వుంటే చాలు అనుకుందాం. అబ్దుల్లాగారితో రాజీకుదిరితే మంచిదే.

—:o:—

# మందులమ్మ

మేము యూరపునకు పోబోవు సమయాలలో థియసాఫికల్ సొసైటీ వారి అడయారు కేంద్రమునకు వెళ్ళినాము. శ్రీ అనంతలు, అనిబెసంటమ్మ ఉపన్యాసాలు విన్నాము. ఆమెకు భారతీ దేవిని పరిచయం చేశాను. విద్యోదయా కళాశాలలో చదువు చున్నారు. ఇంగ్లండుకు త్వరలో తీసుకెళ్ళుతున్నానని చెప్పినాను.

"ఎంత సుందరమైన భారతివి" అంటూ దగ్గరకు తీసుకొనిరి.

"నీవు 'గర్ల్‌గైడు'గా తయారైనావా? లేదా! ఇంగ్లండులో 'ఎక్కడికి వెళ్ళుతావు? ఆక్సుఫర్డుకా! అక్కడ గర్ల్‌గైడుగా చేరు. ట్రైనింగు పొందు. ఆ చుట్టూవుండే పల్లెల్లో, స్త్రీల యిన్స్టిట్యూటు లుండును. యుద్ధ సమయంలో బైలుదేరినాయి. అందులో చేరు. మీ భర్తకు ఇవన్నీ తెలుసులే! రంగాగారూ! ఈమెకు యీ వ్యవహారాలలో మంచి తర్ఫీదు ఇప్పించండి" అన్నారు ఆమె!

ఆనాడు భారతీదేవి ఎంతో ఆనందంబొందిరి. 'గర్ల్‌గైడు'గా ప్రథమ శ్రేణిలో భారతీదేవి తయారైరి. స్త్రీల సంఘములలో చేరిరి. వారి టూరులలో, సేవా కార్యాలలో, ప్రదర్శనాలలో పాల్గొనిరి. తిరిగి మనదేశానికి వచ్చిన తరువాత, 'గర్ల్‌గైడు'లకు నాయకుల కిస్తూవుండిన, పైపై తరగతుల ట్రైనింగును, వూటీలో యెండాకాలములలో పొందిరి. ఆదర్శ మహిళాసేవకుల నాయకురాలుగా బిరుదులు సంపాదించగల్గిరి.

అలా తయారగుచుండిరి కనుకనే మా యింటివద్ద, కప్పు కూలితే పడిపోయిన పనివారికి, వెన్వెంటనే ఫస్టు ఎయిడు (ప్రథమ చికిత్స) చేయగల్గిరి. స్మృతి కల్గుటకై నీళ్ళు త్రాగించి, గాయముపై మందురాసి చల్లగా అంతమనిషిని, ప్రక్కనున్న వారి సాయంతో, మంచంమీద బెట్టించిరి. నెమ్మదిగా ఆస్పత్రికి పంపించిరి. ఈ విషయం వూళ్ళోవారందరికీ, మరునాడు తెలిసి. అందరికి ఆశ్చర్యమే! ఆనందమే! "రంగాగారి భార్య, ఆ చిన్నమ్మాయి, ఇంగ్లాండు వెళ్ళి వచ్చినామె, పడిపోయి, గాయాలు పడ్డవారిని యెంత శక్తితో రక్షించిరి. సామర్థ్యం అంటె, చదువంటె అలా వుండాలి. ఇంట్లోనే దాగొనేవారివల్ల యేమి జరుగుతుంది" అనుకున్నారట.

మన గ్రామాల్లో ఇలాంటి ఆపదలు అప్పుడప్పుడు బీదలకు కల్గుతూనే వుండును. మన దేశానికి తిరిగివచ్చిన తరువాత, అట్టి కష్టాలు పడేవారికి యెట్లా సాయం చేయుటం, అని మేము ఆక్సుఫర్డులో, థేమ్సు నది వెంట తిరుగుతూ ఆలోచించేవారం.

అప్పుడామెకు నా అనుభవ మొక్కటి చెప్పినాను! మట్టి త్రవ్వకంలో స్వంత ఉద్యోగం చేసుకొనే వడ్డివారిలో వొక్కరి పాదంలో పలుగు దిగబడ్డది. ఎంతో నెత్తురుపోయింది. ఆగాయాన్ని మాన్పించలేకపోయారు! ప్రాథమిక చికిత్సా లేదు. ఆస్పత్రిలో ఆలకించేవారు లేరు. ఆముదపు గుడ్డ వేస్తూ వుండినారు. కొన్నాళ్ళకు చీము పట్టింది. క్రమంగా ఆయన క్షీణించినారు. రెండు నెలలకు చనిపోయారు. అలాగా ఎందరో దిక్కులేక, బాధపడడం, కాళ్ళో, చేతులో విరిగిపోవడం, మరణించడం జరుగుతూనేవుంది.

అట్టి ఆపదలు పొందినవారికి, పాశ్చాత్య దేశాల్లో భీమా వుంది. నష్ట పరిహారముంది. వారి రక్షణకై ప్రభుత్వం బాధ్యత అంగీకరిస్తూ వుంది.

మన వ్యవసాయ కూలీలకుకూడా, అలాంటి రక్షణ వుండాలనుకున్నాం.



"మన రైతులు, ఫాక్టరీ యజమానులకువలె ధన వంతులు గారు. కనుక నష్టపరిహారం చెల్లించగలరా?" అన్నారు శ్రీ లింగం వీరభద్రయ్య చౌదరి.

"పోనీ, ప్రాథమిక చికిత్స చేయుటకైనా వారు పూనుకోవాలిగదా! ప్రభుత్వము మిగతా రక్షణంతా కల్గించాలి" అన్నారు.

భారతీదేవి కొన్నాళ్ళకు ఈచర్య గుర్తింపుకు తెస్తూ "నేను వొక్కటి చేస్తా! మన ఇంట్లో ప్రాథమిక చికిత్సకు అవసరమైన మందులు, పరికరాలు చేర్పుతా! ఈ దేశంలోనే, ఆ చికిత్స చేయుటకు తగిన ట్రైనింగు పొందుతా" అన్నారు. నేనెంతో ఆనందపడితిని. శ్రీమతి అనిబిసెంటు మాటలు ఆమెకు గుర్తున్నవిగదా!

మన దేశానికి వచ్చి, నేను మద్రాసులో ఉద్యోగాలు చేస్తున్నప్పుడే, విస్తారంగా ఖర్చుపెట్టి, ఎన్నెన్నో మందులు కొన్నారు. డ్రెస్సింగుకు కావలసిన కాటను, పౌడరు, పిన్నులు, సూదులు, థర్మామీటరు చేర్చిరి.

సిమ్లా, ఢిల్లీ, నిడుబ్రోలు మకాములలో చిన్నచిన్న "డిస్పెన్సరీలు" మందుల సొరుగులు తయారుచేసిరి. క్రమంగా అల్లోపతీ వస్తువులే కాక, హోమియోపతి, ఆయుర్వేదం మందులు పెట్టెలు పెట్టెలుగా చేర్చిరి.

ఆ మందుల వివరాలు, ఎందెందులకు ఉపయోగపడునో, యెలాగా వాడాలో వ్రాసుకొంటూ వుండేవారు.

ఒక పర్యాయం న్యూఢిల్లీలో వుండగా, ఆంధ్రవంట వారొకడు రాత్రి చలిగావుంటే బొగ్గులకుంపటి గదిలో పెట్టుకొని, తలుపులు కిటికీలు మూసి పరుండెను. గాస్ తయారై, అతడు ఉక్కిరి బిక్కిరై పోయె! ప్రక్కనున్న వారొక్కరు ఎట్లానో తేరుకొని, తలుపుతీసేసరికి, ఇద్దరు బైటకు వస్తూ, పడిపోయిరి. గాయాలయ్యెను. ఒకప్రక్క నెత్తురు కారుతూవుంది. మరో ప్రక్కవారికి

స్మృతి తప్పుతున్నది. అందరం లేచి, గాభరాపడుచుండిమి. భారతీ దేవి మాత్రం గంభీరంగా, తన పెట్టెలోనుండి కావలసినవి తీసుకొనిరి. వారి ముక్కులవద్ద "సాల్ట్సు" పెట్టించిరి. నెత్తులపై ఏదో (వుడుకులోం కాబోలు) వ్రాయించిరి. గాయాలమీద నెత్తురు కారకుండా చేస్తూ డ్రెస్సుచేయించిరి. మరొకరిచేత ప్రభుత్వ ఆస్పత్రికి ఫోను చేయించిరి. ఇద్దరం పార్లమెంటు సభ్యులం. మా ఇతర తోడు కుటుంబీకు లందరం, వారి సలహాల ప్రకారం నడచుకొంటిమి. అలాగా ఆ నౌకరుల రక్షణ కార్యం సాగించగల్గిరి.

నిడుబ్రోలులో, మా గోభూమికి ఫర్లాంగు దూరంలో హరిజనులు, రజకులు, నాయీలు వున్నారు. ఇంటి కిరువైపుల వీధివెంట యెందరో వ్యవసాయ కార్మికుల. ఏవేవో బాధలు. పాము, తేళ్ళ కాటు, కందిరీగల కుట్లు, కాలుకి వేలుకి యేవేవో గుచ్చుకోవడం, పలుగో, పారో కత్తిపోటులు, పోట్లాడుకుంటె కల్గిన గాయాలు, పలురకాల పిల్లల జబ్బులు, అన్నీ బీదలకే! మున్ముందుగా, భారతీ దేవిగారే వారి మనసునందు మెలిగేది! పరుగెత్తుకుంటూ, కొందరు యేడుస్తూ, బాధేమిటో చెప్పకుండానే గలభా! కొందరు ఎవ్వరికి గాయమో, జ్వరమో చిన్నబిడ్డ నొప్పో వారిని తీసుకురాకుండానే ఆమెవద్దకు పరుగెత్తేవారు!

నేనున్నప్పుడు వారి ఏడ్పులు విని, భయపడుతూ 'ఏమండీ భారతీ, త్వరగా రాండి. ఇంత ఆలస్యమా' అంటూ కేకలు వేసే వాణ్ణి!

ఆమె తొణికేవారు గాదు. సరసర నడిచేవారు. తాళపు చెవులు పైనుండి వచ్చినవా అన్నట్లు, అట్టె అందుకొని, అలమర తెరచి, వారిదేబాధో, పసికట్టుతూ, అడుగుతూ, ఆ రెండు, మూడు మందులు, కాటను, టింక్చరైడీను, చేర్చుతూ, కత్తెర, సూదితో, క్షణంలో తయారయ్యేవారు.

ఒకపరియాయం డాక్టరు రాండుగారు ఎందుకో వచ్చిరి. భారతీదేవి వోబిడ్డకుగల గాయంపై కొద్దిగా యేదో కత్తిరించి



తుడిచి, పౌడరువేసి, కట్టుకట్టుతూ చిన్నచిన్న మాటలమధ్య చికిత్స చేస్తూండగా వచ్చిరి. ఆ బిడ్డ తల్లిదండ్రులకు అరటిపండ్లిచ్చి పంపుచుండగా, చూస్తూ వుండిరి. "భారతీదేవిగారూ! మీ రెంత డాక్టరు పనిచేస్తున్నారండీ! మా దగ్గరకు యీ బీదలు, ప్రథమ చికిత్స మీవద్ద పొందిన పిమ్మట వస్తూవుంటే, ఎవ్వరి చేతనో చేయిస్తున్నా రనుకుంటున్నా! ఇంత రాజకీయ పెత్తనం చేస్తూ, వ్యవసాయం సాగిస్తూ, స్వయంగా, మా నర్సులు చేయనంత సేవ డాక్టర్లమే సాధిస్తున్నంతగా, సేవ చేస్తున్నారే. నా వందనాలమ్మా మీకు! మేము సాల్వేషను ఆర్మీ మిషనరీలము. మీరు జీత భత్యాలు పేరులేని బీదల మిషనరీలు" అన్నారు.

ఆనాటినుండి తాను మనదేశంలో యీవూరి ఆస్పత్రిలో వుండిన సంవత్సరాల పర్యంతం భారతీదేవిగారిని తన నాయకురాలుగా చూచుకున్నారు. డాక్టరు రాండు భారతీదేవిగారు స్వర్గీయులైరని తెలుసుకొని, గోడుగోడున దుఃఖించుతూ తమ చర్చిలో వారి ఆత్మశాంతికై ప్రార్థనలు ఐర్లండులో చేయించిరి.

వారి స్వగృహ డిస్పెన్సరీలో దాదాపు వేయి రూపాయలు చేసే మందులెప్పుడు వుండేవి. ప్రతినెలా 50 నుండి 100 రూపాయలవరకు మందులు వాడడమునకే అర్పించుచుండేవారు.

శ్రమపడి, మలబారునుండి, పాము, తేలు, తీవులు, వాపులకు ప్రత్యేక మందులు తెప్పించేవారు. పచ్చల తాడిపర్రు శ్రీ నరసయ్య ద్వారా హోమియో మందులను వాడడం నేర్చుకొన్నారు. మలాం పట్టీలు, పాలసముద్రం. జిల్లేడు ఆకుల కాపటం నాయీలనుండి తెలుసుకొనిరి. చెంచు కోయవారు తెచ్చే వోషధులు వుంచేవారు.

అంత ప్రయత్నం, బీదల సేవించుటకే! బిడ్డలను రక్షించుటకే అలాగే ప్రతి గృహిణి ఓ ప్రాథమిక వైద్యకేంద్రమును నడుపుటో, బలపరచుటో ధర్మమని ప్రచారం చేస్తూ వుండిరి.

సంతాన నిరోధం గురించి నేను 1923 నుండి ప్రచారం చేస్తూ వుంటిని. తానుకూడా క్లుప్త జీవితం, పరిమిత కుటుంబం గురించి శ్రద్ధ చేయమని, రైతు, కూలీ, గృహిణుల మధ్య, వారి వారి గౌరవ మర్యాదల కనుగుణంగా చెప్పుతుండేవారు. కాని ప్రభుత్వ ప్రచార ధోరణిగాని, ముగ్గురు పిల్లలకు మించి వుంటున్న వారిని నేను కసురుకుంటూ, "ఇకనైనా మానుతారా లేదా?" అంటూ వుండడడం గాని వారికి నచ్చదు.

కలిగిన బిడ్డలను దేవతాప్రసాదముగా చూచుకొని, ప్రేమించి పోషించుకొనుటకు తల్లి దండ్రుల ప్రోత్సహించేవారు. ఇక ఆనందంగా బిడ్డల భారం ఆహ్వానించకుండా భద్రపడమని గోప్యంగా సలహా చెప్పేవారు. నీరసిస్తున్న బీదల బిడ్డలకొరకై వైటమినులు తెప్పించి పంచిపెట్టుచుండేవారు. భారతీదేవొక చిన్న ఆస్పత్రిగా, డిస్పెన్సరీగా, నర్సమ్మగా, మందులమ్మగా దిక్కులేనివారికి అందుబాటులో వుండేవారు.

—o—

# కాశీ - సారనాథ్

నేను భారతీదేవి, వారి అక్కయ్యకుమార్తె చి॥ సుశీలా దేవి, కాశీ (బెనారెస్)లో నాల్గు రోజులు శ్రీ ప్రకాశయింట్లో బసచేసితిమి. హరిశ్చంద్ర ఘాటుకు రెండుపర్యాయములు వెళ్ళితిమి. అప్పుడు సత్యహరిశ్చంద్రునికి విశ్వామిత్రుడు కల్గించిన కష్టాలు తలుచుకొంటిమి. ఆ కథ నిజమైతే ఆ ఋషీశ్వరుడు "విశ్వామిత్రు" లెట్లా అన్నారామె! అది చాల వరకు కథ మాత్రమే నన్నా!

'ఐతే ఆ కాలంలో, మనుష్యులను అమ్మేవారా? అందునూ, భార్యలను అమ్ముకొనేవారా? ఎంత దుర్మార్గం. అదెంతెట అనాగరకము."

"ఈ బ్రిటీషువారి జడ్జి, మన ప్రభు-భార్య తాళిని జప్తు చేయించాడే, జరిమానాకుగాను. అందుకే బ్రిటిషు ప్రభుత్వాన్ని "ఛీ" అంటున్నాం. ఆ రోజుల్లో, చంద్రమతీదేవిని వేలం వేయటం తప్పని మన పురాణాలు యెందుకు ఘోషించలేదు" అన్నారు ఆమె.

"అప్పుడు కూడ, హరిజనులను అంత నీచంగా చూస్తుండిరే" అన్నది సుశీల.

"అందుకే మనం ఆ దురదృష్టపు పురాణ ఆచారాలను విడిరిస్తున్నాం."

అమ్మాయి సుశీల, బెనారెసు హిందు విశ్వవిద్యాలయమందు ఎఫ్.ఎ. చదువుచున్నది. అచ్చటె పిమ్మట ఆచార్య క్రిపలా

నీని పెండ్లాడిన సుచేతాజీ లెక్చరరుగా వుండిరి. విశ్వవిద్యాలయ నిర్మాత పండిత మదన మోహన మాలవ్యాను చూడటానికి వెళ్ళాము.

ఆయన్ను చూచి, భారతీదేవి సమ్మోహితులైరి. ఆ వృద్ధుని దెంత అందం! సన్నని. కోలమోము, ఆ నవ్వు, ఆ ప్రేమావతారం! నెమ్మదిగా లేచిరి. సుశీలను బుజ్జగించిరి.

భారతీదేవి నుద్దేశించి "మీ అమ్మాయిని మాకు వొప్పగించినారు, రంగా. శ్రీ ప్రకాశ! ఏవమ్మా నీకు తృప్తిగా వుందా" అంటూ "రంగా! ఆ కలకత్తా కాంగ్రెసు సమావేశములో యెంత బాధలనుభవిస్తిరి. పార్లమెంటు యెలాగా వున్నది! నీ పేరు పలు మారులు వింటున్నా! గొప్ప యుద్ధమే చేస్తున్నారు. ఆ రంగంలో"

"మీరు ముప్పై సంవత్సరాలుగా వేసిన బాటలలో, ధ్వనింపచేసిన రణ దుందుభుల సహాయము మాకు పట్టు గొమ్మలండీ" అన్నా. "మీలాగా రెండు మూడు గంటలు, అనర్గళంగా మాట్లాడుతూ, బ్రిటిషు పాలకులకు గుక్క తిరగకుండా చేయ గల్గువా రిప్పుడున్నా రా?"

"సత్యమూర్తి వున్నారుగా!" అన్నారు.

"ఒక్క పర్యాయమే; మీ రికార్డు వద్దకు కొంచెంగా రాకల్గినారు."

"మా బాబాయి, వొక గంటసేపు మాట్లాడారని మాతోడి విద్యార్థులు చెప్పుకుంటున్నారు. అదంతా లేబరు రక్షణ గురించే! మీలాగా అమృతధారలా అనిపిస్తూ, నిప్పురాజేస్తూ, బ్రిటిషు వారి దుర్మార్గాలను పద్యం, గద్యం, శ్లోకం అన్నిటిని మేళవించే, పల్కుల వీర్యము మాలవ్యాగారి నుండీ వచ్చేదని' ఆకాలంవారు యిప్పటికీ పార్లమెంటులో చెప్పుకుంటూ రండీ"అన్నా! వారెంతో తృప్తి చెందిరి.



వారి తమ్ముల కుమారుడు రమాకాంత సెంట్రలు అస్సెంబ్లీకి వచ్చిరి. అలహాబాదు పార్కులో వుండి, ఆ చెట్టు యీ చెట్టు చాటుచేసుకుంటూ, తుపాకితో గుండ్ల సారిస్తూ, గంటల పర్యంతం బ్రిటీషు పోలీసులతో వొంటరిగా యుద్ధంచేసి వీరమరణంజెందిన అజాద్‌ను పొగడుతూ గంభీరోపన్యాసము చేసి, మదన మోహనుని ప్రతిష్టను తిరిగి స్ఫురింప చేసిరి.

అదృష్టమున్న వారు, వారి బంధుల అస్థికలను, అలహాబాదు, ప్రయాగవద్ద, త్రివేణిలో కల్పుకుంటారు! "ఐతే మనవాళ్ళకేనా ఇట్టి నమ్మకాలు?"

"మహమ్మదీయులకు కూడా ఇలాంటి నమ్మకమే! నేను రౌండుటేబులు సభ సమయంలో ఇంగ్లాండులో ఉంటినే. అప్పుడు మన కాంగ్రెసు నాయకులు మహమ్మదాలీ చనిపోయిరి. తన్ను మెక్కాలో సమాధి చేయమని చెప్పిరి. తాను పుట్టిన దేశంగాదు. తన మతం పుట్టిన ప్రదేశం వారికి పవిత్రమైనది.

"అదేమన వారి గొప్పతనం. హిందువులైన వారంతా భారతదేశంలోనే, తమ అస్థికలను, మన నదులు, యేరులు, సముద్రాలలోనే కలసిపోవాలనుకునే ఆచారంలో వున్నాము. ఇదే దేశభక్తికి గొప్ప బలం! మా అమ్మ అస్తికలను మా నిడుబ్రోలు ప్రక్కనున్న చిన్న తుంగభద్రలోనే కలిపినారు. ఆయేరుకూడ సముద్రానికేగాచేరేది. అన్నా. త్రివేణీ, యీ గంగమ్మ తల్లీ అంతా! అందరు రాలేరుగా కాశీకి, ప్రయాగకు! ఎచ్చటున్నా ఆ నీరు గంగమ్మే! అన్ని గంగలు సముద్రానికే! అన్ని సంద్రాలు సూర్యుణ్ణి ఆవిరి రూపేణా కౌగలించుకుంటున్న" వన్నారు, అందుకే హిందువుల ప్లాను బ్రహ్మాండమైనది. పాత కాశీకి చేరాము. ఆ చిన్ని కోటను చూశాము. ఆరాజు కా[illegible]నే వుంటున్నారు. "అసలీ మహారాజులే మన దేశానికింత గతి గల్గించారు. ఆ జయచంద్రుడానాడు తన మేనల్లుడు, అల్లుడుగా పెరుగుటకు వోర్చుకోలేకనే

గదా, గజనీ మహమ్మదుతో మన దేశాన్ని మట్టిపాలు చేశాడు అను కుంటున్నారు" భారతీదేవి.

"ఇంకెన్నాళ్ళులే, వీళ్ళందరూ పదభ్రష్టులు కాబోతున్నారు! ఇక మన దేశంలో రిపబ్లికు యేర్పడుతుం" దన్నా!

"అందుకే ఆ రోజుల్లో మీరు నైజాం పెత్తనంమీద తిరుగ బడుతుంటే, నాకెంతో సంతోషం కల్గింది.

మా బసకు చేరాం! రాత్రి భోజనానంతరం శ్రీ ప్రకాశ్ తమ తండ్రి భగవాన్ దాసుగారివద్దకు మమ్ము తీసుకెళ్ళినారు. ఆ ఋషీశ్వరుడు ఆమెను ఆశీర్వదించారు. ఆ తెల్లటి గొప్పగడ్డం, ఆ వదులైన, తెల్లని గౌను, ఆనిండు తామర పుష్పాలలాంటి నయనాలు, ఆ బంగారు వన్నెల మొగము - ఆయనే భగవాన్‌దాసు. వారిని అసెంబ్లీ సభ్యులుగా వుండగా భారతీదేవి యెరుగుదురు. యీ సన్నివేశం అందరికీ యెంతో ఆనందంగా వున్నది.

"మీరు అస్సెంబ్లీలో వుంటే, గ్యాలరీ నుండి చూస్తూ ఎంతో ఆనంద పడేవారము" అన్నారు దేవి. "ఆసభలో నాకేమి తృప్తి కలుగలేదు. వయస్సులోవుండేవారికి ఆ కుస్తీపట్టులు తృప్తి కావచ్చునేమో! మన రంగా, శ్రీ ప్రకాష్ తనివితీర యుద్ధం చేస్తున్నారులే."

మేం సెలవు తీసుకొనే సమయానికి, అప్పటికే అందించబడ్డ తన పుస్తకం ''హిందూ సోషలిజం'' నాకు యిచ్చిరి.

''ఈ కాశీలో యిద్దరు ఋషీశ్వరులను చూచుకున్నాము మీరు, మీ మాలవ్యాజీ అన్నాం. ఆయన విశ్వవిద్యాలయానికి ప్రారంభంనేను, అనిబెసంటమ్మ, మా సెంట్రల్ కాలేజీద్వారా చేశాం". ఆ సంగతులన్నీ శ్రీ ప్రకాష్ చెప్పినారు "అనిబెసంటమ్మను నేను దర్శించాను. అడయారులో''ఆమె అన్నారు. వారెంతో సంతోషపడ్డారు.



శ్రీ ప్రకాష్ యిల్లు సుందరమైనది. అందువారి అతిథిగా మేము కొన్నాళ్ళు, వారి బిడ్డగా సుశీల కొన్నివారాలుగావుంటిమి. వారు మద్రాసు గవర్నరుగా వుంటూ ''మా గోభూమి''కి వచ్చిరి. తన బిడ్డ సుశీలబిడ్డ కమలేంద్ర కుమార్‌కు అక్షరాభ్యాసం చేసిరి. ప్రక్కనే వున్న బుచ్చినాయుడు కాలేజీ భవనాలకు స్తంభ ప్రతిష్ఠ జేసిరి. ఆనాడే సుప్రసిద్ధ షెనాయి గాయకులు, చిన్నమౌలా తన అమర సంగీత వాతావరణంచే మమ్మందరి అలరించిరి.

ఒక సాయంత్రం, గంగానదిపై బోటులో ప్రయాణం చేస్తున్నాము. సూర్యుడు చల్లగా వుంటూ తన బంగారు కాంతులచే, నదీజలాలను పండించి వేస్తున్నాడు. ''అవ్వేమిటి, అలా లేస్తూ త్రిప్పుకొంటూ పడిపోతున్న" వంటున్నది! సుశీల! "అవ్వే తాబేళ్ళు" అన్నారెవ్వరో! ''కాదు అవ్వి పెద్దచేపలు. ఆలాంటివి, ఇండియన్ ఓషన్‌లో చూచేవారం" అన్నారు దేవిజీ.

''ఐతే వాటి నెవ్వరు పట్టుకోరా?''

ఈ ఘాటుల కెదురుగా, ఎవ్వరు చేపల వేటాడరు. నదిలో పడుచుండే శవాలను తింటూ అంతగా బలసిపోతూంటవి" అన్నారు బోటు నడుపువారు.

''ఇన్ని శవాలు ప్రతిరోజూ నదిలో పడుచున్నా నది ఇంత పరిశుభ్రంగా వుండటాని కివేకారణం కాబోలు" అన్నా!

"ఇంతకీ మనవాళ్ళెంత ప్లానర్లు అండీ! రామేశ్వరంనుండి, పెద్ద చదువులు లేని వారిని గూడ యింతదూరం రప్పిస్తున్నారు. శబ్దాలనుండి. ఈనదిలో, యీ ఘాటులలో చనిపోయి, కలిసిపోతే, పుణ్యం అనే భావాన్ని మనవారి మనస్సుల్లో నిల్పినారు. రాగల్గిన ముసలివారంతా వస్తారు, చనిపోయేవరకు వుంటారు. మరణించేప్పుడు, తృప్తితో యీ గంగమ్మను చేరుకుంటారు."

కాశీకి దగ్గరలో, సారనాథ్ బౌద్ధ దేవాలయంకు వెళ్ళితిమి. "ఎంతో శాంతి, సుఖము, యోగనిద్ర కల్గును అనిపించుతుంది,

ప్రార్థన చేసుకుంటూంటె!" అన్నారు. ఆ విశ్వనాథుని దేవళంలో, మహాత్ములన్నట్లు, యెంత రద్దీ, బురద, అసహ్యం! మనవాళ్ళకు దేవుని వద్దగలభా చేసుకోవడమే ఇష్టమా?" అన్నారు.

ఆ ప్రక్కనే ఎంతో గుండ్రంగా, గొప్పగా, పడిపోయిన గోపురము లాగా వున్నది పురాతనపు స్తూపం! ఆ పరిసరాల్లో వనము వుండేదట. అందు బౌద్ధులు తమ ప్రధాన బోధలు ప్రథమంగా చేశారట.

"ధర్మం గచ్ఛామి" అన్నారుట బుద్ధుడు, బుద్ధం గచ్ఛామి యని, వారిని దర్శించి, వారి బోధలువిని, ఆనందించిన ప్రజలన్నారట.

"ధర్మం గచ్ఛామి-అని బౌద్ధు లన్నారు. ధర్మమనే ఆ మహత్తర భావం, ధోరణి, దోవను మన హిందూమతాధికారులు, మనువు పేరుతో వ్యాసులపేరుతో, పురాణాల కవనాలతో. కులాల అంతస్థులను, పురోహితుల ప్రాముఖ్యాన్ని, రాజులపాలనాన్ని, కోటీశ్వరుల ధనాధికారాన్ని నిలబెట్టుకొన్నారు ఏమి అన్యాయమండీ" అన్నారు. "బాబాయి! బుద్ధ భగవానులు సోషలిస్టేనా?" అన్నది మా సుశీల. "మంచిమాట అన్నది మన అమ్మాయి! ఆ ప్రేమమూర్తి ప్రతి మానవుని, జంతువును, క్రిమికీటకాదులను కూడా ప్రేమించమన్నాడు. మన పురోహితులు ఆయనని పూజిస్తారు. ఆయన బిడ్డలను హింసిస్తారు. బుద్ధునిదే ధర్మపథము" అన్నారు దేవీజీ!

ఆ సాయంత్రం, బౌద్ధులు ప్రార్థనలు చేశారు. మేమూ వారితో చేరినాము. ఆ సంగీతం హృదయశాంతి కల్గించినది. ప్రార్థన మందిరం ఎంతో సుందరంగా వున్నది. అట్లె ఢిల్లీ లోని దేవళాల్లో బుద్ధుని గుడిలోకూడ! "చిన్నదైనా, సాంచీలో ఈ మధ్య నిర్మింపబడిన దేవళంకూడా అందంగా, శాంతి ప్రదంగా వున్నదండీ "మీఅమ్మ మంగమ్మగారు! 'మదరాసులోని సాంతోము చర్చిలో ఎంత ప్రశాంతంగా వున్నదమ్మాయి' అన్నారు."



కాశీకి తిరిగి వచ్చిన తరువాత, దేశభక్తులు శివప్రసాదు గుప్త నిర్మించిన భారతమాత మందిరంలోకి వెళ్ళినాము. అందు భారతదేశపు మాపు స్వరూపాన్ని కొండలు, నదులు కన్పడునట్లుగా నేలమీద గొప్ప శ్రద్ధతో నిర్మించారు. విద్యార్థులకు ఆమాపు చూస్తే, మన దేశపు స్వరూపం సులభంగా తెలుస్తుంది.

అచ్చటినుండి, కాశీ విద్యాపీఠమునకు పోయినాము. దాన్ని పెంచుటలో శ్రీ ప్రకాష్ చాలా శ్రమించిరి. గుప్త తన ధనాన్ని అందించిరి. మా స్నేహితులు ఆచార్య నరేంద్రదేవ్ దాని ప్రధాన ఆచార్యులు.

"మనం నడువుచుండే రైతాంగ విద్యాలయం లాంటిదేగా! అయితే మనకు గుప్తలాంటివారు లేరు" అన్నారు.

"మా తాతయ్యలు. మా మామయ్య అందించారుగదా! రామానీడు భవనాలను.'

"మన పద్ధతే మంచిదండి. ఈ లక్షాధి కారులమీద ఎందుకు ఆధారపడడం! చూడండి. ఆ మహానుభావుడు మాలవ్యా. అంత విశ్వవిద్యాలయం, అన్ని భవనాలు నిర్మించితే ఎన్నిమాటలు కాని వారంటున్నారు! వాటిని నిర్వహించటం యెంతో కష్టం! యెంతో రాచకీయం! బోధలు చేయడమే మనలక్ష్యం" అన్నారు.

బెనారసునుండి అలహాబాదు వెళ్ళాము. ప్రయాగ అచ్చటున్నదిగదా! అందే నెహ్రూల ఆనందభవనాన్ని స్వరాజ్య భవనంగా మార్చుకున్నది. ఆ పట్టణమునుండే, లిబరలు నాయకులు, సర్ తేజ్ బహదురు సప్రూ, కుంజ్రూ, కాంగ్రెస్ నాయకులు పురుషోత్తందాసు టాండన్ జీ, కీ॥ శే॥ అజాదు అందిరి.

సప్రూ నాకు రౌండు టేబులు సభల సందర్భంలో మిత్రులైరి. కుంజ్రూ కేంద్ర పార్లమెంటులో, టాండన్ జీ కిసాను వుద్యమంలో! జవహరులాలు నెహ్రూ కాంగ్రెస్‌లో కలుస్తూ వుండిరి.

నదిపై బోటు ప్రయాణం చేశాము. త్రివేణిలో మా తల్లిదండ్రులు, మేనమామ, తాత అమ్మమ్మలను తలుచుకున్నా!

"మనమంతా కలిసిపోయేది, మన పెద్దలంతా అందుకున్నది యిచ్చేటేగదా!" అన్నారు, భారతీదేవి!

"బ్రాహ్మణులు వెన్నంటుతూ, పిండాలు వేస్తారా! మంత్రాలు చెప్పుతా" మన్నారు. "మాకొద్దు. మా ప్రార్థనలే పిండాలు. మంత్రాలు, పౌరోహితులు వద్ద"న్నా! నేను కవిరాజు రామస్వామి బోధనలు విని యున్నాగా!

మూడు దశాబ్దాలకు పిమ్మట, ఆమె అస్థికలు ఆ త్రివేణికి అందించునప్పుడు, మనమరాలు విజయలక్ష్మి, ఆమె భర్త నాగేశ్వరరావు మంత్రాలు చెప్పించితే వోర్చుకుంటి! నా ప్రార్థనలు మాత్రం నాకుతృప్తి! ఆమె ఆత్మశాంతికై పలుమారులు త్రివేణికి త్రివిధములుగా ప్రార్థనలు అందించుకుంటిని.

"ఎందుకింత పట్టుదలగా మనవారు యీ త్రివేణికి వచ్చేట్లు మన పురోహితులు చేస్తారు!" అన్నారు.

"ఉత్తరాది వారిట్లా దక్షిణాన వున్న ఎన్నో నదుల సంగమములు గల, సంగమేశ్వరాలకు రావడం ఆచారంగా లేదుగా! భారతదేశమంతా వొక్కటేననియా! ఐతే దక్షిణాదికి మాత్రం ఎందుకొచ్చి భారతియొక్క నిండు దర్శనం చేసుకోరాదు! ఇదంతా వుత్తరాది ఆధిక్యతకే! రాచకీయంలోనూ యింతే! మనదేశపు ప్రభుత్వము ఢిల్లీలోనే" అన్నా!

"రామేశ్వరానికి వాళ్ళూ వస్తున్నారుగా?" అన్నారు. ఏకొద్దిమందో! మనకు కాశీలో పోవాలనిపించినట్లు, వాళ్ళకు రామేశ్వరంలో చనిపోవాలనిపిస్తున్నదా? రామాయణం, భారత కథలు అలుతూ, పురాణాలు పుట్టిస్తూ వుత్తరాదినే పుణ్యమున్నటు, దక్షిణాన ఆ వాల్మీకి సృష్టిమాత్రమే నన్నట్లా మనకు



బోధలు చేశారు. రామస్వామిచౌదరి అదేగా ఖండిస్తున్నారు' అన్నారామె.

"ఇప్పుడీ కాంగ్రెసులో కూడా అంతే! ఆనాడు ఆచార్య త్రయం, యీనాడు రమణమహర్షి, రాధాకృష్ణ, విశ్వేశ్వరయ్య మనవారేగా అనుకుంటూ బోటులో సాగుతున్నాము.

వచ్చింది కోట! అంత అందమైనది కాదు. అది అక్బరుదా షాజహానుదా? ఢిల్లీ, ఆగ్రా, యెర్రకోటల సొగసు దీని కంద లేదు. గంగమ్మ తల్లిగాలుల ఆశీర్వాదాలు మాత్రం కొల్లలుగా అందుకుంటుంది.

అందుకు ముందొక పరియాయం అలహాబాదునకు సుశీలతో వెళ్ళి, జవహరులాలుగారి యింట్లో, వారు స్పెయిను రిపబ్లికు రక్షణకై జరిపిన సంప్రతింపులలో పాల్గొన్నా! అప్పుడే సుశీలను ఆయన ఆశీర్వదించిరి. తమ యిందిరమ్మకు, భారతీదేవిలాంటి తల్లీ కరవై పోయిందంటూ, సుశీలను బుజ్జగించినారు.

తిరిగి 1960లో వెళ్ళాను రాజాజీతో కలసి, రాచకీయ అంపశయ్యపై నున్న టాండన్ జీని కలుసుకున్నాం! "జవహరులాలు రాచకీయాధికార నిరంకుశమును ఆపలేకున్న త్రిమూర్తులం" అంటూ వారు చమత్కరించినారు మే "మిద్దరం ద్రోణ భీష్ములం, నీవే ఇక మన రైతులకై ప్రజాస్వామ్యమునకై పోరాడా"లన్నారు. ఆ మాటలు దేవీజీకి అందించగా "పెద్దలట్లా పూరిస్తారు లెండి. మనకెంత సత్తాయో, మనదెంత బలగమో అన్నీ ఆలోచించుకోవద్దా" అన్నారు గోభూమిలో నుండి దేవీజీ.

—:o:—

# ప్రభుత్వ భూములకు
# వ్యవసాయ కూలీలే వారసులు

స్వాతంత్ర్యయోధులకు రక్షణ కొంత యివ్వడం ధర్మమని స్వరాజ్యము లభించిన రెండు సంవత్సరాలకు అందరూ అంగీకరించిరి. ఎవ్వరు జైలుకు వెళ్ళిరో, అండరు గ్రౌండులో అన్నిటికి తెగించి శ్రమించిరో ఐ. యన్. ఏలో వుండిరో వారందరికి దేశం తరఫున గౌరవము అందించాలనుకున్నాం! అప్పుడు మంత్రులుగా వుండినవారు. అట్టి స్వరాజ్యయోధులకు, భూములివ్వాలన్నారు. కొన్ని రాష్ట్రాలలో, మద్రాసుతో సహా ఒక్కొక్కరికి మాగాణి భూమి ఐదు ఎకరాల మెట్టభూమి పది యెకరాలవంతున ఇవ్వజూపినారు నేను అప్పుడు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షునిగా వుంటూ, ఆ ప్రపోజలును వ్యతిరేకించితి. "అలాంటి ప్రభుత్వ భూములను ఎంతో కాలంనుండి భూదేవిని పూజిస్తూ భూవసతి లేకుండా కష్టపడుచుండిన వ్యవసాయ కూలీలకే ఇవ్వాలిగాని, స్వరాజ్యం సంపాదించిన యోధులు భూమిలేని, దిక్కులేని బీదలకు అడ్డం రాకూడదు" అన్నాను. నా ఆలోచనే ధర్మమైనదని భారతీదేవి అంగీకరించిరి. అందునూ, కొంత భూమి కల్గిన స్వాతంత్ర్యయోధులు అలాగా యివ్వబడుచున్న ప్రభుత్వపు భూములను స్వీకరించరాదన్నారు ఆమె! ఈనాందారీ పెత్తనం పోవాలంటూ, యీనాందారీ రైతుల హక్కులకై పోరాడుచున్న మా సోదరులు శ్రీ లక్ష్మీనారాయణ, స్వాతంత్ర్య యోధులు కూలీలకు, అందవలసిన భూములను కొత్త యీనాములుగా అంగీకరించరాదన్నారు.



మేము మరొక హెచ్చరిక చేసితిమి. బ్రిటిషు కాలమందే, జస్టిసుపార్టీ ప్రోత్సాహంమీద, అనాధీనంగా వుండిన, సాగుకు లాయకీగా వుండిన భూములను డి. సి. లాండుగా, అంటే వెనుకబడిన వారి కివ్వబడదగిన భూములుగా నిర్ణయించి వుండిరే! అట్టి భూములను స్వరాజ్య ప్రభుత్వము స్వాతంత్ర్య యోధులకు ఇస్తే, దీనజనుల నోట మట్టికొట్టినట్లుగాదా? అని సవాలు చేసితిమి.

ఆపైగా 1930 నుండి, మేము రైతుకూలీ సామరస్యము వాంఛించితిమి. పైకులాలవారి క్రిందే సాగవుచున్న భూములు 70 శాతం వుంటూ వుండెను. భూమి లేక, భూమిపై శ్రమించు కూలీలకు సాగుకు పనికివచ్చే అనాధీనంగా ప్రభుత్వం క్రిందనే వున్న భూమి వుండినది. అది మొత్తం వ్యవసాయపు భూమిలో నాల్గో వంతునకు మించి వుండినది, దాన్నంతా, వ్యవసాయ కూలీలకే యివ్వాలని, దాన్ని సాగుక్రిందకు తెచ్చుటకు అవసరమగు పరపతి, పరికరములు, పశువులు, తదితరము ప్రభుత్వము సప్లయి చేయుటకు జాతీయ ప్లాను అవసరమని మేము ప్రచారము చేస్తూ వుంటిమి. నిజమైన, నిర్మాణాత్మకమైన, అభివృద్ధి దాయకమైన సోషలిజము అలాగా కూలీలను స్వయంవృత్తికలవారిగా స్వంత ఉద్యోగులుగా చేయుటయేగదా! ఈ ప్రణాళికను 1936 లో నా "Modern Indian Peasant" అనే గ్రంథంలో చేర్చితిని. శ్రీగిరి దానికి సమ్మతించిరి. కనుక, ప్రభుత్వ భూములను, స్వంతభూములుగల స్వరాజ్యయోధుల కివ్వరాదంటిమి.

మంత్రులు మమ్ము స్వరాజ్య యోధులకు మధ్య బలహీనపరచుటకు గాబోలు మా వాదనను నిరాకరించిరి.

ముఖ్యమగు మంత్రులే, పెద్ద భూస్వాములయ్యు, కొలది కాలంలో మాగాణిగానో, బస్తీలలో నివేశన స్థలాలుగానో మారి, లక్షల ఖరీదు చేయబోయే భూములను ఒక్కొక్కరు పది యెకరాలుగా ఆక్రమించుకొనిరి.

మేముకూడ స్వరాజ్య యోధుల రక్షణ కోరితిమి. ఐనా వారికి ప్రతి నెలా యేదో పెన్షనులు ఇవ్వమంటిమి. భూములిస్తే కొందరు వాటిని అమ్ముకొందురు. ఆ తరువాత తిరిగి వారికి దౌర్భాగ్యమే! పెన్షను ఐతే, వారు చాలాకాలం జీవించాలని వారి బంధుమిత్రులు కోరుకుంటారు. జీవితపర్యంతం వారికి నిజమైన రక్షణ వుండును. మామాట చెల్లలేదు.

అందరు ప్రభుత్వ స్కీము ప్రకారమే భూమి గ్రాంటులకై పి. సి. సి.అధ్యక్షుడనైన నావద్ద సర్టిఫికెట్టులు కోరుచుండిరి. నేనూ అడిగిన దేశభక్తులైన యోధులకల్లా యిస్తూ వుంటిని.

నేను, భారతీదేవి, తమ్ములు, చెల్లెళ్ళు జైళ్ళకు వెళ్ళితిమి గదా! మాకు కూడా ఆ భూములు రావచ్చునే! సర్టిఫికెట్టులు అందరికి వలెనే, నేనే ఇచ్చుకోవచ్చు గదా వారందరికి! పైనాన్సు మినిస్టరే, అందుకుంటే, గొప్ప భూస్వాములే కావాలంటె, మేమేల వెనుకాడాలి! ఆనాటి ఆంధ్రప్రభ కొంతకాలం నా వాదనను బలపరచింది. తీసుకొన్న వారిని తిరిగి తమకు అందిన గ్రాంటుల త్యాగం చేయుమన్నది. ముఖ్య మంత్రులుగా పెరిగినవారిపై 1953 వరకు గొప్ప వ్యతిరేక ఆందోళన జరిగింది. తుదకు అందరూ, భూములందుకోవటం ఫరవాలేదనుకొన్నారు.

భారతీదేవి, లక్ష్మినారాయణ మాత్రం నాతో నిలబడిరి. 'వ్యవసాయ కూలీలకు ధర్మంగా అందించబడవలసిన భూములను స్వరాజ్య యోధులు ఆక్రమించరాదు' అనే ధర్మాన్నేబలపరచిరి. మేము కావాలనుకుంటే, ఆనాటి ఈనాటి ప్రభుత్వపు ఆర్డర్ల ప్రకారం మా ప్రతివాక్కరికి, ప్రత్తో, పుగాకో, మిరపో పండించు నిక్షేపమగు మెట్టభూమి ఎకరాకు 1974లో వేయి ముక్తా యిచ్చే భూమి పది ఎకరాలు తెచ్చుకొనేవారమే! ఇచ్చుకొనే వారమే ఆ 1950లోనే నేను పి. సి. సి. అధ్యక్షుడుగా వుండగానే! దాదాపు ఇరవై సంవత్సరాలబాటు, తన తల్లి తండ్రుల ద్వారా తనకందినది



మూడేఎకరాలైనా స్వాతంత్ర్య యోధులుగా తనకుగా తాను పది యెకరాలు అనుభవించ కల్గేవారె ఆమె!

కాని వారు అందుకు అంగీకరించలేదు. ఆ గ్రాంటుకు కక్కురితి చెందలేదు. ఆమె 'అట్టి భూమి అంతా వ్యవసాయ కూలీలకే వుండాలని' అన్నారు. ఈనాడు శ్రీమతి ఇందిరమ్మ పెత్తనంలో వ్యవసాయ కూలీలకు యేది భూమి?' అంటూ ఆరాటపడుచున్న మంత్రులు, సోషలిస్టు, కమ్యూనిస్టులు ఆనాడు మమ్ము బలపరచలేకుండిరి. ఇప్పుడు సీలింగుద్వారా కొంద? భూములను లాగి, తీసి, భూమిలేని వారికివ్వాలని గొప్ప విప్లవకార్యం సాగించ బూనితే, ప్రభుత్వపు స్వంత భూములనే స్వరాజ్య యోధులు ఆక్రమించి వేసినారుగదా! అలాగా అట్టి నిజమైన పరీక్షలో నెగ్గిరి భారతీదేవి, లక్ష్మినారాయణ. వాస్తవమైన రైతుకూలీ సామరస్యముకై నిలబడిరి. వారే నిర్వచించిన ధర్మమును వారే నిండుగా త్యాగులై పాటించిరి. అదే ధర్మపాలన, మరి కొందరట్టివారుండవచ్చు. భారతీదేవి మాత్రము ఆదర్శపాయంగా అందుచున్న భూమిని, ఇవ్వబడుచున్న భూమిని, తన హక్కుగా నిర్ణయింపబడుచున్న భూమిని, తనకు తానై, "వద్దు. నాకొద్దు". అది మా కూలీలకే 'భూమిలేని భూమి సేవకులకే' అన్న స్వధర్మ సూత్రము నిర్వచించిరి, పాలించిరి.

—o—

# మైసూరు

భారతీదేవి ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయంలో, ప్రసిద్ధ ఆర్టిస్టు, ఆర్టు క్రిటిక్, రచయిత, వేదాంతియగు రస్కిను పేరున వుండిన కళాశాలలో కళోపాసన చేసిరి. అది ఉద్యోగాపేక్షతో కాదు. కళాకాంతులు గల్గిన జీవితము, ప్రజాసామాన్యమును సేవించుటలో నైతిక శక్తి కళారాధన పెంచుటకే! రస్కిను వ్రాసిన "Unto the Last" అనే ఉద్గ్రంథమును చదువుటవల్లనే మహాత్ములు అధిక వుత్తేజం పొందిరని, నేను ఆమహనీయుని సేవా ధోరణిని మెచ్చుకుంటున్నానని దేవికి తెలుసు.

ఆ రస్కిను కళాశాలలో చదువు కున్నందువల్ల, అంతకు పూర్వం, శారదా నికేతనంలో, విద్యోదయంలో పొందిన శిక్షణకు నాగార్జునకొండ, అమరావతి బుద్ధుల, అజంతా ఫ్రెస్కోలగురించి, దామెర్ల రామారావు చిత్రాలు వగైరాల గురించిన చదువులకు మెరుగులందినవి. ఇంగ్లండులో వుండగానే, కృష్ణాపత్రిక, సంక్రాంతి సంచికలో, అడవి బాపిరాజు వ్రాసిన మాటల వరుసలు, చిత్ర పటాల సొగసులు గమనించిరి. ప్రిన్సు ఆల్బర్టు మ్యూజియంలో నుండిన మొగలాయి, మినియేచరు (చిన్న)బొమ్మలను చూచి ఆనందించిరి. బ్రిటిషువారి, ఫ్రెంచివారి చిత్రశాలలను దర్శించిరి. ఫ్రాన్సులో, ఇటలీలో చర్చిలపైనున్న శిల్పాలు, లోపల అద్దాలపై వెల్గుచున్న చిత్రాలను మెచ్చుకొనిరి.

ఆయనుభవాల ప్రేరణచే, భారతీయ శిల్పాలను చూడాలనే కోరిక, భారతీదేవికి నాకంటె హెచ్చుగానే పెరిగినది. ఐతే



తిరుగుటకు నేనుబొందిన అవకాశాలు వారి కందలేదు. ఎన్నిటినో, ఎన్నెన్నో మారులు చూచుటకు! చూచినంతవరకు, నాకంటె సుఖ వుగా, శక్తివంతంగా, హెచ్చుగా ఆనందమును, వారు ఆస్వాదించ గల్గుచుండిరి. నాకున్న వరవడికి మెరుగులు పెట్టుచుండేవారు. ఎన్నెన్నో హృదయోల్లాసం కల్పించే ఆలోచనలు వారు అందిస్తూ వుంటే నేను వుత్తేజితుడ నగుచుంటేవాడను. డాక్టరు సత్యనారాయణగారి "భారతీయకళ గ్రంథాన్నంతో మెచ్చుకొనేవారు నాగార్జున, అమరావతీశిల్పాలను 1935లో 95ꣳలో తిరిగి 1960లో దర్శించితిమి. ఆ పాలరాతిపై పాలుగారు సోయగముల నెన్నో చూచి ఆనందించితిమి! ఆమెకా కళాఖండాలు ఆత్మీయమైన పఠన గ్రంథాలు. ప్రథమంగా బ్రిటీషు మ్యూజియంలో చూచిరి. పిమ్మట కలకత్తా మ్యూజియంలో పరామర్శించిరి. ఆవిధంగా ఆమె భారతీయ కళావైదగ్ధ్యమును గ్రహించుచుండిరి.

అలాగా వెళ్ళాము ఒకసారి మైసూరుకు! అది విజయదశమి. మన దేశానికంతా అదొక సుదినము. ఆ రాత్రి అన్నీ దీపాలే! ఆ రాజ సౌధము ముందు మాకారుకు ముందు నిల్చున్నాము. వస్తున్నదా లక్ష కాగడాలు సమయం! గడియారం చూడ్డానికి కూడా భయం! ఈలోపే వెల్గులు వస్తేయెట్లా? సెకండులుకూడ లెఖ్ఖ! అదీ! అదుగో, యిదిగో, అనుకొన్నా. తళుక్కుమన్నది. అంతా వెలుగే! నెమ్మదైన, కమ్మనైన దిగ్భ్రాంతి కల్గించే వెలుగు! చంద్రుని వెన్నెలా? బంగారు కాంతులుగా? ఇంతలో స్వరూపము సాక్షాత్కరించినది! అదే ఆ మహలు అదొక అందమైన బొమ్మ! ఎంతో పెద్దబొమ్మ! మహారాజులు వూహించిన బొమ్మ.

ఆ సొగసుల చిత్రమును చూస్తూ వున్నారు. నే నేమో మాటలు దొర్లించాలనుకుంటున్నా! మాటలు వస్తేగా! ఆమె అలా చూస్తూ, తన ఆనందమును, మాటలు లేని కవనం ద్వారా, నాకొక నవ్య శోభలదేవిగా కన్పించుతున్నారు.

ఏది యెక్కువసొగసు? ఆ లక్షల ఎలక్ట్రిక్ దీపాలచే వెల్గుచున్న ఆమహలా? అన్నిటినుంచి తానేదో అందుకొని ప్రతిబింబిస్తున్న ఆ భారతీదేవి ముఖారవిందమా! అలాగా ఆనందించితిమి ఆ అరుదైన ఆసుఖ సమయాన ఆ సన్నివేశాన్ని. అక్కడనుండి, వాయువేగంతో, మరోమారు మీర్జా యిస్మాయిల్ నిర్మించిన, కృష్ణరాజ సాగరు జిల్లాలలో ఆటలాడుచున్న బృందావనానికి! ఎన్నిరంగుల్లో నవ్వులాడుచున్నవా జలబిందువులు. ఎంతచురుకుగా, పరుగెత్తుచున్నవా, మెట్టునుండి మెట్లు దాటుకుంటూ మమ్మెవ్వరు అందుకోగల రంటూ ఆ జలధారలు! ప్రతిజల ధార ప్రక్క, అంత సుకుమారంగా, గుబురుగా, చల్లని తుంపురుల నాహ్వానించుకుంటూ, సొగసుల ప్రోవులుగా, రంగురంగుల మాలలుగా వెల్గుచున్నవా పుష్పవల్లికలు! వాటిని చూస్తూ, ఆ చెంగు చెంగున ఎగిరెగిరి, అటునిటు విసురుకుంటున్న "స్ప్రింగు" జలాల పొంగులతో సరసాలాడు కుంటూవుంటిమి. ఆ సొగసులను, కళోపాసియగు ఆమె నిండుగా మ్రింగుచున్నారు, తిరిగి ప్రతిబింబిస్తున్నారు, తన మిరుమిట్లు గొల్పే ఆ చిరునవ్వుల ద్వారా!

"కాశ్మీరపు సొగసులను మొగలాయి వా రేర్పరచితే, దక్షిణాత్య సంస్కారమును జూరుకున్న మీర్జాయిస్మాయిలు యీ బృందావనాన్ని రూపొందించిరి. భళే" అన్నారు ఆమె. మరునాడు వెళ్తున్నాము! "అల్లంత దూరంలో చూస్తారా ఇటు, ఆఎత్తయిన ఎదురు లేనట్టి మిట్టమీద, సూదిలాగ వున్నది. చూడ"మన్నా, "కన్పడ్డది అదేనా?" అంటూ వుండగా, క్రమంగా పెద్దదిగా కన్పడుచున్నది. అదే ఆ తీర్థంకరుని శిలావిగ్రహం. ఆ మిట్టక్రిందకు త్వరితంగానే చేరితిమి! అదొక చిన్నగ్రామం! క్రిందే కోలాహలం లేదు. క్రమంగా గుట్టవద్దకు వెళ్లాం. ఏమంత కన్పడ్డంలేదే! సన్నగా, పెద్దగా, నడుములు విరిచేదిలా ఉన్నదా కొండపైకి దారి.



ఎక్కుతున్నాం! "కష్టమండి యీ కాలిదారి ఇంకెంతసేపు?" అంటున్నారు ఒక గేటు అందుకొన్నాం "కొంచెంసేపు ఆగండి, గుండె ఆగిపోయెలావుంది. ఎంత ఆయాసం" అన్నారు.

నాతో ధర్మాస్ ఫ్లాస్కులో తెచ్చిన నీరు ఇచ్చినా, కొంతసేపు ఆగి తిరిగి బైలుదేరాము. అందుకున్నాము. "అబ్బో, వీరేనా, అంత యెత్తునుండి కొండ శిఖరాన్ని తొలుచుకుంటూ, ఇంత విగ్రహాన్ని రూపొందించిరే! ఏ నాల్గు, ఐదునెలల క్రితమో, ఆ శిల్పుల సుత్తెలు పనిచేసినవనిపిస్తుంది. ఎంత క్రొత్తదనం మరెంతటి సున్నితపు పలుకుల రాతి కదలికలు, కళవళికలు, నావంక తిరిగి "యింతటి ప్రాణం యీ కొండకు పోసిన ఆ శిల్పులు మనవారేనా? వారి వంశీకులేనా మన యీనాటి భారత శిల్పులు?" అన్నారు.

నేనంతకు మునుపు రెండు మారులా గంభీరమగు, శ్రావణ బెలగోలస్వామిని దర్శించినా! ఆ విగ్రహ సర్వాంగ సౌష్ఠవమును అభినందించుకొన్నా! ఐతే! అప్పుడు నేను అసంపూర్ణుడను.

ఆ పాదాలు చూచారా! ఆ కాళ్ళగోళ్ళు! అబ్బ ఎంత సొగసు. ఒత్తితే, నెత్తురు వుబుకునా, అనిపిస్తున్నదన్నారు.

ఆ పాదాలకు పూజలు చేశాము. ఆ జైన ఋషీశ్వరుడు మానవులనే గాక సకల జీవరాసుల ప్రేమించిరి. ఆశీర్వదిస్తున్నారు యీనాడు కూడా! తన్ను బలంగా పూపాలని, ఎన్నెన్నో శతాబ్దాల నుండి వోడిపోతున్న ఆ పెనుగాలి జూచి జాలిపడుతున్నారా!

'అన్నిజీవుల ప్రేమించు జైనులనా మనవారు హింసించిరన్నారామె! "మత పిచ్చండీ! జైనులుకూడా అట్టి దారుణాలే జరిపిరి. పరస్పర వైరుధ్యములో, తమ ఆశయాలు మరచిపోయిరి, పోతాము. ఆవేశాలే అందరిని ఆక్రమించుతాయి. అప్పుడు దయా లేదు! ధర్మంలేదు. ఇదే చరిత్రయొక్క కథనం! ఈనాడు స్వతంత్రులైన మనరైతులపై కాంగ్రెసుకు కమ్యూనిష్టులకు యింత వ్యతిరేకత యెందుకు?

"క్షణంలో రాచకీయములా?" అన్నారు. పన్నెండు సంవత్సరాల కొకమారు శైవభక్తులు అదేపనిగా రోజుల పర్యంతం, పాలతో ఆ సుందరమగు, దయామయవిగ్రహాన్ని, అరవై ఆరు-అడుగుల స్వరూపాన్ని అభిషేకం చేస్తారట! అలా అందిన చల్లదనం వల్ల తిరిగి పండుగ వచ్చేవరకు అనుదినం వీస్తున్నగాలి, యెండల తాపం, హేమంతుని చలి, అన్నిటివల్ల వల్లకల్గే ఒత్తిడి, ఒరపిడులపై జయం కల్గునట!!

"రంగాజీ! మన పొన్నూరులో, అంతటి ఆంజనేయులను, మరంతటి గరుత్మంతుని, ఆ గుంటూరు ప్రాంతపు చిన్న కొండరాతి నుండి తొలిచి, చిత్రించి, రూపం కల్గించి ప్రాణంపోసిన శిల్పకారుడు యీ మహాశిల్పాన్ని కొండ శిబిరమునుండి తేలుస్తూ, రాతి ఛాతిపై నిల్పిన ఆనాటి శిల్పాల తాత వంగడానికి చెందినవారే కాబోలు!"

"ఇదుగో. మనదేశం చిరంజీవి! ఆ నాటినుండి ఈనాటివరకు వున్నారు, యిక ముందు వుంటారు. అంతటి శిల్పులేగాదు. కళాకారులేగాదు. ఆజైన తీర్థంకరులు, బుద్ధభిక్షుకులు, రమణమహర్షులు, గాంధీజీ," అంటూ వున్నారు భారతీదేవి!

ఆ సాయంత్రానికి వెళ్ళాము, మేల్కోటె, హెలెబిడే! అచ్చటి దేవాలయములు నల్లరాయిని వంచగా, తొలవగా, ముద్దులొలుకునట్లు మలచగా, అందాలతో, ఆలోచనలతో, చరిత్రలతో వున్నవి మన పురాణ కథలు. అవ్వి కథలు, కవనాలతో దశాబ్దాల మీద రూపొందించబడ్డ శిల్పకారుల సృష్టి! మహాశిల్పులెందరో ఎంతగా తపస్సుచేసిరో! శ్రమించిరో! చాముండేశ్వరీ దేవళాన్ని చూచితిమి. దారిలో అందిన ఆ మహానంది విగ్రహాన్ని పల్కరించితిమి, రామేశ్వర మందలి నంది, వరంగల్లులోని నిగనిగలాడే నిండు నంది యీలాగే వుండునన్నారామె "శైవుల కింత ప్రేమ. నంది విగ్రహముపై ఎందుకో యింత ప్రేమ. ఆ కళ్ళు చూడండి. ఇదిగో



ఈ తోక యెలాగా మలుపుతీరి వున్నదో! మన వ్యవసాయిక జీవితానికి నందేగదా ప్రధాన సాధనం".

వారంతా ఎవ్వరి ప్రేరణవల్ల అలాగా శ్రమించిరన్నా!

"మనం ఎవ్వరి బలవంతంవల్ల యీ సేవావ్రతాన్ని సాగిస్తునాం?" అన్నారు. "ప్రజలు దీనులై వుంటే దేవుడే మనలాంటి వారిని ప్రేరేపిస్తుంటాడు! మన హృదయాలే ద్రవించి, కరుణారసమును చిల్కుతుంటాయి" అన్నారామె!

వాళ్ళు జైనులా! వీళ్ళు వైష్ణవులా! ఆ శిల్పుల మధ్యకూడా ఆయుగాల్లో కలహాలా! మాటలతో నేనా! సుత్తులతోటే, వారు యుద్ధాలు చేశారు?

"ఏమో! ఆ రాజులు యేవి నిర్మించమంటె, అలా ఆర్డరు ప్రకారం చెక్కడానికి వారు సిద్ధమా! కొందరు వొప్పుకున్నా, యింతటి అందం, ఆర్ద్రిత, ప్రాణం, పట్టు, పెట్టు ఈ నల్లరాతిలో, ఆ తెలుపు - నలుపు గరపకొండ కండలమీద, దేవుళ్ళవలెనే ప్రతిబింబించగలరా? వారు ఆయా మతాల బోధలలో యోగముద్ర చెందినవారు.

ఆరోములో, సెంటుపీటరు, ప్రక్కనున్నచర్చిలలో చూచాము ఆ విగ్రహాలను, చిత్రాలను! ఆమైకేలు ఏంజలో యొక్క సృష్టిని, మహాశిల్పి జక్కనగురించికూడా సినిమాలనుకూడా చూచితిగదా! వారు సిద్ధులు. సిద్ధహస్తులు."

"చూడండి, యీ శ్రీకృష్ణుని గాథలు, ఇదంతా, భాగవతమండి. ఒకొక్క ఫలకములో వొకొక్క కథ! పోతే యిది చిన్నబిడ్డలకుకూడ అర్థమయ్యేలా వుందే! పెద్దవారికి ఉత్సాహంగా వుంటుంది. ఈ కాళింగమర్దనుడు! ఈ జలకాల చిలిపి కృష్ణుడు ఈ భగవద్గీతా వేదాంత బోధకుడు! అందమైన కృష్ణుడు, ఆనందముల విరజిమ్ము కృష్ణుడు. ఈ కఠినమైన నల్లరాయిని వెన్న

ముద్దలాగా ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌లాగా, మలచినారు ఆ శిల్పులు!" అంటూ వొక్కొక్క సృష్టినిచూచి ఆనందించిరి. వారి ఉలులను తేనెలో ముంచేవారేమో? వచ్చినాము, నరసింహావతారం వద్దకు. వెళ్ళాము రావణాసురుడు మహేంద్రగిరిని ఎత్తుచున్న ఫలకంవద్దకు. రాముల నెదిరిస్తూ, అస్త్రము సారిస్తున్నారు.

ఆ హిరణ్యకశ్యపుడు హిట్లరు లాంటివారా! స్టాలిను వంటి వారా! ఐతే చరిత్రలో ఎందరో డిక్టేటర్లు!

ఈలాగా, చక్రం తిరుగుతూనే వుంటుంది. ఈలాగే రామాయణ కథలను, జావా, సుమిత్రా కంబోడియాలోగల దేవళాల మీద (అంకోర్ వాట్, మరెన్నో) పది, పదకొండు శతాబ్దాల క్రీతమే, భారత శిల్పులు చెక్కిరని నేను చెప్పితి. "సాధారణ జనాలకు చదువులు పెంచకపోయినా వారి నైతిక విద్యా వ్యాపకముకొరకై యీ దృశ్య చైత్యములనైనా ఆనాటి హైందవులు నిర్మించు కొన్నారమ్మా. మనవాళ్లు మంచి సైకాలజిస్టులే. చరిత్రగమనం యుగాల పర్యంతం తెలిపినవారే! అందుకే "యుగే యుగే యీ బాధలు, మనలాంటి వాళ్ళకు ఎప్పుడూ పని వుండనె వుంటుందిలే" అన్నా!

"ఎందుకూ? కష్టాలకేగా!" "అందరూ సుఖాలే కోరుకొంటూ, అందుకోలేక, కష్టాలు యెదుర్కొంటున్నప్పుడు యేడ్చుకుంటూవుంటే, వారి నోదార్చుటకు అన్నిటిని యెదుర్కొగల కొంత మందైనా ఉండొద్దా," అన్నాను." మాటలతోనైనా మతులు నిల్పుతారు లెండి" అన్నారు.

ఈలాగా ఆ మహత్తర శిల్పాల రాసులను గౌరవించుకొంటిమి. ఆ శిల్పులకు జోహారు లందించితిమి. ఆ విగ్రహాల అందాలు చూపులకు మించిపోయినవి. వూహలకు మాత్రమే అందుచున్నవి.



అమ్మయ్యో, ఆ సృష్టిని మహమ్మదీయులు ధ్వంసం చేయజాలరైరి.

ఆ "మేల్కోటే" వైష్ణవ దేవళం, హరిజనాభ్యుదయం కోరుకునే, గాంధీజీ శిష్యులందరికి పవిత్రమైనది. ఆ 1933 మేనెల యెర్రటి యెండలో, గుంటూరు, కృష్ణా, నెల్లూరు, గోదావరులలో టూరుచేస్తూ, అంటరానితన మీద యుద్ధం చేస్తూన్నప్పుడు ప్రతిరోజూ "మేల్కోటె" గురించి చెప్పుకొనేవాళ్ళం. అచ్చటే రామానుజుల కాలంనుండి, వందల సంవత్సరాలుగా, యేడాదికొకనాడు హరిజనులకు ఆ దేవళంలోకి ప్రవేశం వుండేదని, కనుక ఒకనాడు లేని అంటు ఒకనాడు సాటిమానవులుగా, సభ్య భక్తులుగా అందిన హరిజనులకు, తరువాత ఎటుల" అంటు వుండునని సవాలు చేశేవారము. ఆవిషయాలు భారతీదేవికి స్ఫురణకు వచ్చినవి.

"మన పురోహితులు, యోగులు, బండితులు, కూలీలు, ఎంతగా తమ్ము తాము మోసగించు కుంటూ వుండినారండీ"

"ఇలాగేగా! అమెరికన్లు బానిసత్వాన్ని రద్దుచేశామంటూనే' నీగ్రోల దూరంగా నిల్పుచున్నా" రంటిని.

ఇప్పటికి కూడ మన మూలచట్టంలో అంటరానితనాన్ని రద్దుచేశాముగదా! కాని మనవూళ్ళల్లో ఎలావుందో చూడండి, ఆశ్చర్యమేమంటే 1933లోనే మాఅమ్మ, మీరంతా దాన్ని విసరివేశారుగదా! 1925లో వెలివేశామని మిగిలిన వాళ్ళంటే, 'మిమ్ము మేము వెలివేశాము' అని మీరు నాతోటి వుంటిరిగదా' అన్నాను.

మే మిద్దరం సాంచీ స్తూపముపై తోరణాల చిత్రాలను చూచితిమి. వాటిని తొలచిన, మలచిన శిల్పులు ఆంధ్రులను కొంటిమి. కాకతీయుల నాటి రామప్ప దేవళంపైన, లోపల బారులు తీర్చివున్న అపురూపమగు ప్రతిమల జూచితిమి. లోతట్టు

# గోభూమి - వ్యవసాయపు అనుభవాలు

భారతీదేవి స్వయంగా వ్యవసాయంచేసే, చేయించే బాధ్యత 1936నుండి శిరసావహించినారు. నిడుబ్రోలు రైతులలో హెచ్చుగా భూములు కలిగినవారు, చిన్న కమతాలవారు ప్రత్యేక శ్రద్ధచేస్తూ వుండే రైతులందరు, ఆమె అవలంబిస్తూవుండే, వ్యవసాయ నిర్వహణ ధోరణులను గమనించేవారు. పంటల ఫలసాయం యితరులకు అనేకపరియాయములు, వారికంటె, హెచ్చుగా అందుచున్నా పొదుపైన, శ్రద్ధతోటి, భూసారమును రక్షించుకుంటూ, పెంచుకుంటూ వివిధ పంటలను వేస్తూ, పండించుతూ వుండడంలో ఆమె పద్ధతులు ఆదర్శమైన వనుకొనేవారు.

బాపట్ల, తెనాలి, రేపల్లె తాలూకాలలో పశువుల, వ్యవసాయ ప్రదర్శనములు సాగుతూవుంటే, వాటిని ప్రోత్సహించడానికి ఆమె వుత్సాహపడేవారు, అందుకే తాము పండిస్తున్నవివిధపండ్లు, పెంచుతున్న పశువులను ఆ ప్రదర్శనాలకు పంపేవారు.

మా సమీపమలో, గోవాడ, చినకోటప్ప తిరునాళ్ళలో శివరాత్రినాడు అట్టి ప్రదర్శనములను శ్రీ ఆలపాటి సూర్యనారాయణ రైతు సంఘముద్వారా జరిపిస్తువుండేవారు, ఆ ప్రదర్శనంలో ఒక్క సంవత్సరం మా తోటలోని దానిమ్మ పండునకు ప్రైజు వచ్చిందట. మరో సంవత్సరం, నాకు ప్రియపాత్రమైన బహు సుందరమైన "సీత" అనే ఆవుకు మొదటి ప్రైజు వచ్చినది.

"ప్రైజుల కొరకుగాదండీ. నేను యీ ప్రదర్శనాల్లో పాల్గొనేది! భారతీదేవికూడ తమవలెనే, రైతాంగ కృషిచేస్తున్నారు.



అలాగే శ్రద్ధ చేస్తుండే మరింతగా అభిమానం, వుత్సాహం రైతులకు కల్గుతుందని!" అన్నారు.

ఎంతో కాలం నుండి మేమిద్దరం అనుకుంటూ వుంటిమి. వరి పండించే రైతులు వొక్క-మాగాణి వరిపంటమీదనే ఆధారపడితే మంచిదికాదు. పాడి పెంచుకోవాలి, కూరగాయలు, పండ్ల చెట్లు వేసుకోవాలి. కోళ్ళు, గొర్రెలు పెంచాలి. మిగిలివుండే గడ్డిని, కుటుంబానికి మించిన ప్రతివస్తువులను అమ్ముకునే అలవాటు పెంచుకోవాలని, వెనుకటి కాలములోవలె, నెయ్యి, పాలు, పెరుగు వగైరాలు అమ్ముకోరాదనే పిచ్చి వదులుకోవాలి.

తమ అవసరాలకు ఎన్నెన్నో క్రొత్త వస్తువులు ఎలాగా డబ్బులుపెట్టి రైతులు కొనుక్కోవలసి వస్తుందో, అలాగా తమ, తమ చిన్న పెద్ద కమతాలలో, దొడ్లల్లో వివిధ కూరగాయలు, పశువులను పెంచుకోవాలి. వాటిని అమ్ముకోవాలి. చిన్న, పెద్ద మొత్తాలుగా అలాగా వ్యాపారం ద్వారా వచ్చిన సొమ్ముతో, వ్యవసాయ ఖర్చులకు సర్దుకోవాలని, రైతాంగానికి బోధిస్తూవుంటిమి.

అటులే, తానుకూడా ఆదర్శ ప్రాయంగా వివిధ వస్తువులు, వ్యాసంగములు వ్యవసాయ పరిశ్రమను సాగించుటకు భారతీదేవి, అభిమాన పడకుండా, శ్రమించేవారు.

ఎన్నెన్నో రకాల కోళ్ళను అప్పుడప్పుడు తెప్పించి, పెంచేవారు. కొరుకురోగం వస్తూ, వొక్కొక్క-మారు అన్నీ చస్తూవున్నా, విసుగు జెందకుండా తిరిగి మరోరకపు పెట్టలను తెప్పించేవారు.

తేనె పెట్టెలు పెట్టిరి. తుట్టెలనుండి, తేనె వెలిదీయుటకు, మరడబ్బాలను తెప్పించిరి. క్రొత్త కూరగాయ విత్తనాలను చల్లుతుండేవారు. పురుగులు పడకుండా, పడ్డ తర్వాత, అవసరమైన మందులను వాడేవారు.

సపోటా, నారింజ, కొబ్బరి పండ్లను ఆయా సీజనులో ధారాళంగా సంపాదించగల్గిరి. గోభూమిలో యీలాంటి పండ్ల అవసరం హెచ్చుగదా! ఐనా మిగిలినవాటిని మార్కెట్టుకు పంపించమంటిని. అప్పుడే అలాగా కొద్దికొద్దిగా పండ్లు, కూరగాయలు అందుకొనే వారికి నామూషీ పడకుండా, మార్కెట్టుకు పోవడానికి, దారి చూపెట్టాలంటిని. కొంతకాలం పట్టింది నా సలహా పాటించడానికి. క్రమంగా భారతీదేవి తోట పంటలు మా పొన్నూరు మార్కెట్టులోకి చేరుతుండేవి.

చెరుకు వేస్తె మా వూళ్ళో రైతులకు లాభం కల్గునంటిని. తానే వేసిరి. ఇతరులకు లాభం కల్గిందిగాని, తనకు గిట్టింపు కాలేదట.

"ప్రత్తి వేయరాదా?" అంటిని. తన అన్నయ్యా తిరుపతయ్యగారిచేత వేయించిరి. వారికి గిట్టింపు కాలేదట.

తమలపాకుతోట వేయటం లాభంగా వుందన్నారు. ప్రతి యకరానికి ఐదారువేల పెట్టుబడితో, భూమి లెవెలు పెంచాలి. పదివేలతో పంపింగు యింజను, బావి, షెడ్డు వేయాలి "ఐనా పూనుకొనండి" అన్నా!

"అన్నీ చెప్పుతారు, అంత డబ్బెక్కడున్నది మీరేమీ యివ్వరు. అప్పులెట్లా తిరిగి చేయడం?" అంటూనే నాల్గు సంవత్సరాలలో అంతా పెట్టుబడి పెట్టిరి. భూమిని తయారుచేసిరి.

మాగాణి గట్టులపై గోదావరి జిల్లాలలోవలెనే, అరటిచెట్లు వేస్తే అందం, ఆదాయం కల్గుతుందనుకున్నాం! కొంతగా ప్రయత్నం చేశాం! అంతగా ఫలించలేదు. కొబ్బరి మొక్కలు నాటితే! రెండు సంవత్సరాలైన తరువాత, వేయించినారు. మొక్కలు తెచ్చినవారి అశ్రద్ధ, ప్రక్క చేలవారి వత్తిడి వల్ల సగంచెట్లు అందలేదు. మిగిలినవి లాభసాటిగా వుంటూవున్నవి. సాగరునీరు వస్తున్నందువల్ల, దాళా (రెండోపంట) వేద్దామన్నారు. వేసిరి



శ్రీనగర్ (కాశ్మీరు) లోని "నిషాద్ బాగ్" లో
రంగాజీ, భారతీదేవి (1957)

'గోభూమి'కి విచ్చేసిన ప్రముఖులతో ...
ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ శ్రీ వి. ఎస్. కృష్ణ, గవర్నర్ శ్రీ శ్రీ ప్రకాశగారలతో
దేవిజీ, రంగాజీ. (1953)



దోమలు పెరిగినవి. పైరులకు జబ్బులు క్రొత్తగా వచ్చినవి. పంట సమంగా, అందరికీ తృప్తిగా రాలేదు. ఎలుకల బాధ హెచ్చై పోతున్నది. ఆపైన ఖర్చులు విపరీతం! అందుకని దాళ్వా వద్దను కున్నారు. ఆమెకు దాళ్వా నిర్వహణం అతిభారమైపోయింది.

ప్రతి సంవత్సరం భూములను, పంటకాల్వలను మరమ్మతు చేయించాలి. మట్టిని తిరుగవేయాలి. దొడ్లో ఎరువులు మాగేట్టు చూడాలి. నీరువచ్చే సమయానికి దొడ్లోని ఎరువులను చల్లించాలి. రసాయనపు యెరువులను సమయానుకూలంగా చేర్చాలి, చల్లించాలి. పైరు పెంపకం, వారం, వారం గమనిస్తూ, రసాయనపు ఎరువులను, ఎట్టివి, ఎంతగా వేయాలో తెలుసుకోవాలి. ఆలస్యంగాకుండా చల్లించాలి. ఇంతలో పురుగులవల్ల, సముద్రపుగాలివల్ల తెగుళ్ళు, కల్గుచుండటం గమ నించి తగిలిన మందులు వాడాలి! వేయి కళ్ళు పెట్టుకొని ప్రతి సాయంత్రం, ఆనాటికి పైరు పెరగడం, నీటిసప్లయి, కదలిక యెలాగవుందో గమనించి మరునాడుయేమేమి జాగ్రత్త పడాలో తెల్సుకోవాలి. ఇలాగా ప్రతిదినం అందరు రైతులవలెనే తానూ సృష్టితో, పైరులతో సంసారం నడుపుతుండేవారు. ఒక్కొక్క సంవత్సరం, ఖర్చు — ఆదాయం బొటాబొటిగా వుండేది, వరుసగా మూడు సంవత్సరాలు నష్టాలే కల్గుతుండేవి. అప్పుడు ఆమె పడు చుండే దిగులు వర్ణింప తరంగాదు. మిగిలిన సంవత్సరం, నష్టాలు భర్తీ చేసుకుంటూ, మరో సంవత్సరం బాగా ధరలు, పంటలు వస్తే, మిగిలిన మొత్తాలను భూములను బాగుచేయడానికై, పెట్టు బడి పెట్టెవారు. పత్తి, పొగాకు రైతుల బాధలు మరేన్నో! సీలిం గుకు తగ్గిన వ్యవసాయములో, ఇన్ని విధాల ఎన్నెన్నో సృష్టికారక వ్యవసాయిక ఆదాయములు అందుకుంటున్నా, ప్రపంచమంతా తిరిగి వచ్చి, దేశంలో ఎందరెందరో గొప్పవారితో కలుస్తూ వుంటున్నా ఆదర్శ రైతువలెనే, క్లుప్తమగు సంసారిక ఖర్చులు, సౌకర్యాలలో గాంధేయ మార్గాననే జీవించుతూ వుండిరి.

మిగతా రైతులు, పెండ్లి, పబ్బాలకు, వుత్సవాలకు, ఆర్భాటంగా ఖర్చులు పెట్టుచుంటే, సీలింగు వచ్చిన తర్వాతనైనా, క్లుప్త జీవితము అవసరమని ప్రచారం చేసేవారు.

భారతీదేవి వ్యవసాయపు, ఎవరికి శోషణ కల్గించని అభివృద్ధి దాయకమైన నిర్మాణాత్మక మేనేజిమెంటుకు వివిధ జిల్లాల నుండి వస్తూండే వారంతా ఆనందపడేవారు. వ్యవసాయం చేయటంలో సిద్ధహస్తులైన వారి నాన్న వెలగా సుబ్బయ్యగారు గర్వించేవారు. గోరంట్లపాటి వెంకట సుబ్బయ్యగారు శ్లాఘించేవారు. మాగాణి వ్యవసాయానికి, గొప్ప స్థాయిగల ఒంగోలుజాతి యెద్దులను భరించటం మధ్యతరగతి రైతులకుకూడా నష్టం వాటి దానాకి రోజుకు యిప్పుడు ఐదు రూపాయలు ఖర్చు. కనుక, ట్రాక్టర్లనన్నా తేవాలి కలిగినవారు. మిగతావారు, దున్నలనైనా వాడాలిఅని మా అనుభవంవల్ల తేలింది. ఐతేతాను ట్రాక్టరు తెస్తే దాన్ని నడపడానికి డ్రైవరు కావాలి సూపర్విజను కష్టము. ఇతరుల భూములపై కిరాయికి పనిచేయిస్తే తప్ప, గిట్టింపుగాదు. అప్పుడప్పుడు రిపేరులు జాస్తి అవును. అన్నీ ఆలోచించి అప్పుమీద తెచ్చిన, ట్రాక్టరును వదిలివేసిరి. ఎద్దులు లేకుండానే, ఇతరుల ట్రాక్టరులను కిరాయికితెప్పించి, మా భూమి సాగుచేయించిరి.

మా భూముల లెవెలు పెంచునప్పుడు. ప్రభుత్వపు ట్రాక్టరులు మా దున్నపోతుబండ్లు ఉపయోగించిరి. ఇలాగా ప్రతిష్ఠకు పురాతన అలవాటుకు వారెప్పుడు లొంగలేదు. ఒకమారు రెండువేలు పెట్టి, అందమైన ఎద్దుల జతను పశ్చిమగోదావరినుండి కొనిరి. మా గుంటూరుజిల్లా డిశంబరు వాతావరణాలకి తట్టుకోలేక, చనిపోయినవి. యిందుకే, పశువుల భీమా కావాలని 1930 నుండి ఆందోళన చేస్తున్నా"మనిరి. పాలకేంద్రములవల్ల. బీదరైతులు బాగుపడుతారు. ఐతే పశువులభీమా అవసరం.

ప్రథమ ప్రపంచరైతాంగ సభకు 1946లో నేను ఇంగ్లాండు వెళ్ళి, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం వారు నడుపుచున్న, కృత్రిమ



"ఇన్ సెమినేషన్" ద్వారా, పశువులకు చూడి కల్గించటం గమనించితిని! ఆ ప్రకారం మనదేశంలో ప్రభుత్వం ప్రచారం చేయిస్తే మన పశుసంపదను సత్వరంగా అభివృద్ధి పరచవచ్చు. లేకుంటే పెరిగీ పెరుగని కోడెలతో దాటిస్తే, క్రమంగా ఆవులకు గేదెలకు కల్గే దూడల దార్ఢ్యత, పాలిచ్చే, సాగుచేసే శక్తి తగ్గిపోతూనే వుంటుందని మన ప్రభుత్వానికి తెల్పితిని. వ్యవసాయ మంత్రి శ్రీ మున్షీ గారు నేను కలిసి సంప్రదింపులు చేసుకొంటిమి. తత్ ఫలితంగా "కీ విలేజి" సెంటరుల (Key village centre) ప్రణాళిక యేర్పడినది. నిడుబ్రోలులో పంచాయితీబోర్డు అధ్యక్షులు శ్రీ నన్నపనేని నాగయ్యా నాయకత్వము ద్వారా ఆ "కీసెంటరే" ప్రథమంగా ఆంధ్రకు యేర్పడినది. దాని ద్వారా, ఎన్నో ఆవులకు గేదెలకు శ్రేష్ఠమైన జాతిదూడలు కల్గడం ప్రారంభించినది. ఆసెంటరు ద్వారా ముందుగా మా పశువులకు ఆ సౌకర్యం సంపాదించుటకు భారతీదేవి ముందుకు వచ్చిరి. ఆ విధంగా, కొన్ని ఆవులు, కోడెలు, పడ్డలు, దున్నలు మాదొడ్లో పెరుగుతూ వుండినవి. వాటి పెంపకము గమనించుటకై, మా అనుభవాల తెలుసుకొనుటకు, పశుగణాభివృద్ధి ఆఫీసరు వస్తూ, భారతీదేవిగారితో సంప్రతించుతూ వుండేవారు.

పుష్పాలు, కూరగాయల తోటల ద్వారా వరిపంటకంటె హెచ్చు ఆదాయం పొందవచ్చునని, పెద్దవడ్లపూడి, నారాకోడూరు బాపట్ల వారి అనుభవము. అటులే, యిసుక భూములపై, బాపట్ల చీరాల కుప్పం, మదనపల్లి వారుగొప్పసంపద బొందుతున్నారని భారతీదేవి గమనించిరి. కాని, ఆ పంటలకు ఎంతో శ్రమచేయడం అవసరం. మార్కెట్లు దగ్గరలోవున్నా, జీతాలకు, కూలీలకు అంతగా అందరు అందడం లేదని ఆప్రయత్నంచేయలేదు. చెరకు పంటవేస్తే, పంచదార ఫాక్టరీలు కావాలి. మా మిత్రులు, శ్రీ వెలగపూడి రామకృష్ణ అలాంటి ఫాక్టరీని, నగరంలో స్థాపించిరి, భారతీదేవి చిన్నవాటాలు తీసుకొనిరి. కాని దాన్ని ఎత్తివేసిరి. ఈ మధ్యనే,

దండమూడి. చేబ్రోలులలో ఖండసారీ ఫాక్టరీలు వచ్చినవి. రైతులింకా చెరకు పంటకై తగినంత శ్రద్ధచేయటంలేదు. బెల్లం తయారు చేయడానికి తయారు కావటం లేదనుకొనేవారు.

రెండోపంటగా వేరుసెనగ వేశారు. లాభం లేకపోయింది. ప్రత్తి పురుగుల యిబ్బందులే కల్గించింది. మినుములు, పెసలు అంత బాగా పండలేదు. ఒక్కొక్క సంవత్సరం ఖర్చులకే సరి పోయింది. జనుము పశువులకు చాలా అవసరం, కాని క్రమంగా పెరుగుట ఆకువేయుట, పూవుల నందించుట తగ్గిపోతూవుంది. పశుపోషణకు గిని, నేపియరు,ఇతరమేత పైరులను పెంచడం మంచిది. అదేమో, యీ అపరాల ధరలు అర్థం పర్థం లేకుండా తగ్గిపోతుంటాయి. పండించే రైతును నిరసింప చేస్తాయి.

ఏ క్రొత్త విత్తనమో, పంటో వచ్చినా వాటిగురించి దీర్ఘంగా విచారించి వేసి, పండించి చూచేవారు. అలాగా యితరులకు ఆమె ప్రయత్నాలు, ప్రదర్శనాలు "డిమాన్‌స్ట్రేషన్‌లు"గా వుండేవి.

ఆమధ్య జపాను ధోరణిలో వరుసలు తీర్చి నాటే పద్ధతి ప్రయోగమైనది. అనుభవములో అంత లాభసాటిగాదని తెలుసుకున్నారు. వరిపంటకు "స్టెమ్ బోరరు" అనే తెగులు వచ్చింది. దానివల్ల విస్తారమైన నష్టం కల్గింది. ఆబాధా నివారణకై, నాచేత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వవ్యవసాయ పరిశోధకుల హెచ్చరింపజేసిరి. తాను శాసనమండలిలో ప్రభుత్వమును హెచ్చరించిరి. ఆనాటి మంత్రి రామ్‌సుభాగ్ సింగుగారొక ప్రత్యేక పరిశోధనాకేంద్రమును ఆంధ్రలో యేర్పరచిరి. కొద్దిగా ఆ బాధా నివారణ కల్గుచున్నది.

ఎలుకల బాధవల్ల మొక్కలు నల్లబడకముందే కొట్టివేయడం జరిగెను. వాటిని తినేవారికి కూడా మించినన్ని పట్టుబడుచుండెను అందుకెంతో ఖర్చు, మందులు దొరుకుటేకష్టము. ఆ మందులు కలిసిన నీళ్ళు త్రాగి ఎందరో జబ్బులుపడిరి. ఇట్టి యీతి బాధలు



స్వయంగ అనుభవించి, శాసన మండలిలో రైతుల తరఫున వారు ప్రసంగించేవారు. రక్షణ కోరుచుండేవారు.

నేను కెనడాలో **1948-49**లో ప్రపంచ రైతాంగోద్యమ ప్రచారం చేస్తున్నప్పుడు, ఆ దేశంలో రేడియోవారు "రైతాంగ గోష్ఠులను" ప్రతివారం అన్నిప్రదేశాల రేడియోద్వారా సాగిస్తూ వుండడం గమనించితి! దానిద్వారా, స్థానిక రైతులు తమ కేంద్ర ములో చేరటం. రేడియో గోష్ఠి వినటం పిమ్మట ఆయా విషయాల గురించి తమలో తాము ఆలోచించుకోవడం, తమ ధోరణిని రేడియోవారికి తెల్పడం, వాటన్నిటిని వచ్చేవారం సమీక్షిం చటం సాధ్యమగుచుండెను. మన దేశానికి తిరిగివచ్చింతరువాత, ఆయనుభవాన్ని భారతీదేవికి మున్ముందుగా తెల్పితి! దాని ప్రాశ స్త్యాన్ని ఆమె చురుకుగా గ్రహించిరి. వెంటనే ప్రభుత్వానికి, రేడియో, వ్యవసాయ మంత్రులకు క్రొత్త వ్యవసాయ వైజ్ఞానిక ప్రసార ప్రాముఖ్యత గురించి వ్రాయమనిరి. రెండు సంవత్సరాల పర్యంతం, ఆ పట్టుదలతో వారు, నేను, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ లను, వారి ఎక్స్‌పర్టులను మేల్కొల్పుచుంటిమి. కెనడానుండి ఆ విష యంపై అందగల కరపత్రాలను తెప్పించి, యిస్తూ వుంటిమి! ఆ యాందోళనా ఫలితంగా, యిప్పటికి అఖిలభారతదేశమంతటా, అన్ని రేడియో స్టేషనులనుండి, వారానికొకమారు గోష్ఠి, ప్రతిదినం కబుర్లు, చర్చలు, వ్యవసాయకులకై ప్రత్యేకంగా సాగుచున్నవని వారు తృప్తి జెందుచుండిరి. దాదాపు ప్రతిదినం, వ్యవసాయ వార్తలు, వ్యవసాయికుల అనుభవాలు, తదితర గోష్టి, కార్యక్ర మాలను బహుశ్రద్ధతో ఆమె వింటూవుండేవారు.

ఎరువులు, మందుల సప్లయి పంపక వ్యవహారాల్లో కొంత కాలం వ్యవసాయపు ఉద్యోగులు, మరికొంతకాలం, మార్కెటింగు సొసైటీలవారు, మరో పరియాయం తహశ్శీలుదారులు సాగించిన వర్తకులు మార్కెటింగు చేసిన కల్తీలు వారికెంతో విషాదము కల్గించెను. అంతకు మించి, రైతులు కక్కుర్తి పడుతూ, వాకరి

కంటే మరొకరు, హెచ్చుధరలకు వాటినికొంటూ, బ్లాకుమార్కెటు ధరలను పెంచేస్తు వుండటం వారికి అసహ్యంగా వుండేది. వాటి సప్లయి, సీజనుకానికాలంలో సులువుగా వుంటున్నప్పుడు తాను సులభంగాకొంటూ, అటులే వ్యవహరించమని మిగతా రైతులనుకూడ హెచ్చరించేవారు. ఐతే అందరికి చేతికి డబ్బులు అందవుగా! పరపతి సంఘాల్లో అప్పులు తెచ్చుకోమనిరి! అచ్చట వుండే పెత్తందారులు సకాలాన పరపతి అందిస్తేగా! "రైతుల కష్టాలు యెన్నని?" అంటూ విచార పడేవారు. కంపోస్టు తయారీ చేస్తే మంచిదే! "కాని నౌకర్లు అంతబాధపడుతూ, పశువుల పక్క గడ్డిపై నీరుచల్లి మట్టికప్పి ఎరువుగా మార్చటానికి వొప్పుకోవటం లేదు" అన్నారు. నేను 1946నుండి "గోబర్ గాస్" తయారుచేసే మరలను గ్రామాల్లో ప్రచారం చేయమంటున్నా! మేము దాని అవసరాన్ని తెల్పిన తరువాత ప్రభుత్వం 26 సంవత్సరాలు నిద్రించినది. మా దొడ్లో పెట్టించమంటే, "మాకు గిట్టింపుకాదు. ప్రతివూరి మొత్తానికి పెట్టితే, బజారులకు గాసులైట్లు, గ్రామానికి మంచి ఎరువుల సప్లయి అగు"నని. అందుకు లక్షలు కావాలట. ఇప్పటికి మేల్కొని, గోబరుగాస్ కేంద్రాలు తెరుస్తా మంటున్నారు.

వరదలవల్ల రేపల్లె, బాపట్ల, కైకలూరు భీమవరం రైతులు రాజమండ్రి, రామచంద్రపురం వారు ఎంతో నష్టం పొందుతున్నారు. రాయలసీమ వారే గాక, కోస్తాజిల్లాలలో మెట్టప్రాంతపు రైతులు మూడు సంవత్సరాలకొక పర్యాయం; వొక్కో దుష్టకాలంలో రెండు మూడు సంవత్సరాలు వరుసగా కరవులవల్ల ఎంత నష్టపడుతున్నారో, భారతీదేవికి, నాకూ మా సంచారములో, రైతు ఉద్యమములో, అనుభవమే! అంతేగాక, ఆమె స్వంత వ్యవసాయిక జీవితానుభవములో మూడు సంవత్సరాలు వరుసగా పంటలు పోయినప్పుడు, వొక్కో సంవత్సరం, కోతఖర్చులకే చాలని వరిపైరు, జనుము, మినుముల పైరులు పోయినప్పుడు ఎంతో దుఃఖం వారనుభవించేవారు. అందువలవ



మేము పట్టుదలతో, రైతుల రక్షించుటకు, పంటలభీమా, పశువుల భీమా కావాలని ఘోషిస్తూ వున్నాము.

ఒకరాత్రి రైలు స్టేషనులో వుంటిమి. ఢిల్లీకి బైలుదేరితిమి. మంటలు లేచినవి. ప్లాటుఫారంనుండి చూస్తే, మాయిండ్ల వైపునే! "ఢిల్లీకి తర్వాత పోదాంలే!" అంటూ అప్పటి కప్పుడు, మా యింటిదారిన పరుగిడితిమి. మాయింటి ప్రక్కవారి వామి, యిల్లు పోయినవి. వారెంతగానో దుఃఖించిరి. "యూరపులో ఇలాంటి కష్టాలకు భీమా వున్నదికదా! మనకు మాత్రం ఫైరు యిన్సూరెన్సు వద్దా!" అన్నారు. ఎన్నో పర్యాయములు, బారువాలో, సోంపేటలో, పలాసాలో, మా హరిజనవాడలలో ఇలాగా అన్నీ ధ్వంసం ఔతుంటే, ఆ బీదల బాధలు తెలుసుకొని యేడ్చుకొనేవారు. ఆఖరుకు "యీ బీదల యిండ్ల కప్పులకైనా, అన్ని రేకులనైనా ప్రభుత్వం యిస్తే బావుండునే" అనేవారు.

"అన్ని వృత్తులు, వ్యవహారాలకంటే, వ్యవసాయం బహు బాధాకరమండీ" ఐనా స్త్రీలు మేనేజిమెంటు చేయ నేర్వాలి." అనేవారు. "స్త్రీలు సహకరించడం అత్యవసరం, మంచిది, సాధ్యం. కాని స్త్రీలే మేనేజిమెంటు చేయటం బహుబాధాకరం. ఖర్చులు హెచ్చువుతవి. కూలీలుమాట వినరు. తగినట్లు పనిచేయరు. సహకరించవలసినవారు మాట సులువుగా వినరు. ఆడపెత్తనమా అనుకుంటారు. తెల్విచాలని మగవానికి లొంగడం, అంతకష్టం కాదుగాని, ఎంత సమర్ధురాలైన స్త్రీయైనా, ఈ మగ, ఆడ కూలీల పనివారలచేత వళ్ళువంచి మాటవింటూ పనిచేయించడం చాల కష్టమండీ!"

"మీకుకూడ అలా అనిపిస్తుందా?" అన్నా! "దేశంలో నాకుండే గౌరవస్థానం వాళ్ళు గమనించరండీ! నేనూ స్త్రీనేగదా! ఈమె కేమితెలుసులే! ఇంత పెత్తనమెందుకూ? ఏమైనా పని చేయక తలాయిస్తే, మగవానివలె, కేకలు వేయలేరుగా! వారి

మనస్సుకు చర్మానికి చురుకుగల్గు రోషంపు పల్కు లాడలేరుగా? అందుకని ఆటాడించ చూస్తూనే వుంటారు. కనుకనే నాకింతబాధ. శ్రమ, బరువు" అనివిసుగుకొనేవారు.

ఆమెవద్ద కూలి, కమతపు పనిచేస్తూవుండేవారు. కొన్నాళ్ళు జరిగేసరికి 'అమ్మో. ఆవులిస్తే, ప్రేవులు లెక్కబెడతా రండీ, భారతమ్మగారు? అనుకుంటూ ఆమెతో సహకరించుటకు ఉత్సాహం పడేవారు.

ఆమె లేబరువారికి చూపెట్టుచుండిన శ్రద్ధ, గౌరవం, విశ్వాసం, అందించుచున్న అదనపు కూలీ, వరుమానంవల్ల, క్రమంగా వారికి, లేబరులో ప్రతిష్ట కల్గింది. గ్రామ మామూలు కంకె, ఒక చేరడు ధాన్యం, రెండణాల డబ్బు అందించేవారు. సాయంత్రానికి ఏకాయలో, పచ్చడో, గుగ్గిళ్ళో, బెల్లమో ఏదో చిరుతిండి బంధువులకువలె, చేతులలో పెట్టేవారు. అన్ని కబుర్లు ఇన్ని అనుభవాలు, ఆడ కూలీలు వారితో సాగించుకొని మరీ వెళ్ళేవారు.

కనుకనే వారు స్వర్గీయులైన పిమ్మట ఆమె పటమునకు దణ్ణము పెట్టటానికి, పురుషులెందరో, అంతకుమించి స్త్రీకూలీలు వస్తూ వుండిరి. వారిని తలుచుకొని, దుఃఖించుచుండిరి. ఆమెపటము ముందు ప్రార్థనలు చేసుకుంటూ వున్నారు. ఆమెవారికి మందుల తల్లేగాక, రైతమ్మ, పేరంటాలమ్మ అనుకుంటూ, వ్యవసాయ కూలీలు వారిని తలుచుకుంటున్నారు. మా గ్రామ రైతులు, తమ కొకచేయి పోయింది. తమ తల్లి పోయింది అంటున్నారు. కారణం ఆమె ఆదర్శ రైతు స్వంత వ్యవసాయం చేసిన భూదేవిబిడ్డ.

—:o:—

# హరిజన సేవ

ఈరోజుల్లో (1971–74) హరిజనులను ఢిల్లీ మంత్రివర్గములో ప్రధాన స్థానములందు నిల్పుకొంటున్నాము. రాష్ట్రమంత్రివర్గములలో అచ్చటచ్చట ముఖ్యమంత్రులుగా పిలుచుకోగలుగుచున్నాము. ఐనా ఎన్నెన్నో ప్రాంతాల్లో ఇంకా అంటరానితనము లక్షలాది హరిజనులను బాధిస్తోనే వున్నది. సాంఘిక అసమానత్వము కోట్లకు మించిన హరిజనులను వేధిస్తున్నది. ఇప్పటికి ఇంకా బావులు, దేవాలయములు వారికి దూరముగా వుంచబడుచున్నవి. ఇళ్ళకు స్థలాలు లేవు, ఇండ్లు చాలవు. చదువులు అందరికి అందడము లేదు. నిరుద్యోగం, అనారోగ్యం, ఆకలి బాధలు వేధిస్తూనే వున్నవి. ఇదంతా భారతీయులు ఎంతగా భావదాస్యమునకు, ఆచార దాష్ట్యమునకు, మత మూర్ఖత్వమునకు గురియగుచున్నారో గుర్తు చేస్తున్నవి.

ఆ 1923 వంక, అర్థ శతాబ్దము వెనుకకు దృష్టి సారించండి. అప్పుడు మరెంతగా భారతీయులు తాముగా అంగీకరిస్తూ, నిల్పుకుంటూ, సర్వతోముఖ దాస్యము సాంఘికనైచ్యము, పచ్చి పశుత్వము గాఢంగా వారిని బంధించుతూ ఊపిరాడ నివ్వకుండా వుంటూ వుండెనో ఊహించగలరా? ప్రయత్నించండి.

కొందరు మాత్రం, బ్రహ్మసమాజం, థియోసాఫికల్ వారు, ఆర్య సమాజమువారు, వివేకానందుని శిష్యులు క్రైస్తవ ధర్మముల నంగీకరించిన వారు మాత్రం ఆ దాస్య బంధములనుండి తొంగి చూడ కలుగు చుండేవారు.

ఆనాడు ఆ వీరేశలింగం మహాశయుల శంఖానినాదం మంగిపూడి శర్మ నాబోటి ఏలక్ష కొక్క యువకునికో వినబడుచుండేది. ఆ బోధను అందుకుని, పాశ్చాత్య దేశాలలో ఉన్నత విద్యబొంది 1923లో తిరిగి వచ్చినాను. నన్ను చూడవచ్చిరి మా గ్రామము, పరిసరాల హరిజనులు(వారు ఆనాడు పంచములుగా పిలువబడేవారు) యూరవులో అందరిని ఎటులపిలచి, మర్యాదచేసి, కరచాలనంచేసి, అతిథి సత్కారము చేస్తారో అటులే వారందరిని గౌరవించుచుంటి. సహపంక్తి భోజనాలకు పిల్చితి, చేర్చితి, గౌరవించితి, కౌగలించు కొంటిని. ఆనాటి సాంఘిక దురాచారాలు అసహ్యం, అమానుషం. హరిజన నౌకరులకు, మల్లలలో యింటిబైట అన్నాలు అందించే వారు. వారి వాడలు గుడిసెలతో పందులతో. ఊరి వెలుపలనే వుండేవి. వారి బిడ్డలకు చదువులు లేవు. వారిపై ఎవరైనా అమానుష కృత్యాలు జరిపితే అప్పీళ్ళు అందేవికావు. దూరంగానే వుండి నాటకాలు, భజనలు ఊరేగింపులు - కొలువులలో చేరవలెను. వారి పెళ్ళిళ్ళకు, మేళతాళాలు పెట్టుకోలేరు. ఇతరులు చేరేవారుకారు. హరిజనులచేరి నేను బోధ చేయ ప్రారంభించితిని. మీరంతా వ్యవసాయ కూలీలు, ఇతరదేశాలలోవలె మీరుకూడా, కూలి సంఘాలు పెట్టుకోవాలి, జీతభత్యాలు జీవనోపాధికి తనినట్లు కోరాలి, సంపాదించాలి,అందుకై కట్టడి పొందాలి" అని బోధించితి. వారి సభలను గ్రామాల్లో పెట్టుచుంటి. క్రమముగా తాలూకా, జిల్లా సభలు సాగించితిమి.

ఈనాడు దేవిజీ, నేను నిలువుకొన్న గోభూమి ఆవరణలో రెండువేల ప్రజలతో గొప్ప సభ వ్యవసాయ కూలీల కనీసపు కోర్కెలపై జరిపితిమి. మమ్ము సంఘబహిష్కారమునకు గురి చేస్తామనిరి, "ఇంత వెర్రితనమా!" అని ఎందరో బాధ చెందిరి. ఆనాటి బ్రిటీషు ప్రభుత్వపు స్నేహితులు మాకు విరోధులైరి. గ్రామం నుండి రాష్ట్రి స్థాయివరకు గ్రామంలోని పై కులాల పెద్దలంతా మమ్ము "వెలిగా"నే చూడ మొదలిడిరి. అప్పుడు నన్ను



బలపరచిన దెవ్వరు? అలా నన్ను బలపరచడం ఎంతో కష్టం. బస్తీలలోనే అట్టి సంఘ బహిష్కరణ ఎంతో బాధాకరం! గ్రామాలలో ఆబాధ వర్ణింపతరమా! పట్టణాలలో సంస్కార ప్రియులు కొందరైనవుండిరి. ఎందరో మా గ్రామాల స్త్రీలు వారిని మా వెంటనడువవద్దన్నారు గ్రామాలలో వారేరి? ఎంతమంది? నా సోదరులు వెంకటప్పయ్య, లక్ష్మీనారాయణ, ఆ బాల్యస్నేహితులు సహాధ్యాయ ఆచంట నాగయ్య, వారి స్నేహితులు, మాకందరికి ఆధారభూతులు. పెద్దలు పెంచినవారు, మమ్ము కాపాడుచున్న మా అమ్మ మంగమ్మ అమ్మమ్మ, అక్కయ్య లక్ష్మీదేవి, అప్పుడే ప్రథమ చూపులకు అందుచున్న యువతీ లలామ భారతీదేవి, వీరు చలించలేదు. దేశోద్ధారక నాగేశ్వరరావు, మాకు పెట్టనికోట.

ఈ భారతజాతి సుపుత్రికలు, రైతాంగ మాతలు మాతోటే నిలిచిరి. "కిరస్తానీ సాహేబులు మతంలో చేరిన మాల, మాదిగలతో మీ పెత్తందారులు, మాంసాలు, సారాలు అందుకోవచ్చా? మా అబ్బాయిలు మన పొలాలలో పంటకళ్ళాలలో మనతో కలసి పనిజేస్తున్న, మన సీతారాముల భజనచేసే మన గ్రామస్థులైన మాలలు, మాదిగలను పిలువరాదా? అన్నారు మంగమ్మ! "సరసన కూర్చోబెట్టుకోరాదా? చాపకూళ్ళ భోజనాలు, ఆనాటి మనందరి పెద్దలు బ్రహ్మనాయుడు వలెనె, జరుపరాదా? అన్నారు లక్ష్మీదేవి. ఆసవాలుకు ఆనాటి పై కులాల పెద్దలకు సమాధానం లేకపోయింది. అలాగాసంఘ సంస్కరణోద్యమంలో హరిజనోద్ధరణ కార్యాలలో, అక్షరాభ్యాసం భారతీదేవికి చిన్ననాటనే మాఅమ్మ మంగమ్మ యింట్లో కల్గింది.

ఇంతలో "మాలపల్లి" ఉద్గ్రంథమును శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ వ్రాసిరి. ప్రచురించిరి. వారే స్వయంగా మా యింట కొన్నాళ్ళు బసచేసిరి. భారతీదేవికి పెంపుడు తండ్రిలాగా వచ్చి, పాటలు పాడి, మాటలు చెప్పి తన నవ్వులే పువ్వులుగా తన తలపులే బోధలుగా ఆమెను ఉత్తేజ పరచిరి.

మహాత్ముని యుగ మారంభమైనది. ఆంధ్రలో కాంగ్రెసు వారందరి మధ్య కులమత భేదాలులేకుండా సహపంక్తి భోజనాలు అందుకుంటున్న రోజులవి. ఆ వాతావరణంలో పెరిగిరి భారతీదేవి.

1926లో ఇంగ్లాండు, ఫ్రాన్సు, స్విడ్జర్లండు, జర్మనీలలో చదవి, సంచారముచేసి వచ్చితిమి దంపతులం. ఆఫ్రికాలోని ఈజిప్టు సోమాలిలాండు, మనదేశపు పాదుక సింహళములో తిరుగాడితిమి. స్వగామానికి వచ్చి ఆ తరువాత ఆమె స్వయంశక్తితో ఆధునిక ప్రపంచపు మానవులందరు పరస్పరంగా సాధారణ సాంఘిక, మత, రాచకీయ హక్కులను నిండుగా అందుకోకలగాలని అనుభవించుకోవాలనే విశ్వాసంతో అన్నికులాల వారితో మెలగ ప్రారంభించిరి. స్త్రీలు ఘోషాలో వుండడం తప్పనుకున్నాం. స్త్రీపురుషులు ప్రథమ యుద్ధానంతరం యూరపు దేశాలలో సమాన హక్కులు బాధ్యతలు యెట్లా పొందుచుండిరో అటులే మనదేశమందు మన వారు సాధించుకోవాలనుకున్నాం.

కనుక, ఆమె హరిజనుల స్త్రీలను, నేను వారి పురుషులను సమానంగా సత్కరించితిమి! మా హరిజన వాడలో మా కుటుంబానికి చెందిన కుటీరంలో హరిజనులతో బాటు విందులను నడపితిమి. ఆమె వంట ప్రారంభించిరి. మా చెల్లెళ్ళు పుష్కరాంబ, అనసూయతోడైరి. వారంతా వండిరి. వడ్డించిరి. అందరం ఆరగించితిమి.

మహాత్ముని ఆదేశం ప్రకారం, అస్పృశ్యతా నివారణ తన ప్రధాన కార్యక్రమంగా కాంగ్రెసు శిరసావహించినది. కాంగ్రెసు ప్రధాన కార్యకర్తలు లందరు అంటరాని తనాన్ని గర్హించ మన్నారు. ఐనా ఎందరో సనాతన ధోరణిలోనే మ్రగ్గియున్న తమ కుటుంబాల బాధనుండి తప్పించుకొనుటకై వెలుపలమాత్రం అందరిని అంటుకున్నా, ఇంటికొచ్చేసరికి, ఆ వస్త్రాలను వదలి వేసుకోవలసిన దురవస్థలో వుండేవారు 1930 వరకు. ఇక ఇంట్లోకి



హరిజనులను పిలుచుకోగలగడం, అతిథులుగా మర్యాద మన్ననలను అందించడం ఏ కొద్దిమందికో సాధ్యమయ్యేడిది. ఆరోజుల్లో గ్రామాలలో అంత ఉదారంగా, మానవ సౌభాగ్యపు మర్యాదలను గమనించడం, పురుషులకే కష్టంగా వుండేది. అలాంటప్పుడు భారతీదేవి తన ఇంటిలోనికి హరిజనులను అతిథులుగా ఆహ్వానించడం, ఆదరించడం, సమాన సాంఘిక గౌరవమర్యాదలను నడుపుచూ మేమిద్దరం అంగీకరించుచున్న సాంఘిక ధర్మమును ఆచరణలో పెట్టుచుండేవారు. అందు కెంతధైర్యము, మానసిక ఔన్నత్యం అవసరమో వూహించగలరా?

మహాత్ముని రాజకీయ ఉద్యమం కొంతగా మబ్బులలో దాగొంటున్నప్పుడు 1932-34 హరిజనోద్యమాన్ని ప్రజ్వలింపజేయడానికి గాంధీజీ జాతీయ వాదులను ప్రోత్సహించుచుండిరి.

ముందంజ వేయుడానికి మేమిద్దరము తీర్మానించుకున్నాము. హరిజన యాత్రలు సాగించితిమి. వివిధ తాలూకాలలో, జిల్లా హరజన సేవా సంఘం తరపున ప్రచారం చేస్తూ వుంటిమి. అంటరాని తనము, హైందవ మతమునకు విరుద్ధము, అవసరము లేదని సభలలో మేము ఎంతగా మొత్తుకుంటున్నా కొంతమంది బ్రాహ్మణులు తలలూపిరిగాని రైతు కులాలవారు మొండిగా దేవళాలను గాని, చెరువులు, బావులుగాని తెరచుటకు వెనుకాడు చుండిరి. వారిని ప్రోత్సాహపరచి ముందుకు సాగునటుల చేయు మా యత్నములలో భారతీదేవికే హెచ్చు విజయాలు కలుగుచుండెడివి. వారి నడత, మాటలతీరు, గుంభనగా, గౌరవంగా గొప్పగా తోటి స్త్రీలను సంస్కరణాభి ముఖులగునట్లు చేయడంలో వారిదే అందె వేసిన చేయి! ఏమైనా తాముచేసి ఇతరులకు బోధించాలనే ధోరణి వారిది.

మా యింటి పనులకై, వంట ఇంటి సహకారము కొరకై అతిథి సత్కారములు జేయుటకై మాతో సభ్యతగా కలసిమెలసి

మెలగుటకై హరిజనుల యువతీ యువకులను వారు ఆహ్వానించేవారు. తన బిడ్డలుగా వారిని చూచుకొనేవారు.

ఒక్కొక్కప్పుడు, పై కులాలవారు, సందేహిస్తుంటే, వారినే వెలుపల వుండమనేవారు! పైవారికై హరిజనులను ఎప్పుడు దూరస్థులుగా జూడలేదు.

మన కులాల వైరివలన, ఒక్కొక్క కులమువారు, ఒక్కొక్క ప్రదేశంలో మెజారిటీగా వుంటూ పై పెత్తనము చేస్తూవుంటే మిగతా కులాలవారిని తక్కువగా చూడడం, చిన్న మెట్లల్లో సత్కారాలు అందించడము దీర్ఘకాలాలనుండి వస్తున్న బాడ్యం. దీన్ని ఎదురించడమే మాపని! కనుక అన్నికులాలవారు అందరితో, సమాన మర్యాదల్ని అందుకోడానికి తయారైతేనే వారిని గోభూమికి భారతీదేవి ఆహ్వానించేవారు. మహమ్మదీయులకు హిందువులకు క్రైస్తవులకు సమానమైన గౌరవ మర్యాదలు అందించేవారు.

ఇట్టి సాంఘిక సమానత్వం పాశ్చాత్య దేశాలల్లోవలె సాధారణ ప్రజలచేత అంగీకరింప చేయాలంటే కష్టం. అందులకు మనమే సక్రమంగా ఆచరించాలి. గ్రామీణ సేవకులలో సంఘసేవయందు భారతీదేవిదే ప్రథమ స్థానం.

1923లోనే చి॥ బొల్లెద్దు మాణిక్యం అనే హరిజన బాలుని ఆదరించిరి. 1928-29 లో చి॥ గుమ్మడి శేషయ్యనుబలపరచిరి. స్వర్గగామియులైన వారిద్దరు 1946లో విదేశాలలో సంచారము చేసి గొప్ప ఉద్యోగాలలో చేరిన హరిజన ప్రముఖులైరి.

నౌకరులగావుండిన హరిజన, సన్నజనాలవారికికూడా, గోభూమిలో మర్యాదలు చేయించిరి. ప్రతిదినం వారి భోజన మజ్జనాదులను మర్యాద పురస్కరంగా అందించిరి. కన్నబిడ్డలుగా వారిని చూచుకొంటూ వుండిరి.

రైతాంగ విద్యాలయంలో, సహపంక్తి భోజనాలకు, కులాలు, మతాలకు, అతీతమైన జీవితానికి అంగీకరించని పైకులాల



వారెవ్వరైనా రాదలచితే వారిని ప్రవేశ పెట్టవద్దని నాతో ముందుగానె చెప్పిరి. అటులే అలాంటి సంకుచిత ధోరణిగల వారిని చేర్చుకొనమైతిమి. ఇక్లే కూలీలను, నౌకరులను సమాన మర్యాదలతోటే చూచుకొంటూ వుండిరి. ఇందులో ఎన్నెన్నో బాధలు, అసంతృప్తులు మమ్మెదుర్కొంటూ వుండేవి. అయినా ఆమె చలించలేదు. మానవు లందరిని మర్యాదగా, దయతో సమానంగా, గొప్పగా చూచుకోవడం తన ధర్మమని నమ్మిరి. అలాగ నడచిరి, మెలగిరి.

ఆ 1933 హరిజనోద్యమమందే, హరిజన సేవాదళాన్ని నడిపితిమి. స్వర్గీయులు నూతక్కి వెంకటేశ్వర్లు, శ్రీ జియ్యరు దాసు ప్రభృతులందు చేరిరి. సవర్ణుల సహకారాన్ని పొందితిమి. వారి యిండ్లలో, మా హరిజన సభ్యులకు, మాతోపాటు సమాన ఆదరణ సన్మానములు అందించగలిగిరి రైతాంగ స్త్రీ పురుషులు. ఆ ఉత్సవాలతో దేవీజీ ఎంతో తృప్తి చెందిరి

అంతటితో మేము ఆగలేదు. ఓ కమ్మ గుత్తావారి యువతికి, హరిజన యువకునకు దేవిజీ పెత్తనం క్రింద వివాహము చేయించగలిగితిమి. అందుకు గాంధీజీ ఎంతో ఆనందము చెందిరి. బంజరు భూముల నైనా హరిజనులకు యివ్వాలన్నాము డి. సి. భూములను యితరుల కియివ్వరాదన్నాము.

ఓ ప్రక్క అలాగా సంస్కరణాభిలాషులైన వారిచేత అభివృద్ధి కార్యక్రమములు పై మెట్టులోనికి పెంపుచేయ కలుగుచున్నా అధిక సంఖ్యాకులు సంస్కరణ మొదటి మెట్టునకు కూడా అందుకోవడం లేదే, అందిన భూములను నిల్పుకోవడం లేదే. అని దేవిజీకి విచారంగా వుండేది. వయోజన ఓటింగు వచ్చినా హరిజనులు రాజకీయ చైతన్యం పొందటంలేదే, కులాల కుమ్ములాటలోనే, మిగతావారివలె కుళ్ళిపోతున్నారే, యని దిగులు చెందుచుండెడివారు.

మరొక వైపునుండి, ఆదర్శ ప్రజాసేవకులైన శ్రీ కావూరి శ్రీ హనుమంతరావు, రంగయ్య గుంటూరులో, వెంకయ్య పల్నాడులో; కాట్రగడ్డ పాపయ్య ఒంగోలులో ఎన్నెన్నో స్కూళ్ళు, హాస్టళ్ళు హరిజన గిరిజన బిడ్డలకు నిర్మించి, నిజాయితీగా, గాంధేయ ధోరణిలో నడుపుతూవుంటే వారిని ప్రోత్సహిస్తూ గౌరవిస్తూ వుండేవారు. తెనాలిలో శ్రీమతి కొ॥ తాయారమ్మగారు, హరిజన గిరిజన బాలికా హైస్కూలు, హాస్టలు నడుపుచుంటె ప్రోత్సహించిరి; కాని, ఎందరో యీ హాస్టల్సు ద్వారా సంఘసేవకంటే స్వంత ప్రయోజనాలకై తిరుగుచూ, మంత్రులు రాజకీయ తాంత్రికుల వలలో పడిపోవడము ఆమెకెంతో ఆశాభంగము కలిగించెను. తుదకు 1973లో వాటన్నిటినీ ప్రభుత్వము నిర్వహింప పూనుకోవలసి వచ్చినదిగదా!

పాకాల యన్. వి. నాయుడు తిరుపతి స్వామి దర్శనాన్ని హరిజనులకు సాధించినందులకు సంతోషపడిరి. మాచేత ప్రప్రథమముగా రాజకీయ పెత్తనం బొందిన శ్రీ సంజీవయ్య రాష్ట్రంలో ముఖ్యమంత్రి, కేంద్రములో క్యాబినెటు మంత్రి, కాంగ్రెసు అధ్యక్షులైనందులకు అటులే వెనుకబడిన తరగతులవారి తరపున శ్రీ భగత్, లచ్చన్న, భగవంతరావు మా ఆక్సుఫర్డు మిత్రులు డాక్టరు దేశముఖ్ కేంద్రమంత్రులైనందులకు, అలాగే జగజ్జీవనరామ్ కేంద్రనాయకులుగా కొందరు జిల్లా కలెక్టర్లుగా పెరుగుచున్నందుకు దేవీజీకి తృప్తి కలిగినది.

అయితే ఆ పదవులు ఏకొద్ది మందికో వస్తేచాలదు. వారు హరిజన యువ వైజ్ఞానికులు, దేశభక్తులుగావుండాలి. నైతికస్థాయి పెంచుకోవాలి, నిజాయితీపరులుగా పేరొందాలి. వ్యవసాయ కూలీలు, సాధారణ ప్రజానీకపు అభివృద్ధికై కృషిచేయాలి - అని వారికోరిక. అందుకే ప్రఖ్యాతి బొందిన డాక్టరు అంబేద్కరు గారిపై వారికెంతో గౌరవం. మాతో కొంతకాలం నడచిన శ్రీకూర్మయ్య, రాఘవులు మంత్రులుగా మా ద్వారా చదువులు పొందిన పున్నయ్య జడ్జీగా పెరిగితే ఆమె సంతోషించిరి. కాని ఎందరో



పదవులకై పతితులు గావడం, పెత్తనాలను స్వంతము కొరకై పాపంపు ధోరణిలో వృథాచేయడం హెచ్చుకావడం వారికి అసంతృప్తి కలిగించుచుండేది.

ఆ వెల్లూరు జైలులో ఓభాగంలో నేను, మరోభాగంలో వారువుంటూ "హరిజననాయకులు" అనే నానవలను మా భావవీధులలో సృజించుకుంటూవుండేవారం. అంటరానితనంలోనే క్రుంగి నశిస్తూ పోతుంటున్న హరిజనులను మంత్రులుగా శాసన సభ్యులుగా ప్రజానాయకులుగా పెంచాలనుకున్నాం. ఆ హరిజన నాయకులను ఆదర్శప్రాయులుగా ఊహించుకున్నాము. వారు హైందవ సమాజానికి నాయకులుగా రూపొందించుకొన్నాము.

రాజ్యాంగాధికారం, బాధ్యత నిర్వహణ శక్తి పూర్తిగా హరిజనులు, గిరిజనులు, వెనుకబడ్డవారు సన్నజనాలకు అందాలని ఆశించినాము. అందుకే అందరిని ప్రబోధించుటకై ఉన్నవవారి "రామదాసు" "వెంకటదాసు" ల్లాగా మేముకూడా "హరిజన నాయకుడు" అనే పాత్రను, రూపొందించుకున్నాము. ఆపుస్తకాన్ని 1933 డిశంబరు 25వ తేదీన మహాత్ములు, మా రామానీడు విద్యాలయాన్ని తెరచిన దినముననే ప్రకటించుకున్నాం. ఆనాటి ఆశలు, ఆశయాలు శాంతియుతముగా విప్లవ ధోరణిలో ప్రజలందరికి శుభప్రదంగా ఫలించాలంటూ 1923నుండి 1972వరకు అర్థశతాబ్దము సేవావ్రతంలో పండుచూ, పరుగుచూ, ప్రార్థనా నిమగ్నులై వుండిరి భారతీదేవి.

ఇప్పుడిప్పుడు కుల నిర్మూలనా సభలు చేస్తున్నారు. వారే తమ తమ చిన్న, మధ్య, పెద్ద కులాలను నిలుపుకుంటూ, వాటి సాయంతో స్కాలర్‌షిప్పులు, ఉద్యోగాలు స్వేచ్ఛగా పొందాలనుకుంటున్నారు. ఈ వింత ప్రవర్తన రహస్యంగా గాక బహిరంగంగా అభివృద్ధి కారకమగు ఉద్యమంగా రూపొందించుకుంటున్నారు. ఇదంతా ఆ రామమోహనరాయలు, వీరేశలింగం, వివేకానంద, మహాత్ముల బోధలనుండి వెనుదిరుగుటేనని మా ఇద్దరి

భావన. అందుకే ఆ1936లోనే ఆంధ్రరాష్ట్ర కమ్మవారి మహిళా సభకు అధ్యక్షురాలుగా వారిని ఆహ్వానిస్తే భారతీదేవి నిరాకరించిరి. తమ ప్రకటనలో జాతీయవాదులు సంఘ సంస్కరణ వాదులు మానవ సమానత్వం గోరుకొనువారు కుల సభలను ప్రోత్సహించుట ఏల? అని ప్రశ్నించిరి. ఆనాటికుల పెద్దలకు ఎంతో ఆగ్రహము. వారిలో కాంగ్రెసు నాయకులు కొందరుండిరి.

కట్నాలు, వరకట్నాలైతేనేమి, కన్యాశుల్కాలైతేనేమి - సంఘమును బలహీన పరచునవే విశ్వాసం, ఆ గురజాడ, వీరేశలింగం కాలంనుండి ప్రచురితమగుచున్నది. ఆ ప్రకారం యువకులైన మా బోంట్లము సాధ్యమైనంతవరకు, కట్నాల బోధలనుండి సంఘాన్ని రక్షించాలని ప్రయత్నించితిమి. తుదకు విఫలమైతిమి. అందుకే అప్పికట్లలో మా పెంపుడుబిడ్డ, కవయిత్రి శ్రీమతి ఆచంట సరస్వతమ్మ, సమావేశపరచిన ఆంధ్రమహిళా కల్చరల్ మహాసభకు అధ్యక్షత వహిస్తూ భారతీదేవి మన యువకులకు విజ్ఞప్తి చేసిరి. కట్నాలను అంగీకరించవద్దని, కోరవద్దని. "తల్లి తండ్రులు వధువుకిచ్చుకొనే ప్రతిపైసా మన పెద్దలవలె పవిత్రమైన దేవధనంగా స్త్రీధనంగా మాత్రమే గౌరవించాలి, రక్షించాలన్నారు.

ఇంతకూ యీ వివాహాలు, ఆర్భాటాలు, కట్నాలు, కానుకల మర్యాదలు పైతరగతులవారు తమకై మాత్రమేగాక బీదలకొరకై కూడ మానుకోవాలన్నారు. వీరిని చూచి బీదలు వాత పెట్టుకుంటున్నారు. అప్పులుచేసి ఆర్థిక బానిసత్వములో మరింతగా మునిగి పోతున్నారు. కనుక బీదలెంతగా ఉత్సవాలు జరుపుకోగలరో ఆ మాత్రంగానే పైవారు సాగించుకోవడం మంచిది, అవసరమంటూ ప్రతి పెళ్ళిలో ముత్తైదువుల ఆశీర్వచన సమయాలలో తమకు సహజమైన సరళి ధోరణిని బోధించేవారు.

ఖర్చులు పెంచుకోవడం, బీదలు, క్రింది కులాలు, సన్నజనాల వీధులలోకూడా పరిపాటి అగుచున్నది. ఇందుకు ఆమె వ్యధ చెందేవారు.

—:o:—

# గిరిజనులు - హరిజనులు

శ్రీ వెంకటకవి, బుచ్చినాయుడుతో కలిసి నేను, భారతీదేవి పల్నాడు వెళ్ళినాము-పిడుగురాళ్ళ, దాచేపల్లి, గురజాల, మాచెర్లలోగల లంబాడీలకుతదితర గిరిజనులకు ప్రత్యేకంగా స్థాపించబడ్డ స్కూళ్ళను, హాస్టళ్ళను చూస్తూవుంటిమి. మాచర్లలో వీటన్నిటిని స్థాపించిన ఆదర్శ సాంఘిక సేవకులు ప్రసిద్ధ దేశభక్తులు శ్రీ కావూరి వెంకటయ్యను సన్మానించు సభకుచేరితిమి. పోతూ వస్తూ ఆ యాత్రలో, గిరిజనులు నేరస్థ జాతులు (క్రిమినలు ట్రైబ్సు) గురించి ఎన్నో ఆలోచనలు చేస్తూవుంటిమి.

"హరిజనులను శతాబ్దాలబాటు - వూరి వెలుపలనె వుండునట్లు చేసిరి, మనవారినియే మనవలెనండి? అలాగా వారిని అంటరానివారిగా ఆజన్మాంతం చూచే జాతికి నీతివున్నదా! ఎంత ఘోరమండీ!" అన్నారు భారతీదేవి!

"ఆ ఘోరాన్ని తుడిచివేయుటకేగదమ్మా రామమోహనుని నుండి, వివేకానందులు, వీరేశలింగం వరకు మనవారే బోధిస్తున్నారు. మహాత్ముని ప్రచారం వల్ల జనాలుకూడా యీ అన్యాయాన్ని ఎదిరిస్తున్నారు. రంగాగారు 1923నుండి అంటరానితనంపై దాడిచేస్తుంటే, మీరు 1930 నుండి సహపంక్తి భోజనాలకై అన్నపూర్ణవైనారుగదా! మేమంతా మీతోటే వుంటున్నాం కనుక మన జాతి పూర్తిగా పతితం కాలేదండీ!" అన్నారు బుచ్చినాయుడుగారు.

మంగిపూడి వెంకట శర్మగారి పద్యాలు హృదయం ద్రవీభవించునట్లు వెంకట కవిగారు చదివిరి; పాడిరి. విజయనగర

సామ్రాజ్య కాలంలో యింత అన్యాయంగా లేదంటూ, ఆముక్త మాల్యదలో శ్రీకృష్ణ దేవరాయలు హరిభక్తుడైన మాలదాసున్ని వర్ణించుతూ రచించిన పద్యాలు చదివి అర్థమగునట్లు తెలిపిరి.

"ఐతేమాత్రమేమండీ ఈనాటికి ఎన్నో చోట్ల అంటరాని తనం అలానే వుంటూవున్నది. ఆపైన తరతరాలుగా కొన్ని జాతులను నేరస్త జాతులుగా చూస్తూ వారిని పోలీసులకు దాసులుగా చేస్తూవుండె బ్రిటీషు ప్రభుత్వం! ఆ బ్రిటీషువాళ్ళు తమ దేశంలో స్వాతంత్ర్యం అన్నీ అనుభవిస్తూనే, మనదేశంలోను, మిగతా కాలనీలలో ప్రత్యేకంగా ఆఫ్రికాలో, రంగుజాతులవారి నెంతో నీచంగా చూస్తూవుండేవారండీ! మనవారుకూడా తమ వర్గాల కొకధర్మం, మిగతావారికి మరొక అధర్మం ఆచరించిరి గదా!" అన్నారు ఆమె. "అయినా యీ నైచ్యపరిత్వంపై సవాలు చేస్తున్నాము గదమ్మా? విజయం పొందుతున్నాముకూడా అన్నా!"

"ఎందరు మిమ్మలను బలపరుస్తున్నారండీ! పార్లమెంటులో, క్రిమినలు ట్రైబ్సు శాసనాన్ని రద్దు చేయించడానికి మీరు బిల్లు ప్రవేశపెట్టితిరిగదా! పార్టీ యెందుకు బలపరచలేదు?"

"తుదకు ధర్మమే గెలిచినది కదమ్మా!" "మీరు ఆనాడు అంత తీవ్రంగా జవహరులాల్‌తో 'యింత దుర్మార్గాన్ని యెలా సహిస్తారండీ మన కామరాజునాడారుగారి కులం కూడా ఒకప్పుడు క్రిమినల్ ట్రైబ్సు యెరుగుదురా! సర్. ఏ. పి పాత్రో పైకి వచ్చేవరకు, కాళింగకులంకూడా అంతేకదా! ఇంకెన్నాళ్ళీ అన్యాయాన్ని సహించకేరు!' అంటూ వారి న్యాయం గ్రహించునట్లు పలికితే, జవహరు తీర్మానించిరిగదా, ఆ శాసనాన్ని రద్దు చేయడానికి. అంతటితో ఆగక విముక్త జాతుల సముద్ధరణ సంఘాన్ని పెట్టిరిగదా!" అన్నా.

"ఎన్నేళ్ళ నుండో రాఘవయ్య, వెంకయ్య, కోదండ రామయ్య, మల్లిపెద్ది కృష్ణమూర్తి, భీశెట్టి అప్పారావు, మీరు



యీ సంస్కారము కొరకై శ్రమించితిరండి" అన్నారు బుచ్చి నాయుడు. "మన సేవావ్రతం యీ మార్గములో కొంతగా విజయం బొందిందిలెండి. కాని తలుచుకుంటూ వుంటే ఇన్ని శతాబ్దములుగా యింత ఓపికతో అంత అన్యాయాలను అనుభవిస్తూనే, మన భారతీయ నాగరికత హిందూమత సంప్రదాయములను కౌగలించు కుంటున్న హరిజనులు, విముక్తజాతుల యెడల, స్వరాజ్యం స్వతంత్రం కోరుకునే భారతీయు లెంతైనా కృతజ్ఞులై వుండాలి గదా!" అన్నారు భారతీదేవి.

"అందుకేనమ్మా. నేను 1931 నుండి అంబేద్కరును బల పరుస్తున్నా." ఆయనకు విసుగెత్తే బౌద్ధులైనారు. "ఆయనకు కూడా మనపై ఎంతో ప్రాణమండి, ఆయనమాటలు ప్రతలు కఠినంగా వుంటాయంటె ఆశ్చర్యమా! ఐతే ఆయన హృదయం ఎంత మెత్తనిది. 'మీ గాంధీని నేను ద్వేషించడములేదు లెండి' అన్నారు జ్ఞాపకమేనా?"

"నాగరికత యొక్క లక్షణాలను గ్రహించాలంటే పడి పోయిన, ఓడిపోయిన వారినెట్లా రక్షించాలో, పోషించిరో, గౌరవించిరో చూడాలి. అలెగ్జాండరు చక్రవర్తి మన పంజాబును వశపరచుకొన్నాడే? అప్పుడు ఓడిపోయిన పురుషోత్తముని ఎంతగా గౌరవించిరి. అలాగా వుండాలి. మన పౌరాణిక కాలపు ఋషు లెంత హైన్యంగా ప్రవర్తించిరో! ప్రథమ యుద్ధానంతరం బ్రిటీషు, ఫ్రెంచివారు ఓడిపోయిన జర్మనులను నిర్దాక్షిణ్యంగా చూచుట వల్ల కూడా రెండో ప్రపంచయుద్ధం వచ్చిపడ్డది. పిమ్మట అమెరికా వారు దూరదృష్టితో అటు జపానీయులను, యిటు జర్మనువారిని దయార్ద్ర దృష్టితో చూచుచున్నారు. ఇది మంచిదే. ఇన్ని తెలుసు కుంటున్న మన అగ్రకులాల వారు, పురోహితులు ఇంకా వేల సంవత్సరాలనుండి ఓడిపోయి వుంటూవున్న ఆదిమ జాతులు, హరిజను లను తగినంత శ్రద్ధా సక్తులతో ఉద్ధరించడం లేదే అనే దిగులు, బాధ నాకు కలుగుతానే వుందండీ!"

"అందుకే మనమీ దీర్ఘ ప్రయాణం చేస్తున్నాం. ఇది తీర్థ యాత్ర! మొక్కుబడి తీర్చుకొంటున్నాం" అన్నారు నాయుడమ్మ గారు.

"రంగా గారితో కలసి నేను చేస్తున్న సేవలన్నిటిలో, ఇదే అత్యుత్తమమైనది. హృదయానందం కల్పిస్తున్నది" అన్నారు ఆమె.

నాగాలాండు, అస్సాము, ఆదిమజాతుల ప్రాంతాలు, మేఘాలయం, మణిపూరు, మిజోలాండు, అరుణాచలం, హిమాచలం వారికి వేర్వేరు రాష్ట్రాలుండాలని నేను కృషి చేస్తున్నా! 'ఎందుకింత చిన్న చిన్న రాష్ట్రాలు' అన్నారు జవహర్ లాలు. 'ఆజనాలు కొద్దిమంది అయినా వారి ప్రాంతాలు చిన్నవైనా, వారిని లొంగదీయాలని వేల సంవత్సరాలుగా ప్రయత్నించి వందల కొలది ప్రభువులు ఓడిపోయినారు గదా! అంతటి గంభీర హృదయాలు, రత్నములాంటి అభేద్యమగు ధైర్య సాహసాలుగల ధర్మవంతులగు స్వాతంత్ర ప్రియుల ప్రదేశాలు మన పెద్ద రాష్ట్రాలకంటె గొప్ప స్వరాజ్య దివ్య మందిరాలు గదా!' అంటిని!

"అవును అవును" అంటూ ఆనందంతో "వారి కిద్దాం స్వరాజ్యాన్ని" అన్నారు. "స్వరాజ్యం అంటే?" అడిగారుపంత్ జి! "భారతదేశంలో మన రాష్ట్రాలతో బాటు వారికికూడా రాష్ట్రాలు; అంతేగా నీఆలోచన", అని అడిగారు నన్నూ. "అదేనండీ"! అన్నా. అలాగా ఏర్పడ్డది నాగాలాండు రాష్ట్రం. నాలుగు లక్షల నాగజాతి ప్రజలకై. వారిని చూచితిమిగదమ్మా ఎంతటి బలాఢ్యులో. పొట్టి కురచవారు, బంగారు ఛాయ, బర్మావారి ముఖకవళికలు, ఆ కంచు పిక్కలు, విశాలమగు రొమ్ములు, ఉక్కులాంటి భుజాలు, తిరుగ నేర్వని మెడలు, ఎంతటి సత్తావారిది!

"వారికి ప్రత్యేక రాష్ట్రం యిచ్చినా వారి ప్రభుత్వపు ఖర్చులు మనం భరించుతున్నా, శిస్తులేమి వారిపై వేయకున్నా యింకా స్వతంత్రం కావాలంటారేమండి!" అన్నారు ఒక్కరు.



"అన్ని శతాబ్దాలు వారిని వెనుక్కునెట్టి నాగులచవితినాడు మాత్రం ఏవో పాలు పుట్టల్లో పోస్తూ పాపం పరిహారమగునులే అనుకుంటూ వున్న మనం కొన్ని దశాబ్దాల వరకైనా వారి స్వతంత్ర తృష్ణకు తగిన తృప్తి కలిగిస్తూ ఓర్చుకోవద్దా" అన్నారు భారతీ దేవి.

అంతటి ప్రేమ, ఆమెకు యీ నాగాజాతివారిపై అటవీ ప్రజలపై, హరిజనులపై, విముక్త జాతులపై.

కనుకనే తుట్టతుదకు శీల భద్రయాజీ, మా అందరి సలహాల మేరకు శ్రీ చవానుద్వారా, భారతపు పార్లమెంటు అరుణాచలం, మిజోలాండు, మేఘాలయం రాష్ట్రాలు ఏర్పరచింది. హిమాచలం, త్రిపుర, మణిపూరు స్టేటుల బలపరచినది. మేము సాధించుకున్న సంస్కరణాలు యివ్వికూడాననుకుంటూవుండేవారు భారతీదేవి. క్రమంగా, ఆ ప్రజలు తిరిగి భారతీయ సంస్కారమును తమదిగా చేసుకొనుటకై వారిమధ్య ప్రచారం చేయబూనుకోవలెనని మా కోరిక. కనుకనే రామకృష్ణ మిషనువారి స్వాములను వారి మధ్యకు పంపించుటకై ప్రభుత్వాన్ని ప్రోత్సహించినాము, జయించినాము.

"నాగాజాతివారు అన్ని మాంసాలు, మద్యములు సేవిస్తారు. కుటుంబ జీవితములో వారి యువకులు, యువతులు మంచి వయస్సు వచ్చేవరకు పెండ్లి చేసుకోరు. వేర్వేరు యువజనాల పందిళ్ళలో కలసి మెలసి వుంటారు. బహుదగ్గరగా చేరుకుంటారు. ఒకరి నొకరు ప్రేమించుకుంటూ తుదకు జంటలుగా తేల్చుకుంటారు. తల్లిదండ్రులకు ఎవ్వరు ఎవ్వరితో కాపురము చేసిరో, చేయదలచిరో తెలుపుకున్న తరువాత పెళ్ళిళ్ళు నిర్ణయించుకుంటారు. విడాకుల ధర్మం, స్వతంత్రము స్త్రీ పురుషులకు సమానంగానే వుంటుంది. వారిమధ్య స్త్రీలకు మర్యాద, దాదాపు సమాన పెత్తనం వుంటుంది అన్నా. హరిజనులు, ఎరుకలు, యానాది, చెంచు, లంబాడీ, కోయవారు అంతటి స్త్రీ పురుష సమానత్వము,

అనుభవమేనండి. ఐనా పాశ్చాత్యులకంటె మనవారికి కట్టుబాట్లు మెండు. వారు పందులు, పశువులను తినడం, సారాయి తాగు త్రాగు గనుక హిందువుల పౌరోహితులు, మహమ్మదీయుల మౌల్వీలు, మన నాగాజాతుల, తదితర అటవీ ప్రజలమధ్య చేర లేదు. క్రైస్తవులు మాత్రం వారిని చేరిరి. చదువులు చెప్పిరి. ఐనా యాభై శాతం, దేవీ పూజలందే వున్నారు. వారినైనా ఏకేశ్వరోపాసనయందు, భారతీయ వేదాంత ధోరణియందు ఆసక్తి పొందునట్లు చేయడానికై బుద్ధుడు, వివేకానంద, రామతీర్థ, రమణమహర్షి శివానంద, శాయిబాబా మహాత్ముల దారిలో బోధలు చేయుటకై మిషనరీలు అవసరమని మేమిద్దరము భారత ప్రభుత్వ నాయకులకు చెప్పుతూ వుంటిమి.

వైష్ణవ సాంప్రదాయములో అందమైన తమ ఫాలముల మీద గంధం, నామం పెట్టుకొని పుష్పముల పళ్ళెరాలతో పొద్దునే శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళుతూవున్న ఆ మణిపూరు నాగాయువతుల జూస్తూ భారతీదేవి పొందుచుండె ఆనందం ఏమని వర్ణించగలం! నేటికి వివేకానంద, కన్యాకుమారి శిఖర మెమోరియల్ సంఘమువారు గృహస్థాశ్రమంలో వుండే సంఘసేవకులను పంపిస్తున్నారు. యీ అభివృద్ధి దేవికి స్వర్గారోహణ పొందిన తరువాత సాధ్యమగుచున్నది.

మా గోభూమిలో, వెంకయ్యగారు వస్తే ఆదిమ జాతివారు, హరిజనుల సేవకులు ఎవ్వరు ఎప్పుడు వచ్చినా ఆదినం పర్వదినంగా వుండేది. హరిజన సేవకులు, నాయకులను అటవీ జనాల సేవకులు, నాయకులను చారిత్రక దృష్టితో భారత జాతీయ పశ్చాత్తాప హృదయంతో, మితిమించిన ప్రేమ, గౌరవములతో సత్కారము చేయుట భారతీదేవి తన ధర్మమనుకొనేవారు.



# మా బర్మా యాత్ర - ఆశియా స్వాతంత్ర్య యాత్ర

## 1939

1939లో భారతీదేవి, నేను రెండు వారములకు మించి, బర్మాలో ప్రచారం చేసితిమి.

అవి రెండో ప్రపంచయుద్ధపు ప్రథమమాసాలు. ఆ ప్రళయ సమయంలోనే స్వరాజ్యము కొఱకై భారత స్వాతంత్ర్య సంపాదన సంరంభము అన్ని దారులలోకూడా పెంచాలని శ్రీ సుభాష్ బోస్, మేమంతా ఆందోళన చేస్తూవుంటిమి. శాంతి యుతమైన సత్యాగ్రహోద్యమమే తగునని మహాత్మాగాంధీ పల్కుచుండిరి. ఏ ధోరణి నెగ్గునో? అప్పటి కాంగ్రెస్ ప్రెసిడెంట్‌గా వుండిన సుభాష్‌బోసు తిరిగి ఎన్నుకోబడిరి. అది బాగలేదన్నారు మహాత్ములు. రాజీ కుదురలేదు. సుభాష్ తన రెండో అంతస్థు అధ్యక్ష పదవిని వదలుకొంటున్నారు, కాంగ్రెస్‌నే వదులుకొనుటకు సన్నద్ధులగుదురా? యుద్ధవ్యతిరేకోద్యమము సాగించుటకై కాంగ్రెస్ పెత్తందారులనే మున్ముందు ఎదిరించవలసి వస్తుందనిపిస్తున్నది. ఆ సమయంలో అంతకు ముందు రెండుసారులుగా వస్తూవున్న ఆహ్వానాన్ని అంగీకరించక తప్పదంటూ ఈసారైనా బర్మాదేశ లేబర్ కాన్ఫరెన్సువారు బలవంతపరుస్తున్నారు ఆంధ్ర సభవారు భారతీదేవిని తమ సభలకు ఆహ్వానిస్తున్నారు.

పోవడమా, లేదా అనే సమస్య మమ్మెదుర్కొన్నది. పోతే, మన దేశంలో పెరుగుచున్న, యుద్ధవ్యతిరేక ఉద్యమంలో కాంగ్రెస్ పెద్దలతో సాగుచున్న పోరాటం నుండి దూరమగుదుము. "తాత్కాలికమేగదా!" అన్నారు సుభాష్; "అది నిజమేగదా" అన్నారు భారతీదేవి; ఆయన పక్కనే త్రిపుర కాంగ్రెస్ "క్రైసిస్"లో కుడిభుజంగా వుంటూ, ఆయన కాంగ్రెసు అధ్యక్షులుగా వుంటూ తన తరఫున సూచింపబడ్డ వర్కింగు కమిటీలో ప్రముఖంగా నా పేరు ఉండెనట. కనుక సుభాష్‌కు ఈ వివరాలు తెలిపితిని. "తప్పక బర్మా వెళ్ళిరండి అచ్చటి ప్రజలను యుద్ధ వ్యతిరేకోద్యమములో చేర్చుటకు ఇదొక మహదవకాశము" అన్నారు వారు.

తిరిగి సముద్ర ప్రయాణమనేసరికి భారతీదేవికి యెన్నో స్ఫురణకు వచ్చినవి. 1925లో ఆ సముద్రాలలో స్టీమరు అటూ ఇటు తిరుగుతూ వుంటే ప్రతిదినం తాననుభవించిన కష్టాలు' మరెన్నో బాధలు తలంచుకొనిరి 1926లో సముద్రంలో మా స్టీమరు తగులబడుచున్నప్పుడు కలిగిన ప్రాణాపాయము తిరిగి భయం కలిగిస్తున్నది. ఎలాగో ఒప్పుకున్నారు. బయలుదేరాము. అంతకు ముందు బర్మాలో వుండి బర్మా ఆంధ్రులతో పరిచయం పొందిన శ్రీ గుత్తికొండ నరహరి నాకు సెక్రటరీగా బయలు దేరిరి.

ఆ బర్మావారు మాకు క్రొత్తగాదు. పైనాన్సుమినిస్టరులా వుండిన శ్రీ తీన్ మాంగ్ గారు సెంట్రల్ అసెంబ్లీలో సభ్యులుగా వుంటూ మా దంపతులను, ఢిల్లీలో, సిమ్లాలో కలుసుకుంటూ వుండేవారు. దేశభక్తులు, పలుబడిగల నాయకులు, దిన పత్రికా స్థాపకులు, సంపాదకులు, వారే స్వయంగా మమ్ము తమ అతిథులుగా రమ్మన్నారు.



1925 నుండి బర్మాలోని భారత కార్మికులకే ప్రముఖ నాయకులుగా వుండిన సుప్రసిద్ధ ఆంధ్రులు సంపాదకులు, బర్మాశాసన సభ్యులు శ్రీ అవటపల్లి నారాయణరావు 1935 నుండి సెంట్రల్ అసెంబ్లీ రంగములో నాచేత బర్మా భారతీయ కార్మికుల సేవ చేయిస్తూండిరి. 'కంట్రాక్టు లేబరు' అనేపద్ధతి ద్వారా భారతీయ కార్మికులను, కంట్రాక్టరులు రంగూన్ పోర్టులో దోచుకుంటూ యుండిరి. ఆ కంట్రాక్టు పద్ధతిని నిర్మూలించుటకై మేమిద్దరం శ్రమించుచుంటిమి. వారుకూడ మా 'టూరు'ను కోరిరి బలపరచిరి.

మా "టూరు" ప్రచురించుటతోడనే నేమింకా ప్రయాణం కాకముందే, "రంగూన్ డైలీ గజెట్" అనే ఇంగ్లీషు పత్రిక "రంగాను రంగూన్‌కు రానివ్వరాదు. ఒకవేళ బర్మా లేబరు కాన్ఫరెన్సుకు రానిచ్చినా, బర్మాలో 'టూరు' చేయనివ్వరాదు" అంటూ సంపాదకీయం వ్రాసినది! ఈ గలభాలో, ఎందరో 'మీ రెందుకు బర్మా పోవట'మన్నారు "పోయినా మీ రేపోండి, భారతీదేవి నెందుకు తీసుకు వెళ్ళటం? మిమ్మెటూ జైలులో పెట్టుతారు ఆమె నన్నా మామధ్యవుంచి, మమ్ము నడుపులకు ఉండనివ్వం" డన్నారు.

"ఏమమ్మా! మీ ఆలోచన ఏమి?" అంటిని. "ఆ దేశంలో మీరు జైలులో ఉండవలసి వస్తే నేనుకూడా ఆ దేశంలోనే యుంటే, నాకు కొంత తృప్తి. అప్పుడప్పుడు జైలుకు వచ్చి చూచి పోవచ్చునుగదా! ఈ దేశంలో ఉన్నా నన్నుమాత్రం జైలులో పెట్టరా?" అన్నారు ఆమె.

"ఆ దేశంలో కూడా మిమ్ము జైలులో పెట్టవచ్చు. ఇక్కడ యుంటే, అప్పటి వరకైనా మా కందుబాటులో నుందురు." అన్నారు కొందరు.

"ఈలాంటి ఉపద్రవ సమయములో బర్మాకు వారు వెళ్ళుచుంటే వారివెంట వుండటమే నా ప్రథమ ధర్మము" అన్నారు భారతీదేవి. ఆలాగా మనస్సులు అన్ని బాధలకు సరిచేసుకొని బైలు దేరితిమి.

ఆ సముద్రమా! మధ్యధరా సముద్రమువలెనే. కడుపుబట రపు ఆందోళన! స్టీమరు చిన్నది. అలలు పెద్దవి. సముద్రం ఆయాసపడుచున్నది. ఇక దేవీజీకి కక్కులు, తల తిరుగుడు బాధలు చెప్పతరమా.

ఆరోజుల్లో డెక్కు పాసింజర్లు వందలు! ఒకర్పై మరి ఒక్కరు త్రొక్కిసలాడు కొనడమె! పరిశుభ్రత అరుదు. తిండి సౌకర్యాలేవి! డాక్టరు ఒక్కరె! ఎందరికో జబ్బులు, వారిని చూడటానికి పోతున్న భారతీదేవి, వారితో బాటు వాంతి చేసుకోవడమే! ఎలాగో రంగూన్ చేరినాము. బ్రహ్మాండమైన ఆహ్వానము, అప్పటికి జవహరు, సుభాష్‌బాబులు వచ్చినప్పుడు మాత్రము అంతటి సత్కారము బర్మావారు అందించిరట, భారతీయ నాయకులకు. లేబరు కాన్ఫరెన్సు మా టూరు చివరకట. ఈలోపల బర్మా అంతా సంచారం చేయాలి! నాల్గు కారులలో అందరిని చేర్చుకొని, బ్రహ్మాండమైన సంచారము. నా ఉపన్యాసం ఇంగ్లీషులో, తర్జుమాలు, బర్మాభాష హిందీలలో! పదం పదం, వాక్యం వాక్యమునకు తర్జుమా!

అచ్చటచ్చట భారతీదేవి మాట్లాడేవారు. వారి చిరునవ్వులు మందహాస సత్కార స్వీకార వచనాలు, ఆమె పర్సనాలిటీ, సౌహార్ద్రిత బర్మాస్త్రీల హృదయాలను, ఆకర్షించినవి. భారతీయ స్త్రీలకు అదివరకు అంతటి ఆదరణ బర్మా స్త్రీలు ప్రదర్శించ లేదట! ఒక్క 'రిసెప్షన్'లో, సభలో ఆమెను కలుసుకున్న మీదట ఆ పట్టణం కేంద్రంలోనే, అచ్చటి మహిళా సేవకులు, ఆమెను ప్రత్యేకంగా కలియుటకై, బర్మా స్త్రీల సన్మానాలు



సభలు కోరిరి. ఏర్పరచుకొనిరి. ఆ బర్మాస్త్రీల కోలాహలం గమనించిన, యింగ్లీషు దైనిక పత్రికలు - 'ఈ రంగాదంపతుల 'టూరు'ను ఇంకా సాగనివ్వరా'దని పదేపదే వ్రాస్తూవుండిరి రంగా ఒక్కరే ప్రళయకారుడనుకొంటే, చూపుతోనే స్త్రీలోకాన్ని సమ్మోహితుల చేస్తున్న రంగా సతిని కూడ బర్మావిప్లవకారులు ప్రయోగం చేస్తున్నారని వ్రాసిరి.

అంతటి మహిమ భారతీదేవిది నిండు వయస్సులో. బుద్ధి బలంలో, ప్రచార ధీమాలో, అంద చందాలతో, ముత్యాలసరాల మాటలతో వెళ్ళి ఆమె బర్మా స్త్రీల హృదయాల నాకర్షింప గలిగిరి. మేము రంగూను తిరిగి వస్తూన్నప్పుడు మోల్‌మేన్‌లో ఒక పండితులు మమ్ము సత్కరిస్తూ శనివారపు సుబ్బారావుగారిచే ప్రచురింపబడిన నా 'భారతీయ వయోజన విద్యా' అనే ఇంగ్లీషు గ్రంథాన్ని తెరచి దానిపై భారతీదేవి సంతకమును బొందిరి. అప్పుడు ఆమె నాయెడల కనబరచిన గౌరవ మేమని చెప్పగలను! తన భర్త పుస్తకం ఆ బర్మాలో వుందా! దానిపై తన సంతకం వారికి అంత మెప్పా!

మేము రంగూనుకు తిరిగి వస్తూన్నప్పుడు 'ప్రోము' పట్టణపు బౌద్ధ దేవాలయమునకు వెళ్ళితిమి. అచ్చటి బుద్ధ విగ్రహాలు నన్నాకర్షించినవి. ఆతురతతో అందొక్క ముద్దు లొలుకుచున్న బుద్ధ విగ్రహాన్ని అందుకోబోతున్నా. వర్షాలతో నునుపు తేలిన స్థలం పై నడవాలి! నడువరాదు. ప్రక్కనున్న చెక్కలపై నెమ్మదిగా చుట్టూ తిరిగిపోవాలి. అంత నెమ్మది నాకేది? అడుగు వేయడంతో జారితి. ఆగాలనుకుంటే పట్టు కుదురదు. ప్రక్కనున్న నరహరి నవ్వలేకున్నాడు. ఇంకను చెక్కలపైనే వున్న దేవిజీ ఆయన్ను నిలుపుచున్నారు. నేను పడిత, లేస్తున్నా, లేవలేకున్నా, అబ్బా! లేచినా. తిరిగి జారినా. ఎట్లో లేస్తున్నా, లేచినా, వెనుదిరిగినా, తిరిగి కాలు జారుతుంది. నాపై నున్న ఉత్తరీయాన్ని

మెల్లిద్రిప్పి నన్ను నిల్పినారు! బయట పడినాము. 'అంత తొందరా! ఇన్ని దెబ్బలా! అంతగాయమా అనుకుంటూ నన్ను దారికి తెచ్చిరి దేవిజీ! మా జీవితములో ఆమె పాత్ర అలాంటిదే లెండి.

ప్రొద్దుటి పత్రికలు అందినవి. 'రంగూను రావడంతోనే రంగాను అరెస్టు చేస్తారట!' డెటిన్యూగా చేస్తారట!' మరో పత్రికలో 'దంపతు లిద్దరిని కలిపి వుంచితే మంచిదే' ననుకున్నాము. నన్నొక్కరినే అరెస్టుచేస్తే తాను భారత దేశానికి వెళ్ళి రైతు కూలీ కాంగ్రెసు ఉద్యమాలలో చేరుతానన్నారు. అయితే ఆ కారు ప్రయాణమేగదా! ఆక్షణాలేగదా మావి! సెలవులు చెప్పుకోవాలి! మురిపెములు చూపులోనే! అదే చాలనుకున్నాము. తుదకు మమ్ము అరెస్టుచేయలేదు. ఆనాటి హోం మంత్రినుండి భోజనానికి పిలుపు. వారి వద్దకు వెళ్ళితే ఆ దంపతులు మా యిద్దరినీ అభినందించిరి. మా ప్రచారము తమ స్వాతంత్ర్యోద్యమమునకు బల మిచ్చినదని తెలిపిరి. భారతీదేవికి వారి భార్య బుద్ధుని అందమైన విగ్రహమును అందించిరి. ఆ సుందర కాంస్య విగ్రహము "గోభూమి"లో నున్నది.

బర్మా నాగరికత ఆమె హృదయాన్ని ఆకర్షించినది. వెదురు బద్దలతో బుట్టలు మన మేదరవారు, రంగు రంగుల పట్టీలతో యేలాగా అల్లుతారో అలాగా వారి యిండ్ల గోడలు (తడికలు) నిర్మించుకుంటారు, ఫ్లాటీలపై దట్టమైన తడికల నేలమట్టం క్రింద నీరే గావచ్చు, పైన రెండంతస్థుల గృహాలు. మెట్లుమాత్రం గట్టివి. రాతివి. వివిధ కుటుంబాల మధ్య తడికలు. అవి రాతిగోడలా! ఏమో! అంతా అందమే! గొప్పమే, ఎంత పరిశుభ్రత! ఎట్టి సౌందర్యపు అరటి, వెదురు, కొబ్బరి, తాటి, అనాస వృక్షాలు, పిట్టలు, వారిది పసుపురంగు. తమలపాకునునువు, తళుకు! ఎత్తు మధ్యస్థము. నడక చురుకు; పలుకు సుకుమారము, తిండి అన్నీ,



అందినంతవరకు, నిద్ర మైమరపు! సుఖమా, ఏమో, ఎప్పుడూ నవ్వుతూనే వున్నట్లున్నారు. మతము బౌద్ధము, యువకులంతా ఒక్కొక్క సంవత్సరం బైరాగులై, భిక్షుకులై ప్రార్థనాల్లోనే! వారి దేవళాలా! మన రథాలవలె తెరలు, మెట్లు, అంతస్తులు, ఎంత సొగసు! ఎక్కినాము. రంగూన్‌లోని బంగారు షోబా దేవళం! ఎంతవిస్తీర్ణము, ఔన్నత్యము, అందం తళుకులు, భక్తులెల్లరు మిలలాడుచుండిరి. గంటలు, పాటలు, ప్రార్థజీలు దేవతలవే.

మాగాణిపై బియ్యంపై, మత్స్యములపై ఆధారం ఎడతెగని వర్షాలతో మత్స్యములతో. సయాంలోమలయా, కంబోడియా, జావా, సుమిత్రా, చైనా, జపాను, వరకు అంతే! అది ఒక ప్రత్యేక నాగరికత. పాశ్చాత్య నాగరికత తానెరుంగు. ఈ నాగరికత మరెంతగానో ఆమె నాకర్షించినది. బర్మా ప్రజలు తన్ను, తాను వారిని గౌరవించుకొనిరి. గ్రహించుకొనిరి. అలాగా ఆసియా హృదయం తన్నావరించుకున్నది.

యుద్ధం 1942కు ఆశిఖాను అందుకున్నది మన మణిపూరు వరకు పాశ్చాత్య సామ్రాజ్య శక్తులను చెల్లాచెదరు చేసుకుంటూ జపాను వస్తూంది. జపాను సాయంతో మనసుభాసు ఐ యన్.ఎకు ప్రాణం. బలంచేర్చి అండమానును తన స్థావరంగా ఏర్పరచుకొని, మణిపూరులో బ్రిటీష్ సైన్యాన్ని ఓడించిరి. విజయ స్తంభాన్ని నిలిపిరి. ఆయుద్ధమందే బర్మా స్వాతంత్ర్యమును పొందినది. మా మిత్రులు తీన్‌మాంగుగారు స్వతంత్ర బర్మా ప్రభుత్వ ప్రతినిధిగా టోక్యోలో నిలిచిరి. మన సుభాష్ నేతాజీగా వెలసిరి. తానెరింగిన అభిమానించిన ఆ బౌద్ధ దేశాలన్నీ స్వరాజ్యం పొందినవి. తనవారే తెల్లవారినుండి బయటపడినారని ఆమె ఆనందించుచుండిరి. ఇదంతా భారతీదేవి హృదయాన్ని పల్లవింప చేస్తున్నది.

నేను 1940 ఏప్రియలు నుండి జైలులోనుంటి! బెంగాలు, బీహారునుండి యెందరో విప్లవవీరులు మా 'గోభూమి'ని తాత్కాలికంగా శరణ్యం బొందుచుండిరి. 'గోభూమి'ని మూడు మారులు పోలీసులు ముట్టడించిరి. గాలించిరి. దేవీజీ చాకచక్యమువలన అందరికీ రక్షణే. నేనే తుదకు 1942 నవంబరులో ఆ "గోభూమి" లోనే పోలీసులకు తిరిగి పట్టుబడితిని. "ఆ విప్లవ వీరుల తప్పించితిమి. మనం పట్టుబడ్డా ఫరవాలేదులే" అనుకున్నాము.

అలాగా 1940లో ప్రారంభమైన మా స్వాతంత్ర్య సంపాదనా విదేశయాత్ర 1944లో భారతీదేవి అఖిలభారత రైతు సంఘ అధ్యక్షులుగా వుంటూ "బ్రిటిషు వారితో కలిసేదిలేదు." అనే శాబ్ది చేయగల్గువరకు సాగుతూనేవుంది.



# వీరపూజ

దాక్షిణాత్యమున వీరపూజ పురాతన సాంప్రదాయము "సిలప్పాధికారము" అనే తమిళ పురాతన కావ్యమందు, "వీరపూజ"కు తమిళ సాహిత్య స్థాయి కల్గించబడినది. చోళ చక్రవర్తులు, తమ సామ్రాజ్య చరిత్రలో ప్రాణములను అర్పించిన యోధులకు "వీరపూజ" చేయుడం, సాగించడం ప్రధాన ధర్మముగా జరిపిరి. అదే ధోరణిలో, ఆంధ్రకవి, శ్రీనాధుడు "పల్నాటి వీర చరిత్రమును రచించిరి. బైనేనివారు దాన్ని ప్రజాసామాన్యమందు ప్రచారం చేసిరి.

రైతు కూలీ ఉద్యమాలను మేము ప్రారంభించి నప్పటి నుండి (1923) గ్రామీణ ప్రజాసేవకులకు పూజలు చేస్తూ వున్నాము.

బర్మానుండి, నేను భారతీదేవి తిరిగివచ్చిన రోజుననే, బీరువాలో రైతాంగ విప్లవకవి శెట్టిపల్లి వెంకటరత్నం స్వర్గీయులైరన్న విషాదవార్త అందినది. భారతీదేవిఎంతగానో దుఃఖించిరి.

ఆగునా జీవాలు, సాగునా లోకాలు
రైతు జూడక పోతె, రాజ్యాలు యిల నిల్చునా
"అన్న సవాలుచేసిన
కవి పోయిరే" అన్నారు.

మమ్మెవ్వ రాపగలరోయ్!,
కొడవలటు నిటు త్రిప్పి,
నాగేలు పై కెత్తి
పరిడుగితు వస్తుంటె" అని ఆయన గర్జించె.

కవి జారిపోయి నారా అంటూ, మమ్ము సన్మానించుటకు సాగిన బహిరంగసభలో పల్కిరి.

బర్మా ఆంధ్రులు ఆమెకు అందించిన వేయి రూపాయలు శెట్టిపల్లి సంస్మరణ గ్రంథముకై వినియోగించెదమనిరి! వారి కోర్కె ప్రకారం తెలుగులో, యింగ్లీషులో శెట్టిపల్లి గేయాల విప్లవధోరణి, రైతు కూలీల ఉద్యమాశయాలు, జీవిత విశేషముల గురించి పుస్తకాలు రెండు వ్రాసితిని. ప్రచురించితిమి. మరెంతో మా ధనం ఆ వీరపూజకై అందించితిమి. మా నిడుబ్రోలులోనే, గోగినేనివారి ఆడబిడ్డ ఆదెమ్మ శతాబ్దాల క్రితం "సహదహనం" చేసుకొని, పేరాంటలై వెలసిరి. వారికి పూజలను అందించిరి.

పల్నాడులోని, కార్యంపూడిలో ప్రజలందరొకనాడు సంవత్సరిక పూజలు, 11 శతాబ్దమందు వీరమరణం బొందిన పల్నాటి వీరులకు అందిస్తూ వుంటారు. నాతో పల్నాడులో మెండల్లో ప్రచారం చేస్తూన్నప్పుడు ఆమె ఆ పవిత్ర నాగావళీ స్థలమందు వారిని తలచుకొంటువుండిరి. ఆ దేవళములో, వారికిగా గుర్తుగా వుండిన ఫలకములపై పూల మాలలను అర్పించిరి.

ఆ దినమంతా కారుల్లో, బంగాళాలో ఆలోచించుకొంటూ వుంటిమి! బాలచంద్రుదు ఎంత సాహసి, వీరుడు! బ్రహ్మనాయుడు ఎంతటి సాంఘిక విప్లవ నాయకుడు! నాగమ్మ ఎంత శక్తికల మంత్రిణి, వీరవనిత. రాచకార్య దురంధర! ఐతేనేమి! అధర్మమును ఆహ్వానించిరి. అన్యాయంగా యుద్ధం ప్రేరేపించిరి. రైతాంగ యువతి ఐనా, మనకు ఆదర్శప్రాయురాలు కాలేకపోయిరను కున్నారు.

వీర ప్రతాప రుద్రదేవుడు నాల్గుసారులు ఢిల్లీ పాదుషాలు, అల్లా యుద్దీను, తుగ్లకు చక్రవర్తుల నెదరించ గల్గిరి తుదకు. స్వామి ద్రోహుల కుట్రవల్ల లొంగిపోయిరి. ఆ పిమ్మట నలభై సంవత్సరాల పర్యంతం, ఢిల్లీ సుల్తాను సైన్యాలను ఓడించి, వరంగల్లులో తిరిగి దక్షిణభారత స్వతంత్ర్య రాజ్యాన్ని స్థాపించి,



నడుపగల్గిరి, వీరాధివీరులై కాకతీయ నాయకులు, వారి పెద్దలైన ప్రోలయ! కాపయ, వినాయక దేవులు! ఆ స్వాతంత్ర్య వీరులుపోయి ఆరు శతాబ్దములైనది. 1970కి వీరందరికీ వీరపూజ చేయులకై, భారతీదేవి, నేను, పుష్ప, విజయ, నాగేశ్వరరావు. రైతు నాయకులు గోరెపాటి వెంకట సుబ్బయ్య, పరమహంస తీర్థయాత్ర చేసితిమి ఆ కాకతీయ నాయకుల వీరోచిత, దేశస్వతంత్ర సంపాదనా చరిత్రను యింగ్లీషులో నేను వ్రాసినందులకు భారతీదేవి యెంతో ఆనందపడిరి. ఆ వరంగల్లు శిధిలాలమధ్య, రామప్ప దేవళాలు సౌందర్యమును ఆరాధిస్తూవుంటే ఆమె మెదలుతుండగా అభినవ తిక్కన శీతారామమూర్తిగారు, భారతీదేవిని రుద్రమ్మకు పోల్చుతూ వ్రాసిన పద్యాలు తనకు స్ఫురించుచుండిన వన్నారు గోత్రిపాటి వెంకట సుబ్బయ్యగారు. ఆ వీరపూజ ధోరణి అంతగా ఆమెకు వున్నందువల్లనే, 1940లో వీరమరణాన్ని మందసా కాల్పులలో ఆహ్వానించిన రైతాంగ గున్నమ్మకు మహత్తరమైన వీరపూజలు చేసిరి. లక్ష జనాలు చేరిన ఆ సభలో, పోలీసులను కవ్విస్తూ, నాల్గు తుపాకి కాల్పులను పదేపదే ధిక్కరిస్తూ వీరవిహారము చేసిన ఆ రైతాంగ మహిళలను భారతీదేవి సంస్మరించిరి. ఆనాటివారి ఉపన్యాసము మహత్తరమగు ఉత్తేజము ఆ శ్రీకాకుళ రైతాంగమందు కల్గించినదట! ఆమెను అప్పుడు చూచినవారు ఆమే మన రైతాంగ దేవత" అన్నారట, బ్రిటిషు సామ్రాజ్యాధికారుల ధిక్కరిస్తూ స్త్రీల ప్రాణాలు మింగేరాక్షసి యీకాలపు ప్రభుత్వం" అంటూ వుంటె, సాక్షాత్తు భారతమాతే అనిపించెనట! జైల్లోవుండి, ఆ వార్తలు అందుకొన్నాము ఆ భారతీ దేవిని నేను స్వయంగా అలాగ చూడలేక పోతినే అనిపించినది. రైతుల కందిన సత్తాతోటే. వీర గున్నమ్మకు చిన్నమందిరమును యేర్పరచిరి. ఆ స్థలాన్ని వీరగున్నమ్మ రణాస్థలి అనిరి.

అలాగ తమ నాయకత్వములో, పళాసాలో చేరిన అఖిలభారత రైతు కాంగ్రెసు సభలో ఉత్సాహం పొంది వీరత్వమును సాహమునుగా ప్రదర్శించిన గున్నమ్మను, వీర గున్నమ్మగా గౌరవించు భాగ్యము భారతీదేవి పొందగల్గిరి.

నలభై సంవత్సరాల పర్యంతం, తదేక దీక్షతో రైతుకూలీల సేవించిన స్వాతంత్ర్య యోధులు గొట్టిపాటి వెంకట సుబ్బయ్య గారు 1970లో స్వర్గీయులైతే భారతీదేవి పొందిన దుఃఖము ఎంతని చెప్పగలను! యుద్ధకాలంలో, బ్రిటిషు ప్రభుత్వపు కఱకు నిర్బంధ విధానాన్ని యెదిరించుటలో తనకు తోడైన వీరుడు నిర్బంధ సహకార సేద్యమును ప్రవేశపెట్టబూనిన అంతటి జవహర్‌లాలు నెదిరించిన వీరుడు పదిహేడో సవరణను, అదనపు శిస్తుల నెదిరించిన సత్యాగ్రహనాయకుడు. రైతు సంఘాధ్యక్షులుగా 30సం॥ సర్వత్యాగములుచేసిన ఆ వీరునకు మేమిద్దరం ఘంటసాలకు వెళ్ళి అశ్రు తర్పణములను అందించితిమి. వారి త్యాగములకు తోడుగా వుండిన శ్రీమతి సరస్వతమ్మను యోదార్చుకొంటిమి. "పది సంవత్సరాల క్రితం నెల్లూరు రామానాయునికి; యీనాడు యీ వీరునకు పూజలు చేస్తుంటిమి. వారివలె సేవావ్రత జ్యోతులు నెల్గించు రైతుకూలీ వీరులు ఎందరెందరో కావాలి! వారేరి? ఎచ్చట వున్నారు? ఎప్పుడువస్తారు అన్నారు? బీదజనులు, దీనజనులకొరకై సేవావ్రతము సాగించుటకు అఖండ జ్యోతులు, కావాలి. సమయానికి అందుతారా అనే ఆతురత ఆమె ప్రకటిస్తూవుండిరి - చి॥ నాగేశ్వరరావు, అచ్చమాంబ, ఘంటసాలనుండి తిరిగివస్తున్నప్పుడు.

1971 ఎన్నికల ఫలితాలు మెజారిటీ ప్రజలైన బీదసాదల కెంతగా తమ ఆర్థిక, సాంఘిక పరిస్థితులు, రాజకీయ పెత్తనాలలో మార్పు, తీవ్రమైన మార్పు, తొందరగా నడిచేమార్పు కావాలను కొంటున్నారో మా ఇద్దరికి కళ్ళకు కట్టినట్లనిపించినది. స్వరాజ్యావతరణ తరువాత 25 సంవత్సరాలు గడచినా, తమ బీదతనాన్ని పోగొట్టక పోయినా, తగ్గించు నట్లయినా ప్రభుత్వాలు, పార్టీలు ముందుకు జరుగుట లేదనుకుంటూ, భారతీయ సంస్కారము, నాగరికత, అహింసాత్మక సాంఘికసభ్యత యెడల సహనం ప్రదర్శించుతూనే, అహింసాత్మకముగా, తమ వోటుల ద్వారానే తమ మార్పుకై తాము అనుభవిస్తున్న తపన ప్రకటించటంలో ప్రజలు ప్రదర్శించిన వీరత్వమునకు మేము ముగ్ధులమైతిమి. వేర్వేరు పార్టీల



పట్టింపులనువదలి, బాధితులయ్యు, అహింసాత్మక వీరులైన ఆ ప్రజలలో కలసి, నడువాలనుకున్నాము.

ఆ 1971 ఆగష్టులో భారతీదేవి వొకసంచిని తెచ్చి, నాకు చూపిరి. అది వాలంటీరు పట్టాగలిగినసంచి. ఖద్దరుసంచి. వెలిసిపోయిన కాకీ రంగుసంచి. ఎవ్వరిదమ్మా! చాలాముసలిదే అంటిని నవ్వుతూ ఇది మా నాయనగారిది అన్నారు. అంటే వారు దీన్ని తన పైవేసుకొన్నారా? ఎప్పుడు? ఆ1920-21లో నండీ, శిస్తు నిరాకరణసమయాల్లో అన్నారు. పెదనందిపాడు శిస్తు నిరాకరణ ఉద్యమ రోజుల్లోనా? అవునండి, అపుడే, మానాయన పెదనాయన వేసుకొన్నారు. వారుకూడ వాలంటీరులైనారా? అరవై సంవత్సరాలు నిండుతున్నవుడా? ఔనట! ఐతే ఎలాగ వచ్చింది మనకు యీ బంగారు మూటల సంచి అన్నా. మా అమ్మ ఇచ్చినారు. ఎప్పుడు? వారు ఉండగానే! నేను మొదట జైలునుండి తిరిగి వచ్చిన తరువాత అనుకుంటా! అప్పటినుండి దీన్ని భద్రంగా దాచివుంచినా! మీరు, నేను జైళ్ళకు వెళ్ళుచున్నప్పుడల్లా దీనిపైకి మనసు కదలుతుండేది, అట్లానే దాచివుంచితిని. ఇపుడు అర్థ శతాబ్దము తర్వాత మనం యీ బీదజనుల తీర్పు గురించి యిప్పుడింత తీవ్రంగా ఆలోచించుకుంటూఉంటే ఈ సంచిపై తిరిగి మనస్సు మళ్ళింది. ఆ 1921లోనే మానాన్న మార్పుకోసమేగదా ఈ సంచిని ధరించిరి. ఈ మధ్య కల్గుచున్నదౌర్భాగ్యపు అనుభవాలలో దీనిపై మనస్సు మరలలేదు. మన జీవితానికి దారివేసిన సంచి గదాయని ఇప్పుడీ మెజారిటీజనాలు మార్పు కావాలని తపిస్తుంటే ఈ సంచే మార్గదర్శి అనిపిస్తున్నది.

యిక వేర్వేరు పార్టీలు వదులుకోవటం తప్పదనుకున్నాం. కాని మా స్వంతపార్టీని ఎలాగా రద్దు చేసుకోవడం? 1971 ఎన్నిక ముందు, వివిధ ప్రత్యర్థి పక్షాల ఫ్రంటు పెట్టుకొన్నప్పుడే వేర్వేరు పార్టీల ప్రాముఖ్యం పోయిందిగదా! అంతకు ముందె జాతీయ ప్రభుత్వం మేమంతాకోరినపుడు వేర్వేరు పార్టీలను వదులుకోడానికి మనస్సు దొర్లుతుండెను. కోటా, లైసెన్సు, పర్మిట్లు నిరంకుశ

పెత్తనం వదులుకొంటే, స్వతంత్ర పార్టీని రద్దుచేస్తామని రాజాజీ అన్నపుడే పార్టీ ప్రభుత్వం వద్దు. మంచి ప్రభుత్వం కావాలన్నపుడు తమతమ పార్టీలను రద్దుచేసుకోడానికి రాజాజీతో బాటు, మనం కూడా తయారగుచుంటిమే అన్నారు. ఈ పార్టీల గోల మాకేల, తిండి, గుడ్డ, నీరు, నీడ, చదువు, నిండు ఉద్యోగ రక్షణాలందించండి, అని ప్రజలు వోట్లద్వారా విప్లవాత్మకంగా రాజ్యాంగ అధికారాన్ని ఇందిరాజీకి ఇచ్చిరిగదా! వారి ఘోషను గుర్తించితిమి. వారి ఆశలను ఆవేదనలను ప్రజాసేవకు జీవితాలను అర్పించుకొన్న మా లాంటివారి పరమ ధర్మమన్నారు. నేను అంగీకరించినా. ఈ ఆలోచనలను పూజ్య రాజాజీకి తెల్పుకుటున్నాం. తుదకు జన సామాన్య సేవకై స్వతంత్రములకై, రక్షణకై, మా ప్రతివ్యక్తిగత పట్టింపులు, పార్టీల పెత్తనాలను త్యాగం చేయాలనుకున్నాం.

ఉద్యోగాలు. ఆస్థులు, ఆదాయాలు వదలడంకంటే స్వంత వ్యక్తిత్వాల పార్టీలను త్యాగం చేయటం ఎంత వీరోచిత తెంపో, బాధో అంతటి రాజాజీకి మా మధ్య జరుగుచుతున్న చర్చలు తేల్చినవి. అంతటి వీరత్వము, త్యాగం చేయుటకు భారతీదేవి సిద్ధమైరి. ప్రజాస్వామ్యమంటే విశ్వాసము వుంచుకోదలచితిమి. దేశభక్త వెంకటప్పయ్యా కుమార్తె కొండా పార్వతీ గుంటూరులో 1972 ఆగష్టు 15న స్వాతంత్ర్య దినోత్సవం జరుపుతూ తన్ను సన్మానించిన సభలో తన యీ వీరపూజా ధర్మమును భారతీదేవి ప్రకటించ గల్గిరి.

—:o:—

# విప్లవకారులు - పోలీసులు
## 1943

అది గుంటూరుజిల్లా కలెక్టరు, పోలీసు, సూపరింటెండెంటు (డి.యస్.పి), కలకత్తానుండి వచ్చిన సి. ఐ. డి. సూపరింటెండెంటు సంప్రదింపులు జరుపుకుంటున్న స్థానము - కలెక్టరు బంగళా!

కలకత్తా : "ఈ ఆంధ్రలో మూడు స్థావరాలు ఉత్తరాది విప్లవకారులకు దొరికినవి. ఏదోవిధముగా రెంటిని మూసివేయించ గలిగాము, లేదా ఆ చోట్లకు ఉత్తరాదివారు రావడానికి భయం కలుగునట్లు చేయగలిగినాము. కొందరిని పట్టుకోగలిగాము. కాని ఈ జిల్లాలోని సెంటరును అందుకోలేకున్నాము! అందులకే నేను ప్రత్యేకముగా మీతో రహస్యంగా మాట్లాడటానికి వచ్చినాను."

డి.యస్.పి: నేను యెరుగున్నంతవరకు, రహస్యపు సెంటరు అలాంటిది యీ జిల్లాలో లేదే!

కలెక్టరు : వారు కూడ రెండు సార్లు నన్ను హెచ్చరించి వున్నారండి.

డి.యస్. పి. : రంగాజీని పట్టుకొన్న తరువాత మరే ఇతర కేంద్రము యేర్పడలేదే!

కలకత్తా : రంగా కేంద్రం సాగడం లేదంటారా?

డి.యస్.పి : అచ్చట భారతీదేవిగారే వుంటారు. వారెప్పుడు, ఎవరు ఎప్పుడు వచ్చినా బహిరంగంగానే కలుస్తారు. సంప్రదింపులు సాగిస్తారు. పత్రికలకు రిపోర్టులు పంపుతుంటారు. ఒక్కొక్కమారు

మేమే ఆమె రిపోర్టులను పత్రికలు ప్రచురించకుండా చేయవలసి వస్తున్నదే!

కలకత్తా : అయితే, వారు రహస్యంగా యేమిచేయరా!

డి. యస్. పి : రహస్య వ్యవహారాల వారు వారిని కలుస్తూ వుంటారు. వారికి ఆమె సలహాలను ఇస్తూ వుండవచ్చు. ఐతే తాను మాత్రం బహిరంగంగానే కలుస్తారే!

కలకత్తా : మీాకెలా నమ్మకం?

డి. యస్. పి : నెలల పర్యంతం వారి వీధిలో పగటివేళ యిద్దరు, రాత్రివేళ వారి యింటిముందు ఒక్కొక్కరుగా హామేషా బే డ్రెస్సులో, మా పోలీసులు బీటుమీాద వుంటారు. రాకపోకలన్నీ మాకు తెలియకుండా వుండవే!

కలకత్తా : వారివద్దకు వచ్చేపోయేవారంతా ఉత్తరాది వారు కారని మీా వాళ్ళకు యెలా తెలుసు?

కలెక్టరు : ఆమె మాత్రం బహిరంగంగా మన ప్రభుత్వాన్ని ఎదిరిస్తున్నారు. కమ్యూనిస్టులదేమో "ప్రజాయుద్ధం" కాదంటూ వాదిస్తున్నారు. అఖలభారత కిసాను కాంగ్రెసుకు ఆమె అధ్యక్షులు. శ్రీ లక్ష్మినారాయణ కార్యదర్శి. ఆమె కేమాత్రం మన ప్రభుత్వ దళాలంటే భయంలేదు. మన సి. ఐ. డి.ల గాలి ఆమెకు గిట్టదు. అయినా తమ ప్రచారకుల నెలాగో, అలాగే మన పోలీసు, సి. ఐ. డి. ఆఫీసర్లను ఎంతో మర్యాదగా చూస్తారు. వారి ఆతిధ్యము అపురూపము.

డి. యస్. పి : ఔనౌను. మా నైటు డ్యూటి వారు చలిలో బాధపడుతుంటే, గొంగళ్ళు యిచ్చి, మంచినీళ్ళ కూజా లందించి, ఎన్నో సపర్యలు చేస్తారు.

కలకత్తా : అక్కడే వుంది కిటుకు! మనవారు ఆమె మహత్తుకు లోబడిపోతున్నారు. ఆ వెనుకగా టెర్రరిస్టులు తిరుగాడుతూ తప్పించుకు పోతుంటారులే!



కలెక్టరు : ఆమె చెప్పేది, చేసేది ఒకే ధోరణి

కలకత్తా : నిజమే! ప్రభుత్వాన్ని కూలదోయడమే కదా! అయితే రివల్యూషనరీలకు ఆమె సహాయం చేయరనగలమా? మన గురించి ఆమె కేమి బాధ్యత?

డి. యస్పీ : ఏమంటారు? ఏమి చేద్దామంటారు?

కలకత్తా : ఇదివరకే ముగ్గురు బెంగాలీలు, యిద్దరు బీహారు వారు! ఒక్కరు ఢిల్లీ, మరొక్కరు బొంబాయివారు యీా కేంద్రానికి వచ్చారు. కొన్ని రోజులు వుండిపోయినారు. కొన్ని ఆయుధాలు పంచిపెట్టిపోయారని మా బోగట్టా? ఇప్పుడిప్పుడే యీా వారంలోనే కలకత్తానుండి ఆ కేంద్రము లో తారాడుతున్నారు, ఒక ఉపద్రవమైన విరోధి.

డి యస్పీ : రెయిడు చేద్దామంటారా?

కలెక్టరు : ఆమె ఆక్స్ఫర్డు వైజ్ఞానికురాలు, అఖిల భారత నాయకులు, మహాత్మునికి సన్నిహితులు. ఆమె గురించి జయప్రకాశనారాయణ ఉత్తరాలలో ఎంతగా వ్రాశారో చదివారుగా! వారి యింటిమీాద 'రెయిడు' చేయడమంటే!

డి. యస్పీ : నాకు అదేబాధ! రేయింబవళ్ళు పోలీసు గస్తీ చేయడం చాలక యీా అవమానం కూడ చేస్తారా? నన్నే డిటిన్యూగా తీసుకెళ్ళరాదా అని ఆమె అంటె!

కలకత్తా : మీాకే యింత భయం, గౌరవం ఆమె యెడల వుంటే, యింకా సందేహమెందుకు; మీా బీటు పోలీసులు కళ్ళల్లో ఆమె దుమ్ము కొట్టుతున్నారనె నా భయం.

కలెక్టరు : సరే డి. యస్పీకి నేను అధికారం యిచ్చేదా? 'రెయిడు' చేయడానికి.

డి. యస్. పి : పొన్నూరు పోలీసులు చాలరా?

కలెక్టరు: తెనాలి, బాపట్ల వారినికూడా!

కలకత్తా: వాళ్ళందరికి ఆమెమీద భక్తి వుంటుంది. కనుక ఇచ్చటనుండి, రిజర్వును తీసుకెళ్ళాలి.

డి. యస్పీ: ఒక్క "వాన్ లోడ్" చాలదా?

కలకత్తా: వారి యింటి పరిసరాల ప్లాను చూపెట్టండి.

డి యస్పీ: ఆ యిల్లు వూరిబయట. ఇదుగో యీ దారి వెనుక, ప్రక్కతోట! మరో ప్రక్క వారిదే చావిడి! రెండు పర్లాంగులలో రైల్వే! దానునుండి వచ్చే డొంక ఆ పైకి వెళ్ళుతుంది.

కలకత్తా: ముందో! దక్షణానో.

డి. యస్పీ: రెండు ఫర్లాంగులలో రహదారి, ప్రక్క హరిజన పల్లె, దక్షిణాన పంటకాలువ అరమైల్లో.

కలకత్తా: ముందు ఆదారులన్నీ కట్టాలి. అప్పుడే ఆ ఇంటి కెదురుగా, వెనుకగా మనదళం చేరాలి. అంతా ఒకే పరియాయం. ఎవ్వరికి ఏనోటీసు యివ్వరాదు.

డి. యస్పీ: ఎప్పుడు!

కలకత్తా: ఇప్పుడే!

డి. యస్పీ. మా డి.వై.యస్పీ.ని పిల్చేదా?

కలెక్టరు: రిజర్వు కెప్టెన్ను పిలుస్తా. ఫోనుమీద. అలాగే చేయువలసిన యేర్పాట్లు అన్నీ గంటలో చేశారు. మూడు బ్లాకు వానులలో రిజర్వును చేర్చారు. బైలుదేరుతున్నారు.

ఎట్లా, ఎవ్వరో డి. వై. యస్పీ. ఆఫీసునుండి పొన్నూరుకు రిజర్వు కదులుతున్నదని, పొన్నూరు స్టేషనుకు హెచ్చరిక చేశారట.

అందినది ఎవ్వరెవ్వరికో, ఎచ్చెచ్చటవున్న వారికో యీ కేంద్రంలో వున్న వారికి.



సాయంత్రం మూడున్నర గంటలకు భారతీదేవిగారికి వినపడు చున్నవట, గొప్పధ్వనులు, బజారునుండి ప్రక్కవారి పిల్లలు అరుచుకుంటూ పోలీసు లన్నారట! చేలోనుండి పనివారు దూకుతూ "అమ్మో సైన్యం విరగబడి వస్తుందంటూ" దేవిజి వినేటట్లు అరుస్తూ మా బజారుదాటి పల్లె వైపుకు పరుగెత్తుతున్నారట.

భారతీదేవి అప్పుడే తమతో సంప్రదిస్తూ వున్న కొసరాజు అమ్మయ్య, ప్రభుతులతో యింటి బైటికి వస్తున్నారు. దాచడానికి ప్రత్యేకంగా యేముంది. రహస్యపు కాగితాలు-ఉత్తర ప్రత్యుత్తరాలు గోభూమిలో వుండవు. మరి భద్రంగా వుంచవలసినవి, తోటలో ఎచ్చటో భూగర్భమందుండును.

ఇంతలో ఇంటికి నలుప్రక్కలా రిజర్వు పోలీసులు.

లోపలికి స్థానిక సబ్ ఇన్స్పెక్టరు, సర్కిలు, డి.వై.యస్పీలు వస్తూ భారతీదేవికి నమస్కరించారు.

ఏమండి ఇవ్వాళ ఏదో హడావిడిగా వచ్చారే! ఇంత మందికి అతిధ్యము అందించగలమా!

కాదండి! మీరు క్షమించాలి. కొందరు రివల్యూషనీర్లు ఇచ్చట తలదాచుకొన్నారని మాకు వార్త! ఐనా దేవిగారు దాచరే అన్నాము. కాని, వారిని పట్టుకొని తీరాలి! అంటూ పైనుండి ఆర్డర్లు!

అయితే సరే! మాయిల్లు మీవారికి తెలుసుగా! ఈ పెద్ద హాలు వెనుక ఆ చిన్నగది ఈ ప్రక్క వంటశాల ఆపైన అంతా చేలు, చెట్లు పొలము, పాములూ! పోలీసులు అప్పుడే అన్నీ చుట్టుతున్నారు. కొందరు లోపలకు వెళ్ళుతున్నారు! ప్రతిగోడ వెంట నిలుబడుతున్నారు. అన్నీ రిజర్వు టోపీలే!

ఐతే యింత తొందరపడుతున్నారే మీవారు! మాయిల్లు ఎంత సత్రంగా అన్నివైపులా బహిరంగంగా వున్నాం. అంతా

మాదిగదా! నన్ను అరెస్టు చేయకుండా నాకేవారంటూ చూపెట్ట కుండా ఇలా చేస్తుంటే యెలా? ప్రభుత్వము ఇట్టిది కాబట్టేగదా మేము తిరుగబడుచున్నది! ఐతే పోదామా పోలీసుస్టేషన్‌కు? మా యింటికి మీరే తాళాలు వేస్తారా?

వారంతా నిర్వీర్యులైనారు.

డి. యస్పీ. సిగ్గుపడుచూ "అమ్మా సర్చివారంటు తెచ్చి నాము, ఇదిగో చూడండి."

చూచుకొని "సరే సెర్చి చేసుకోండి! ఇప్పుడే యీస్నేహి తులకు కాఫీ యిస్తున్నా! వారి కామర్యాదచేశేదా? మీకు ఏమి ఇవ్వగలం! మేమంతా బందీలమై పోతామా?

డి. యస్పీ. అమ్మా క్షమించండి. మీరు ఆ కాఫీ తీసుకోండి మేము తీసుకొచ్చినాము.

ఆమె స్నేహితులకు కాఫీ ఇచ్చిరి. వారినికూడా ఆసెర్చి చూస్తూ వుండమనిరి.

గాదెలు, మచ్చులు, బిందెలు, బుట్టలు, స్నానపు గది, వంటగదులు, మంచాలక్రింద, అంతా గాలించి చూచుకొనిరి. గుబురుగా పెరిగిన మామిడి చెట్లు ఎక్కి చూచిరి. గంటకు మించి తోటంతా చూచుకొనిరి. తుదకేమీ దొరుకలేదనుకొనిరి.

అప్పుడుగాని ఆఫీసర్లు కూర్చొనలేదు. అంతవరకు భారతీ దేవి ఆరుబయట కుర్చీలు వేయించి, తాను అతిధులు కూర్చొని వుండిరి.

"సర్చి" పూర్తి అయిన తర్వాత డి. యస్పీ. భారతీదేవికి క్షమాపణ చెప్పిరి. కలకత్తా సి. ఐ. డి. ఆఫీసరులు పరిచయంచేసిరి. ఆయన బిడియపడుతూ అన్నారు. "అమ్మా, మిమ్మూ నేను పల్లు



మారులు కలకత్తాలో, పాట్నాలో చూచినాను. రంగాజీని ఎరు గుదు. శ్రద్ధానంద పార్కులో లక్ష జనాలకు వారు ఉపన్య సిస్తుంటే చూచాను. మీరుకూడా వున్నారు.

ఐతే ఇంత శ్రమజేసి మీరుకూడా ఇంతదూరం వచ్చారు. మా పోలీసులమీద నమ్మకం లేకేనా?

కాదండి! ఎందరో యీ వైపుగా వస్తున్నారు. ఎవ్వరూ దొరకడంలేదు. ఎన్నో రిపోర్టులవల్ల మీవద్దకు ప్రతివారు వచ్చి పోతున్నారని తెలుస్తున్నది. ఇప్పుడొకరు యీ కేంద్రంలో వున్నా రని మా భోగట్టా! అందుకని నన్నే స్పెషలుగా పంపినారు! మరేమి అనుకోవద్దండి.

అనుకోవడానికి ఏముంది! ప్రతి క్షణం మాకు గండము! ప్రతివారు వస్తూంటారు. మేము యీ ప్రభుత్వా నెదిరించేదేగదా! కొందరు రహస్యంగా, మేము బహిరంగంగా! ఏక్షణాన రహస్యపు దేశభక్తులుగా వస్తారో? వారికి ఆతిధ్యం బహిరంగంగా ఇస్తాము. రహస్యంగానే వెళ్ళిపోతారు. ఎక్కడనుండి, ఎచ్చటకి, ఎందుకు, ఎలాగా అనే ప్రశ్నలు నాకేల? వారు దేశసేవ చేయగల్గడమే మా కోరిక, ప్రయత్నం. వారి చిల్లర రహస్యాలతో మాకు పనిలేదు. మా అందరి బహిరంగ రహస్యం ఒక్కటే. దేశమాత సంకెళ్ళను త్రెంచివేయడమే!

మన కర్మవల్ల ఆ సంకెళ్ళను మీరు రక్షిస్తూన్నారు. బ్రద్దలు కొట్టాలని మేమూ! ఐనా ఇరుపక్షాలు భారతీయులమేగదా. మీకూ ఆతిధ్యము ఇస్తూనేవుంటా! ఇక దేశభక్తులకు పూజలు చేయడం మా ధర్మంగాదా! ఈ రివల్యూషనరీలు నా వద్దకు వస్తూనే వుంటారు. వారిని ఆదరిస్తూనే వుంటే తప్పేమీ. ఈ సమయంలో వారెవ్వరు లేరు.

అమ్మా! నేను కాళీమాత భక్తుడనే! ఈ ఉద్యోగ ధర్మం.

నిజమేనండి మేమందరము కూడా ఉద్యోగాల్లో వుండిన వారమే!

అదిమీ పూర్వాశ్రమం! మేమింకా ప్రాథమిక ఆశ్రమంలో వుండే దురవస్థ కలిగింది.

అందుకే, మీరు మాతో చేరమని అడుగడంలేదు, "కాని చేరే రోజులు రావా? నేతాజీతో చేరుతున్న ఐ. యన్.ఎ వారు చేసిన రాజభక్తి ప్రమాణంకంటే మీ ప్రమాణాలు గట్టివా ఛేదింపరానివా? ప్రభు భక్తి పరాయణులమధ్య ఇలాంటి ప్రచారం చేయడం శిక్షార్హం కదా. అందుకు మమ్మ అరెస్టు చేసుకుంటారా? ఎవ్వరు మా వద్దకువచ్చిరో, వస్తారో మమ్మ అడుగవద్దు. వస్తూనే వుంటారు, వారిని రక్షిస్తూనే వుంటాము. పట్టుకుంటారు మీరు, ఎవ్వరి ధర్మం వారిదిగదా అన్నారామె.

"అమ్మా అలా అనకండి. మీరు ఆ కాళిమాత ప్రతిబింబము. ఈనాడు ఇట్లా మిమ్మ స్వయంగా కలసి ఈ సందేశము స్వయంగా అందుకోగల్గుట మా అదృష్టము. నాదొక్క కోరిక. బెంగాలులో మా అమ్మకు అందించే సాష్టాంగ ప్రణామం మీకు అందిస్తున్నాను. ఆ దేవియే మీద్వారా సాక్షాత్కరిస్తున్నారు" అన్నారు కలకత్తా ఆఫీసరు. భారతీదేవి, డియస్పీ, మిగతావారంతా ఆశ్చర్య చకితులైపోయారట.

ఆ తర్వాత అందరు వానుల పైకెక్కి వెళ్ళిపోయిరి.

అమ్మయ్య! అనితేరుకొని "యిప్పటికి ఆ బెంగాలీ పెద నందిపాడు వదలిబెట్టి పరుచూరు చిలుకలూరిపేట మీదుగా మద్రాసుకు పోతూ వుంటాడు" అంటూ తన సంతోషాన్ని ప్రకటించిరి.

"చూచితిరి కదా! వారెవ్వరిని నావద్దకు తీసుకురావద్దు. నేనె ఒక్కరోజు ప్రయాణమైనా చేస్తూవారిని తగు గోప్య ప్రదేశాలలో కలుస్తా. బియ్యమో, గుడ్డలో, డబ్బో మందులో



మరేదో కావలసినది మన శక్తికొలది యిద్దాము. అప్పుడు యీ కేంద్రముకు ముప్పురాదు" అన్నారు.

గుంటూరు పోయే దారిలో కలకత్తా ఆఫీసర్ డి.యస్పీతో ఈ భారతీదేవిగారిదే ఉత్తరాదివారికి గొప్పబలం. ఎంతటి ధైర్యం. నైతిక శక్తి. ఎట్టి ధీమా! ఎవ్వరూ రాలేదన్నారా? ఎవ్వరికి సాయం చేయమన్నారా? మీకు సత్తావుంటె పట్టుకోండి మేము మా విప్లవాన్ని నడిపించేదే! అన్నారు.

డి. యస్పీ. మేము ఆమెకు ఆ మైదానంలో రక్షించడానికి బదులు ఆమె మాకు ఆదరణ చేస్తారండీ! మా వాళ్ళందరూ ఆమెను దేవతగా చూచుకొంటారు. ఎంత మర్యాద ఏమి హుందా! ఆమె రాణి!

పై కథ కొంత దేవిజీద్వారా, కొంత ఆ సెర్చిలో పాల్గొన్న పెద్ద, చిన్న ఆఫీసర్లు, కొంత అమ్మయ్య, శ్రీ వి. యల్. సుందర రావు ద్వారా నాకు అందినది.

అప్పుడపుడు మేము ఈ విషయములు తలుచుకుంటూ వున్నపుడు ఆమె అనేవారు "రంగాజీ మీరు జైళ్ళలో ఎన్నో శ్రమలు పడ్డారు. మేము బైటబడ్డ బాధలు యింకా హెచ్చు. మన ధర్మం నెరవేర్చితిమి. అనుకునేవారం. వీరకు మేము, ఎంతచేసినా ఇంకెంత చేయాలో అనే దిగులు, రేపేమి ఉపద్రవమో అనుబెంగ! మీరు జైల్లో ఎంత దిగులుపడుతున్నారో అనే ఆవేదన మన యింటి కొచ్చినవారికేమి బాధ కలుగునో, వెళ్ళినవారు పట్టుబడలేదుగదా అనే భయం. బైటవుండి విప్లవబాధ్యతలు భరించడం నెరవేర్చడం అందులో స్త్రీని, ఒక్కరిని, ఊరిబయట, డబ్బులేదు! అబ్బ చెప్ప తరము గాదులే అనేవారు.

# శ్రీశైలం

శ్రీశైలానికి దక్షిణ భారత చరిత్రలో ప్రముఖస్థానంవుంది. తెలుగు దేశమును త్రిలింగ మనేవారట; ఆ మూడింటిలోను శ్రీశైలం ప్రధానమైనది.

ఆ తీర్థానికి పోయిరావడం అర్థశతాబ్దానికి ముందు, కాశీకి పోయిరావడము కంటే కష్టమై వుండేది. పదుల మైళ్ళు, రోడ్లులేని కీకారణ్యములో ప్రయాణములు చేయవలసి వుండెను. మా అమ్మ మంగమ్మ 60 సంవత్సరాల క్రితం వెళ్ళివచ్చిరి. అటులే భారతీదేవి అక్కయ్య 50 సంవత్సరాలక్రితం వెళ్ళిరి! తిరిగి వస్తూవారు తెచ్చినవి శివుని కృప, భ్రమరాంబ ఆశీర్వాదములకు తోడుగా ఎముకలు కరిగించే మలేరియా జ్వరాలు మాత్రం! ఆ యాత్ర ఎంతో కష్టం, మరెంతో భయంకరం.

అందరూ ఆయడవులలో వుంటూవున్న చెంచువారిని పొగడుతూ వుండేవారు. అబద్ధమాడరు, దొంగలించరు, అమిత ఆత్మగౌరవం, రోషం, ధాటీ, ధీమా గలవారు.

మొదట్లో శైవులు, జైనులు, పిమ్మట వైష్ణవులు ఎంతెంతగానో పరస్పరంగా వివాదపడేవారు. యుద్ధాలు జరిగినవి. రాజులను చేర్చుకొనేవారు. పరస్పరంగా హింసా కాండలను సాగించినారు. పుస్తకాలు వ్రాశారు. తగులవేశారు. ఆ యుద్ధ గాథలను గురించి మేమిద్దరం చెప్పుకొనేవారం. అంత దౌర్భాగ్యం మన చరిత్రలో వుండగా పాశ్చాత్య దేశాలలోనే మత యుద్ధాలుండెనని వివిధ మతాలవారు పరస్పరంగా హింసించుకుంటూ వుండెనని



మన చరిత్రలో అట్టి మత పోరాటాలు లేవని మనవారెందుకు చెప్పుకుంటారని భారతీదేవి అడిగేవారు.

ఎందరో ఎన్ని వివాదాలలోనో నాశనం కాగా, కాగా, చివరకు 'చేతులారంగ శివుని పూజింపడేని, నోరునొవ్వంగ హరి కీర్తి నుడువడేని' అనే పరస్పర శాంతియుత, స్నేహపూర్వక మత సామరస్యం సాధించగలిగిరి మన పూర్వులు అన్నా.

1962లో శ్రీశైలం పోవుటకు అవకాశం కలిగినది. దేవీజి మేనకోడలు పుష్పను కలుపుకొని ఆ పవిత్ర క్షేత్రానికి కారులో బయలుదేరాము. శ్రీశైలం వరకు మంచి రోడ్డు వున్నది. మా అమ్మనాటి యిబ్బందులు తెలుచుకొని, వారి ఓర్పు, శ్రమకు ఆశ్చర్యము పొందినాము. నల్లకొండ భయంకరముగా లేదు. తన దట్టమైన అడవులతో అందముగా వుంది. అదియైనా పదిమైళ్ళే. చెంచువారు ఎందరో లేరు. అడవి మృగాలేవి కనపడలేదు. పాతాళగంగవద్ద పవరు ప్రాజెక్టు సన్నాహాలు! అంతా ఈనాటి ప్రపంచమే. సులభంగానే చేరినాము శ్రీశైలనాథుని వద్దకు. మంచి గెస్టుభవనములు నిర్మింపబడినవి. కాన్‌టిన్ కూడా బాగున్నది. అన్నీ భగవద్భక్తి కలిగిన ధర్మాచరణుడైన శ్రీ లక్ష్మయ్య దేవాలయ కమీషనరుగా సాగించిన నిర్మాణ కార్యక్రమ ఫలితము. దేవళం ప్రక్కనే స్వాములవారు పోషిస్తూవున్న అందమైన, సుఖదాయకమైన, చల్లని ఉద్యాన వనమున్నది. అందు దేవిజీ ఆనందముగా గంటలసేపు విహరించిరి. ఆ దేవళ పురోహితులు, బ్రాహ్మణేతరులు, లింగధారులు.

అడవివారే ప్రథమ ప్రార్థన చేస్తారట. అదే మంచి పద్ధతి. సంస్కృత మంత్రాలు, పురోహిత పౌరాణికాలు ఎంతో మందికి మతిభ్రమ కల్గిస్తున్నాయి దేవళాలెన్నిటిలోనో అనుకున్నాం.

అప్పుడన్నారు ఎవ్వరో శ్రీశైల కథ వివరిస్తూ "ఒకపుడు దేవళపు - పూర్వ చరిత్రలో - యిది దుర్గా దేవళ"మని.

"నిజమేనా?" అన్నారు ఆమె! "ఎన్నో దేవళాలలో ఇట్టి మార్పులే జరుగుచుండేవి కదమ్మా" అన్నా!

ఔనౌను. మహమ్మదీయులు, మన దేవళాలను త్రవ్వి మసీదులు కట్టించారుగదా, ఉత్తరాన" అన్నారు ఆమె. "కోటలు రాజుల మధ్య మారినపుడు దేవాలయాలు దేవతల మధ్య మారుతుండేవి. శ్రీకూర్మంలో ఒకప్పుడు శివాలయమట! దాన్ని కూర్మావతారపు ప్రతిష్ఠగా రామానుజులు మార్చారట!

"తిరుపతిలోకూడా ఇలా ఎన్నో మొదట అమ్మవారట! తరువాత యీశ్వరులట! ఇప్పుడు అందరినీ చేర్చుకొన్న శ్రీ వెంకటేశ్వర్లు. ఇవన్నీ ఆయా కాల ప్రజాభిమతము ప్రకారం అవతారాలు. అసలు ఒక్కటే! ఒక్కరే! అదే సర్వాంతర్యామి, సర్వేశ్వరుడు, ఆదిమధ్యాంతరహితుడు. పురుషుడుగాదు, స్త్రీగాదు అదే అది, నీవు నేను అంతా అదే"నంటూ భారతీదేవి, అదొక యోగముద్రలో నున్నట్లు పల్కుకుంటూ వుండినారు. నామాట చేర్చినాను "అండాండంబులు, బ్రహ్మాండంబులు అంతయు నీవై వింతలు సలుపగ, అంతా రామమయం."

అర్చన చేసుకున్నాం! పురోహితులచేత చేయించడం ఇతర దేవళాల్లో! శ్రీశైలంలో పురోహితుని మధ్యవర్తిత్వం అవసరం లేదు. శివునికి అభిషేకం మనమే చేస్తాము. మన చేతులతో ఆ శివుని అందుకుంటాము. చేతులారా నలుముకుంటాం. అందులో నలుపు నీలం రంగుల కలయిక జెందిన మూర్తి, ముఖములేని, విగ్రహముకాని, లోహములను లో బెట్టుకున్న శిలాఖండమే.

ఎంతో తృప్తి పొందితిమి. ఆ శివుని చేతులారంగా పూజించుతూ, స్పృశించుతూ, అభిషేకించుతూ. ఉత్తరాదినవున్న బురుజు



ద్వారం వద్ద శివాజి నిలిచిన గుర్తులు గమనించితిమి. వారిదొక మందిరమట. ఆంధ్రదేశపు యీ శిఖరానికి ఆ శివాజీ వచ్చిరా! ఇదేనా వారుండుచుండిన ప్రదేశం. మనలాగే వారును యీ మల్లికార్జునుని పూజించిరా? ఓటములనుండి వెల్వడి విజయంకొరకై మల్లికార్జునుని చూచుకొనిరా? అనుకుంటూ తన తృప్తిని దేవీజీ వెల్లడించిరి.

ఆ కష్టకాలంలో యీ అడవులు ఆ దేశభక్తుని కెంత రక్షణ కలిగించినవో! విగ్రహారాధనపై దండెత్తుచుండిన ఆ మహమ్మదీయ చక్రవర్తి ఔరంగజేబును ఎదిరించడానికి తగిన మతసంప్రదాయపు ఆయుధము, యీ ముక్కు, ముఖంలేని లోహాలకు, విగ్రహాలకు మించిన ఈశ్వరుని ఈ నల్లశిలయే! బాగున్నది.

"అయితే ఆ శివాజీ తన విరోధి అఫ్జిల్‌ఖాన్ను తన పులి గోరుల మధ్య నలిపివేశారే? అది ధర్మమంటారా? ఆనాటి మహమ్మదీయులు మన భారత రామాయణాల ధర్మాలను గుర్తించలేదుగా? రాణి పద్మినిని అధర్మంగా చెరబట్ట చూచిరే! మన ప్రతాపరుద్రుని మోసంతో గదా బందీ చేసిరి."

"ఎలాగా హింసించిరో? అసలు వారి యుద్ధాల నడక అంతా భారతీయేతర అధర్మధోరణిలోనే గదా!" అంటూ వున్నారు.

"ఆయన యుద్ధ ధోరణి గోరిల్లా" పద్ధతి. అంతటి సామ్రాజ్యాన్ని ఎదిరించాడు, ఆ కరుణ నెరుగని ఔరంగజేబు చక్రవర్తికెదురైనాడు! కత్తిని కత్తితోనే, ధర్మాన్ని అధర్మములోనైనా. అందిన పద్ధతి, అవకాశం, ఆయుధముతో పోరాడుచుండినారు. అప్పుడు మన గాంధేయ ధర్మాలు ఆయనకు అందునా? చాలునా?" అనుకున్నాము.

"రాములు మాత్రం వాలి నేమిచేశారు?" అన్నది పుష్ప! "శంబుకినో?" అన్నా నేను. యుద్ధమంటే మాటలా! కర్ణుడిని ధర్మం గానే చంపారా? ఆ కర్ణుడు అభిమన్యు నేమిచేశాడు!

"అందుకే మహాత్ముడు అహింసాత్మకమైన సత్యాగ్రహో ద్యమాన్ని తాను నడుపుటేగాక లక్షల ప్రజలచేత సాగిస్తూ వున్నారు. విజయం సాధించారు-ధర్మయుద్ధం ద్వారా! అది మనం దరి అదృష్టం. అందులో మనంకూడా యోధుల మయ్యాం," అన్నారు" అనుకున్నాము.

అప్పుడు తిరిగి చెప్పినారు. తాము మహానంది క్షేత్రమునకు వెళ్ళితిమని - నేను జైలులో వుండగా, తన రాయలసీమ ప్రచార సందర్భములో, "ఆ కొలనులో స్నానముచేస్తూ ఎంతో ఆనందం బొందితిమి. అప్పుడు మీరువుంటే ఎన్ని కేరింతలు అనుభవించే వారమో?" అప్పుడు ప్రత్యేక శ్రద్ధతో చెంచువారికి అటవీ ఉద్యోగులువల్ల కలుగుచుండే ఇబ్బందులను గురించి విచారించిరట. అప్పుడే చెంచు లంబాడీలు, తదితర అటవీ జాతుల రక్షణకై నేను తయారు చేసిన ప్రణాళికను ప్రచారం చేసినారట. వారికి పశుం లను కొనుటకు, పోషించుటకు ప్రభుత్వము పరపతి యిస్తూ యితవు సహాయం చేయాలని, సాగుచేసుకోవడానికి తగిన భూవసతి కలిగిర చాలని; మరమ్మతులు, విత్తనాలు, పరికరలకు పరపతికల్గించాలని; షావుకారులనుండి రక్షణ కలిగించాలని; అటవీ పంటలు, ఫలాలు వగైరా అమ్మకంలో వారికి తగిన పరపతి మార్కెటు రక్షణ అందించాలని, మంచి గృహావసతులు కలిగించాలని? ఇంకేవేవో అవసరాలు తెల్పిరట.

"ఆ 1928లో నీలగిరి కొండల్లో బడగవారు, తోడావారు, వణి యనులు వగైరా కేరళ అటవీ జనాలగురించి మీరు ఆర్థిక, సాంఘిక లెక్కలు వేస్తూ వుండేవారుకదా? ఎందుకబ్బా యీ లోయలలో కొండ శిఖరాలపై నున్న యీ కొద్దిమందిని గురి చి



ఇంత శ్రద్ధ చేస్తున్నారనుకొనేదాన్ని. అప్పటి మన బ్రిటీషు స్నేహితుల, వారి అనుచర భారతీయ బృందం! ఆ తరువాత దేశంలో నాలుగు కోట్లమంది అనాదిమ జాతులవా రున్నారని తెలుసుకొంటిమి. సిమ్లా కొండలలోవున్న అటవీ జనాల ఆట పాటలు, పండుగలలో పాల్గొంటిమి. చిత్తూరులో సవరుల కొరకై వల్లభరావు, విశాఖలో కృష్ణమూర్తి, బీశెట్టి కోయలకొరకు, నల్ల మలలో బాలిరెడ్డి, ఎడ్వర్డు సేవ చేస్తూవుంటే, వారికి తోడగు భాగ్యం నాకు కలిగినది" అంటున్నారు దేవిజీ.

మీరు వ్రాసిన "నీలగిరి అటవీ జనాలు" అనే పుస్తకాన్ని శ్లాఘిస్తూ మహాత్ములు వ్రాసిన లేఖ ఎంత ఆనందం కల్గించిందో. నేనే స్వయంగా ఆంధ్రలోని కొండజాతులవారి క్షేమం కొరకై శ్రమించవలసి వచ్చినపుడు "మారంగా ఎంత దూరదృష్టితో యీ దిక్కుజాలని కోట్లకొలది భారతీయ ప్రాథమిక ప్రజలకై ప్రణాళిక లను రచించారని గొప్ప తృప్తి బొందితినండి" అంటూవున్న దేవిజీతో ప్రయాణం గడిచినది.

"పుసులూరు కోదండ రామయ్యగారు అనేవారండి. రంగాజీ మేము 1946లో ఆదిమ జాతుల రాజకీయ రక్షణకై ఆల్ యిండియా ట్రైబల్ ప్రజల సంఘాన్ని పెట్టకపోతే గాంధిజీ, ధక్కరు బాబా ఆశీర్వాదం లేకపోతే మన ట్రైబ్సు గతి ఏమ య్యేదోనని."

"మన ఢిల్లీ బసలోనేగదా రాజేంద్రప్రసాదు అధ్యక్షతన మీరు ట్రైబలు ప్రతినిధుల సమావేశాన్ని జరిపించిరి!

"డా॥ అంబేద్కర్, ఆక్సుఫర్డులో మనతోవుండిన జైపాలు సింగు వచ్చిరి. అప్పుడేగా మన కాన్‌స్టిట్యూషనులో ఆదిమ జాతుల రక్షణకు తగిన హక్కులు నిర్ణయించాలని తీర్మానించిరి."

"జ్ఞానమ్మా! అసలీ దేశంలో ప్రప్రథమముగా వుండిన జనాలసంతతే గదమ్మా ఈ ఆదిమజాతులు. ఉత్తరాదినుండీ, సము

ద్రాలమీదుగా దండెత్తుతూ వస్తూవున్నవారు పైకి పోవడం, వీరిని క్రిందకు త్రొక్కి-వేయడం ఆ వేదకాలమునుండి మొన్నటి వరకూ సాగుతూనేవుంది. మనపూర్వీకులు ఆదిమ జాతివారే, వారు ఓటమిని అంగీకరించి శబరి, ఆంజనేయులు, సుగ్రీవులు, ఘటోత్క-చులు వగైరాలవలె లోబడిపోయారు. మనకు వారి కులాల వరుసలలో ఏదో తరగతులవారీస్థానమిచ్చినారు. ఎప్పుడూ లొంగని వారు అడవులలోకి, లోయలలోకి, కొండశిఖరాలపైకి వెళ్ళుతూనే వున్నారు. పురుగులు, దోమలు, చలి, ఎండ, ఆకలి, దప్పికల బాధలతో, జబ్బులతో క్షీణించుతూ, పెంపులేక, పోషణలేక జంతువుస్థాయిని అధిగమించలేక అటవీ ప్రజలుగా నిలిచిపోయారు. రామాయణ కాలానికే గెలిచి పైకెదిగి, మంత్రాలు తంత్రాలు నేర్చిన ఆర్యుల దృష్టిలో, పాటలలో పురాణాలలో కోతులుగా చిత్రింపబడ్డారు. కొందరు రాక్షసులుగానే చూడబడి ఊచకోత కోయబడ్డారు.

"అయితే ఈ దిక్కు-జాలని ప్రజల గురించి ఆ 1923కే మీకెలాగా యింత దయ, అభిమానం కలిగిందా అనిపించేది నాకు."

1921-22లో ఆఫ్రికానుండి వెస్టు యిండీసు, అమెరికానుండి ఆక్సుఫర్డు లండనుకు వచ్చిన విద్యార్థులతో చెలిమి కలిగింది కదా! వాళ్ళను చూస్తే మన యానాది, ఎరుకల, కోయ, సవరవారు లాగానే వున్నారు. ఆముక్కు-లు, జుట్టు, పెద్ద పెదవులు, బలమైన చెక్కి-ళ్ళు. అప్పుడనిపించింది. కవిరాజు తన "శంభుకవధ" నాటకానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో చెప్పింది నిజమని! అప్పుడేగదా, 'అంతర్జాతీయ రైతుకూలీ గ్రూపు'ను నేను ఆక్సుఫర్డులో ఏర్పరచింది. అప్పటినుండి వీరి పురోభివృద్ధికై పాటుపడాలనుకున్నాం."

"పాపం మన శ్రీ వెన్నెలకంటి, యానాదులకై ఎంత శ్రమిస్తున్నారండి!" "అల్లే క్రిమినల్ ట్రైబ్సు గురించి నేను



థక్క-రుబాబా శ్రద్ధ చేస్తుంటిమి." "మీ ధోరణిలోనే అఖిల భారత కిసాను కాంగ్రెసు చేత వీరి రాజకీయ హక్కు-లకై తీర్మానాలు చేయించినామండీ - నేను ప్రెసిడెంటుగా వుండగా" అన్నారు దేవీజీ.

"రంగాజీ! డాక్టరు అంబేద్కర్ గారు కూడా ఎంతగా కష్టపడ్డారు. ఆదిమజాతుల గురించి, హరిజనులకొరకు, ఆయన తానొక హరిజనులయ్యె. వారి కష్టాలు, మనోవేదన దౌష్ట్యంపు సాంఘిక కర్మకాఠిన్యత గ్రహించుకో గలిగినారు గనుక!"

"అందరు హరిజనులు ఆయనలాగా సాంఘిక దురన్యాయాల గురించి అంత ఘాటుగా తిరుగబడ్డారా? ఆయన కారణజన్ములమ్మా! అది నిజము? మనకొక తృప్తిలెండి! ఆ రాజారామమోహనులు, వీరేశలింగం, వివేకానందులు, అనిబిసెంట్, రామతీర్థవలెనే, మనం కూడా దీనజనోద్ధరణకు మహాత్ముని మార్గాన్ని అనుసరించ గలుగుతున్నాము. మన కావూరి వెంకయ్య ఎంతో సేవ చేస్తున్నారు గదా? అదేగదా శివుని ధోరణి! ఆ దుర్గాంబ ఎలాగా తన భర్త విషం మింగుచున్నా, ఓర్చుకొంటూ ప్రపంచ రక్షణ కోరుకున్నదో, పోతన్న పద్యాలు చదివితిరిగదా!" అన్నా.

ఒక్క-టి మాత్రం నాకు అత్యంత తృప్తి కలిగిస్తూ వుంటుంది. మనదారి మంచిది. మన ధోరణి ధర్మమైనది. ఐతే జవహర్‌లాల్ కూడా మన దారిలోనే, ధర్మ పంథాలోనే వుంటున్నారు. ఆయన ఆమెట్టులో, మనం యీ శివపార్వతుల దారిలో?"

అలాగా తిరిగి వస్తున్నాం! కటిక యెండ! వాయువు తాపం కలిగిస్తూ వుంది. అంత దూరాన రోడ్డు ప్రక్క- ఖద్దరుసంచితో ఓ పాంథుడు నడుస్తున్నట్లు పసిగట్టినాను "ఆయనెవ్వరో పాపం!" అన్నా! అంటే "కారు ఆపమంటారా!" అన్నారామె, "ఆపుదామా" అన్నా? "ఆమాట చెప్పరాదు" అంటూ కారును

ఆపించిరి. ఆయన్ను పిలిచినాము. ఎచ్చటికి, ఎవ్వరు? నడుస్తూ వున్నారట, వేకువనుండి. డబ్బులు తక్కువట. నర్సరావుపేటకట! వారిని ఎక్కించుకున్నాం. నా మనస్సులో ఆ శ్రీశైలనాథులే అనుకున్నా. చల్లగా వారితో గుసగుసలాడినా 'అలానే వున్నదండీ' అని మందహాసము చేశారు.

ఆకాలంలో పక్షం దినాలు, జ్వరాల మూటలు, దగ్గుల బరువులతో వుండిన యాత్ర యీ కాలంలో రెండు దినాలలో సులభంగా సుఖంగా సాధ్యమైనది. యీ శ్రీశైలయాత్ర! అదే నాంది చిత్తూరులో మా విజయానికి! ఆ దారిలో కాళహస్తీశ్వరులు, వెంకటేశ్వరులు, సుందర వినాయకులు తమ ఆశీర్వాదములు అందించారు.

—:o:—

# అర్ధనారీశ్వరులకు మించె

సాధారణంగా భార్యాభర్తలు మన సాంప్రదాయములో అర్ధనారీశ్వరులుగా చూడబడుదురు. ఆచరణలో అంత సాంఘిక గౌరవము, సమానత్వము స్త్రీలకు అందించలేకున్నారు. మేము మాత్రము ఇంగ్లాండునుండి తిరిగి వచ్చినప్పటినుండి ప్రత్యేకంగా, ఉద్యోగాలు వదలి మహాత్ముని ఉద్యమములలో చేరినప్పటినుండి (1931) భారతీదేవి, నేను ఇద్దరము కలసియు, వేర్వేరుగాను మా దంపతుల తరఫున వ్యవహరించ పూనుకుంటిమి.

నేను జైళ్ళలో వుంటున్నపుడు, తానుకూడా కొంతకాలం జైళ్ళలో వుండవలసి వచ్చేది. కొన్ని పర్యాయములు, తాను వెలుపలే వుండ కలిగినపుడు, పార్టీ అవసరాలకోసరం, అండరుగ్రౌండు కృషి, సేవలు చేయవలసి బైటనే వుండవలసినపుడు, నా తరఫునగూడా వారు వ్యవహరిస్తూ వుండేవారు.

క్రమంగా రైతుకూలీ వుద్యమాలలోని సేవకులు, కాంగ్రెసువారు కూడా భారతీదేవి స్వయంగా తమ సభలకు, సమావేశాలుకు వస్తే నేను చేరినప్పటికంటె హెచ్చు తృప్తి పొందుతూ, మేమిద్దరము అందినంత ఆనందం పొందేవారు. అలాగా మేము, వేర్వేరుగా యిద్దరు కంటె హెచ్చైన ప్రాతినిధ్యం వివిధ ఉద్యమాలకు అందించ కలిగేవారము.

1940లో నన్ను జైళ్ళకు పంపినప్పుడు యిప్పటి ఒంగోలు జిల్లా యిడుపులపాడులో, కడపజిల్లా చెన్నూరులో 1941లో నిడు

బ్రోలులో రైతాంగ విద్యాలయ నిర్వహణ భారం వారే భరించిరి. విద్యార్థులు, ఉపన్యాసకులు నాయెడల ఎట్టి భక్తి చూపెట్టేవారో అట్లే ఆమెను తమ తల్లిగా, పెద్దగా గుర్తించేవారు.

అయినా వారికెంతో భారంగా వుండేది. ఆ విద్యాలయ నిర్వహణ! డబ్బు కావాలి. ఉపన్యాసకులు పరస్పరంగా గౌరవించుకోవాలి. విద్యార్థులు సుశిక్షితులై వుండాలి! బోధన మా రైతుకూలీ ప్రజా రాజకీయ ధోరణిలో వుండాలి. డిబేట్సులో వివాదాలు రాకుండా చూడాలి. నాయకుల మధ్య హెచ్చు తగ్గుల స్పర్థలు పెరుగరాదు. అన్నీ సక్రమముగా జరుగునట్లు వారు చూడకలిగినారు.

రైతుకూలీ ఉద్యమ సేవకుల కుటుంబాలలో వివాహములు జరుగుచుండునుగదా! ప్రతి ఒక్కరికి మేము రావాలని, వధూవరులను ఆశీర్వదించాలని కోర్కెలుండడం సహజము. నేను ఇతర రాష్ట్రాలలోను, దేశాలలోను సంచారము చేస్తూ వుంటే, అలాంటి సమయములలో ఆమె శ్రమించి శ్రద్ధతో ప్రయాణములు చేస్తూ వధూవరులను ఆశీర్వదిస్తూ, సమావేశమగుచున్న వారందరి మధ్య రైతుకూలీ ఉద్యమ ప్రచారం చేస్తూ వర్కర్లందరినీ పరామర్శిస్తూ వుండేవారు. నేను స్వయంగా, వెళ్ళినప్పటికంటె, వారె అందినప్పుడు అందరికి తృప్తి కలుగుచుండేది. అంతగా సేవా కార్యాలు సాగింప లేకున్నవారికి, దేవిజినుండి ఓదార్పు కలిగేది. నావలె తీవ్రంగా పల్కుట వారి ధోరణి కాదుకదా!

క్రమంగా భారతీదేవి అనారోగ్యంగా వుంటున్నా ఆమెయే స్వయంగా వచ్చి ఆశీర్వదించ కలిగినపుడు ఉద్యమ ప్రచారకులు పొందుచుండెడి తృప్తి వర్ణింప తరముగాదు.

ఎందరెందరో వారివారి కష్టములు, సంసారిక అనుభవాలు ఆమెకే స్వతంత్రించి చెప్పుకొనేవారు. అభిమానముతో నిదానముగా అన్నీ విని చర్చించి తిరిగి సలహాలను అందించేవారు. అంత



సామర్థ్యము వారికే చెల్లును, కనుక "వారి సలహా ప్రకారము వ్యవహరించండి" అనేవాణ్ణి.

గొప్పగొప్ప కవీశ్వరులు, పండితులు, కాంగ్రెసు నాయకులు వివిధ సాంఘిక సమావేశాలకు వస్తూ వుండెడివారు. క్లుప్తముగా చిరుపలుకుల వరుసలలో మందహాస భరితముగా ఆమె అందించు సందేశములను అందరు గొప్పగా చూచుకొనడమేగాక, కొందరు "ఆమె నాలుక ప్రక్క సరస్వతి, మనస్సులో ద్రౌపది, హృదయములో రుక్మిణి తాండవిస్తారండి," అంటూ వుండేవారు.

1940-44లో వివిధ జిల్లాల కలెక్టర్లు, మద్రాసులోని గవర్నరు సలహాదారులు ఆమెపై గౌరవముతో, ఆమెను తలుచుకొని భయము పొందేవారు. "రంగా జైల్లోవున్నా ఆయన నలుగురైదురుగా పెరిగినట్లు భారతీదేవి వ్యవహారాలు సాగిస్తూనే వున్నారే! ఆయనైనైతే పట్టుకోవచ్చు. వెంటాడవచ్చు. ఈమె ఇంట్లోవున్నా గంభీరముగా వుండిరి. ప్రయాణాలు అఖిల భారతమంతా చేస్తూవున్నా యేగడబిడ లేకుండ సాగిస్తారు. అరమర లేకుండా అందరితో చర్చించినట్లే వుందురు. అయినా విప్లవాత్మక కార్యకలాపములు వారి సలహాల మేరకు సాగిపోతూనే వుంటవే? ఎలాగా ఈమెను ఆపగలగడం? అనుకునేవారట!

అలాగా దశాబ్దాల తరబడి రంగా అంటె ఇద్దరు రంగాలకు మించినట్లుగా రైతుకూలీ ఉద్యమాలలో సేవ చేయగలిగినాము.

చేనేత వారి ఉద్యమం నేను జైలుకు పోవడంతోటే కుంటుపడుతుందేమో ననుకున్నారు. చేనేతవారు బీదలు, రాచకీయంగా అప్పటికి బాగా పైకి రాలేదు. శ్రీ పెండ్యాం వెంకటరాములు మాత్రము స్వతంత్రవీరులుగా వెలసిరి, అప్పుడు ప్రగడ కోటయ్య, రమాకాంతం, అక్కల కోటయ్య, భారతీదేవిని తమకు తోడుగా నిలువమనిరి. "అంతకంటె పరమధర్మమేమి" అంటూ ఒకవైపు యుద్ధ వ్యతిరేక ప్రచారం చేస్తూనే, యుద్ధానికి కావలసిన వస్త్ర నిర్మాణం చేస్తున్న చేనేతవారి రక్షణ, కనీస మజూరీల గురించి ప్రభుత్వముపై వత్తిడి తేకలిగిరి.

"ఏమండీ, ఒకప్రక్క మీరు మా ప్రభుత్వాన్నిట్లు ఎదురిస్తున్నారే? ఇప్పుడిలా చేనేతవారికిన్ని రక్షణలు కావాలంటూ మమ్ము కోరుతారేమిటి? మీరే వస్తే మేము ఎలా కాదనగలం" అన్నారట ఒక పరియాయం ఒక అడ్వైజరు.

"యుద్ధ వ్యతిరేకానికి జైల్లో పెట్టండి. అంతేకాని శ్రమజీవులైన యీ చేనేతవారికి రక్షణ గలిగించడానికి కూడా జైల్లో పెట్టుతారా! నా భర్త జైల్లో వున్నారు. నేను వీరిని కాపాడుకుంటున్నా! రెండు పనులు సాగవలసినదేకదా!" మీరన్నది ధర్మమేనండీ!" అన్నారు ఆ గవర్నరు సలహాదారు.

జైలుకు ఆరునెలలుకు ఒక పరియాయం నన్ను చూడడానికి వచ్చేవారు. ఒక్కొక్కమారు తాను కటకం వెళ్ళి శ్రీ నవకృష్ణ చౌదరి, మాలతీ చౌదరి బృందాలను, కలకత్తాలో దత్తు ముజుందారు, బంకిం ముఖర్జీ, అహమ్మదు బలగాలను, పాట్నాలో గంగాప్రసాదు, శర్మ ప్రభృతులను కలుసుకొని, తుదకు బీహారు చివర వున్న హజారిబాగ్‌కు వెళ్ళి జైల్లోవున్న స్వామి సహజానంద సరస్వతి గారిని కలుసుకొంటిమని. ఏమేమి ఎట్టెట్లు చర్చించిరో ఏయే ఆలోచనలకువచ్చిరో, ఆమె వెనుకవున్నతలుపు ప్రక్కనే చెవియిచ్చి వింటూ వున్న సి. ఐ. డి. ఆఫీసరుకు అర్థముగాకుండా, నాకు తనతలంపులు అందునట్లు నెమ్మదిగా చెప్పీ చెప్పనట్లుగా సంసారపు సంగతులు వెలువరించినట్లు అతి గోప్యంగా పలుకుచుండిరి. చాలవరకు అర్థమగుచున్నా అంతా తెలియలేదు, ఉత్తరం వ్రాయరాదా అంటిని. "ఇక్కడే ఈ మాటలనే ఇంత శ్రద్ధగా ఈ సి.ఐ.డి.వారు ఏమేమో వ్రాసుకుంటున్నారే. అనుకున్నవి అనుకోనివి కలిపి" అన్నారు.

వారి ధోరణి గ్రహించి పకపక నవ్వితి! ఆమె మాత్రం చిరునవ్వే అందించిరి! అడిగినా, "ఏమండీ, యింతంత పెద్ద ప్రయాణాలు యీ యుద్ధపు రోజులలో ఎలా చేయకలుగుతున్నారు."?

"మీరేగదా ఆ 1923 - 925లో వొంటరిగా మద్రాసు నిడుబ్రోలు మధ్య రైలు ప్రయాణాలు చేయించారు. ఇంగ్లాండులో వుండగా, చెప్పుతుండేవారు కదా, పాశ్చాత్యులవలె నిర్భ



యంగా ప్రయాణాలు చేయాలని! వూటినుండి మద్రాసుమీదుగా, నిడుబ్రోలుకు, ఎన్నిమార్లు ఒంటరిగా ప్రయాణం చేయించేవారు! అదే తర్ఫీదు అండి" అన్నారు. అయినా యుద్ధం, పైగా ప్రభుత్వానికి మనం వ్యతిరేకులం. సైనిక దళాలవారి మొండి పెత్తనమే అనే భయం వుంది.

"లేదండీ ఖద్దరుతో నేను రైలెక్కితే నా వాలకం జూచి కాంగ్రెసు సేవకురాలినని గ్రహించి అందరూ నన్ను గౌరవిస్తారు. స్థలం పరుండడానికి చూపుతారు. మంచినీరు, తినడానికి వస్తువులు తెచ్చి పెట్టుతారు! ఎంతో సేపు పట్టదు, నేను ఎవ్వరినో తెలుసుకొనుటకు! ప్రతి రాష్ట్రంలో రైళ్ళలో, బస్సులలో మనల నెరింగిన వారు కొందరు వున్నారు. మీరేమి దిగులుపడవద్దు "అన్నారు!

అలాగా ఆమె ఆదిశేషునిలా నన్ను, మా ఉద్యమాలను విస్తృత, పరచిరి, పోషించిరి. బహుళ శక్తివంత మొనర్చిరి.

కమ్యూనిష్టులు రైతు ఉద్యమాన్నికూడా పారిశ్రామిక కార్మికోద్యమాన్నెట్లు బ్రిటీషు ప్రభుత్వమును బలపరచుటకై ఉపయోగించుకొనిరో అటులే తమ "ప్రజాయుద్ధ" నినాదాన్ని శిరసావహింప ఎంతగానో ప్రయత్నించిరి. వివాదాలలో చర్చలు సాగించుటకు మా తమ్ములు లక్ష్మీనారాయణను (M.A. B.L.) బలపరచిరి. తీర్మాన స్థాయికి వచ్చేసరికి తాను మాత్రం కమ్యూనిస్టులతో అంగీకరించేవారు కాదు. పళాసా సభలో చేసిన తీర్మానానికి మనం కట్టుబడి వుండాలి మార్పు కావాలంటె ప్రభుత్వముతో చేరకుండా వుండవలసినదే కాని జాతీయ స్వాతంత్ర్య సంపాదనోద్యమాన్ని, కాంగ్రెసు ఇచ్చిన నినాదాన్ని ఎదిరించరాదు" అంటూ నిలబడిరి. ఆలాగా, రైతాంగాన్ని కాంగ్రెసు యొక్క జాతీయ రాజవీధిలో నిలుపుకోగలిగిరి. బ్రిటిషు వారికి లొంగనివ్వలేదు. అలాగా నేను ఎప్పుడూ వారి ద్వారా ప్రజలమధ్య వుండకలుగుతూవున్నా! అదెంతో తృప్తి కలిగించినది.

—:o:—

# భారతీదేవి - పూల పుప్పొడులలో

శ్రీమతి భారతీదేవికి పుష్పాలపై గొప్ప ప్రేమ. భారతీయ స్త్రీలకేగాదు - అన్ని దేశాల స్త్రీలకు అంతే! ఐతే, దేవీజీ తానే పుష్పవల్లికలను, చెట్లను పెంచేవారు. ఆదరించిరి. పుష్పాలను యేరిరి; మాలలను కట్టిరి. దేవతలకు, దేశభక్తులకు, సంఘ సేవకులకు, వారి ప్రతిమలకు అర్పించిరి.

మల్లెలంటే యెంత మక్కువ! తలలో తురుముకోవాలని వుండేది. ఇంగ్లండునుండి ప్రప్రథమంగా తిరిగి వచ్చినప్పుడు ఆ పాశ్చాత్యుల ప్రభావంవల్ల. "తలలో అన్ని పువ్వులు గుత్తులుగా పెట్టుకోవటం నాకంత నచ్చలేదు." అంటే "సరేలే" అంటూ, పువ్వుల గుత్తులను వదిలివేసిరి.

క్రమంగా దేశంలో తిరుగుతూ శ్రామిక స్త్రీలు భగభగ వెల్గుతుండే మందారపువ్వులు, బంగారుల విరజిమ్ము చేమంతులు, వెల్గుల బంతులను తమ తుమ్మెదలను మరపించే తలలలో నొక్కి శృంగారముల విరజిమ్ముతుంటే చూచితి, ఆనందించితి; ఆమెదృష్టి నటు త్రిప్పితి; నవ్వుతూ "అందుకేగదా తలలో పువ్వులు మనవారు పెట్టుకుంటారు" అనిరి. మీరుకూడా పెట్టరాదూ? అంటే "ఆవయస్సులో వద్దంటిరిగదా" అన్నారు. నా తృప్తికై తన యిష్టము తీర్చుకొంటూ, ఆ నల్లని కరుకగు జుట్టుముడిలో నీలాకాశమున ధ్రువతారవలె వెల్గునట్లు వొక్కటి, రెండు బొడ్డుమల్లెలను జేర్చేవారు. ఆ మల్లెలకు వారందించినారా అందం! మల్లెలు ఆమెకు అందాలను జేర్చెనా?



"సంపెంగ సొగసు" అనేవారు! పుష్పమా అది? ఆ నిండు పచ్చని ఆకుల సోయగమా? కమ్మని సువాసిన! ఘుమ ఘుమలాడిస్తుంది వాతావరణాన్ని! తెల్లవార్లు మెళుకువ గల్గినప్పుడల్లా తన్ను మరువనివ్వదు. ఆ సంపెంగ తీగల తియ్యదనం దేవిజీ ధనం! "మందార మకరందము" తుమ్మెదలకేగాదు. మనకూ మాధుర్యమే! అది అనుభవించే పోతన్న కవి అంత కమ్మని పాదాన్ని పూరించారు" అనేవారు దేవీజీ. ఎన్నిరకాల మందారాలనో చేర్చేవారు. పెంచేవారు. మా అమ్మాయి అనసూయ గుత్తి మందారను పెంచితే దాని మొక్కను తెచ్చిరి గోభూమికి! ఈనాడా మందార గుత్తులు-రంగురంగుల దళాలు ఎన్నెన్నో - "దేవిజీకి" ఆభరణాలుగా వుంటున్నవి. వంద పగడాల గుత్తులు ఆమెకే! ఈమధ్య, విజయవాడ కో ఆపరేటివ్ కాలనీలో, పంచదళాలతో ఎర్రఎర్రగా విసురుకుంటున్న మందారాలను చూచితి! "అయ్యో, దేవీజీ లేరే!" అనిపించింది.

మేమిద్దరం మద్రాసులో డాక్టరు చిట్టూరి సత్యనారాయణగారి దొడ్లోవున్న పున్నాగలను పరమర్శిస్తూవుంటిమి; నేలపై వెల్గుచున్న పున్నాగ వెండిదళాలను ఏరుకొంటూ వుంటిమి! "శ్రీ కృష్ణుని చూచావా?" "పున్నాగ కానవే పున్నాగవందితుని" అంటూ గోపికలు పల్కిరట గదా!

ఆ పోతన్న పద్యాలెంత బాగున్నవి! పోతన్న రైతు గనుకనే అన్నిపుష్పాలకు, చెట్లకు, చేమలకు అంత గారవం అందించారు" అన్నారు దేవిజీ. "నీవలెనే గదా!" అన్నా.

మరింకొకరు పోతన్నవలె, చెట్టు, చెట్టుకు ప్రాణం పోసేవారు. అవునవును. చిత్రనళీయంలో కృష్ణమాచారి. నలుని పోగొట్టుకొన్న దమయంతికి దుఃఖంలో అందిన చెట్లుగదా!

గోభూమి ప్రాంగణములో వున్నది పారిజాతం. పువ్వులన్నప్పుడు. ప్రొద్దునే ఉదయపు సూర్యుని ఆరాధిస్తూ భూదేవికి

క్రొంగ్రొత్త ఆభరణాలను వివిధ వర్ణాల సమ్మేళనమును సున్నితంగా అందిస్తూండే ఆ పారిజాత పువ్వులకు మా హృదయాల నందించే వారము. సాయంతనపు వేళ పచారుచేస్తూ మేల్కొంటున్న పారిజాతములు మమ్ము తమ జాడలు గమనించమనేవి. ఓరజూపులతో ఆనాటి రుక్మిణీ - సత్యభామలెందుకు వాటిపై అంతగా మనస్సు పెట్టుకొనిరో గుర్తుకు తెచ్చేవారు "పారిజాతాపహరణం" లాంటి గ్రంథం మరో భాషలో వుండగలదా - అనుకొనేవారు.

"నైటుక్వీన్" అంటే పారిజాతంపై వున్నంత ప్రేమ మా కిద్దరికి. వెన్నెలరాత్రిళ్ళు మా క్వీనుకు ప్రక్క టేబిల్ వేసేవారు. కుర్చీలు తెచ్చేవారం. భోజనాలు చేసేవారం ఎందుకంత శ్రద్ధ క్వీన్ యొక్క శోభ, సుగంధం అనుభవించడం కొరకు. ఐతే ఒక్కొక్కప్పుడు ఘాటుగా వుండేది ఆ క్వీనుబలం; "జీవితంకూడా అప్పుడప్పుడట్లె!" అనేవారు.

పైకివెళ్ళి కబుర్లాడుకుంటూ వుండగా, దక్షిణాది గాలితో వచ్చేది క్వీనుసొగసు! ఆ సుగంధమును నేను గుర్తించేసరికి ఆమె చల్లగా తన గంభీరమగు మెడ నిటు త్రిప్పి "అందుకే ఆమె క్వీను" అనేవారు.

ఇక రోజాలా! నాకు ఎర్రగా, వర్రగా, గుమ్మగా వుండే రోజాలు, ఇంగ్లండువారి కందేమాదిరివి, ఇష్టం, తనకూ వాటిపై ప్రేమే! ఐతే, వివిధరంగుల రోజాలు కావాలనుకొనేవారు, కష్టపడి హైదరాబాదునుండి తెలుపుపై, ఎరుపు చిలకరించుకొన్న రోజాలు తెచ్చిరి. అందాల రేఖలేకాని, క్రమంగా "అలాంటి చీరలవలెనే తెల్ల బారిపోతవి! చూచారా మీ పూలు వాడిపోతున్నవనేసరికి ఒప్పుకొన్నారు, పసుపుపచ్చని రోజాలను తేవాలనుకున్నారు! అవి రాకముందే. సెలవు పొందినారు. భారతీ కుటీరంలోని రోజాలు ఆమెను అందుకోలేకున్నవి.



"లిలీసు"ను మా అమ్మాయి సుశీల తెచ్చిందట! బారులు తీర్చితిమి. సంవత్సరానికో నెల దినాలు పొడుచుకొస్తవి! ఎర్రగా, సొగసుగా, సుగంధాన్ని సన్నగా అందించే ఆ "లిలీ" పువ్వుకత్తెలను, 1971లో నేను తనవద్దనే వుంటున్నప్పుడు గోభూమి ప్రాంగణములో ప్రతి సాయంత్రం నేను తిరుగాడుతూ తనకు చూపెట్టుతుంటే తానంతకు ముందు ఆ సత్యభామలాంటి వీరవనితలను చూడనట్లె. తనే పెంచిన ఆ లిలీలలామలను తన మునివ్రేళ్ళతో బుజ్జగించేవారు. మొగలివలె గుచ్చుకోవుగా! వారాలబాటు యీ అందాలను అందిస్తున్నవీ లిలీలు! "మీరీ సంవత్సరమేగా వాటిని గౌరవిస్తున్నారు. ఎన్ని సీజనులలో, రంగాజీవుంటే, యీ లలీలను లాలిస్తూంటే, యీ పారిజాతాలను పలకరిస్తుంటే, యీ మల్లెలను మాలిమిచేస్తే ఆ చామంతులకు భజనలందిస్తే, ఎంత బాగుండునో అనిపిస్తుండేది!" అన్నారు.

మల్లెలంటే మరోమాట వుంది. అది పున్నమరేయికాబోలు! తళతళమంటున్నవి పైకి చూస్తున్న మల్లెకొమ్మలు, వాటిపైనున్న చంద్రుని మరిపించు మల్లెలు! నాకు పూలంటే వెర్రిగదా! భోజనానికై పిలుస్తూ టేబిలుకొరకు రూములోకి వెళ్ళిరి దేవీజీ. ఇంతలో నాల్గు మల్లెలు అందుకొని వారికిద్దామనుకొన్నా! సరసర వెళ్ళినా. పూలకై చేయిచాచినా. ఇంతలో ప్రక్కనేవున్న రోజాకెందుకో కోపం వచ్చినది. చొక్కా నంటుకొన్నది ఓకొమ్మ! దోవతిని పట్టుకొన్నది మరోకొమ్మ! ముళ్ళు వదలలేదు. గిరగిర తిరిగినా, పడిపోయినా. కుడి అరచేతిపై బరువు అందినది. ఎటులో లేచినా! వారు పిలుస్తున్నారు. నవ్వుకుంటూ ఆ రెండు పూలను వారి కెటులో అందిస్తూ "పడిపోయినా, ఇదిగో కాలికి చిన్న దెబ్బ అరచేతికి వత్తిడి" అంటూ చిన్నపిల్లలువలె వారి "బుజ్జగింపుకై" చూచితి. ఆమెకు ఎనలేని భయం, ఆపైన కోపం! "ఎందుకింత తొందర" అంటూ సపర్యలు చేస్తూ వుండిరి. "నాకు మల్లెలపై ఎంతప్రేమో తెలియదా" అంటిని. ఆ చేతిబాధ ఇప్పటికీ అప్పు

డప్పుడు కలుక్కుమంటుంది. మల్లెలు ఆమె హృదయంపు బిడ్డలు. ఆమెను తిరిగి నాకు అందిస్తూ వుంటవి.

చంద్రకాంతలు అవిగో సుశీల, భారతుల పిలుస్తూ వున్నవీ సాయంకాలములందు. కనకాంబరాలు, కంచి, కాళహస్తి చీరల సొగసుల నందిస్తూ వుండును. ఆ చీరెలు వదలివేస్తిమి! "ఇవ్వేగా మిగిలి వున్న''వనేవారు. ''మీ ప్రియఖాదీ ఆ యందాలను మర పించడంలేదా'' అనేసరికి - ''యిలా'' చూచేవారు.

మెరిసే మెట్టతామరలు మాత్రమే అందినవి ఆ 1926లో. "భోగనువిల్లా"తో ఆమె సరసాలాడేవారు. హైదరాబాదులో ''మెష్'' మీద అల్లుకునే ఆకుల తీవెలందు సరదా! పగడాలు, పచ్చలు, నీలాలు, రత్నాలను వయస్సులో ఆనందించలేదనే కొరత వుండేది.

ఇంతప్రేమ పుష్పాలకేనా? కాదుకాదు గోభూమిముందు రైతులు కోరినవరిచేను, హరిజనుల వెండిజల్తారు సరస్సు ఎట్టి ఎంత సౌందర్య రాసులందిస్తున్నవి? ప్రొద్దున్నే వెనుక తలుపు తెరచి ప్రాంగణములో వెల్గుచున్న బాలసూర్యుని నవ్వులరాసిని అందుకొనేవాణ్ణి! ఆప్రశాంత సౌభాగ్యం నేనేనా అనుభవించడ మనుకుంటూ. ''ఏమండోయి భారతీ, యిటురా రా, రావమ్మా'' అంటూ కేకవేసేవాణ్ని!'' ఏమంత మునిగిపోయిందో" అనుకొంటూ త్వరగా వచ్చేవారు. 'చూడుచూడు ఆ ఆనందాల అవతారం' అంటే "అవ్విచూస్తూ ప్రతిప్రాతఃకాలం, ఆనందంతో నా హృదయం నింపుకొంటున్నా! ఐతే మీరు పిలిస్తే నేను వస్తిని. నేను పిల్చినప్పుడు మీరు రావలదా?'' అని ప్రశ్నించేవారు.

మేడపైకి ఎక్కేవారం. మైళ్ళ పర్యంతం కనబడుతుంది సృష్టి శృంగారం! ఆ కొబ్బరి, తాడిచెట్లు, ఆ వరిచేలు, ఆ కాల్వ కట్టలు; దూరాన, యింటూరు — నిజాంపట్నం కాల్వపై వేస్తున్న తెరచాపలు - ఎంత అందం! "జ్ఞాపకముందా, మన బసవయ్య -



దుర్గమ్మగారు సీతారామశాస్త్రిగారందించిన తాళవృక్ష దండకం'' అన్నారు. ''ఓ తాళవృక్షమా? నీవు నిలువెల్ల మా కొరకేగదా!'' అన్నపద్యం, అదే పోతన్న హృదయం, రవీంద్రుని గేయం, వర్డ్స్ వర్తు సంగీతం అనుకొనేవారు.

''మీరేమో, కేరళ, అస్సాం, గోదావరి, మణిపూర్, కాశ్మీరు, మలయాద్రి, కోనసీమ, తజావూరు, ఉద్యానం మరెన్నో సౌందర్య సీమలను పదేపదే చూస్తున్నారు. నేను వాటిని ఎప్పుడో చూడగలిగినా, కావాలనుకున్నపుడల్లా, యీ మేడమీదకెక్కితే వీటినిచూచి, మనమున్నామనుకుంటూ ఆనందించగలుగుతున్నాను. ఐతే క్రమంగా యింతపైకి ఎక్కలేకున్నాను! మొదటి అంతస్తుకే వచ్చి, చూడటంకూడా భారంగానేవుంటుంది. ఆమధ్య గోవాకెళ్ళినారుగా, ఆ బంగళా ప్రక్కనున్న, మూడు "పొప్లారు" చెట్లగురించి వ్రాసిరే! శ్రీనగరంలో దాల్ సరస్సులో, నెహ్రూపార్కులోని చెట్ల అందాలు చూచితిమిగదా! అలాగే సుందరంగా వున్నవి. యీ గోభూమికి రెండు వైపులవున్న యీ కొబ్బర్లను తూర్పునవున్న యీ సరస్సును చూస్తూ ఆనందించుచున్నాను.''

మన మాగాణి ప్రాంతాలేగాదు ఆమె హృదయాన్ని పల్ల వింప జేసినది. ఆనల్లమలే, సాత్పురా, వింధ్య, హిమాలయం నీలగిరి, మహేంద్రగిరి, శ్రీశైలం, తిరుమల, కన్యాకుమారి పాదాలు భారతీదేవికి మనోజ్ఞంగా వుండేవి! నేనుచూచి ఆనందించడం! ఆమె వాటిని నాటి, పెంచి, పోషించి, మాకందరికి, ఆయా వృక్ష ములు తీగెలు, మొగ్గలు, పువ్వులు, దళాలు అందించేవారు. ఆపైన మాతో తన ఆనందాన్ని పంచుకొనేవారు. అన్నిటికి అధ్యక్షురాలు తులశమ్మ. వారిదే సౌభాగ్యం! అందుకొనేవారం మనం! "పుష్ప విలాపం" పద్యాలను ఘంటసాల కంఠ నినాదంతో గ్రామఫోను అందిస్తుంటే, వినేసరికే, "అందుకేగదా నేను పువ్వులను గట్టిగా నల్పుటకు బాధపడతా"ననే వాడిని! సరే సన్నజాజి వున్నాగ

పారిజాతం లాంటివి జారిపడిపోవును గదా! హింసించడం వద్దు! ఐతే ఎంతవరకు ఆజాలి!! స్త్రీలుకూడా పుష్పాలేగదా; కనుక, పుష్పాలను పెంచుకోవాలి. పెట్టుకోవాలి. నలిపివేయరాదు!

బంతులు, చామంతులపై దేవిజీకి, ఆంధ్రులందరివలెనే గౌరవము, ముక్కోటి ఏకాదశే రావాలి. చామంతులనే సరాలుగా అల్లాలి. చిన్నపిల్లలకే సింగారించాలి! శ్రీకృష్ణునికే ఆపాదమస్తక పూజకు చామంతులనే, బంతులను అందించాలి.

ఇక చెట్లో! రావిఆకు, మర్రివూడలు, వేపమండలు, ఈకి పూలు, వెదురుజులపాలు, కొబ్బరిచేతులు, తాటివీవన-గొడుగులు, చింతచిగురులు, మామిడి కొమ్మలు, చిగురులు, పండ్లు జామకాయలు, కరుబూజ, బొప్పాయి కాంతులు, అరటివెన్నులు, తామర, కమలాల దళాలు, అన్నీ ఇష్టమే! అసలు ఆమె నిలువెల్లసృష్టిసంపదే! నాకున్నంత వుత్సాహం ఆమెకు హరిదాసుళ్ళపై కలుగలేదు. కాని, సంక్రాంతి గొబ్బెళ్ళకంటే, వాటిపై వెలిగే, గుమ్మడి పూవులంటె ఎంతో వుత్సాహం! ఐతే, కోకిల, చిలుక, గోరింక, బుల్‌బుల్‌లు, పపేహాలు, గువ్వల-పాటలు, పల్కులు, గొంతులోని ధ్వనులు, కదలికలలోని గలగలలు ఆమెకెంతో విలువ!

ఈ విషయాలన్నీ నా వుత్తరాలలో, జైళ్ళనుండి హిమాలయ ప్రాంతాలనుండి వస్తూవుంటే చదువుకొంటూ, తనలో తాను ఆనందించి, మేము కలుసుకున్నప్పుడు "ఇందరు మిత్రులు మీకుంటే, ఇక నేనెందుకు మీకు" అంటూ సరసమాడేవారు.

ఆ హైదరాబాదులోని రంగాభవనంలో వున్నప్పుడు, తన వొంటరితనాన్ని పోగొట్టుతూ, ప్రాణప్రదంగా పల్కులు చెప్పుతున్న ఆ పిట్టలు, హృదయానికి రంగులందిస్తున్న ఆపూలు తనకెంతో తృప్తి! నా వుత్తరాలలో నేను వెలువరిస్తున్న ఆలోచనలకు ఆపిట్టలు, పూలు హృదయానికి అందే తోడు ఆలోచనలను అందిస్తున్నవనేవారు.



"చూచితిరా యీ అరటిగున్నలు! నవనవలాడే చిరు పత్రాలు, అన్నిటికి మించిన అందాల బిడ్డలు యీ తమలపాకులు తీగలపై వుండగా మనకు అందిస్తున్న సూర్యకాంతులకు మనమేమి ప్రతిఫలమిస్తాము?" అనేవారు.

అందుకేకాబోలు, యీ సంవత్సరమ తా వారి సమాధి చుట్టూ సూర్యకాంతులను ఆరాటంగా ఆరాధనతో లక్షల తమల దళాలు అందుకొని దేవీజీకి మిలమిలలాడే ముద్దుల నందిస్తున్నవి.

నాకే పూలపై ప్రేమ. నాకు మించిన ఆదరణ వారికి. పూల మధ్య పరుండాలని నాకోరిక! పూలతో పూజించుతూ పువ్వులలో తామర పుష్పములాగా తన తాళిబొట్టును చూచుకున్న ధన్యురాలు ఆమె! మా దంపతులిద్దరం శ్రీనగరంలో చాష్మాషాహి, నిషాద్‌బాగ్ షాలిమార్, కృష్ణసాగరు వద్ద బృందావనంలో పుష్ప పల్లకీలలో వూరేగినాము! భారతీదేవి భరతమాత పుష్పాల భాగ్యంలో నిల్చేవున్నారు.

## స్త్రీలు - రాచకీయంలో

భారతీదేవికి యీ కాలపు చదువులు అందించునపుడే, స్త్రీలు ఎందులకు, ఎలాగా, ఎంతగా, పురుషులతో పాటు జాతీయ వికాసము, అభివృద్ధిలో పాల్గొనాలో ఆమెకు బోధించడము మొదలు పెట్టితిని. పాశ్చాత్య దేశాలలో ప్రథమ యుద్ధానంతరం స్త్రీలకుకూడా ఓటింగ్ హక్కు ఇవ్వడం, బ్రిటిషు లేబరు పార్టీ తమ మంత్రివర్గములో ఒక స్త్రీని చేర్చుకోవడం గమనించి వుంటిని విదేశాలకు పోకముందే వీరేశలింగముగారి ప్రబోధము వల్ల స్త్రీలోకానికి సమానహక్కులు సంఘజీవితమందు వుండాలనే నమ్మకము బొందితిమి. కాకతీయ చక్రవర్తిని రుద్రమదేవి జీవిత చరిత్రను చిన్న పుస్తకముగా నేను వ్రాయగా, దానిని చదివిరి. మహాత్ములెటుల శ్రీమతి సరోజనీదేవిని ప్రోత్సహించిరో, కాంగ్రెసుకు అధ్యక్షురాలుగా ఆహ్వానించిరో భారతీదేవి గమనిస్తూ వుండిరి.

1921లో శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి ధైర్యసాహసాలు, త్యాగం, దేశభక్తితో ముందడుగు వేసి తన ఆభరణాలను పాశ్చాత్య సొగసులు కలిగిన వస్త్రాలన్ని మహాత్మునికి అర్పణచేసిరి. ఆ మార్గాన దేశమందు ఎందరో స్త్రీలు ముందుకు వస్తూవుండిరి. రాచకీయ రంగమందు పాల్గొనుచుండిరి. అలాగే తానుకూడా ప్రజాహిత జీవితములో ప్రవేశించాలని చెప్పుచుంటిని. కాంగ్రెసు ద్వారా స్త్రీ పురుషులు దేశసేవ చేయాలంటిని. కస్తూరి బాయి వలె ఆదర్శ గృహిణి, సేవిక, దేశభక్తురాలుగా తాను తయారైతే



నాకెంతో ఇష్టము, దేశానికి లాభం, రైతాంగానికి బలం, స్త్రీల అభివృద్ధికి దోహదమగునను బోధచేస్తూవుంటిని. రాజ్యం పోయినా రణరంగములో ఎన్నో పర్యాయములు అపజయము పొందుతున్నా దేశ స్వాతంత్ర్య వీరుడు రాణాప్రతాపునికి ఎలా తోడు నీడగా వుండి, అడవులలోనే ఆయనతో వుంటూవుండిన వారి భార్యయే ఆదర్శ మహిళయని చెప్పుకుంటిమి. చాంద్‌బీబి ఎలా అక్బరును ఎదిరించ కలిగెనో చదివితిమి. జోన్ ఆఫ్ ఆర్క్, ఫ్లారెన్సు నైటింగేలు కథలు వీరేశలింగంగారి రచనల ద్వారా తెలుసుకొంటిమి. శివాజీ తల్లి, రాణీసంయుక్త వీరోచిత కథలను కళ్ళకద్దుకొంటిమి.

అలాగా చదువులు ఆలోచనలు పెంచుకుంటూ వుండిన భారతీదేవి యూరపు దేశాల యువతులను చూచిరి. వారి నాగరికత, స్వేచ్ఛ ప్రజాసేవాసక్తి, శక్తి గమనించిరి. తాను పాశ్చాత్య లోక వృత్తము నంతా స్వయముగా గ్రహించిరి. అలాగే మన రైతాంగ స్త్రీలు ఆర్థిక వ్యవహారములలో శక్తిగలిగి వ్యవహరించుచుండుట గమనించిరి. కూలీల యువతులు గృహ నిర్వహణములందేగాక కూలీపనులు చేస్తూ వచ్చు ఆదాయాన్ని వాడుకోవడములో, భర్తలతో సమానముగా డబ్బుల సంపాదించడం, వాడడంలో బాధ్యత వహించుచుండుటగూడా తెలుసుకొనిరి. వారికే గనుక ఉన్నత విద్య అందితే రాచకీయ ధోరణి కలిగితే ఎంత బాగుండునో అనుకొనిరి. కనుక మహిళోద్యమంములో రాచకీయ భాగము అవసరమునునిండుగా బలపరుస్తూ వుండిరి.

బస్తీలలో చదువుకున్న, ఎన్నో హంగులు పొందిన స్త్రీల మధ్యనే ఆ ఉద్యమందాగొనడం మాకు అసంతృప్తి కలిగించినది. గ్రామీణ మహిళలలో కూడా ఉద్యమం కావాలనిరి. ఆ ఉద్యమం ప్రత్యేకంగా నిరక్షరాస్యతపై దాడి చేయాలనుకొనిరి. స్త్రీలకు శాసన రూపేణా సమానహక్కు బాధ్యతలు, తల్లీ తండ్రులద్వారా ఆస్తి హక్కు రక్షణగా కావాలను కొనిరి.

తమ ఆలోచనలను ఆంధ్ర రాష్ట్ర రాచకీయ మహిళా మహా సభలో 1933లోనే కాకినాడ సదస్సుపై నిర్భయంగా ప్రచురించిరి. ఆ పిమ్మట 1953లో ఆంధ్రమహిళా మహాసభకు అధ్యక్షత వహిస్తూ ఘంటసాలలో వివిధ సాంఘిక వ్యవహారాలలో స్త్రీల అవసరాలు, బాధ్యతలు వివరించిరి.

'ఎన్ని ఎంతగా ఎలాగా సాధించాలన్నా, సాధారణ సాంఘిక ప్రయత్నాలు చాలవు. రాచకీయ ఆందోళన, పెత్తనం అవసరము' అనే ప్రత్యేక నినాదమును భారత గ్రామీణ మహిళోద్యమంలో భారతీదేవియే ప్రముఖంగా మున్ముందు కాంగ్రెసు వారిలో, జాతీయ వాదులలో ప్రవేశపెట్టిరి.

అనిబెసెంటమ్మ, సరోజనీదేవి, కమలాదేవి ప్రభృతులు రాచకీయ పెత్తనంలో వుండిరి. కాని సాధారణ మహిళాలోకంలో రాచకీయ దృష్టితో ఆందోళనేగాక నాయకత్వం కావాలన్నది భారతీదేవియే!

ఆమె రైతు ఉద్యమ నిర్వహణలో ప్రతి అంతస్తులో స్త్రీలను నిలుపుకోవలెననేవారు, అలాగా స్త్రీలకు తగు స్థానము కల్పించుటే గాక వారు ప్రముఖ పాత్ర, బాధ్యతలను సాగించునట్లు శ్రద్ధచేసే వారు. అటుల శ్రీమతి మాలతీ చౌదరిని ఒరిస్సానుండి, కమలా దేవిని కర్ణాటకమునుండి అఖిలభారత కిసాను కాంగ్రెసు నాయక శ్రేణిలో కలుసుకొనిరి. తాను ధైర్యంతో ఆ సంస్థకు క్రమంగా కార్యదర్శిగా, అధ్యక్షులుగా బాధ్యతలను శిరసావహించిరి. పెద్దల మన్ననల నందుకొనిరి. ఆంధ్రచేనేత వారి శ్రామిక సంఘమునకు గౌరవాధ్యక్షులుగా వుండి కళాకారులను సేవించిరి.

తగినంతమంది స్త్రీ ప్రచారకులు బయల్దేరడంలేదనే విచారం మాకు వుండేది. ఆ లోటును తీర్చుటకై నేను వివిధ ప్రాంతాలలో



వేర్వేరు ఋతువులలో సాగిస్తున్న రాచకీయ విద్యాలయాలలో (రైతాంగ విద్యాలయమైనా సిటిజన్ షిప్పు (పౌరసత్వ) పాఠశాల నైనా, రాచకీయ తరగతులనైనా) ప్రత్యేక ప్రయత్నంచేసి కొందరు మహిళాసేవికలను చేర్చుకొనేవారము. వారిగురించి ప్రత్యేక శ్రద్ధ చేస్తూ వివిధ దేశాల స్వాతంత్ర్యోద్యమాలలో స్త్రీలెట్టి ప్రముఖమగు, వీరోచితమగు సేవలు పెత్తనాలు చేస్తూ వుండిరో తెలుపుచుండేవారము.

1945లో ప్రత్యేకంగా మహిళాసేవికలను రాచకీయప్రచారం కొరకు తయారుచేయాలనే తాపత్రయంతో శ్రీమతులు గోళ్ళ మూడి రత్నమ్మ, సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి నాయకత్వము క్రింద, చేబ్రోలులో నెలరోజులు రాచకీయ మహిళా విద్యా లయాన్ని నడిపించిరి. అందు మేమిద్దరము ఎన్నో ఉపన్యాసముల నొసంగితిమి. అచ్చట తయారయినవారిలో చాలామంది యీనాడు ఆంధ్రప్రజా ఉద్యమాలలో ప్రధాన బాధ్యతలు నడుపుచున్నారు. అంతటితో వారికి తృప్తి కలుగలేదు. 1946లో మద్రాసులో ప్రత్యేకంగా స్త్రీలకై రాచకీయ తరగతులు సాగించిరి. అందరికి సంబంధించిన రాచకీయ విద్యాలయానికే, 1945లో, నిడుబ్రోలు విద్యాలయంలో తర్ఫీదుబొందిన శ్రీమతి రాజ్యంనే ప్రిన్సిపాలుగా నియమించుకొనిరి. ఆమె అలాగా వేసిన బాటలలోనే కమ్యూ నిస్టులు తమ మహిళా ఉద్యమాన్ని, రాచకీయ తరగతులను సాగించు చుండుట వారికి తృప్తిగానే ఉండేది.

ఐనా మన స్త్రీలోకం యింకనూ వెనుక బడుచునే వున్నది. 1974లో కమ్యూనిష్టులే నడిపిన అఖిల భారత కిసాను సభలో ఒక్క స్త్రీగూడా ప్రముఖంగాగాని, పేరుకైనాగాని డెలిగేటుగా లేరేయని వారి నాయకులే విచారించిరి. ఈనాటికి యిలా వెనుక బడుచున్నారంటే, ఆ 1930-60 భారతదేశంలో భారతీదేవి గ్రామీణ మహిళాలోకంలో ఎంతటి సాహసం, పట్టుదల, కార్య

శూరత ప్రదర్శించుతూ ఎంతటి ఓపికతో ఎన్ని ఆశాభంగముల భారాన్ని మోసేవారోగదా? గ్రామీణ మహిళాసంఘము నేర్పరచుటకు కమ్యూనిష్టులు, కాంగ్రెసువారు ఇప్పుడు ప్రయత్నములు చేస్తున్నారు, అవి జనసామాన్యాన్ని అందుకోలేకున్నవి. కనుకనే నిరక్షరాశ్యత, వయోజన విద్యా ప్రచారం ప్రప్రథమంగా అందరు శిరసావహించాలనే పట్టుదల వారికి రానురాను హెచ్చైనది. అందుకే మా గ్రామాలలో ఎప్పుడు అవకాశం కలిగినా అందినా విద్యావంతులగు స్త్రీలను, మిగిలినవారికి, వ్రాయను చదువను అందరికి, చేజిక్కినవారికి నేర్పండి అనేదే భారతీదేవి నినాదమగుచుండెను. ఇందుకు భజన సమాజమును ఉపయోగించాలనిరి. ఆధ్యాత్మిక కేంద్రముల స్వాములు, వారి శిష్యులు యీ ప్రాథమిక సంఘసేవ చేయాలని ప్రబోధించిరి.

ఆమె ధోరణి, నినాదములు భారతీయ మహిళోద్యమ ప్రారంభనాయకులలో ఒక్కరగు శ్రీమతి కజన్సుకు తృప్తి కలిగించినది. ఆమె వ్రాసిన "భారత నారీలోకపు వుద్యమము" అనే ఆంగ్ల గ్రంథమందు భారతీదేవియొక్క సేవాధోరణి భారత నాయకులకు అభివృద్ధి దాయకమనిరి. ఏయే సాంఘిక, ఆర్థిక సంస్కారాలు, హక్కులు, స్త్రీలకు అవసరమో వారే ఆంధ్ర మహిళా సభాధ్యక్షులుగా చేసిన ఉపన్యాసము నందు తెలిపిరి.

ఆచరణలోకూడా 1928 నుండి వితంతువులకు పునర్వివాహములను ప్రోత్సహించుతూ వుండిరి. ప్రత్యేక శ్రద్ధతో అట్టి సంఘసంస్కరణలో ముందడుగువేసిన శ్రీమతి మూల్పూరు చుక్కమ్మతో కలసి, ఎన్నో వివాహములందు పాల్గొనుచుండిరి. భర్తలు ఏవో కారణాలవల్ల భార్యలకు విడాకులు ఇస్తూవుంటే, అలాగా దీనత్వము బొందిన స్త్రీలకు పునర్వివాహములు చేసుకొనుటకు ప్రోద్బలపరుస్తూవుండిరి. భర్త వారి తల్లిదండ్రులతో వివాదపడి వేరుపడ చూచిన అమ్మాయిల నెందరినో తిరిగి వారి కుటుంబాలతో సర్దుబాటు చేసుకొనుటకు బోధలు చేసేవారు. భర్తలు త్రాగు



బోతులై, రౌడీలై భార్యలను అకారణముగా క్రౌర్యంగా కొట్టుతూ వుంటే అట్టి బాధితులకు తానై ఆశ్రయమిస్తూ వుండేవారు.

మా ఉభయులం మనవారి కులపట్టింపుల నెదిరించుతాము. వివిధ కులాల మధ్య పెరిగిపోయిన హెచ్చు తగ్గుల తిక్కలు, అరలు, పొరుపులు మాకుగిట్టవు. సాంఘిక, సంస్కార సాంప్రదాయములను గౌరవించుతాము. కాని అవి ఒక సాకుగా యువతీ యువకులు వారి తల్లితండ్రులు పరస్పరంగా అనుకూలురైనపుడు, ఒక కులము వారు మరొక కులమువారితో పెళ్ళిళ్ళు చేసుకొనడం మంచిదేనని మా నమ్మకము. కనుకనే పెదపులివర్రులో స్వాతంత్ర్యయోధుల కమ్మ కుటుంబపు అమ్మాయి వున్నత విద్యబొందిన ఒక హరిజన యువకుని పెండ్లాడినపుడు వారిని ఆశీర్వదించితిమి. మాకు పౌరాణిక మంత్ర తంత్రములందు పట్టింపు తక్కువ. స్వకుల పౌరోహిత్యము అంగీకరించినవారు కవిరాజు రచించిన వైవాహిక ప్రమాణములను, శిరసావహించినవారు మా ఆదరణ బొందుచుండిరి. నేనే కొన్ని వివాహములలో పౌరోహితునిగా ప్రమాణాలు చేయించితిని. ఆమెకూడా అట్లే చేసిరి. ఇటుల సంఘసంస్కరణ స్త్రీలమధ్య ప్రచారం చేయడంలో వీరేశలింగం బోధనలను ఆచరణలో గౌరవించితిమి.

1940-41 నాటి దేవీజీ సందేశం యీ నాటికి శిరోధార్యం.

భారతీదేవి దృష్టిలో మహిళలంటే పెద్ద కులాలవారు, ధనాలవారు, పేరు ప్రతిష్టలతో అదృష్టజీవిత పరిధులలో వుండేవారు చాలరు; బస్తీలవారు మధ్య తరగతివారుకూడా చాలరు. రైతుకూలీల స్త్రీలు, అభాగ్యులగు వారి ఇండ్లవారు, కాయకష్టం చేయువారు స్త్రీలోక స్వరూపముగా వారు చూచుకొనేవారు. అట్టి శ్రామికలోక స్త్రీలకు ఎలాగా సర్వతోముఖాభివృద్ధి వారు కోరుకొనుచుండిరో, ఈక్రింద ఉదహరించబడిన 1940 సంవత్సరపు వారి సందేశము సూచించుచున్నది. ఇది వారు ఆనాటి స్త్రీల

రాచకీయ సమావేశములకు పంపించుచుండిన సందేశము. అదృష్ట వశాత్తు వారి యీ దివ్యవాణి వారి కాగితాల్లో దొరికినది. వారి దూరదృష్టి అభివృద్ధిదాయకవుధోరణి, బీదజనాలపై వారికి కలిగిన హృదయం, ఆశలు యిందు ప్రతిబింబించుచున్నవి:-

"ఆంధ్ర స్త్రీలు క్రిందటి స్వాతంత్ర్య పోరాటమందు (1931-33) (1940-42) వీరవిహార మొనర్చిరి. భారతీయ స్త్రీ లోకానికి వన్నెవాసి కలిగించిరి.

"ఇప్పుడు తిరిగి మనదేశానికి స్వరాజ్యము సంపాదించడానికై త్వరలోనే (1942 ఆగష్టు) జాతీయ కాంగ్రెసే సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించబోతున్నది

స్వాతంత్ర్య వీరులకు తర్ఫీయతు ఇవ్వడం ప్రారంభమగుచున్నది. (మేమంతా జైలులో వుండగా దేవీజీయే యిడుపల పాడులో 1940లో చెన్నూరులో 1941లో విద్యాలయాలు నడపిరి గదా)

"మీ సభలు తరగతులు యీ కార్యాలకు అన్నివిధాల బలమిచ్చుటకై పూనుకొందురు గాక! మనస్త్రీల కెన్నో బాధలు కలవు. మన పురుషుల దౌష్ట్యము, మాధ్యమునుండియే గాక మన జాతి బీదతనమునుండికూడా మనమంతా స్వతంత్రము పొందవలసివున్నది. మన బాధలన్నీ స్వరాజ్యము రావడముతోడనే తొలగునన్న ఆశ నాకైతే లేదు! స్వరాజ్యము వసేనేకాని మన కష నివారణ ప్రారంభము కాదు.

"ఐనా మన స్త్రీలు కనుమెలగి వర్తించుకుంటే స్వరాజ్య స్వరూప నిర్ణయ సభవారు (Constituent Assembly) స్త్రీజన రక్షణాకై తగిన నిర్ణయములు చేయగలరు, వయోజనులందరికి స్త్రీ పురుష భేదము లేకుండా ఓటింగ్ హక్కు వుండాలి. సంయుక్త నియోజక వరాలు కావాలి. స్త్రీ శ్రామికులకు ప్రత్యేకరక్షణాకె



ఆ సభవారు తగు నిర్ణయాలు చేయునట్లు మనం జాగ్రత్తపడాలి, అన్నిటికి ఆధారమైన సాంఘిక, రాచకీయ అధికారం మనకు యిచ్చేది మన త్యాగబలం. అందుకే ఈనాడు మన చదువుకొనల స్త్రీలు వీరవనితలు కావాలి. మధ్యతరగతి స్త్రీలకంటే హీనాతిహీనమైన స్థితిలో మన రైతుకూలీల స్త్రీలు వున్నారు. వారికి మోక్షం కలుగవలెనంటే, రైతు కూలీ ప్రజారాజ్యం కావాలని నా సంపూర్ణ విశ్వాసం, కనుకనే రైతాంగ స్త్రీనైనా నేను రైతు కూలీ సంఘాలద్వారానే, వారి పరస్పర సహకారం ద్వారా అసహాయులగు రైతుకూలీ స్త్రీ పురుషులందరి ఆర్థిక రాచకీయ దాస్యవిముక్తికై శక్తికొలది కృషిచేయ ప్రయత్నిస్తున్నాను.

సెలవు

భారతీదేవి

1940-41.

—:o:—

# పెన్షనుకూడా వదలుకున్నారు

స్వరాజ్య అవతరణ రజతోత్సవము సందర్భముగా, స్వతంత్ర స్వరాజ్య యోధులకు, ఎప్పుడో మేము సూచించినట్లుగానే పెన్షనులు ఇస్తామని భారత ప్రభుత్వము ప్రచురించినది. ఎవ్వరెవ్వరు యీ పెన్షనులకు అర్హులు. ఎంతెంత పెన్షను ఇవ్వడం అనే విషయం ఇంకా ఇదమిత్థమని నిర్ణయం జరుగుటలేదు.

ఇప్పుడిప్పుడు ఎవ్వరికైతే సాలుసరి ఖచ్చితమైన ఆదాయం ఐదువేలకు మించదో వారికే యిస్తామంటున్నారు. పెన్షనుకూడా నెలకు రెండువంద లంటున్నారు. మొదట్లో యీ నిబంధనలులేవు. వివరాలు సరిగా తెలుపలేదు.

ఆరు నెలలు, అంతకు మించి శిక్ష ఎవ్వరికైతే వుండి. జైలు అధికారుల సర్టిఫికెట్టులున్నవో వారికే నన్నారు. జైలు రికార్డులు ఎందరికో అందడంలేదని తెలిసిన తరువాత; వారితోబాటు ఖైదీలైవుండిన యం. ఎల్. ఎ.; యం. యల్. సి., పార్లమెంటు సభ్యులు, మాజీ సభ్యులు, తనతోబాటు, ఖైదీలుగా వుండినారని సర్టిఫై చెయ్యాలన్నారు. అందువల్ల ఎందరికో న్యాయం జరుగుటలేదు.

అందరు గ్రాండులోనుండి, అనేక కష్టాలు పడ్డవారెందరో! ఐ. ఎన్. ఏ.లో ఉండినవారు; వారంటుల్లోవుండి, సబ్ జైలులో నుండినవారు ఆరునెలలు పూర్తిగాకపోయినా, పోలీసు దళాలవల్ల కలాంగులైనవారో? ఇంత వఱకు వారే నిర్ణయించిన నియమ్నా



తృప్తిపరుస్తున్న వారలో సగంమందికి, పెన్షను అందడంలేదు. ఈ సందర్భంలో మా దంపతులను, ఎందరెందరో సలహా సహాయం కోరుచుండిరి. ముందుగా మేము స్వాతంత్ర యోధులమని, యీ పెన్షను, స్కీము ప్రకారము స్థిరపఱచుకొంటే, మా సర్టిఫికెట్లు ఇతరుల బలపఱచుటకు ఉపయోగపడునుగదా! అన్నారు భారతీదేవి. అంటూనే, తాను, నేను జైళ్ళలో నుండగా, జైళ్ళవారు మాకు 1932లో అందించిన సత్తు సర్టిఫికెట్టు బిళ్ళలు తమ పెట్టెల్లో 40 సంవత్సరాలుగా ఉంచిన వాటిని తెచ్చి చూపించిరి మేము స్వాతంత్ర్య యోధులం, అనే రికార్డును, అంత ప్రేమతో, గౌరవంగా, వారు శ్రద్ధతో భద్రపఱచినందులకు ఆశ్చర్యపడితిని. వాటిని ఉదహరిస్తూ, ఢిల్లీవారికి 'మేము స్వాతంత్ర్య యోధులం, మమ్ముకూడ ఆ జాతీయ జాబితాలో లెక్కించండి' అని వ్రాసితిమి. హోంమంత్రి సగౌరవంగా మమ్ము 'భారత స్వాతంత్ర్య సంపాదక యోధులు'' అని గణించిరి; గౌరవించిరి. పెన్షనుశాంక్షను చేసిరి. ఆ శుభవార్త 1972 ఆగష్టుకే మాకందించిరి.

"ఈ పెన్షను మంచిదే, మనకు రావలసినదే ఇద్దరం వృద్ధాప్యమును అందుకొంటున్నాము! శాసనసభలనుండి విరామము బొందుచున్నాం, పెద్దతనపు అవసరాలు మనకు పెరుగుచున్నవి. ఈ వ్యవసాయం యిక నేను స్వయంగా చేయలేను. ఇతరులకిస్తే ఆదాయం చాలా తగ్గిపోతుంది, వచ్చేది చాలదేమో? ఆపైన ముసలితనంలోనే, ఆరోగ్యము కొఱకై, హెచ్చు సౌకర్యాలు, అవసరాలు, ఖర్చులు, అవసరమని యింతకు ముందెప్పటినుండో, నే చెప్పతుంటే మీరు గ్రహించకపోతిరి. కనుక యిపుడు మనకు పెన్షను అవసరమేగదా!" అన్నారు "సరే" నన్నా!

"అంగీకరిద్దామా! తీసుకొందామా" మీ యిష్టమేమిటి చెప్పండి? నన్ను పోషించే భారము మీదేగదా? నాకు చదువు కొనడానికి, వ్రాసుకోడానికి, తిరుగుటకు, శీతోష్ణబాధలనుండి రక్షించుకోడానికి యెంత యెక్కువగా కావాలో, మీ ఆరోగ్య

రక్షణకు ఏమి అవసరమో? మన పెద్దలిచ్చిన భూమిలో సగానికి మించి అమ్మివేసితిమి! ఈ కష్టాలు, అనుభవాలు ఈ నలభై సంవత్సరాలనుండి మీవేగదా!" అన్నాను. "ఐతే, నేను గోభూమి, మీ భూవసతి అంతా సాగిస్తూ ఇన్ని దశాబ్దాలు, ఇన్ని త్యాగాలు చేసితిని. అవస్థలుపడితిని, యిప్పుడు యీ పెన్షను మీదనే యాధారపడవలసిన స్థితి మీకు కల్గించినాననే అప్రతిష్ఠ యెట్లా? అసలీ స్కీము వస్తుందని, మనకు పెన్షను ఇస్తారని కలలోకూడ అనుకున్నామా! మనకు ఈ హక్కు ఉన్నదని నిరూపణ చేసుకున్నాము. అదేచాలు, దీనిమీద మనం ఆధారపడటం, మిమ్ము ఆధారపరచడం, నాకిష్టంగాలేదు. మీరేగనుక నా సలహాపాటించి అఘమం 1962 నుండైనా, మీకందుచున్న చిన్న చిన్న అలవెన్సుల్లో, కొంత మిగిల్చితే, యెంత బాగుండేది" అన్నారు.

"నా ధోరణి తెలిసేగా, యీ కుటుంబ నిర్వహణ బాధ్యత మీరు సాగిస్తున్నారు. ఎల్లకాలం నేను పార్లమెంటులో నుండగలనా! రాజకీయ ప్రత్యర్థులు నన్ను ఎప్పుడూ ఓడించుటకే ప్రయత్నిస్తుంటారని నీకు తెలియదా? కనుకనే, నా ఖర్చులు, అవసరాలు పెరుగనివ్వకుండా జాగ్రత్త పడుచుంటిని. ఐనా మనం యిప్పుడేగదా, మన ప్రత్యేక అవసరాలను గమనించవలసి వస్తున్నది. రిపబ్లిక్ ప్రెసిడెంటు చేసినవారికైనా, యిట్టి అవసరాలుండునని పార్లమెంటు గమనించి, మందులకుగా, కార్యదర్శులకుగా, జీవితావసరాలకుగా పెన్షనులు ఏర్పరచిరి. మంచిదే! నాకు, మీకు, ఉభయులకు నీవే యున్నావుగా!" అన్నా! మందహాసము చేసిరి. కొంత బాధపడుచుండిరి. రెండు రోజులు పోయిన తరువాత, "ఏమండీ, పెన్షను పంపమని హైదరాబాదు అక్కౌంటెంటు జనరల్ ఆఫీసుకు వ్రాయలేదుగదా!" అన్నారు. "మనం తేల్చుకోనిదే యెలా వ్రాస్తాను." "ఐతే! అంగీకరిస్తారా!"

"మీకేమి అనిపిస్తున్నది?" అన్నాను.



"ఇంతగా జీవించి, ఇన్ని వదిలివేసి, ఇప్పుడు దీనిమీదనా! అనిపిస్తున్నదండీ! మీరే తేల్చండి!" అంటూ, "అన్ని బరువులూ నామీద వేస్తున్నట్లే యిదికూడా నేనే తేల్చాలా?" అని విసుక్కొన్నారు. "లేదమ్మా! ఏమో, కొన్నాళ్ళకు ఈ ముసలాయన భారం గొప్పదైనదే, అనిపిస్తే, అప్పుడు నీవు పడేబాధ భరించగలనా!"

"ఎవ్వరికైనా మీరు భారంకావచ్చు! అప్పుడా జవహరుకు, ఇప్పుడీ ఇందిరమ్మకు! నాకు మీపోషణ ఎప్పుడూ భారంకాదు! ఈ ఉన్నది చాలదా? పెద్దబీరువాల పుస్తకాలు మళ్ళీ కావాలంటే, ఎందరెందరో అతిథుల చేర్చి గోష్ఠులు మరల జరుగుతుంటే కొంత కష్టమే! ఏమైనా మనకు వద్దండీ పెన్షను బరువు."

"నాకు తెలుసుగా నీకెంత అభిమానమో! ఆనాడు అన్నీ త్యాగాలే! తెంపులే, సంవత్సరానికి వస్తూండే కొద్ది ఆదాయంలో సగం అందరు గ్రాండువారికి అర్పణ చేస్తూంటిరిగదా! ఆపైన అప్పులభారం వున్నప్పటికి! అందుకే మనహక్కు స్థిరపరచాము. పెన్షను మనది! దేశంనుండి యింకా పొందవచ్చు పొందగలం! ఐనా! ఇప్పుడుకూడా వదులుకొంటున్నాం. 'త్యాగం చేయగలం. త్యాగం చేస్తున్నాం.' అనే తృప్తి మీకు కల్గించాలనిపిస్తున్నది. యేమంటారు". ఆనాడు ఆ మహాత్మాగాంధి, అంత అలవెన్సు, ప్రయాణపుఖర్చులు, ఇస్తాము గాంధీ సేవాసంఘమునుండి అంటేనే కాదంటివి గదా!" అన్నాను.

"నేనేనా! ముందు మీరేగా వద్దన్నది!" "నాకు ఇంటి అవసరాలు తెలిసికాదుగా! ఏదో తిక్కతో వద్దన్నాను." "సరే లెండి, మనకు దేవుడిచ్చిన వరం ఇలాగామనం పరస్పరంగా గౌరవించుకోవడం, ఒకరినొకరు పొగుడుకోవడం అలవాటేగా! ఆ రాజేంద్రప్రసాదు, రాజాజీలాంటి వారి సరసన, మీరుకూడా

ఆ బాపూ పెన్షను తీసుకోగలిగితే గౌరవం కాదా! ఐనా! వద్దనుకోగల్గినారనే సంతోషం నాది."

"మహాత్ము లేమన్నారో తెలుసా! ఎందరో నేను అందించిన సహాయం మహాప్రసాద మనుకొన్నారు. అందులో కష్టాలు కాచిపోస్తున్న దేశసేవకుల భార్యలు కళ్ళకద్దుకొన్నారు. అన్ని కష్టాలు అనుభవిస్తూన్న, తానై ప్రజాజీవితమందు త్యాగాలను శిరసావహిస్తున్న, భారతీదేవి "వద్దు! బాపూ! వద్దు మీ అలవెన్సులు, నేనెట్లో, నన్ను, రంగాజీని పోషించుకోగల్గుతాను. నేను స్వయంగా రైతును, వారి పూర్వార్జితమైన భూమిమీద, సొంత ఉద్యోగము చేస్తున్నాను'' అన్నారు. అందుకే ప్రత్యేకంగా 'భారతీదేవి ధన్యురాలు' అని అందరితో చెప్పేవారుగదా!"

"నాకూ ఇష్టంలేదు ఈ పెన్షను పుచ్చుకోవడం! బీదల రక్షించడానికి ప్రత్యేకశ్రద్ధ చేస్తానన్నారు యిందిరమ్మ! ఆమె మాటేనమ్మి, మనం తమకుచాలమని, మనంను కాదని, వారి అభ్యర్థులనే అంగీకరించినారు - యీ దిక్కుబాలని ప్రజలు. కనుక యిప్పుడు వారికి కాకుండా యీ పెన్షనెందుకు మనకు! దీన్ని కూడా వదలివేసి; మీకోసమే, మీబీదతనం పోవడం కొఱకే మేము జీవితాంతం, సేవ చేస్తామని, ఈ పెన్షన్ను వదలివేద్దాం!"

ఇంతలో వారికి "హార్టు" బలహీనత కన్పించింది. ఆదుర్దినమే 1972 సెప్టెంబరు 21. ఎటులో ఆనాడా గండం గడచింది. గుంటూరు ఆస్పత్రిలో ఆమె ప్రక్క కొంచెంసేపు కూర్చుంటిని.

కళ్ళవెంట నీరున్నది. తన చేయి సవరించుకుంటూన్నా!

"రంగా, మాజీ మహారాజులు ఎన్నెన్నో సౌకర్యాలు కల్గిస్తామంటే వద్దంటిరి! బొంబాయి కోటీశ్వరులు ఏమేమో అందిస్తా మంటిరి. అన్నీ వద్దంటిరిగదా!"



"ఎందుకమ్మా! ఈ సంగతి యిప్పుడు నీ మనస్సుకొస్తుంది!" కళ్ళనీళ్ళు తుడుస్తున్నా!

"ఎన్నిబాధలు పడితిమి రంగా! నేను ఎంతో క్రుంగిపోతుంటె ఆ ఢిల్లీ బస్సులలో మీరు ప్రయాణం చేస్తుంటిరేగాని, వారు, విరు ఎన్ని అందిస్తామన్నా లొంగితిరా! అదేచాలు మనకు రంగా!"

"ఐతే! యీ మాటలన్నీ యెందుకు, ఇప్పుడమ్మా! నీవు ఎక్కువగా మాట్లాడరాదు. అర్థమౌతున్నది. ఆ పెన్షనుమాటా? వద్దా! నేను కావాలంటానా? వదలుకుందా మనుకుంటిమిగదా!" అన్నాను. ఆమె కళ్ళు మెరిసినవి. కుడిచేతితో నాచేతిని వత్తిరి. తల యూపిరి. ఆనందం వుభయులము పొందితిమి. కృష్ణా, యమునా గంగా, త్రివేణిలో వారి అస్థికలు కలిపి వచ్చిన పిదప, పెన్షన్ను వదులుకొంటున్నానని ప్రభుత్వానికి తెలియబరచితి. అదేవారి తుదికోర్కె.

—:o:—

# గాంధీజీ జన్మదినోత్సవం

1967 అక్టోబరు 2వ తేదీ మహాత్ముని జన్మదినం. వీలు కల్గి నప్పుడల్లా, మనదేశంలోనే వుంటే, భారతీదేవితో కలిసి, బాపూజీని తలుచుకుంటూ, ఉత్సవము జరుపుకుంటూ వుండేవారం.

ఆ దినాన హైదరాబాదు, అశోక్ నగర్‌లో, దేవి మనుమరాలు చి॥ విజయలక్ష్మి, ఆమె భర్త శ్రీ గోగినేనినాగేశ్వరరావు. వారి బిడ్డలు ముగ్గురుతో మేమిద్దరము కలిసి వుంటూ వుంటిమి, ఆ దినాన్నే తన జన్మదినముగా పొందగల్గిన వారి రెండో కుమార్తె చి॥ భారతీదేవిని ఆశీర్వదించుతూ, మహాత్ముని జన్మదినమే తన ఉత్సవం రోజు అని అమ్మాయిని ఉత్సాహపరుస్తు ఆనందము పొందితిమి.

ప్రొద్దుననే, బిడ్డలందరిచేత మహాత్ముని పటమునకు పుష్పముల నందించితిమి. అందరిని కారులో నాగేశ్వరరావు తీసుకు వెళ్ళగా, సెంటరులోనున్న గాంధీజీ శిలావిగ్రహానికి పూల మాలలు అర్పించితిమి. అలాగా, చిన్న పిల్లలకు దేశనాయకులు, దేశభక్తుల గురించి చెప్పతూ, పూజించు అలవాటు పెంచుట మంచిదని మా ఇద్దరి విశ్వాసము. ఆ సాయంత్రము, గండికోట సరస్సునకు, వినోదానికై, వనభోజనానికై బిడ్డలను తీసుకెళ్ళినాము. అదే స్వంత కుటుంబ పరిధిలో, మేమిద్దరం మనదేశంలో పండుగ జేసుకొనుటకు ప్రారంభం!

ఆనాడు మా మనస్సులలో మహాత్ముని జీవితకళలే వెల్లుచున్నవి. ఆ సరస్సు ఒడ్డున మంచి చెట్లున్నవి. ఓ చెట్టు మొదలున



చిన్నిరాళ్ళు అరుగులుగా చేర్చబడ్డవి. వాటిపై కూర్చుంటిమి. మా వెనుకగా అప్పుడప్పుడు చిన్నిబిడ్డ రమ చురుకుగా, స్వతంత్రంగా, ఆమెను కదలించడం, మాటలలో కలుపుకోవడం, వింత వింతలుగా ఆమెను నవ్వించడం చూస్తూ, నేనెంతో ముచ్చట పడుతూవుంటి!

ఇంతలో దేశభక్తులు మోచర్ల రామచంద్రరావుగారి కుటుంబీకులు వచ్చిరి. మమ్ము గుర్తించిరి. పండుగ చేసుకుంటున్నారా అనిరి." అవునండి, స్వరాజ్యము సంపాదించుటకు దేశాన్ని, ప్రబోధించి, పెంచి, ప్రజలకు పట్టాభిషేకం చేసిన మహాత్మునికి జోహారు లర్పిస్తూ, యీ పిల్లలకు కూడా ఆ బాపూజీ కళాకాంతుల నందించాలనుకుంటున్నాము."

"ఇంత చెప్పతాము, సరే! ఆ బాపూజీ దారిలో ఎందరు దేశీయులు నడుస్తున్నారు" అన్నా రొకరు.

వారి ధర్మము నెరవేర్చిరి; రామునివలెనే! ఆయన బోధలను సంకీర్తించుచూ, ప్రచారం చేస్తూ వుండడం మన ధర్మం. ఆనాటినుండి ఈనాటివరకు రాముని కీర్తించుచున్నాముగదా! అటులే అన్నా!

"స్వరాజ్యం బొందిరి ప్రజలు. రాజ్యాధిపతులు, వారి వారితో వుద్యోగాలు, ఎసతులు పంచుకుపోతున్నారు గదా! ఎదిరించే వారేరి?" అన్నారెవరో.

"అందుకేనండీ మేము పార్లమెంటరీ ప్రత్యర్థి పక్షాన్ని పెంచుతున్నాము" అన్నారు భారతీదేవి!

" అది పెరగాలిగదా, ప్రజలు దాన్ని బలపరచాలికదా! ఇంతకూ మన వాళ్ళకి ఆ బ్రిటీషు వాళ్ళ పార్లమెంటరీ సాంప్రదాయం అందునంటారా? ఇందరు బీదలే! చదువురానివాళ్ళే"!

"ఆభయం నాకూవుంది. ఐనా రంగాజీ ఆ ప్రయత్నం చేమంటున్నారు. రాజాజీ అదే మంచిదంటున్నారు."

పెద్దలం మేమిట్లా మాటలాడుకొంటుంటె, ఆ ప్రక్క పిల్లల సభ, కోలాహలం! వారితో విజయ, పుష్ప కలిశారు. మాటల మీద మాటలు, గోర్వంకలు, చిలుకల హడావిడిగదా! ఆ సభలు, చర్చలు పూర్తి చేసుకొని వచ్చిరి. విజయ, పుష్ప! ఎన్నికబుర్లు అందించారో?

చిన్నిబిడ్డ చిన్ని మొగము చేసుకొని, వాళ్ళ అమ్మ విజయతో చల్లగా పల్కుతున్నదట. "వాళ్ళ అబ్బాయి ఏమన్నాడో తెలుసా?" "నీవు గాంధి పుట్టినరోజుననే పుట్టినా, ఆడపిల్ల వేగా" నీవేమి చెప్పితివమ్మా!" అన్నారు భారతీదేవి. "మా తాతమ్మ గాంధీ పెంపుడు కూతురుగా. ఆమెలాగానే పెరుగుతాను" అన్నా!

నావంక చూస్తూ "ఆనాటి శీతారాములవలెనే, యీనాటి గాంధి, కస్తూరిబాల లాగా పెరగాలని బిడ్డలకు అనిపిస్తుంది గదా" అన్నారు.

నీలాగానే, పెద్ద వీరవనితలు కావాలని యెందరికో అనిపించడం సహజమేగా అన్నా. యింకా విశేషాలేమిటి?

ఈ హైదరాబాదు నిజాం పాకిస్థానులో చేరాలని కుట్ర చేశారటగదా! అన్నదొక అమ్మాయి. "పాకిస్థానంటె" అడిగింది మరో అమ్మాయి. మన దేశాన్ని పంచితే, జిన్నాగారికి పోయిన భాగం, అన్నాడొక అబ్బాయి. ఎవ్వరు పంచారు, మహాత్ముడేనా? కాదు, కాదు బ్రిటిషువాళ్ళు - అన్నాడు. అది కానే కాదు. నెహ్రూ చాచాయె యిచ్చేశారు. గాంధీకి కోపం వచ్చి, బెంగాల్ కు వెళ్ళారు. మరో అబ్బాయి, "అది కాదు, మన పెద్దలంతా బ్రిటీషువాళ్ళ మోసంలో పడిపోయారు." అని నేను సర్దినాను అన్నది విజయ పాకిస్థాను మనమీద యుద్ధానికి వచ్చిందిగదా అన్నది చిన్నిదేవి. "మనం పాకిస్థాన్ను ఓడించాములే" అన్నారు వారు.



ఇక విజయ పురోచర్య వివరిస్తున్నది.

గాంధిగారు ఎన్నో అవతారం? వొక బిడ్డ. "దశావతారాలలో ఆయనపేరు పంతులు చెప్పరే" అన్నదోబిడ్డ. "గాంధి యీ కాలపు అవతారంటె" అన్నా. ఎందుకు యీ అవతారాలు? అన్నాడొక పిల్లడు. మనకు మంచి మార్గాలు, బుద్ధులు చెప్పడానికి! ఒకసారి చెప్పితే చాలదా అన్నదొక అమ్మాయి. "మీరు చిన్నివారు, మేం చెప్పింది మరచిపోవడంలేదా! అట్లానే, పెద్దలు కూడా మరచిపోతూ వుంటారు. కనుక పదేపదే చెప్పడానికి అవతారాలుగా గొప్పవారు వస్తూవుండాలి" అన్నా! ఒకబిడ్డ కళ్ళింత చేస్తూనే ఇంకా వస్తూనే ఉంటారా! గాంధి తాత చాలడా? అన్నాడు. వస్తూనే వుంటారు. గాంధి తాతకు ముందెవ్వరు? అన్నది దేవి. ఎందరో మనవూళ్ళో స్టేషనువద్ద వున్నదే బొమ్మ. వివేకానందస్వామిది. ఆయన! ఇప్పుడింకా వున్నారా! అడిగాడు పిల్లడు రమణ మహర్షి, అరవిందయోగి మన పుటపర్తి స్వామీజీ వున్నారుగా! ఇంకా యెందరో ఋషులు వున్నారు.

ఇంతమంది ఋషులు మనకు వుంటే, మనదే ఇంత బీద దేశముగా వున్నదేమండీ! ఈ బీదతనాన్నిపోగొట్టడానికే మహాత్మా గాంధీ, నెహ్రూ, రంగ తాతయ్యా పనిజేస్తున్నారు. మన రంగ తాతయ్య అంటే గాంధి తాతకు ప్రేమగదా! అవునమ్మా! నెహ్రూ చాచాకు యెందుకు కోపం! కోపములేదు. రైతులు, గ్రామాలు యెలాగ వుండాలనే ఆలోచనలలో, వారిద్దరికి వేరువేరు దారులున్నవి. రైతులందరి భూములు కలిపివేసి, సాగుచేస్తే మంచిదంటారు. నెహ్రూ చాచా! ప్రతి రైతు తన పొలాన్ని తానే సాగుచేస్తే మంచిదంటారు రంగతాత! వారిద్దరు వొక దారికి రాలేరా? రాలేకపోయినారు. అందుకే నెహ్రూ చాచా, రంగ

తాతను ఎదిరిస్తున్నారు. ఇద్దరూ గాంధి శిష్యులేగా? ఐతేనేమి, వారిద్దరు వేరు వేరు దారులు చూపిస్తున్నారు. ఏదారి ప్రజలకు యిష్టమో తెల్యాలి. అందుకే యీ ఎన్నికలు? అని వారబ్బాయి పల్కినాడు. అయితే, మనరంగా గెల్చినారుగదా. మన రైతులకు యిక భయం లేదుగా" అన్నది బిడ్డదేవి! కాదమ్మా, నెహ్రూ గారితో ఎందరో వున్నారు. వారిదే పెద్ద పెత్తనం. వారిమాటె చెల్లుతున్నది అన్నా! అప్పుడు పిల్లలకు దిగులు కల్గిందిలావున్నది.

ఈ విషయాలు మీకు యిప్పుడే పూర్తిగా అర్థం కావులే! తాతయ్యా, భారతీదేవి పిలుస్తున్నారు, పోదాం రాండి అన్నా!

ఒక్కమాట చెప్పండి, చాచా మంచివారా తాతయ్యా! ఇద్దరూ మంచివారే. యిద్దరు కలియరాదా? కలిసేవుంటున్నారు దేశముకొరకు. రైతుల గురించే అనేసరికి, వారు పోట్లాడుకుంటారా అన్నాడొక పిల్లవాడు. అలాకాదయ్యా! ఢిల్లీలోని పార్లమెంటులో, రంగతాత, నెహ్రూ చాచాను సవాలు చేశారట గదా" అన్నదొక పెద్దఅమ్మాయి! ఆ చెనాయుద్ధంలో మనం ఓడిపోయినప్పుడు గదూ! ఐతే, మొన్న ఎన్నికల్లో రంగతాతయ్యను ఓడిస్తానన్నారుగా, రంగతాతను ముందు ఓడించారు. తిరిగి రంగతాత గెలిచారు. నెహ్రూ చాచాకాదు యిందిరమ్మ వోడిపోయారన్నారుగా!

ఇదంతా గజిబిజిగా వున్నదమ్మా! అన్నారు కొందరు పిల్లలు.

ఒక్క సంగతి చెప్పండి, రైతులు దేశానికి వెన్నెముక అన్నారు మా మాష్టారు! దేశనాయకుడు నెహ్రూ, రైతునాయకుడు రంగా తాతను ఎదిరించడం యేమిన్యాయం అన్నాడు పిల్లడొక్కడు. అందరు పిల్లలూ చెప్పండి యేమిన్యాయమో.

నాకేమి చెప్పడానికి తోచలేదు. ఇప్పటికి యీ మాటలు చాలులే అంటూ, మన పిల్లలతో వచ్చేశా! నన్నారు మా అమ్మాయిలు.



ఆ సంవత్సరాన్నే, మేము రెండు పార్లమెంటరీ ఎన్నికల్లో హోరాహోరీగా, కాంగ్రెస్‌తో పోరాడినాము. చిత్తూరిలో ఓడితిమి. శ్రీకాకుళంలోగెల్చితిమి. పంతంతో నెహ్రూవారసులు మమ్మెదిరించిరి. రైతులు కులాల వారీగా చీలిపోతూ వుండిరి! వారికి ఐక్యత యేది? మా శిష్యులే కొందరు కులాలకు లోనైపోయిరి."

"అంత బాధ ఎందుకు పడితిమి? ఆ పోటా పోటీలో ఏల చిక్కితిమి? రైతుకూలీలకొరకేనని నమ్మితిమి. స్వంత ఉద్యోగులై, ఎవ్వరిని శోషింపజేయక, తమ ఆర్థిక జీవనోపాధిని స్వయంకృషిపై ప్రథమంగా ఆధారపడుచూ, స్వంతభూమినే సాగుచేస్తూ, ఆరాధిస్తున్న సన్నరైతుల రక్షించుటకే. మమ్మేల కాంగ్రెసువారు ఎదిరించిరి వారి రైతాంగ వ్యతిరేక ధోరణికి మేము బలవద్వ్యతిరేకులమని. వారి రాచకీయ పెత్తనానికి మేము ఎదు రొడ్డుచున్నామని గదా।

ఆ రాచకీయ పోరాటములో ఎవ్వరిది తప్పు! ఎవ్వరిదికాదు. ఐతే, మిమ్మే పదేపదే ఎదిరించడం న్యాయమా? మిమ్ము పార్లమెంటులో సభ్యునికాకుండా, ఎన్నెన్నో, నీతిబాహ్యమైన ఎత్తుగడలు వేయడం ధర్మమా? మహాత్ములే జీవించివుంటే, అలాగా, మీలాంటి ఎదిరి పక్షపు నాయకులను పార్లమెంటులో లేకుండా చేయుట కాంగ్రెసుకు ధర్మము కాదని హెచ్చరించేవారేగదా?

కాన్స్టిట్యూయెంటు అసెంబ్లీ ఎన్నికలు జరిపినప్పుడు, మహాత్మాజీ సలహా మేరకేగదా, కాంగ్రెసులో చేరనివారైనా దేశభక్తులగు ఎందరో ప్రముఖ లిబరల్సు, ఇండిపెండెంట్సు, పార్టీలకు బద్ధులుగాని, డాక్టరు కుంజ్రూ, డాక్టరు అంబేద్కరు లాంటి నాయకులను కాంగ్రెసు ఎం. యల్. ఏల చేతకూడా ఎన్నుకొనునట్లు చేసిరే!" అన్నారు భారతీదేవి.

అదే అభివృద్ధి దాయకమగు పార్లమెంటరీ ధర్మము. అలాగా జవహరులాలు నడువాలనుకున్నారు ప్రథమంలో! క్రమంగా పార్టీ

పాక్షిక ధోరణే వారికి రుచించినది. ఆపైన, తాను ప్రయోగిస్తున్న ప్లాను ధోరణులకు ప్రత్యామ్నాయముల సూచించువారిని సహించలేక పోయిరి. తా ననుకొన్నట్లుగాక, స్వతంత్రులైన, స్వయం వృత్తిదారులైన, స్వంతభూమిగల రైతాంగాన్ని రక్షించబూనిన నాపై కినుక బూనిరి. అందుకే 1952లో, 1962లో అలాగా నన్నెదిరించుటకు తన అభ్యర్థుల ప్రయోగించిరి. ఆ పిమ్మట ఆయన కుమార్తె ఇందిరాజీ తిరిగి 1967లో ఆయన ఆచారాన్నే సాగించిరి. అదంతా గాంధేయమునకు వ్యతిరేకము. ఎటులనో, నేను 1962లో తిరిగి 1967లో విజయము బొందితిని. ఆ సారంభాలలో నా ప్రక్కనే మిగతా పీసులవలెనే, భారతీదేవి నిలబడిరి. కష్టించిరి. ప్రజల ప్రబోధించిరి, విజయ లక్ష్మిని రైతుకూలీలు, ప్రభుత్వానికి వ్యతిరేకముగా సంపాదించుటకు తోడ్పడిరి.

ఆ రాజకీయ యుద్ధాలలో కల్గిన మనోబాధలనుండి తేరుకుంటూ, ఆనాడు మహాత్ముని జన్మదినోత్సవాన్ని జరుపుకున్నాము.

అందుకు మా విజయలక్ష్మి, ఆమె ముఫ్వురుబిడ్డలు, రానున్న యుగపుయువపౌరులనుగా జూచుకొని, నవనవలాడు ఆశాలతలను, పుష్పసౌరభములను వూహించుకొను అవకాశము కల్గించిరి.

మన ప్రజలు ఎప్పటికి రాజకీయపు చదువులు, విజ్ఞత పొందగలరో? అధికారులను కట్టడిలో ఎలాగ పెట్టగలమో? కూలీలకు తగిన రక్షణ, పోషణ ఎంతగా ఎప్పుడు సాధించగలమో? మన రైతులు, కూలీలు, కళాకారులెప్పుడు పరస్పర కలయికజెంది కులాల పిచ్చులను వైషమ్యాలను మించి, రైతుకూలీ, కళాకార, బుద్ధి జీవిరాజ్యానికై నిలబడెదరో? దరిద్రనారాయణుని సేవించి, రక్షింతురో, అప్పుడేడే గాంధీజీ ఆత్మకు నిండు శాంతి గూర్తు కునాము.



భారతీదేవి నేను ఆ సరస్సు ఒడ్డున వున్న చెట్టుక్రింద, రాతి ఫలకంమీద కూర్చున్నాము. ఆ పిల్లల సంరంభం చూస్తూవుంటిమి ఎంతలో ఎన్నోకుటుంబాల పిల్లలు స్నేహితులైపోతారు! అంతలో మాటలు పాటలు, పాటలపోటీలు? ఏమేమిటో తినుబండారాలు కల్పుకుంటున్నారు". తింటున్నారు. అంటున్న దేవితో "ఆ పిల్లలతో నీవు మాట్లాడుతుంటే, నాకు ఒక ఆలోచన కలవరపెట్టుతున్నది. ప్రజాస్వామ్యం కావాలనుకొంటున పార్టీలన్నీ యిందిరమ్మ పెత్తనం క్రిందనే చేరి, జాతీయ ప్రభుత్వం సాగించితే మంచిదిగాదా! ఈ ఎన్నికల పంతాలుఖర్చులు పోటీలు తగ్గితే, లంచగొండితనం తగ్గించగలమేమో? రాచకీయ అవినీతిని అరికట్టగలమేమో? ప్రజాసేవ చేయుటకు, ఈ ఆంగ్లో-అమెరికను, చెటిపట్టీల పార్టీ పోటీలు కొంతకాలం తగ్గించుకోవడం మంచిదేమో! ఎటూ మనం బలమైన ప్రత్యర్థిపక్షం వక్కటిగా నిర్మించలేకున్నాము. రాజాజీ మహాత్ముని రాచకీయ ప్రతినిధి అనుకున్నారు గదా! ఆయన పిలిస్తేకూడా, యీ యన్.వి.డి ముఖ్య మంత్రులు సైతం మనతో కలియకున్నారు. ముఖ్యమంత్రుల పార్టీని వేరే యేర్పరచుకుంటున్నారే? యీ జనసంఘము మనలో కలియదు. డి.యమ్.కె కలిసిరాదు, అన్నా. ఐతే యీ ఆలోచన రాజాజీతో హెచ్చరించారా అన్నారు. ఆయన ఏపార్టీల రాజ్యం వద్దు. ధార్మిక, పటుతరమైన ప్రభుత్వం చాలన్నారే! అప్పుడు హెచ్చరించినా! వారేమన్నారు? మనం స్వతంత్ర పార్టీని రద్దు చేద్దామా అని అడిగారు లేకుంటె, అందరికి చెందిన గుడ్ గవర్నమెంటు (Good Governement) యెలా వస్తుంది అన్నా. అందుకు ప్రయత్న చేస్తావా అన్నారు.

ఏ ప్రయత్నం? మంచి ప్రభుత్వం కొరకు! అందులో అన్ని పార్టీలు చేరాలిగా, కాంగ్రెసు వొప్పుకుంటుందా అన్నారు. ముందు

ఎదిరి పక్షాలు వొప్పుకోవాలి. జనసంఘము వారిని చూఛాయగా అడిగితే, ఒప్పుకో లేదు. మొరార్జీని అడిగితే, "మాకు మెజారిటీ వున్నప్పుడు, మా ప్రోగ్రాముకు అంగీకరించమని చిన్నచిన్న పార్టీలతో చేరుతూ, వారికి అధికారం, ప్రాధాన్యత యెందుకివ్వాలన్నారట" అని చెప్పినా! ఇదంతా ఎందుకు, యేపార్టీలకు చెందని దేశసేవా రాధకులు, సమర్థులైనవారి ప్రభుత్వం కావాలందామా All Talents Good mens Government) అన్నారు. దానికి ఎవ్వరూ అంగీకరించరు. దానికి ప్రజాసంబంధము యెలా కల్గుతుంది. అదొక నియంతృత్వ ప్రభుత్వము ఔతుంది అన్నా! నాకొక్కటి తోస్తున్నది, స్విట్జర్లండు, నికరాగ్వా దేశాలలో మాదిరి, ఆ పార్టీల మంత్రివర్గాలు మంచిదేమో ఆలోచించండి" అన్నా!"

ఇంతకూ ముందు మనపార్టీని రద్దు చేసుకోడానికి నీకిష్టమేనా అన్నారు. ఈ యెన్నికలకై డబ్బుగలవారిమీద ఆధారపడడం. ఆ డబ్బులవారి లాభాలకై వారి అవసరాలకై నారు సూచించు పాలసీలను, ప్రణాళికలను బలపరుస్తూ వుండడం నాకు యిష్టంలేదు. రైతు రక్షణకై, బీదల సేవించుటకై మనం యీ పార్టీని పెట్టినాము. అది సాధ్యంకానడంలేదు. మన పేరు ప్రతిష్టలు యీ బొంబాయి వారిట్లా వారి ధోరణికై ఉపయోగిస్తున్నారనే బాధ హెచ్చుగుచున్నది. వారిప్పు డేమికావాలంటున్నారు, అని అడిగారు. యీ బ్యాంకులను జాతీయం చేయడం అవసరమని నా నమ్మకం! ఎందుకు? అవి రైతులకు సేవ చేయవు. పైగా వ్యతిరేకం! అందుకే, సహకార బ్యాంకులు పెంచాలన్నా! అవి పెరుగుటలేదు. వెంకటప్పయ్య కమిటీ రిపోర్టు చూచారునా! రైతులకు అవసరమైన పరపతిలో పదోవంతుకూడా, కో ఆపరేటివు బాంకులు ద్వారా అందడంలేదు ఇప్పుడు బాంకులపై ప్రభుత్వ యజమాయిషి (Social control)" వుండాలని కాంగ్రెసు వారంటె, అదికూడా కాదంటారు మన బొంబాయి మిత్రులు. ఇంకెన్నో



యిలాంటివి. పైగా, మనమెంతగా దేశభక్తి ప్రపూరిత సలహాలు అందించినా, మిగతా పార్టీలు వక్రంగానే ఆలోచిస్తున్నారు, కాంగ్రెసుకూ అధికార దాహమే! మీ తపస్సు నాసేవలు వృథా కావడంలేదా? మన ప్రజలు యీ పోటీ రాజకీయ రంపపుకోతల అవసరం గ్రహించడం లేదు" అన్నా! నీవు గెలిచితివిగదా అన్నారు. ఎంత ప్రయత్నంమీద! చివరకు 500లకు గాను 54గురు మాత్రమేగదా అందిరి! నాకూ యిలాంటి భయాలున్నవి. కనుక, యీ లంచాల వ్యాపారాన్నైనా అరికట్టగల్గితే, ఈ లైసెన్సు, పర్మిట్లు, కంట్రోళ్ళ బ్లాకుమార్కెట్లను ఆపుదల చేయిస్తే, మన పార్టీని రద్దుచేస్తానని, జవహరులాలు వుండగానే చెప్పితిని, నందాతో ఇండిపెండెంటు కమీషను యేర్పరచమని నీవుకోరితివి. ఆలోచిద్దాములే, తొందరపడవద్దన్నారమ్మా?

రైతుకూలీల కొరకై క్రిషికారు లోక్ పార్టీ పెట్టితిమి, పెంచ లేకపోతిమి, రాజాజీ బలంవల్లనైనా, ప్రత్యర్థి పార్టీ పెట్టి స్వయం వృత్తిదారులను, కూలీలను రక్షించుదామనుకొంటిమి, అదీ సాధ్యం కాకుండా వున్నది, ఈ పార్టీ శ్రమికుల పనికిరాని పొత్తు ఎందుకు? ఆ పిచ్చి కాంగ్రెసు వారితోనే సర్దుపిల్చుకోరాదా" అన్నారు భారతీదేవి! ఎంత చితికిపోయినా, వాళ్ళు మహాత్ముని తలుచుకొంటారు గాంధిపేరును నెత్తిమీద వేసుకుంటారు గదా అనిపిస్తుందండీ!

అంతలో పిల్లలు సరస్సు ఒడ్డుకు వెళ్ళుతున్నారు. రమా; ఆమె చేయిపట్టుకొని, "తాతమ్మా! నీళ్ళవద్దకు రా!" అంటున్నది. ఆమె నవ్వుకుంటూ, "ఎంత అధికారం నాపైనీకున్నదే" అనుకుంటూ నీళ్ళ చేరువకు వెళ్ళారు. పిల్లలు లోపలికి లాగుతున్నారు.

మోకాళ్ళ లోతువరకు తాను వెళ్ళిరి. తన చేతులతో ఆపిల్లలను ఒడ్డుచేరువనే నిల్పుచున్నారు.

ఇంతలో పిల్లలు ఒకరిపై ఒకరు నీళ్ళు విసురుకుంటున్నారు. రమా తనపైకూడా ఎన్నోనీళ్ళను విసిరింది. తన మొగమంతా నీటిచుక్కల మయమే! నవ్వుకుంటున్నారు. పిల్లలు నవ్వుతున్నారు వాళ్ళను విజయలక్ష్మి భయపెడుతూ, తాతమ్మమీదనే నీళ్లు చల్లడమంటున్నదీ. ఫరవాలేదులే అన్నారు ఆమె. నాపైనచల్లండి అంటున్నది పుష్ప! తాతమ్మనే కావాలంటున్నారు పిల్లలు! ఆమె కెంత ఆనందమో!

ఏమీ మాట్లాడకుండా, అంతా గమనిస్తూ, నవ్వుతూ వుంటున్నది చూడండి ఈ దేవి! ఆచల్లని, మెల్లని లాల్‌బహదూర్ శాస్త్రిగారిలాగా" అన్నారు ఆమె తండ్రి - నాగేశ్వరరావు.

అరుగో భారతీదేవి, పరుగు పరుగున రమాను అందుకో బోతున్నారు. ఆ చురుకైన చిన్నిరమా నీళ్ళల్లోకి వెళ్ళుతూ, ఆమెను కవ్విస్తున్నది. ఇద్దరూ నవ్వుకుంటున్నారు. బిడ్డను అందుకున్నారు. తిరిగి తీసుకొస్తున్నారు. ఇంతలో అటుతిరిగి నీళ్ళలోకి పరుగెత్తుతా నంటున్నది. నీళ్ళల్లోనే వుంటున్నది. పట్టుకుంటానన్నారు ఆమె! ఏదీ పట్టుకో అంటున్నది రమా! వారిద్దరి మధ్య నవ్వుతూ వెల్గుతున్నారు పుష్ప, విజయ!

అందరిని హడలుపెట్టుతూ, నీళ్ళలోకే వెళ్ళిపోతానంటూనే గిర్రున అటుతిరిగి, నావైపుకు పరుగెత్తుతూ వచ్చేసింది. నేను గట్టిగా నవ్వినా! ఎందుకూ, మేము ఓడిపోతిమనా!" అన్నారు భారతీదేవి! "కాదమ్మా. ఇదంతా చూస్తూవుంటే, ఆనాడు జుహూ సముద్ర తీరాన, ఆబిడ్డ తన చేతిలోని కర్ర బుచ్చుకొని, ముందుకు వడివడిగా సాగిపోతూవుంటే, నవ్వుతూ అంతంత అడుగు



లేస్తున్న ఆ గాంధీజీ మనస్సులో మెరమెర లాడుచున్నారమ్మా ఆయన బిడ్డలమేగా మనందరము అవునండి, ఇది వారి జన్మదిన మేగా! అలాగా పిల్లలతో జలకాలాడివచ్చిరి. కాశ్మీరులో మీరు, నాతో ఇల్లా ఆడినారా అంటిని! ప్రియులకంటె పిల్ల ఆటలు, పాటలు హెచ్చు ఉల్లాసం కల్గిస్తవిగా! ఇప్పుడే తెలుసుకున్నారా అంటిని. "ఎప్పుడో తెలుసు, కాని, పుస్తకాలు, పత్తనాలు, పల్కరింపులలో మునిగివున్న మీతో పిల్లలజేర్చి ఆటలాడుకోడానికి మీరెప్పుడు అవకాశమిచ్చినారు. ఈ విజయభాగ్యమువల్ల పిల్లలు, పుష్ప ఉల్లాసంవల్ల ఈవనమహోత్సవము, బాపూజీ దీవెనల వల్లను సరసు సాంగత్యము ఈ పర్వదినాన అందుకో గల్గినాను. ఈ సరస్సు నీళ్ళు ఈ పిల్లలద్వారా మన కందినవి! అని నవ్వుకున్నారు. నేనూ ఎంతో ఆనందం పొందినా!

—:o:—

# ప్రాజెక్టులు - అప్పుడు - ఇప్పుడు

1955లో భారతీదేవి, నేను, తుంగభద్ర డాం వద్దకు వెళ్ళినాము. నాల్గు రోజులు అచ్చటి సుందరమైన "కైలాసం" అనే బంగాళాలో వున్నాము. ఆనాటి కాంగ్రెసు మంత్రి వర్గములో, అంతకు ముందు కృషికార్ లోక్ పార్టీగా వుండిన వారం, తిరిగి కాంగ్రెసులో చేరుతూ, ఆ మంత్రివర్గములో భాగస్థులమైనాము నా సలహాలను పాటించక, తొందరపడి, మద్రాసునుండి ఒత్తిడి పైన. ముగ్గురకు బదులు ఇద్దరికే సమ్మతించిమూవారు స్నేహితుల నా సలహాలను పాటించక మంత్రివర్గములోకి వెళ్ళడం, అందువల్ల కృషికార్ లోక్ అధ్యక్షులు, కాంగ్రెసు - కృషికార్ లోక్ - ప్రజాపార్టీ ఎన్నిక ఒప్పుదంపై దస్కత్తుదారులైన శ్రీ ఓబుల రెడ్డి బైటనే వుండిపోవడం జరిగిపోయింది. ఆ బాధనుండి తేరుకుంటూ మా దంపతులం, ఆ వెన్నెలతో మిల మిల లాడుచున్న తుంగభద్రాంబ తల్లిని తర్శించు కుంటూ వుంటిమి. ఆ తుంగభద్ర ప్రాజెక్టు కొరకై 1925 నుండి మేమెంతో శ్రద్ధ చేసితిమి. రైతు సంఘాల ద్వారా, శాసనసభల్లో శ్రీ కడప కోటిరెడ్డిగారు ఘోషిస్తూ వుండిరి. రాయలసీమ కరవు బాధలు తొలగుటకా ప్రాజెక్టు అధికంగా ఉపయోగపడునని మేముఆశించితిమి. అడ్వైజరు సమయంలో శాంతి, రామమూర్తి దానికి స్తంభ ప్రతిష్ట చేసిరి. అలాగా ఏర్పడిన ఆదిత్య మంగళ సాగరాన్ని చూచుకొని మహదానందం బొందితిమి, శిధిలాలయిన దేవళాల మంటకు స్తంభాలను కైలాస బంగళాకు స్తంభాలుగా అమర్చిరి. మన ఇంజనీయర్లు రాత్రివేళ, ఆ క్రింద పారాడుచున్న నది ఒడ్డులపై నిర్మించబడ్డ బస్తీలు, విద్యుద్దీపాలు అష్టదిగ్గజాలు. కళకళలాడు చుండినవి.



ఆసమయమందే, హంపీ శిధిలాలను చూచితిమి. ఆనాటి కృష్ణదేవరాయల వారి వైభవములను తలచుకొంటిమి. సీవెల్ వ్రాసిన "మరువబడ్డ సామ్రాజ్యము" చదివి వుంటిమి గదా.

వెంకటరమణయ్య పుస్తకములుకూడా! మనకవుల పద్యాలు మనసుకు వస్తూవుండినవి. కాకతీయ నాయకులలో సోదరులగు హరిహర, బుక్క-రాయల స్వాతంత్ర్య సంపాదనోత్సాహము, వారికి అండదండలుగా నిల్చిన, ప్రోలయ, కాపయ నాయకులు, ఇటు ఆనెగొంది - విజయనగరంలో, అటు ఓరుగల్లు, హనుమకొండలో, దక్షిణ భారతదేశ స్వాతంత్ర్య రాజ్యాల వరాహరూపపు జెండాలను ఎగురవేసిన కథలను నెమరువేసికొంటిమి. భారతీదేవి ఒక్కొక్క పద్యమో పదమో సూచించడం, నేనుదాన్ని పూర్తిజేయడంగా, మనుచరిత్రలోని ప్రథమ భాగాలు, హృదయ సంగీతమందు మేళవింపు చేసికొంటిమి.

ఈమధ్య కృష్ణానది తీరానగల శ్రీకాకుళం వెళ్ళితి. అచ్చటి ఆంధ్ర-శాలివాహన - మంటపంపై - విశ్రాంతికన్నట్లు కూర్చుని-పక్షం దినాలు - కృష్ణదేవరాయలు, ఆమహత్తర కావ్యాన్ని రచించిరని తెలుసుకొంటిని. కృష్ణదేవరాయల కంత తీరిక ఎలాగా అందినదమ్మా. ఆముక్తమాల్యద వ్రాయడానికే? "అన్నా!

"మన జవహరు ఈనాడు అలాగే వ్రాయగల్గడం లేదా" అన్నారు.

"ఎ ...రైనచో - మ.నకరిం..దము డిగ్గి"-అన్నాడుగా పెద్దన. ఆనాటి కృష్ణుని కట్టి సావకాశం కలుగలేదని కాబోలు ఈ విజయనగర కృష్ణుడు కవుల నింతగా పూజించెననుకొంటిని. ఆ బృందావన కృష్ణునికి భూదేవి తన్నుతా అంకితము చేసుకోనివ్వలేదట ఆనాటి క్షత్రియ దుర్మదాంధులు. కనుక ఈనాటి కృష్ణదేవరాయలకు భూదేవి భార్యయై, రొమ్ము ...నవే ముద్రగా నిల్చిపోయి

నది!! ఆలోచించండి. కృష్ణదేవరాయలు నే ఆదిల్‌షాకు ఆశ్రయమిచ్చి, పెంచి, పట్టాభిషిక్తుని చేసిరో, ఆతడే రాయల అల్లుడు, వృద్ధుడైన రామరాజుపై తారసిల్లి, మిగతా నల్గురు నవాబులతో చేరి, తాళికోటవద్ద ఓడించె. రామరాజు కన్ను పొగొట్టి, చంపె. విజయ నగరాన్ని మట్టిపాలు చేసె! ఎంత కృతఘ్నుడండి?" అన్నారు. "మనకు, ప్రకాశంగారి కిట్టి పాఠాలు నేర్పిన "ఆదిల్ షా"లు వుండిరిగదా అన్నారు. అంతవరకు నెమ్మదిగా వుండిన రాజగోపాలు, ఆ విజయనగర్ పాలకుల ప్రాభవము, అభివృద్ధి కార్యములలో కన్పడుతుంది. గణపతిదేవు, రుద్రమదేవి సాగించిన సరస్సులు, తటాకముల నిర్మాణ కార్యముల సాంప్రదాయాన్ని విస్తరింపజేసిరి. మంత్రి తిమ్మరుసు, రాయల వద్దచేరిన కాకతీయాంధ్ర నాయకుల, కృష్ణదేవరాయలు, ఆపిమ్మట తిరుమల, మంగమ్మ రఘునాధ్ నాయకులు; కన్యాకుమారి వరకు ఎన్నెన్నో అడవుల ఛేదించి, దశ లక్షల ఎకరాల భూములకు కావేరి యితర నదుల నీరు అందిస్తూ, భారతీయ విశ్వకర్మలు, తమ ఇంజనీరింగు నిర్మాణ శక్తిని, ప్రజ్వలింప జేసిరి.

"ఐనా ఇంతింత రాతి ఎడారులే మిగిలినవండి. అడవులను మితిమించి ఛేదించితిమి. చెట్లను వేయడం మానితిమి? వర్షాలు తగ్గినవే? ఏల ఇంతగా కరకుకరువు రాక్షసి ఇన్నిసారులు మన బీదజనాలను బాధిస్తున్నదో?" అనుకుంటున్నారు ఆమె. ఆ కరవు కాలాలలో మీరు అన్నపూర్ణగా సాగించిన కృషి మాకెంతో తృప్తి". "అదొక లెఖ్ఖ! ఈ ప్రాజెక్టు నిర్మించుటకు చెప్పుకోదగ్గ అన్నపూర్ణ అవతారములు. ఇంకెన్నో కావాలి దేశమంతటా! భక్రానంగల్ చూచి వచ్చినాము. అందుకే మనం ఇన్ని దశాబ్దాల పర్యంతం ఏ అధికారం అందుకోకపోయినా, నాగార్జున సాగరం, పోచంపాడు, స్వర్ణముఖి, వంశధార ప్రాజెక్టులకై తపస్సు చేస్తున్నాం గదా! యిదే మన నిర్మాణ కృషి! ఈ తుంగభద్ర ప్రాజెక్టు కొరకె 1933 నుండి రైతు రక్షణ యాత్రలను సాగిస్తున్నాము! ఈ జలాలు జలజల పారాడుతుంటె, ఆనాటి సాగరుని పూర్వీకుల భస్మాలు తిరిగి ప్రాణాలు పోసుకొంటూ వుండినట్లు, రాయల రాజులు, నాయకులు, సైనికులు భారత సాంప్రదాయములనేగాక, రైతాంగ, శ్రామిక జనాలకు నిండు ప్రాణం, సౌభాగ్యం ప్రసాదిస్తున్నా రనుకున్నాం.



ఆ మాసాంతములోనే, రషియా, యుగోస్లావియాకు, పార్లమెంటరీ డెలిగేషన్‌లో పోబోవుచున్నా! అంతకుముందే, మేమిద్దరం భక్రానంగల్ డామ్, గాంధి డాం కాలువలను చూచి వచ్చినాము. ఎంతటినిర్మాణము! అమెరికావారి సాయముతో నిర్మించిరి! వాని చలువవల్ల, రాజస్థానులో లక్షల ఎకరాలకు మాగాణి సంప్రాప్తమవుతుంది, మరెంతో విద్యుత్తు సప్లయి!

అవన్నీ తలుచుకుంటూ ఆనంద పరవశుణ్ణగుతుంటిని! "సరేలే అందరికంటే ముందుగా భారతదేశం త్వరితగతి అభివృద్ధి పొందాలంటే, పరిశ్రమలకు ముందుగా, మాగాణి, మురుగుపోయే ప్రాజెక్టులు కావాలంటిరి. అందుకు అమెరికావారి సహాయం కోరమనిరి. అమెరికావారిని ఆలాగా భారతదేశానికి సహాయపడమని ప్రోత్సహించిరి. మీ దేశభక్తి, రైతాంగ రక్షణోత్సాహము, నిరుద్యోగ నివారణ ఆసక్తి గ్రహించక, జవహరులాలు త్వరపడి అన్నిమాటలు మిమ్ము అన్నారు. ఇప్పుడీ దేశాలు బోయి, మరి యేక్రొత్త ఇబ్బంది తెచ్చుకుంటారో నని హెచ్చరించిరి ఆదేవి.

జవహరులాలు, "అలాగేనమ్మా ముందుగా మరితరులు అడుగులు వేస్తే చురచుర మంటారు. తరువాత తానే ఆదారినే శంఖారావముతో విజృంభిస్తూ వస్తూవుంటారు మధ్యలో మనలాంటివారికి ఇన్నిఇబ్బందులా? అదొక సరసము మా మధ్యలెండి అన్నా! ఎన్నెన్ని ప్రాజెక్టులు ఫ్యాక్టరీలు, నూతన పరిశ్రమలు ప్రారంభించుటకు ప్రోత్సాహం కల్గిస్తున్నారు. ఆనేష

నల్ ప్లానింగు కమిటీ యిప్పటి - ప్లానింగు కమిషన్ ఏర్పరచినప్పటి నుండి, మన దేశాభ్యుదయం, ఈ చిన్నవి గొప్పవి ప్రాజెక్టుల ద్వారా సాధించాలనే తాపం పట్టుకున్నది. మంచిదే అన్నా!

ఐదువందల సంవత్సరాల క్రితమే, ఆ కాకతీయులు రాయలు, నాయకులు, ఈనాడు మనకున్న మెషినుల సౌకర్యాలు లేకుండానే ఎన్ని సరస్సులు, దేవళాలు నిర్మించిరండీ అన్నారు. అప్పుడు మన విశ్వబ్రహ్మలు, తిమ్మరుసులు, రాయలుండిరి. లంచాలు తక్కువ. ప్రజాభ్యుదయం అందరు కోరిరిగదా!

—:o:—

# బుద్ధంగచ్ఛామి - బౌద్ధనాగరికత

నాగార్జున సాగరు డాం నిర్మాణము పూర్తి అయినది. రోహిణి అగ్గిలో రాళ్ళనుకరగిస్తుండే అటు పల్నాడు, ఇటునల్గొండ భూములకు చల్లటి అమృత జలాలు, పచ్చల బంగారుపంట లందిస్తున్నవి. గ్రామీణులకు ప్రాణాలు పెరుగుచున్నవి. ఆ సాగరు నిర్మాణమునకై, డా॥ కె. యల్. రావు, ముక్త్యాల ప్రసాద, కన్నయ్యా, కానూరి రామయ్య చౌదరి, ఆర్టిస్టు మల్లయ్యా, నాగినేని వెంకయ్యా, రైతు గొర్రెపాటి, మోటూరి సత్యనారాయణ, వావిలాల గోపాల కృష్ణయ్య, నార్ల ప్రభృతులతో కలిసి, రైతాంగ ఉద్యమం నారంతా శ్రమించిరి. ఆ మహత్తర నిర్మాణమునకు పదుల కోట్లను ఊపుకుంటూ అందించిరి జవహారులాలుగారు. అచ్చట భారతీదేవి మేనల్లుడు చి॥ వెలగా ప్రసాదు ఇంజనీరుగా వుంటూ, వ్యవహరిస్తున్నాడు. మమ్ము ఆ సాగరమధ్యమందొక కొండపై నిర్మించబడ్డ నాగార్జునకాలపు బౌద్ధ శిథిలాలు, కళాఖండాల మ్యూజియమును చూచుటకుపిలిచిరి. డాం వద్ద నిర్మించబడ్డ సుందరమగు బంగళాలో దిగినాము.

సాయంత్రం మోటారు బోటుపై మేమిద్దరం, ప్రసాదు, ఆయన సోదరి చి॥ పుష్పకుమారి, తమ్ముడు సుబ్బారావు, విజయలక్ష్మి, నాగేశ్వరరావు, వారి పిల్లలు కొండకు చేరితిమి.

ఆబోటు పై కెక్కుతూ "ఈ ప్రయాణంపు బోటులోకూడా భయపడుతారా?" అన్నా నవ్వుతూ. "ఇది సంద్రము కాదుగా, మన ఇల్లాలు కృష్ణవేణమ్మగా" అన్నారు. ఆ సంద్రపు నీరులాగా, కృష్ణానదికూడా నీలంగా, గంభీరంగా వుంటుంది. అలలు నెమ్మది.

అసలు కదులుతున్నవా ఆ జలాలు? బోటు సాగుతున్నా, ఒడ్డుకు చేరినా, జరజర ప్రవహిస్తున్న, వెనుకటి కృష్ణవేణి యొక్క ఆర్భాటం లేదు. ఆ సంగీతం వినిపించడం లేదే! ఇప్పుడీమె సరసీమణి అయిపోయినారు. పంటల, భాగ్యాల తనలో నిల్పుకున్న చూలాలు ఈ తల్లి!

ఆ కృష్ణవేణమ్మను చూచుకుంటూ, కొండవైపు పోతూ వుంటే, మనస్సు పూర్వ స్మృతులపై కదులుతూ వుంది.

1925-26లో లండను మ్యూజియంలో, 1953 నవంబరు వడో తేదీన అమరావతిలో బౌద్ధస్తూపముల ఫలకాలను బుద్ధుని విగ్రహాలను, ధర్మచక్రాలను చూచివుంటిమి. అమరావతి కళాఖండాలను, అజంతా చిత్రరువులను, అడివి బాపిరాజు వర్ణిస్తూ, వ్రాసిన వన్నీ చదివితిమి. మరెప్పటికో రెండు వేల సంవత్సరాల క్రితం భారతీయులు అందుకొన్న ధార్మిక జీవితం తిరిగి మనవారు అనుభవించగల్గేది'' అంటున్నా! "మనం చేయగల్గేది చేస్తున్నాముగా, అదే మన తృప్తి'' అన్నారు దేవి. ఆలాగా ఈ 1953 నా జన్మదినోత్సవం అమరావతిలో చేసుకున్నాం. బుద్ధుని వాతావరణంలో!

1936లో కన్పించినవేగాక, ఆ పిమ్మట త్రవ్వ కాలలో అందిన మరెన్నో కళాఖండాలను ఆ చక్కని మ్యూజియంలో చేర్చిరి, అలంకరించిరి. వాటిని చూస్తూవుంటే, రెండు వేల సంవత్సరాలకు ముందే, ఎంతటి నాగరికత, ప్రజాభ్యుదయం, దేశ సౌభాగ్యం మన చరిత్ర చూడకల్గినదో తిరిగి తలచుకొంటిమి. ఆ మొగలాయీలు, ఈనాటి అమెరికనులు అందుకోజాలని సౌందర్య సౌభాగ్యరాసులను మన బౌద్ధభిక్షులు అహింసా వ్రతానుష్ఠానులు అందుకోగల్గిరి

ఆ యుగంలో రైతులు ఎలాగా జీవించిరో? కళాకారులో? అందరు స్వయంవృత్తిగలవారేనా? బానిసలప్పుడు లేరుగా? అంటరానితనము వారెరుగుదురురా? ఇన్ని ప్రశ్నలా పుష్పా? అది



బౌద్ధయుగం. మానవులను దేవతలుగా మార్చుకుంటున్న యుగం, అన్నారు దేవి. ఆనాటి అమరావతి స్తూప శాసనాలలోని కథలు చదివినా నేను, సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్"లో! అమ్మ చెప్పిందే సత్యం! అది బంగారు యుగం. దాన్ని పోగొట్టుకున్నాం పూడ్చి పెట్టాము. దేశం పాడైపోయింది.

ముప్పై సంవత్సరాల క్రితం చూశామే, ఆ దిగాలు పడి వున్న గుర్రం. తన రాజకుమారుని వదిలివేసుకుని తిరిగి వచ్చిన గుర్రం. తలవంచుకుని, నీరు గ్రక్కుతున్న నయనాలతో, గిట్టనైన అంటుకోక, దుఃఖమంతా తనదేనన్న ఆ బుద్ధుని గుర్రాన్ని చూడాలన్నారు ఆమె. తిరిగాం. చూచాం! ఉన్నది అలాగే అందరి దుఃఖము తనదే నన్నట్లు! ఆ పాలరాతిలోనే ఎంత బలమైన సుకుమారతనము! ఆవేశం, ఆక్రందనంలోనే అంత అందం! మాతృదేవతను చూచుకున్నారు. అప్పుడా లోయలో వున్నప్పటికంటె, ఇప్పుడు ఈ కొండమీద, నదీ జలాలమధ్య బుద్ధుని ప్రతిష్ఠించడమే బాగున్నది. అందంగా, అపురూపంగా? మహెంజొదారో నాగరికత, బౌద్ధయుగపు సంస్కారము, మహారాష్ట్రము, కర్నాటకం, ఆంధ్రం - అనగా చాళుక్యుల రాజ్య పర్యంతం అలుముకొన్నది. ఆ కాలపు మాతా సంస్కారం, నిరాకారునిపై మమకారం, బసవన్న ద్వారా మరో జన్మ ఎత్తుకొన్నది. దుర్గమ్మ, బసవేశ్వరుని పూజలు మనకందినవి. అన్నా ఆమెతో, "భారతీ, ఢిల్లీలో రాష్ట్రపతి భవనం ముందున్న ఆనిండైన యెద్దు శిలాఖండం జ్ఞాపకమేనా! అది మహెంజొదారోనుండి, బుద్ధుని వరకు వచ్చి మన ఒంగోలు ఆంబోతెద్దుగ రూపొందినదమ్మా!" ఎన్నో కన్పడుతున్నవండీ!" అన్నారు. ఆ కాలపు పూలతోటల వారు, పూలు గుచ్చువారు, అమ్మువారు, గొర్రెల మందలవారు, గానుగ ఆడువారు, రైతులు, చేనేతవారు, విశ్వకర్మలు, ఎందరెందరో శ్రామికులు, వారి స్త్రీలుకూడా పోటీ పడుతూ దానాలు

చేస్తూ. ఎన్నెన్నో కట్టడాలు నిర్మింపజేసిరి. చెరువుల త్రవ్వించిరి. ఆ విహారాలు శాసనాల్లో చెక్కించుకున్నారు.

అంతటి ధార్మిక నాగరకతను వారు దేవుడున్నాడా లేదా అనే చర్చల్లో తగు సమాధానం ఇవ్వలేదని వారి భిక్షుకులు కొందరేమో అధర్మము లో వుండిరని సాకుగా; ఆధార్మిక ధోరణినేపాతిపెట్టిన హిందూ పురోహితులు, వేదాంతులు సంపాదించిందేమి? ఆరువందల సంవత్సరాల దేశీయ బానిసత్వమేగా? బౌద్ధ ధర్మము గెలుస్తున్నది. జవహరు, శ్యాంప్రసాదు ముఖర్జీ; రామస్వామి, అంబేద్కరు. మనలాంటి వారంతా ఆనాటి ధార్మిక ధోరణిని అందుకున్నారులే! బుద్ధునికూడా దేవునిగా చూచుకుంటాం" అంటున్నా నేను.

తిరిగి వచ్చేటప్పుడు. సాయంత్రపు సూర్యుడు కృష్ణవేణమ్మలో చిక్కుకొని పోతున్నాడు. చూడు, చూడండి ఎంత సిగ్గుపడి పోతున్నాడో! ఏ భూములపై, పల్నాటి వీరుల రక్తాలు యింకి పోయెనో, నాగార్జునులు తపస్సు చేసిరో, శృంగార శ్రీనాధుడు ఏకులు వడికే రంభల జూచి రోసెనో, ఆ భూములే కృష్ణవేణమ్మ జలాలు అందించే గిలిగింతల ద్వారాను మహాత్ముని మరిపించే నూతన యుగ పురుషులకు, మానవులంతా ఒకటి, కులాలు, మతాలు వారిని వేరుపరచరాదు. సర్వమానవ సౌభ్రాతృత్వమును బోధించు కాలం వస్తున్నది. అదంతా ఎలా సాధ్యమౌతుంది. అందరికి తినడానికి తిండి, ఉండటానికి ఇల్లు, త్రాగడానికి నీరు, పాడుకోడానికి హృదయం వస్తున్నవి. అందుకే ఈ ప్రాజెక్టులు, ఈ [illegible] సహాయం కొరకై మన [illegible]ర్థనలు" అన్నాను మా దేవి.

—o—

# తిరుమల, ఈశ్వర పూజలు - విశ్రాంతి

తిరుపతి - తిరుమల హైందవులైన దక్షిణాత్యు లందరికి విద్యార్థి దశనుండి ప్రాణపదముగా నుండును. బిక్షాలవారు, సంక్రాంతి దాసరులు, పురోహితులు, పెద్దలు, పంతుళ్ళు, పిల్లలు అందరూ ఆపుణ్య క్షేత్రమును స్మరిస్తూనే వుందురు.

కనుక నాకుకూడ ఆకొండ కెక్కాలనే వుండేది. అలాగే భారతీదేవి మనస్సు, ఆ వెంకటేశ్వరుని చూడాలనే.

మా తల్లిదండ్రులు, అటువారు యిటువారు యేడుకొండల నాథుణ్ని అందుకొన్నారట. ప్రార్థనలు చేసిరట. వెంకటేశ్వరుని పేరు నాకు అందించిరి. అలివేలుమంగ పేరు ఆమె కందినది.

1925లో నేను మద్రాసు రాష్ట్రమంతా ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయం తరఫున ఆర్థిక శాస్త్రం రిసర్చి చేస్తూ, దక్షిణాదిన చేనేత పరిశ్రమ కళాకారుల జీవితము, ఉద్యోగము, సంపాద్యము ఆర్థిక స్వతంత్ర ప్రాతిపదికల గురించి, విచారణలు 'జనుపుతూ సంచారం చేస్తున్న సమయమది. తిరుపతికి చేరినా! కొండపైకి కాలినడక యెక్కినాను. మనవారంతా అంటున్నట్లు, ఎక్కడం, దిగడం, ఆ చుక్కల పర్వతమో, మోకాళ్ళ పర్వతమో, ఎంతో కష్టం మీదనే, వెంకటేశ్వరునికి అందుకొంటిని.

తిరిగి 1928-29లో, ముత్తవ అమ్మమ్మ, భారతీదేవిలతో కలిసి, మద్రాసులో ప్రొఫెసరుగా ప్రభుత్వపు హానరరీ ఆర్థిక విచారణాధికారిగా వుంటూ, తిరుమలకు ఎక్కి, దిగివచ్చితిని

ప్పుడు దంపతు లిద్దరము నిండువయస్సుతో ఉత్సాహులమై వుంటిమి. ఒకరితో మరొకరం పోటీ పడుతూ ఎక్కితిమి! నొప్పులుగా వుంది. ఆ వయస్సులో అవ్వి లెక్కా? ఎవ్వరికెక్కువ అలసటో! క్రమంగా తెలుసుకొని, ఒక్కొక్కరు మరొక్కరికి చేయి అందించుకొన్నాము, నవ్వుకుంటూ, 'నీవు ఓడినావులే' అని ఒకరినొకరు పరామర్శ చేసుకుంటూ! ఎండ బాగా యెక్కే సరికి దేవళానికి చేరుకున్నాము. దర్శనం చేస్తూవుండే సమయంలో అమ్మమ్మగారికి దర్శనం నిండుగా అందదేమోనని చల్లగా భారతీ దేవి నన్ను హెచ్చరించిరి. అంత ఆమెను యెత్తుకుని, "అమ్మమ్మా! చూడండి, ఆ వెంకటేశ్వర్లును. కనపడ్డారా! తృప్తియేనా" అంటూ వుంటిని. "చూచుకున్నాను బాబూ! వెంకటేశ్వర్లు అందినా" రన్నారు.

అంత వారిని దింపుకున్నా! ఆమెకు ఆనాడు కల్గిన ఆనందం యెలాగా వర్ణించటం!

తిరిగి వచ్చేప్పుడు, ఎంతదూకుడుగా వస్తిమి! దిగడమే భయంకర మనిపిస్తూ వుంది. "పోటీలేదమ్మా! నిదానంగా దిగుదాము, ఇదుగో నేను ఓడిపోయినాగా, ఆగండి!" అంటూ ఆశక్తిశాలిని ఆపుకుంటూ, ఆడుకుంటూ, మేమిద్దరం నడుస్తూ వస్తిమి. అమ్మమ్మను డోలీలో తెచ్చుకొంటిమి.

తిరిగి 1947 వరకు మేము తిరుపతి వెళ్ళలేదనుకుంటా!

ఆమధ్య ఎన్నో పర్యాయములు తిరుపతి వేరు వేరుగా కలిసికూడ వెళ్ళుతూవుంటిమి. అప్పుడల్లా, రైతు, జాతీయ స్వరాజ్య వుద్యమ సందర్భంగా ప్రచారము కొరకై వెళ్ళితిమి. అప్పుడు తిరుపతి దేవస్థానం జమీందారీ పెత్తనాన్ని రద్దు చేయించుటకై తీవ్రప్రయత్నం చేస్తూవుంటిమి. కనుక; 'ఆ జమీందారుతో మాకేమిపని?' అనుకొంటిమి. ఆ దేవుడు జమీందారీ పెత్తనాన్ని దులిపివేసి, రైతు రక్షకుడుగా మార్పు చెందాలంటిమి.



1940లో తిరుపతికి దగ్గరలోనే వుండిన తిరుపతి జమీందారీకి, దాదాపు ఆనుకొనివున్న వెంకటగిరి జమీందారీపై శ్రీ నెల్లూరు వెంకట్రామానాయుడు, నేను సాగిస్తూన్న వుద్యమాన్ని బలపరచుటకై వెంకటగిరిలో రాత్రివేళ భారతీదేవి గొప్ప సభ జరుపుచుండిరి. నేను జైల్లో వున్నా! అట్టి సమయాల్లో ఆమె నాకు బదులుగా, వ్యావహారికంగా ఆయా ఉద్యమ కార్యాలను సాగిస్తూ వుండేవారు గదా! ఆ సభలో, జమీందారు యేజెంట్లు రాళ్ళ వర్షము కురిపించిరి. రెండు రాళ్ళు ఆమెను అందుకొన్నవి, గాయపరచినవి. అప్పుడు "ఈ రాళ్ళవర్షాన్ని చూస్తున్న యో వెంకటేశ్వరా! రైతుల రక్షించటానికి యీ రాజులు నీకిచ్చు వజ్రాల రాసులను వారిపైననే విసరి, మా రైతులకు భూములను పంటలను, పాడిని ప్రసాదించరాదా!" అని భారతీదేవి అన్నారట.

ఆ కోర్కె నెరవేరినది 1947లో. జమీందారీ పెత్తనం. శాసన రూపేణ రద్దు చేయబడ్డది. వెంకటేశ్వర్లు జమీందారు అవతారాన్ని చాలించి రైతుగా, శ్రామికులుగా, దరిద్రనారాయణులుగా సాక్షాత్కరించిరి.

మరో అవతారంకూడా, ఆ స్వామి పొందినారు అదే హరిజనావతారం! నందనారు స్వరూపం. దానిలో ప్రధానపాత్ర మా సోదర సేవకులు పాకాల శ్రీయన్.వి. నాయుడుకు బి.యస్. మూర్తికి అందినది. స్పెషల్ ట్రైనులో, పాకాలనుండి తిరుపతికి హరిజనులను తెచ్చిరి, కొండపైకి యెక్కించిరి. దేవుని దర్శనము అందించిరి. ఆనాడు వెంకటేశ్వర్లు హరిజనావతారమును యెత్తిరి. అందుకొనిరి. అప్పటినుండి తిరుమల మా దంపతులకు, అనుచరులకు పవిత్ర యాత్రాస్థలమైనది, సర్వజనులకు నిండుమానవత్వ హక్కు బాధ్యలను అందించిన దేవుడుగా శ్రీ వెంకటేశ్వర్లు మాకేకాక అందరికి అందుబాటులోకి వచ్చిరి.

ఇంతలో మోటారురోడ్డు వచ్చింది. మేము ఆ మోకాళ్ళ పర్వతాన్ని ఎక్కవలసిన పనిలేదు. శక్తిజాలని వయస్సుకు వస్తున్న మాకు, కారు సౌకర్యము అందుచున్నది. ఐతే ఆ 1928-29 యాత్రానుభవాలను మేమిద్దరము జ్ఞప్తి చేసుకుంటూ, యౌవన సుఖాను భూతులను మనస్సులలో పారాయణ చేసుకొనేవారం.

1959-60 వేసవిలో తిరుమల మీదనే యిరవై దినాలు విశ్రాంతి తీసుకోగల్గితిమి. అదొక అదృష్టమగు సంధ్యా సమయం. అటు ప్రేమపాత్రమైన కాంగ్రెసును వదలితిమి. ఇటు కొత్త పార్టీని రైతు రక్షణకై స్థాపించితిమి. అటు మా యిద్దరికి సన్నిహితులయ్యు, రైతాంగ స్వంత వుద్యోగ వ్యవస్థల రద్దుకే దారి దీయు సహకార వ్యవసాయోద్యమాన్ని నిలుప కంకణధారులైన జవహరులాలుగారి నెదిరించుచుంటిమి! ఐనా వారితో విభేదించి, వారి నెదిరించుట బహుబాధాకరంగా వుండెను. ఇటు ముప్ఫయి సంవత్సరములనుండి ఆ జవహరుతో వుంటూ, యిప్పుడు మాత్రం మాతో సహకరించుటకు ముందుకొచ్చిన, భారత నాయకాగ్రగణ్యులు, పూజ్య రాజాజీ ఆశీర్వాదముల నందుకొను చుంటిమి. ఐతే, ఎంతటి పరీక్ష! జయం పొందగలమా? ఎలాగా! ప్రజలు కాంగ్రెసుతోనే వున్నారే! ఆ కొండపై కూర్చున్నారే జవహరులాలు ప్రధాన మంత్రిగా! మాకు అధికారఆయుధ విసర్జన చేసిన రాజాజీ, రాజకీయ చైతన్యము లొందకున్న రైతాంగ జనాలు అధికార దాహంలో కన్నుమిన్ను తెలియనివారి కులాల నాయకులు మా దిక్కు చూడకుండా వుండిరే! ఇక మాకు దిక్కేది? మేమే కొండ యెక్కగలం? "ప్రతిపక్షాన్ని లేపండి, మంచిదే" నన్నారు శ్రీ జయప్రకాష్! ప్రతిపక్షాలు పెంచగల మంటున్నారు రాజాజీ! స్వతంత్రలాంటి ప్రతిపక్షం కావాలి, కనుక, రాజాజీని శిరసావహిస్తా మంటున్నారు, బొంబాయి, అహమ్మదాబాదు, అమృతసరు, పాట్నా, కలకత్తా పెద్దలు మసానిద్వారా. మాకేమో 1951-53 క్రిషికారు లోక్ పార్టీని స్థాపించి నడుపుతూ, ఎన్నికలలో డబ్బు



లేక, పత్రికల బలంలేక, కారులు, మైకులు గానక ప్రజాబలాన్ని సమీపింప లేకుండిన అనుభవాలు ప్రాణాలను క్రుంగతీస్తూ వుండినవి. కనుక, వెంకటేశ్వరుని కొండపై కెక్కితే కొంతబలం ధైర్యం కల్గుననే ఆశలుండినవి.

ఎన్నోమారులు ప్రార్థనలు చేసుకున్నాం. సుప్రభాతం, దేవళంలోనూ, రేడియోమీదను విన్నాం. ఆనందం, ఆవేశం పొందినాము. అన్నమాచార్యుని పాటను తంబురమీద యేకాంత సేవలో పాడుతూవుంటే, మా బిడ్డనో, తల్లినో, తండ్రినో, నిద్ర బుచ్చుతున్నట్లే గొప్ప ఆనందాన్ని అనుభవించినాము.

ఎన్నెన్నో దేశాలలో "టూరు" చేస్తూ విశ్రాంతి పొందుతూ వుంటిమి. కాని మేమిద్దరం ఆ యిరవై రోజుల తిరుమల విశ్రాంతి ప్రార్థనల సంయోగమందు అందుకోగల్గిన ఆనందం అనన్య సామాన్యమైనది. ఆ యనుభవాన్ని ఎన్నెన్నోమారులు తలుచుకుంటూ గొప్ప తృప్తిని పొందుచుండేవారము

జమీందారీ రైతు వుద్యమమందు మా అనుచరులుగా వుండి, అప్పుడు, ట్రస్టుబోర్డు అధ్యక్షులుగా వుండిన శ్రీ అప్పల నరసింహారావు మా కెంతో ఆదరణ అందించిరి. మా సోదర ప్రాయులు, మమ్ము తమ కుటుంబపెద్దలుగా పూజించుకొన్న సుబ్బయ్యనాయుడుగారు మాకు తన పెద్దకారునిస్తూ తాను చిన్న కారులోనే సాగిపోతూ వుండిరి ఆ సమయాన నిర్మాణ కౌశలము, వ్యవహార దక్షత నిండుగా కల్గిన, పూర్వాశ్రమంలో పచ్చయప్ప కళాశాలలో విద్యార్థిగా వుండిన శ్రీ అన్నారావు ప్రధాన దేవాలయాధి కారిగా వుండిరి. రాజేంద్రప్రసాదు మంటపం ప్రక్కనున్న స్థలాన్ని, మంత్రులెవ్వరు తమ బంగళాలకై ఆక్రమించుకో నివ్వరాదన్నారు భారతీదేవి. దానిపై, అంతస్థులవారీగా, చిన్ని చిన్ని పార్కులువేస్తే, తీర్థ యాత్రీకులు విశ్రాంతి పొందుటకు ఉపయోగించుకున్నారు, ప్రక్కనే సుందరంగా, పునరావాసము

చేస్తున్న, చంద్రగిరి భూముల దర్శింప చేస్తున్న మంటపమందు కూర్చునే యాత్రికులకు ఈపార్కు లవసరమన్నాము మేము. మా సలహాలను అన్నారావుగారు అంగీకరించిరి. వాటికి కార్యరూపము కల్గించిరి.

అచ్చటకి అన్ని జిల్లాలనుండి అన్ని వర్గాల ప్రజలు, వారి నాయకులు, సేవకులు, రాజకీయ ధోరణులవారు వస్తూవుంటారు. కనుక, వారితో కలియుటకు, చర్చించుటకు, సంతోషంగా వారి వారి సాంఘిక పరిస్థితులు తెలుసుకొనుటకు గొప్ప అవకాశం కల్గుతుంది. వివిధ సభలు సమావేశాలు పేరుపెట్టుకొనకుండా, తిథి వారాలతో నిమిత్తం లేకుండా జరుగగలవు. అలాగే రైతు, కూలీ, చేనేత, పారిశ్రామిక నాయకులు మమ్ము కలుసుకొనిరి. చిత్తూరు, కడప, నెల్లూరు జిల్లాల రైతు కూలీ నాయకులు, సేవకులు వస్తూవుండిరి. పాకాలనాయుడు, రాజగోపాలు, వెంకటకృష్ణయ్య, రాజన్, మరెందరో చేరుతూవుండిరి. ఏ పది పెళ్ళిళ్ళలోగాని అందనంతమంది స్త్రీలు, వివిధ అంతస్థులలో వయస్సు హోదాలలో వుండే స్త్రీలు ఆ యిరవై దినాలలో భారతదేవిని కలిసిరి. ఎన్నో విషయాలు చర్చించుకొనిరి. వారి కుటుంబాల సమస్యలను పరామర్శించిరి. ఎవ్వరెవ్వరి కెట్టి కష్టసుఖాలను వెంకటేశ్వర్లు స్వంత తండ్రిలాగా, తల్లిగా, పెద్దన్నయ్యగా, ప్రార్థన సమయాలలో, నిద్రలో, కుటుంబ సమావేశాల్లో హృదయ పరివర్తన కల్గించి, రక్షణ అందించిరో తెల్పుతూవుండేవారు. తిరుమలమీద, బోడిగుండ్లవారిదే పై చేయి. అందునా, వారిలో విద్యార్థులు, యువకులకే మెజారిటీ! అమెరికా, యూరపు దేశాలలో ఆ వయస్సువారు కుటుంబ, సంఘ మర్యాదల నెదిరిస్తూ తమ కోట్ల సంపదలరోసి, వెర్రి వెర్రి వేషాలు వేస్తూవుండటంలో పోటీలు పడుతుంటే, మన వెంకటేశ్వర విశ్వరూప వాతావరణమందు విహరించు భక్తులలో యువకులు, విద్యార్థు లధికులగుట



ఆనందమయ ఆశ్చర్యమే కల్గించుతుంది. ఎందుకొస్తున్నారు వీరంతా? ఎందుకు తలలు బోడులు చేయించుకొంటున్నారు?

బాపట్లనుండి స్వాతంత్ర్య వీరుడు, రైతుకూలీ ఉద్యమ నాయకుడు శర్మగారు వచ్చిరి, తన బిడ్డలతో! పాఠాలు బాగా రావాలని వొక్కరు, పరీక్ష పాసై తినని యింకొక్కరు మొక్కులు తీర్చుకోడానికి తిరుమల పోయి తీరవరసిందే నన్నారట! అలాగా పెళ్ళిళ్ళు కావాలనుకున్నవారు, చేసుకొన్నవారు, బిడ్డలు కోరినవారు, పొందినవారు ఎన్నికలలో జయం బొందినవారు, వోడిపోయినవారు అందరు వారివారి మనశ్శాంతి, సంతసము, ఆత్మబలం, శక్తికొరకై, పుట్టెడంత విశ్వాసముతో వస్తూనే వుంటారు. 1928లో నాపుట్టుకకు చేసుకొన్న మొక్కును చెల్లించుటకు మా అమ్మమ్మ హెచ్చరిక చేసినా నేనొప్పుకోలేదు. తుదకు 1962కు ఆమె కోరికను, తల్లి తండ్రులు మననం చేసుకొన్న తలపులను తీర్చుటకు నాబుద్ర అంగీకరించ గల్గినది.

అంత ఆలస్యమునకు కారణము లెన్నో! పాశ్చాత్య దేశ సాంప్రదాయాలు "కలడు, కలండనెడివాడు కలడో లేడో" అనే ప్రశ్నలు "రాళ్ళు దేవుళ్ళయితే" అనే అలోచనలు! స్పుత్నిక్కు ఎగిరే, చంద్రునికే మనుష్యు లందుకోగల్గడం సాధ్యమగుచుండె. అణు శక్తిప్రభావం "అండాండంబులు అంతయు నీకై వింతలు" సలుపుచుండడం మన అనుభవములలోనికి వస్తూవుండె! కనుక అంతకు ఆధారమైన శక్తి అంతను చూస్తూ, నడుపుతూ, త్రిప్పుతూ, చేర్చుకుంటూ, విదళించుతూ, అంతను తానై వున్న దేదో, అది ప్రతిదినము యిన్నివేల జనాలను తన్మయుల చేస్తున్నది! ఇందరికి వారివారి శక్తికి మించిన శక్తినిస్తూ వారిని పోత్సహిస్తూ వారి భౌతిక, ఆధ్యాత్మిక అవసరాలను తీర్చుతూ, వుల్లాస పరుస్తున్న ఆ శక్తికి నమోవాకము లందించుట శాస్త్రానికి, సైన్సుకు, ఋషుల అనుభవానికి, భక్తులుబొందు హృదయ సాక్షాత్కా-

రానికి సరిపోవుననే విశ్వాసము కల్గుచున్నది. ఇంత శ్రమ లేకనే, సంశయాలను సృజించుకొని, విసరివేయగనే తరతరాల విశ్వాసము, వారి తల్లి భక్తి ప్రభావము భారతీదేవికి నిండైన నమ్మకము అందుచున్నది. ఐనా నాకును తనవలెనే అలాంటి విశ్వాసబలం కల్గువరకు ఆమె వోపికపట్టిరి. తుదకా యిరవై దినాల తీర్థయాత్ర ద్వారా, నేనును తనవలే, భగవద్భక్తియందే నిమగ్నుడనైతినని తృప్తి జెందిరి. "సర్వేజనా సుఖినో భవంతు" అనే నా అనుదిన ప్రార్థనలను భౌతిక లక్షణాలతో అందుకొనుటకు ఆదిశక్తిగా బైలుదేరి నిరాకారుడైన శివలింగముగా సాగి, సర్వశుభ ప్రదాయినిగా కన్పించ నేర్చిన వెంకటేశ్వర్లు, శ్రీ కృష్ణుని ప్రేమామృతమును అందరి కందించు తిరుమలయ్యా దర్శనమందు, మాటల కతీతమగు రీతి, చేర్చుకొనుట ఆమె కానందము కల్గించినది.

మనలాంటి లక్షోపలక్షల ప్రజలు వారి వారి బాధలనే పొరలను వదులుతున్నారు. కొత్త ఆశలు, ఆశయాలను ధరిస్తున్నారు. క్రొత్త కోర్కెలను పూరించుకొంటున్నారు. తప్పుల దిద్దుకోనుత్సాహితులౌతున్నారు. ఆర్థిక నైతిక శక్తి పొందజూస్తున్నారు. వారితో చేరుదాము. వారిని మనవారేనని అందుకొందాము, ఆదుకొందామన్నారు దేవీజీ.

మేము, తిరుమలకు ఆ తరువాత వెళ్ళినప్పుడు ఆ పార్కులలో తిరుగాడుతూ, అన్నారావు కార్యదక్షత, మా యిరవై రోజుల విశ్రాంతి జీవితమున కీవిధంగా యేర్పడిన జ్ఞాపకచిహ్నాలు చూచుకొని "దేవుని కిదే మన హారతి" అనుకొనేవారం.

తిరుమల యిప్పుడెంత సుందరమైన నగరాన్ని తన శిఖరముపై అందుకొన్నది. దాని సొగసు క్రొత్తగా నిర్మించబడ్డ గెస్టుహౌసు (విశ్రాంతి భవనం)పై నుండి చూడాలి! ఆబారులు తీరిన బంగారు కప్పుల భవనాలను చూచి భారతీదేవి ఎంతో ఆనందమును 1972 జూన్‌లో పొందిరి.



ఆజూను ప్రయాణానికి మేమంతా తయారైతిమి, ఆమె పెంచిన చి॥ సౌ॥ పుష్పకుమారి వివాహానికై. ఆమెను డాక్టర్ కె. యల్. నరసింహారావుకిస్తారు. ఆయన వెంకటేశ్వర విశ్వవిద్యాలయమందు. జీయాలజీ లెక్చరరు. గొప్ప సైంటిస్టు. ఆమె సోషలు వర్కు, సోషియాలజీలో గుల్బర్గా మహిళా కాలేజీలో లెక్చరరు.

నేనేమో రైలుప్రయాణం చేస్తాను. తాను మా కారులో తిరుపతివస్తే బాగుండునని సూచించినా. దూరప్రయాణం కారులో నాకు బాధయని వారెరుగుదురు. ఐనా, "కలిసే పోదాము. నిదానంగానే ప్రయాణం చేదాం. మీరు తోడుగావుంటే మన సుశీల బిడ్డ డా॥ కమలేంద్రకుమారు కారు నడుపుతూవుంటె పిచ్చాపాటి మాట్లాడుకొంటూ, ఏవేవో వ్యవహారాలు చర్చించుకుంటూ వుందాం. అసలు యేప్రయాణమైనా మీరుంటేనే కులాసా" అన్నారు. కలిసే వెళ్ళాము.

తిరుమల మీద వొక రాత్రి, పోయిన దినం మరునాటి ఉదయం వున్నాం. రెండుసార్లు శ్రీ వెంకటేశ్వరుని దర్శించినాం. గుప్తగారి హోటలులో, వారి అతిథులుగా చక్కటి భోజనాలు యేర్పాటు చేసిరి. ఆ భోజనాలు తృప్తిగా ఆరగించినారు. పేరు పేరున వొక్కొక్క ప్లేటు తలుచుకొంటూ! ఇష్టమైన భోజనాలను ఆరగించునప్పుడు, ఆమెనే చూడాలి, రాజాజీనే దర్శించాలి. అదొక ఆనందమయ అనుభవం. క్రిందికి బైలుదేరబోయేముందు, క్రొత్తగా నిర్మించబడ్డ గెస్టుహౌసుకు వెళ్ళితిమి. అచ్చటి ఐరోపీయ వసతులన్నీ చూచి, కొంతగా అనుభవించి ఆక్స్‌ఫర్డులో వుండిన భారతీవలె, పరిపక్వత పొందిన యీనాటి భారతీయ దేవివలె ఆనందించిరి. తిరుమలను ఆకొండల ఎత్తుననుండి, అటు యిటూ సాగుచున్న భవననిర్మాణాలు, క్రింద పెరుగుచున్న పార్కులు, అన్నిటికి ప్రాణంపోస్తూ: వేలాది భక్తు

లను, అఖిలభారతమునుండి ఆకర్షిస్తున్న శ్రీ వెంకటేశ్వరుని ధగ ధగల శిఖరాల చూస్తూ గొప్పతృప్తి జెందుచుండిరి. ఆమెవంక చూస్తూ నేను ముగ్ధునైపోతిని! అదొక యోగదృష్టి. అందేదో మాటలకందని ధ్యానమువుంది. ఆమె ముఖవర్చస్సులో గంభీరమగు ముద్రవుండె! తానీ లోకములోకి వచ్చిరి. ఇటు చూడగా నేను తనవంకె చూస్తున్నట్లు గ్రహించిరి. మందహాసము చేసిరి. "ఏ లోకములోకి ఎగిరిపోయి"రంటిని. ఫక్కున ఆనందంతో నవ్విరి. నాభుజాలపై చేయివేసిరి. ''నన్ను చూస్తూనేవున్నారా?'' అంటూ సిగ్గుజెందిరి. అలాంటి సమయాల్లో ఆమె నాకందించే ఆనందం యెంతో.

ఆక్రిందటిరాత్రి వొక మధురమగు అనుభవం. క్రొత్తగా మూడు నాల్గు అంతస్థులుగా, సన్నని, పొడుగాంటి పార్కుల నేర్పరచిరి. అన్నిటికిపైన ఆ చిన్నకొండ శిఖరాన జాజ్వల్య మాన మగు కాంతులతో, విష్ణునామాలను నిల్పిరి. ప్రక్కనే సీతారా ముల చక్కని శిలా విగ్రహాలను నిల్పిరి! భక్తులకేగాక, అందాల నెరిగిన వారందరికి వుల్లాసము కల్గించు దృశ్యమది! అచ్చట భారతీ దేవి చాల తృప్తిజెందిరి. మేమిద్దరం ఎంతో ఆనందం బొందితిమి.

తిరుపతిలో పుష్ప వివాహం సొగసుగానే జరిగినది. మా అభిమాన మేనల్లుడు కొంగ్రొత్తవయడు సుబ్బారావు, ఆయన వధువు ఉమా పుష్ప పెళ్ళిలో పెత్తనం చేస్తున్నారు. ఆ నల్గురు కొత్తగా వివాహితులు. పెద్ద విశ్వవిద్యాలయ డిగ్రీలు పొంది నిండు వయస్కులై ముద్దు ముచ్చటలు పొందగల్గు యోగ్య తలు గలవారై వుండటం మా యిద్దరికి తృప్తిగా వున్నది. ఆ 1920–25లో 'అతిబాల్య వివాహములు వద్దు' అనటం గొప్ప విప్లవాత్మక నినాదం! పెద్ద చదువులు బొందిన ఆడబిడ్డలనే పెళ్ళా డాలనుకోవటం వూహించజాలని ఆశ! ఇప్పుడో భారతీదేవియే



పెంచిన సుశీలాదేవి, ఉమా ఎం. ఎ. ప్యాసగుచూ, పుష్ప ఎం.ఎ. ప్యాసై లెక్చరరుగా వుంటూ, పండితులైన భర్తలను పొందగల్గు చున్నారు. ఇదంతా అభివృద్ధియేకదా? అందునూ, రైతాంగ వర్గ ములో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయములోని ప్రొఫెసర్లు, రీడర్లు, లెక్చరర్లు ఎందరోవచ్చిరి. వారిలో హెచ్చుమంది రైతు సంజాతులే! ఆ విశ్వవిద్యాలయ ప్రథమ వైసుఛాన్సలరు శ్రీగోవింద రాజులు పూర్వీకులు రైతులే. ఆర్థిక శాస్త్ర ప్రొఫెసర్ డి.యల్. నారాయణ మా బంధువులే! అచ్చటి యం. ఎల్.ఎ శ్రీ ఈశ్వర రెడ్డి కూలీలనాయకులే. అలాగా విశ్వవిద్యాలయ పాండిత్య ప్రకాండులను క్రిందటి అర్థశతాబ్దిలో పెంచుకోగల్గిరి మన రైతు కూలీలు అని మేమిద్దరము తృప్తిపొందినాము. ఐనా జనసామాన్య మింకా చదువులు లేక, నిండు తిండిలేక, అప్పుల భారాలతో, సాంఘిక అన్యాయాలతో సతమతమవుతున్నారే–అనే బాధ అనవ రతం పీడిస్తూనే వుంటుంది. "అందుకో దరిద్రనారాయణుని! రక్షిం చుకో, చేదుకో నీ బంగారు కొండపైకి, సాంఘికన్యాయ శిఖ రాని''కని మేము ప్రార్థనలు చేసుకొంటాము

గోభూమికి తిరుగు ప్రయాణం చేయాలిగదా! రైల్లో రావా లనిపించింది నాకు! ఆమె అందుకు వొప్పుకోలేదు. ఎలానైనా తమతో కారులోనే రమ్మన్నారు. నెమ్మదిగా చెప్పిరి. "మీరు తోడుగావుంటే, దారిలో యెదురయ్యే మీ మాటలు, కేరింతలు ద్వారా దారిలో యెదురయ్యే మనుష్యులు, చెట్లు, చేమలు, ఏవేవో ప్రాణం పోసుకొని, మా కందరికి వుల్లాసంగా కన్పడత వండీ. అలాగే యీ తిరుమల కొండల అందం మా కెంతోగా అందినది. చెట్లను, పిట్టలను. లోయలను, ఆ యెర్రరాళ్ళను, రోడ్డు మలుపులలో పరుండు గోవులను మేమూ చూస్తాము. వాటిని, వారికి వీరికి చూపెట్టుతూ, సొగసైన మాటలతో హృదయాలను వి[illegible]పజేసేది మీరుకదా! అలాగా, దారిపొడవునా, ఎన్నెన్నో

సౌందర్యాలను కొత్త కొత్త సామ్యాలతో మా దృష్టికి మీరే తేవాలి. మేమే అనుభవించాలి కదా!" అన్నారు.

"ఎన్ని పరియాయములో ఆలాగా ఆ యేడుకొండలనూ ఆనందించినాము. రెండు మూడు వందల మీటర్ల రోడ్డు పరిసరాలను పరామర్శించాముగదా" అంటున్నా కరిగిపోతున్న మనస్సుతో!

"అదంతా నిజమేననుకోండి. ఐతే యీ ముద్దు ముచ్చటలతో నిండుకున్న యీ మనుమడు, మన కమలేంద్రుడు కారు నడుపుతుంటే సొగసు కాదా! జ్ఞాపకముందా, 'కుమార్! తాతయ్య ఆనీ చిన్ననాడు దారి వెంట వస్తూన్న దిరిశెన చెట్లను, పుష్పాలను చూపెట్టుతూ, కాళిదాసు కవిని గురించి చెప్పేవారు! ఆ చిన్ని కాల్వల వంక నీదృష్టి త్రిప్పుతూ అవ్వి పెద్ద కాల్వలనుండి వస్తాయని, అవ్వినదినుండి సాగుతాయని చెప్పేవారు, 'ఈనీరు ఎందుక' న్నారు. ఈ చేలలోకి తిప్పుకోడానికి, చేలను తడుపడమెందుకు? 'చూడు, చూడు! ఆ రైతులు దమ్ము చేస్తున్నారు? ఇక్కడ నాటు వేస్తున్నారు 'ఎందుకు?' 'పంటల కొరకు?' ఏమేమి పండిస్తారు? ఆహారం మనకు యీపంటలద్వారా వస్తుంది! అందరం బ్రతికేది యీ ఆహారం వల్లనే! ఇది అంతా ఇచ్చేది ఎవ్వరు? నీవు 'రైతు' అన్నావు. నేను 'భూమి' అన్నా! తాతయ్య 'యిద్దరూ' అన్నారు 'పశువులో?' అన్నారు మీ అమ్మ! 'వీళ్ళందరికొరకే తాతయ్యా, దేవీజీ పనిచేస్తున్నారు' అన్నారు మీనాన్న. ఇలాగా మాటలు సాగుతూవుంటే రోడ్డు వెనుకకు పోతుంటే, గోభూమిదగ్గరౌతుండేది" యింకా చల్లచల్లగా ఆనందం కల్గే మాటలు సాగిస్తూ ఆ తిరుపతిలో దేవస్థానంవారి బంగళాలో వుంటిమి.

అంత ప్రేమతో వారు అడిగితే, నేనెట్లా నా సౌకర్యము కొరకే రైలులో ప్రయాణం చేయగలను?



అందరం కారు ప్రయాణమే చేశాము. తిరుపతి వదలుట తోడనే, ప్రక్కనవున్న గంభీరమగు ఆ నల్లరాతి గ్రామదేవతలను మరొక పర్యాయము చూచుకొన్నాము.

గూడూరులో, కుమార్ నాన్న ఉమామహేశ్వరరావు తమ యింటికి తీసుకెళ్ళిరి అన్ని సపర్యలు అందుకొంటిమి. అప్పుడే తన కుమార్, రంగతాతయ్యను కుప్పం నుండి మద్రాసు వరకు కారులో భద్రంగా చేర్చినాడు 1964 లోనే తాను జ్వరంలో వుంటూ అని ఉమామహేశ్వరుని అభినందించిరి.

దారిలో సువర్ణముఖిచే పరచబడిన యెర్ర బంగారవు యిసుకల జూస్తిమి. అలా నదుల కోతలవల్ల భూములు యిసుకమయం గాకుండా ప్రభుత్వం చేయాలనుకొంటిమి. నెల్లూరులో కీ॥ శే॥ రామానాయుడుగారి "జమీన్ రైతు" పత్రికలో మా సారధి కుటుంబమును చూచుకోడానికి సమయం లేదన్నారు కుమార్. "బాధతో, కారును నడిపేదినీవుకదా?" అన్నా మనస్సులో నాయుడు గారు అదేపనిగా మెదలుతున్నారు పట్టుకోలేక అన్నా "నాయుడు మాటల్లో యెంత చమత్కారము ఉండేదో, వారి వ్రాతల్లో మరెంతో చురుకు, వేగముగ దొర్లేది." అన్నా. తాను కల్పించుకొని" వెంకటగిరి రైతు సత్యాగ్రహోద్యమ సందర్భములో వాళ్ళు రాళ్లువిసరగా నాతలనుండి బొటబొట రక్తం కారింది. అది చూచి ప్రతారుద్రీయ నాటకంలో. పిచ్చివాడి వేషంలోవున్న యుగంధరుడెట్లా, ఢిల్లీసుల్తానుపై శాబ్దిచేసిరో, అంతరోషంతో 'భారతీదేవి రక్తాన్ని చిందించిన యీ కరకు జమీందారీ రాక్షసిని రక్షించే వారింకెవ్వరు? ఎక్కడున్నారు?' అని గర్జించిరానాడు మన నాయుడు "ఏడి మన నాయుడు?" అన్నారు.

"నాయుడు రైతుల్లో వున్నాడు. మనలో చేరియున్నాడు. జమీందారీ పెత్తనం పోయింది. ఆపైనవున్న మహారాజుల పెత్తనంకూడ పోయిందిలే!" అన్నా.

"తుదకు వాళ్ళందరికీ పెన్షన్లుకూడా పోయినవిగా!" అన్నారు మా విజయ! "అదేమంచిది. చూచినాగా. ఆ మహారాజులు, మహారాణులను మన సరసనే! ఎన్నాళ్ళు మనడబ్బుతో వారి సొగసుల నిల్పడం. అందుకే వారెంతగా కోరినా రంగాజీవారి తరఫున పార్లమెంటులో మాట్లాడనన్నారు! ఎంత నిబ్బరంగా వుండినారో!"

రామానాయుడుతో. జమీందారీ రైతురక్షణకై పొందిన ఎన్నెన్నో అనుభవాలు, స్మృతి పథానికొచ్చినవి. దేవిజీ నాయుడు గారిని తలుచుకుంటూ కళ్ళనీళ్ళు పెట్టుకొనిరి. నాయుడుగారికి భోజనం పెట్టడం దేవుళ్ళకండే ఆనందమన్నారు 'వద్దు వద్దం'టూ, వడ్డించేవారికి విసుగు కల్గిస్తారు రంగాజీ "ఎంతబాగున్నదండీ మీ వంట యీ వంకాయకూర భలేబాగావున్నది. ఆవకాయ మరీ బాగున్నది. మీ పెరుగు, మోపూరుపెరుగు, రాజుల పెరుగు, అబ్బ, యింకా కావాలనిపిస్తుంది. "అంటూ నాయుడుగారు భోజనం చేస్తుంటే, వంట చేసినవారికెంతో గర్వం గల్గునన్నారు. "నాకేమో నాయుడుగారు తమలపాకు కట్ట క్రమంగా నములుతూ, సున్నమంతా తరిగివేస్తూ, కబుర్లాడుతుంటే ఆనందమమ్మా!" అన్నా. "నాకూ అంతే" అన్నారు

అచ్చటినుండి వంగోలులో వాలితిమి కీ॥ శే॥ ఆళ్ళ వెంకట సుబ్బయ్య కుటుంబాన్ని యోదార్చితిమి. ఆయన రైతాంగానికి, శ్రీనాగినేని వెంకయ్యగారికి అండగావుండి, చేస్తూవుండిన సేవలను తలంచుకొంటిమి.

జర జర, సమర్థవంతంగా కారును నడుపుతునాడు, గిర జాలు పెంచుకుంటున్న మనవడు కుమార్!

అన్ని కబుర్లు వింటూ, దేవీజీ ప్రక్కనే బంగారుకాంతుల నందిస్తూ వున్నారు ఆమె మనుమరాలు విజయలక్ష్మి! కలిసే వస్తు



న్నారు ఆమె భర్త నాగేశ్వరరావు! వయస్సులోవున్న ఆ దంపతులు, పండుచున్న మా దంపతుల "ఎవర్ గ్రీన్" లేక ఆరని తీరని వసంత దాంపత్య సౌరభాలు, సరసాలకు ముచ్చట పడుతున్నారు కాబోలు! ఈ పెద్దలవద్ద తమ దాంపత్యసుఖానుభూతులకు మెరుపులు దిద్దుకొంటున్నారో! ఏమో! తమ చిరునవ్వులతో సేవలతో మా ప్రయాణాని కొక శోభ! ఎంతో సుఖం అందించుతూ వుండిరి.

అలాగా చేరినాము గుంటూరులో, పాతపట్టాభిపురంలో నున్న, కుమార్ తల్లి భారతీదేవి పెంచిన శ్రీమతి సుశీలవద్దకు! ఎంతో ఆప్యాయంగా సుశీల ఆతిథ్యాన్ని అందుకున్నాం. దేవీజీ వంట ఎంతరుచో, సుశీల వంటలు, సపర్యలు దేవిజీనే తిరిగి అందిస్తవి. ఐతే సుశీల మాటలు కృష్ణవేణమ్మ ముత్యాల మూటలే.

గుంటూరు నుండి గోభూమికి గంటలో నాగేశ్వరరావు కారు నడుపగా వచ్చేసినాము. "ఏమండీ, అలసితిరా!" అడిగారు నన్ను. "మీతోవుంటే అలుపుండునా?" అంటిని. "రానే అంటిరే!" "అలా అన్నాను కాని మీతో ప్రయాణం చేయటంకంటె సుఖం మరెక్కడుంది" అన్నా! అదే మాసుదీర్ఘమగు ప్రయాణం! చివరి తిరుమలయాత్ర. అట్లగునని మాకు తెలియదు. అదే జీవితపు బాధామయ రహస్యం.

ఆ పిమ్మట మూడు నెలలకు వారీ లోక ప్రయాణమునుండి విరమించిరి

ఆమెకు ఆ తిరుమలేశ్వరుని దర్శనమే తుది దర్శనమైనది. అదే మేమిద్దరం కలిసి చేసుకొన్న, నడుపుకొన్న, అనుభవించిన సుదీర్ఘమగు ప్రయాణం, యాత్ర, సరససల్లాపాల, అచ్చట్లు ముచ్చట్లతో కూడిన అనుభవం.

అలాగగునని కలలోనైనా వూహించితినా? ఆమెకు కొంతగా తెలియును. అప్పుడప్పుడు హెచ్చరికగా కాక, మాట వరుసలో అన్నట్లుగా అంటూవుండేవారు. "ఇంకెంతకాలమో! ఇన్ని బాధల భారం యింకెంతగా మోయటం!" అంటూ!

జరిగిన అనుభవాన్ని తలచుకుంటే ఆమె కొంతగా తెలుసుకొనే, నన్ను అంత పట్టుదలగా, ప్రేమగా తనతో ఆ రాను పోను దీర్ఘ ప్రయాణం, తనకు ప్రాణప్రదులగు సుశీల, కుమార్, విజయలక్ష్మి, నాగేశ్వరరావు, ఉమామహేశ్వర రావులతో చేయించిరని పిస్తూవుంది. అదొక మహత్తరమగు అదృష్టం. ఆనందమయ అనుభవము ఆలాగా అందుతుంది. భూమిమీదనే స్వర్గం. మన కెరుకలేకనే ఆయా సమయాలలో!

—:o:—

# యోగులు - మనదేశపు నైతిక సంపద

మన నాగరికతా సాంప్రదాయమే అభ్యుదయ దాయకమైనదని పాశ్చాత్య దేశాల యువజనులు, పండితులు, మనః శాస్త్ర పారంగతులు కవులు రచయితలు హెచ్చుగా యీ నాల్గు దశాబ్దములనుండి గ్రహించుకుంటున్నారు.

ఆటంబాంబు, న్యూక్లియరు శక్తి చంద్రలోకం, ఆపైనున్న లోకాలలోనికి పోయి రాకెట్లు, స్పుట్నిక్కులు, వాటిని ఆధారపరుచుకొన్న శాస్త్రం, శస్త్ర సంపన్నులు అనుభవములోనికి వస్తున్నకొలది, ఇన్ని శాస్త్ర, విజ్ఞాన, విద్యుశ్శక్తులకు మించిన యోగశక్తి పొంది, యేఆర్భాటము లేకనే, ఎన్నియుగాలనుండో మనదేశములో మన ప్రజలనుండే పైకెదుగుచూ, మన జనాలనుద్ధరించుటకై తపస్సు చేస్తున్న, యోగులు, యోగినులపై భారతీదేవికి గొప్ప అభిమానం, భక్తి కుదురుకున్నవి.

త్రికరణ శుద్ధిగల భక్తులు; యోగులు, మహాత్ములు అంటే ఆమెకు గొప్ప గౌరవం, భక్తి, యిష్టము! వారు సన్యసించవచ్చు గృహస్థులుగా వుండవచ్చు. ఆశ్రమములలో వుండవచ్చు. బైరాగులుగా తిరుగుతూండవచ్చు. భార్యా, భర్తలు, బిడ్డలతో సంసారములు సాగించుతూ వుండవచ్చు. మన రాజగోపాలు, గోపదేవు, సాధు సుబ్రహ్మణ్యం, తులశమ్మ దంపతులాంటివారెందరో?

శ్రీమతి పొణకా కనకమ్మ వారికి జైలులో పరిచయమయ్యిరి. ఆ పిమ్మట వారి స్నేహితము మధురమైనది. కనకమ్మగారికి తిరువన్నామలే యందున్న రమణమహర్షి మనుష్యరూపమున వున్న భగవానులే. అటులే మా కాలేజీకి ప్రిన్సిపాలుగావచ్చిన పండితులు శ్రీ గుఱ్ఱం వెంకటసుబ్బరామయ్యగారికిని. కనకమ్మగారు దేవిశీని తిరుమన్నామలేకు తీసుకువెళ్ళిరి. మహర్షిని, వారి శిష్యులు రామయోగిని దర్శించిరి. వారితో సంభాషించిరి. తృప్తిచెందిరి. మహర్షి భారతీదేవికి ఆదర్శమూర్తి శ్రీ సుబ్బరామయ్య గోభూమికి వచ్చి మహర్షి బోధనలను దేవికి గుర్తుచేస్తుండేవారు. మా శిష్యులు శ్రీ కే. సభామహర్షి బోధనలను ప్రచురిస్తున్నారని ఆనందం బొందేవారు.

వినయాశ్రమంలోనే ఐదుగురు స్వాధర్మ జీవులున్నారనేవారు. స్వామి శీతారాం, తుమ్మల బసవయ్య, వారి భార్య దుర్గాంబ, తత్వానందస్వామి, మద్ది రంగయ్య.

ఆయాశ్రమానికి సీతారామశాస్త్రిగారు, కురుమద్దాలలో హరిజనులుగా జన్మించి, మహాయోగినిగా వెల్గుచుండిన పెద్దమ్మ అనే పిచ్చమ్మగారిని తీసుకువచ్చిరి. తత్వానందస్వాములు (కొండపర్తి పీరభద్రాచార్యులు) ఆమె మహత్తు గురించి భారతీదేవికి చెప్పిరి. ఆశ్రమానికి మా సుశీలను తోడు తీసుకొని వెళ్ళి, ఆతల్లిని కలుసుకొనిరి. ఎన్నోసారులు ఆ పిచ్చమ్మగారి యోగముద్రనుండి వెల్వడుగుచుండిన బోధలను తెలుచుకొంటూ వుండేవారు. రేపల్లె నుండి ఎన్నో సంవత్సరాలు వారు మౌనవ్రతులుగా వుండిన చిన్నమ్మ వచ్చిరి.

ఆమె మాటలు అమృతములో ముంచి నెమ్మదిగా అందించే ముచ్చెవు కణికలు. గోభూమికి వారు రెండు పర్యాయములు శిష్యులవెంట వచ్చిరి. ఆమె భర్త, బిడ్డలుకూడ వారి భక్తులైరి. అంతటి తల్లికే, తనకువలెనే, దద్దుర్లభాధ కలుగగా, ఆమె



ఇదంతా, యీ జన్మయందే తీర్చుకొనే ఋణమండీ అన్నారట వారి గురించి ఆంధ్రప్రభలో నేను వ్రాసినందులకు భారతీదేవి ఎంతో తృప్తి చెందిరి.

తూర్పు గోదావరిలోని ముమ్మడివరం పెద్ద బాలయోగిని వారి సోదరులైన చిన్నబాలయోగిని చూచుటకు ఎంతో, కాలమునుండి మా యిద్దరి కోరిక. ఆమె మాత్రం మనుమరాళ్ళు విజయలక్ష్మి, అనసూయలతో కలిసి వెళ్ళి దర్శించకల్గిరి. అవి చలిరోజులు. అచట గొప్ప జనసమర్థము. ఎంతోసేపు నిలువుకాళ్ళమీద ఎంతో బాధతో నిలిచి వారిని చూచిరి. ఆ స్వామీజీ అన్నం, నీరు లేకుండ గాలిమీద ఆధారపడుచు దశాబ్దాల తరబడి అలాగ వుంటుచున్నారు. కళకళ లాడుచున్నారట. అంతటి, అలాంటి తపస్సు విశ్వకళ్యాణముకొరకేగదా! అలాగే అరవిందయోగి తపస్సుచేసిరి. అయితేవారు బోధించిరి గ్రంథముల ద్వారా, బోధనల ద్వారా, విజ్ఞాన శాస్త్రజ్ఞులకే అందు చదువులలో భోదించుట ద్వారా. వారిని చూడలేకపోతిమే అనుకొనేవారము.

అందినవారు మా యిద్దరికీ శ్రీ సత్యసాయిబాబా. పుటపర్తి రాళ్ళనుండి రత్నాలకు మించిన దీధితులుకలిగిన పాటలు, మాటలు భజనలు సర్వజనాలకు సుబోధముగు చైద్యముల ద్వారా అందిస్తున్నారు. మాఅమ్మాయి కమల (అచ్చమాంబ) వారికనుంగు శిష్యులలో ఒక్కరు. మేము వారిద్వారా విభూతి నందుకొంటిమి. వారి గానామృతమును గ్రోలితిమి. వారినే భగవానుగా భజించుచున్న ఆధునిక శాస్త్రపరిశోధనా పండితులైన భగవంతముగారు భక్తిపారవశ్యులై యుండగా చూచితిమి. భారతీదేవి తన కమలమ్మతో కలసి అనంతపూరులోని పుటపర్తికివెళ్ళిరి. అదొక ప్రధాన ఉత్సవ సమయము. విభూతి వెల్లులు ప్రోవులుగా పైకెగురుతూవుంటే స్వామి హస్తమునుండి వుబుగుతూ అందుతూవుంటే చూచు

కుంటూ తాను యోగముద్రను అందుకోగలిగితిమనిరి. అది నిండైన విజయదశమి.

స్వామి వివేకానందులు ఎలాగ రామకృష్ణ మిషను ద్వారా ఎన్నో కాలేజీలు, ఆస్పత్రులు, సేవాశ్రమాలు అవతరించుటకు దారి చూపిరో అటులే శ్రీ సత్యసాయిబాబా అనంతపూరులో, బొంబాయిలో, పుటపర్తిలో సాధారణ కళాశాలలను, భారతీయ విద్యాభవనములను మించునట్లు సంఘసేవా పరాయణులుగా విద్యార్థుల తయారు చేయగా ప్రయత్నిస్తున్నారు. అంతకుమించి యోగశక్తిం. భక్తిమార్గమును, ముద్రను పొందకల్గుటకై తన శిష్యుల తర్ఫీదు చేయుటకై కళాశాలల నడుపుచుండుట ఆమె కెంతో నచ్చినది.

హరిద్వారము, ఋషీకేశం వెళ్ళితిమి. ఆంధ్ర ఆశ్రమాన్ని ఋషీకేష్‌లో ఎంతో శ్రమచేసి నిర్మించిన ఆంధ్ర తపస్వి, సరస్వతీ స్వాముల ఆతిథ్యమును పొందితిమి. వారిద్వారా స్వామి శివానందులను దర్శించితిమి. వారి ప్రార్థనలలో పాల్గొంటిమి. వారు తమ పుస్తకాలను మాకందించు భాగ్యము పొందితిమి. వారి ఆశ్రమమును స్పృశించుతూ, గంగానదీమ తల్లి పాటలలో, శివానందుని పాటలు చేరుతూ, మా కుల్లాసము కలిగించుచున్న వనుకొనిరి

మా దగ్గిరలోనే వున్న జిల్లెళ్ళమూడిలో ఆదర్శ గృహిణిగా, ప్రేమమూర్తియగు తల్లిని దర్శించితిమి. భారతీదేవి నిర్యాణానంతరము నేను వారిని చూచితిని. ఆమె యెప్పుడు తనను కలుసుకొనెనో యీ అమ్మ గుర్తుచేసిరి. ఇట్టి తల్లులు ఎందరో వున్నారు. మరెందరో కావాలి. అట్టివా రుండబట్టి, మన జాతీయ సంసారం ఇంతగా నిలుస్తూవుందని భారతీదేవి నమ్మకం.

స్వామి చిన్మయానందులు హైదరాబాదులో బావాజీ మందిరమందు గోపదేవు రామానీడు విద్యాలయములో యిచ్చిన



భగవద్గీతోపన్యాసములను ఆమె ఆసక్తితో ఆనందించిరి. చిన్మయానందుని ఉపన్యాసములు, బోధనావిధానములు వారికెంతో సంతృప్తిని కల్గించినది. చదువుకొనని వారికి స్వామీజీ ఉపన్యాసములు రతనాలవంటి వనుకొనేవారు.

శ్రీయుతులు వున్నవ లక్ష్మీనారాయణ, తత్వానందస్వామి, కొండా వెంకటసుబ్బయ్య, స్వామి శీతారాం, దేశోద్ధారక నాగేశ్వరరావు, డాక్టరు భగవానుదాసు, అనిబిసెంటమ్మను కర్మయోగులుగా జూచుకొనేవారు.

యెగుడు దిగుడు రాజకీయాలలో అంతగా యోగులుగా వుండినందులకు వారిపై యెంతో భక్తి.

యేర్పేడులో మళయాళ స్వామీజీ ఆశ్రమాన్ని యేర్పరచిరి. జైలుకుపోయివచ్చిన కొందరు స్వాతంత్ర్య వీరనారీమణులు కూడా వారి శిష్యులైరి. ఖద్దరునే ధరించాలనీ, అస్పృశ్యతను తొలగించాలనీ, ఆయన బోధించుచుండిరి.

రేపల్లె తాలూకాకు చెందిన వొక బీదరైతు బాలుని వారు చేరదీసిరి. శూద్రులనే బేధభావము పొందక, రైతుబిడ్డని పండితునిగా, జ్ఞానిగా, తుదకు. విమలానందస్వామిగా రూపొందించి, తాము సమాధిలోనికిచేరిరి. ఈ వుదంతములు దేవికి ఎంతో తృప్తి కల్గించినవి. స్వామీజీలంతా అలా వుండాలనుకొనిరి.

శ్రీ బ్రహ్మానందస్వాముల గంభీరసంభాషణలను వినిరి.

పెనుమత్స యోగినిని ఆమె దర్శించిరి

శ్రీ పొట్టి శ్రీరాములుకు గోభూమిలో అతిథ్యమివ్వగల్గటం వారు నాతో ఆంధ్రదేశ సంచారము చేయడం, నేను వారి హరిజన సేవాకార్యక్రమమును బలపరచడం దేవీజీకి యెంతయో ఆనందమును కల్గించినది.

యోగులు, యోగినులు, ఋషులు, మహర్షులు, ధర్మాచరణ దంపతులను దర్శించుటే మహత్తరానుభవ మనుకొనేవారు. త్రికరణ శుద్ధిగల భక్తులు, యోగులను ప్రత్యేక శ్రద్ధతో కలుసుకొను చుండేవారు. అట్టివారు ఆదర్శమూర్తులు. పుస్తకాలలో వారి గురించి చదువుకొనగల్గుటయే అదృష్టము. వారిని స్వయంగా చూడగలుగుట మరింత భాగ్యము. వారివలె జీవించాలని, ప్రార్థనా ప్రపంచములో విహరించవలెననీ, వారివలె సేవాపరాయణులు కావాలని, వారి ఆరాధనా భాగ్యము పొందాలని భారతీయులు భావిస్తున్నట్లే ఆమెయు విశ్వసించిరి.

మన మూలుప్వారి చుక్కమ్మ, ఆ కనకమ్మ, ఆనాటి అన్నపూర్ణ, లక్ష్మీబాయమ్మ, దుర్గాంబ, తెలంగాణా లక్ష్మీబాయమ్మ, చేబ్రోలు రత్తమ్మ ఎందరో స్వాములవలె యోగ్యులు, పెద్దలు గదా అనేవారు.

ఇలాగ ఎందరో వీరనారీమణులు సంఘసేవికులు, ఆదర్శ గృహిణులు దేవి హృదయమున స్థానమును పొందిరి. ఆధ్యాత్మిక శక్తి సంపన్నులైన స్వాములయం దెంత గౌరవమో సంసార జీవితమందు ఆదర్శ జీవితము నడిపేవారిపై కూడ గొప్ప భక్తి. రైతు కూలీ, చేనేత, చేతివృత్తులు వారు శ్రామిక జనాల కొరకై సేవ చేయువారన్న, గోభూమి బిడ్డలగు చి॥ అచ్చమాంబ, సుశీలాదేవి, పుష్పకుమారి, అనసూయ, విజయ, దేవిజయంతికి అందించే ఆదరణముకంటె ఎంతో హెచ్చు గౌరవము, ఆదరణా ప్రదర్శించుచుండెడివారు. ఆమె హృదయ ఆవరణలో ఆంధ్ర, కేరళ, తమిళ, ఉత్కళ, ఉత్తరాది ఆదర్శ సంఘసేవకులు, సేవికలకు స్థానము కల్గించుకొను సుఖము, శుభముల ననుభవించిరి. అటుల ప్రాపంచిక, సంసారిక జీవితములలో, తాను రాణించి, అటుల రాణించిన వారిని ఆదరించి, సేవించి, ధన్యులైరి.

—:o:—

# ఆనాటికాకతీయ వీరులకు ఈనాటి జాతీయఐక్యత అవసరం

ఆరుశతాబ్దాలు నిండుచున్నవి. దక్షిణ భారతదేశపు స్వతంత్ర భానుడు తిరిగి ఉదయించి, ఐదు దశాబ్దాలవరకు ఆ స్వాతంత్ర్య అరుణకాంతలు వెల్లువిరిసినవి. పశ్చిమాన ఆనెగొంది రాయల సోదరులు, దక్షిణ పశ్చిమాన హొయిసలుల వీరభల్లాలురు. దక్షిణాన చోళ – పాండ్యులు ఆ 1930-70 మధ్య కాకతీయ నాయకుల క్షేత్రచ్ఛాయల నాధారముగా తమతమ రాజ్యాల స్వాతంత్ర్యము, వ్యక్తిత్వముల గౌరవాత్మకంగా అనుభవించిరి. ఆ కథనముగురించి, పది సంవత్సరాల పర్యంతం నేచేసిన పరిశోధనల ఫలితంగా "కాకతీయ నాయకులు" అనే ఆంగ్ల గ్రంథము తయారు చేసితిని. అందులకెంతో ఆనందం మొందిరి భారతీదేవి. ఆ కాకతీయులు ఆనాటి రైతులు మా అందరి పూర్వీకులు. వారు బట్టిన కత్తినే మేమిప్పటికి పూజిస్తున్నాము. వారెట్లా పోయిన దేశీయస్వాతంత్ర్యాన్ని పునరుద్ధరించిరో, అటులే మా దంపతులం, సోదరులం గాంధీజీ నాయకత్వాన, భారత స్వాతంత్ర్యమును తిరిగి సంపాదించుకొనుటలో వీరోచితముగా సేవలోనర్చితిమి. కనుక మాకు, వరంగల్లుకు పోవాలని, అచ్చటి కోటగోడలు, అందలి శిధిలాలు, హనుమకొండ సహస్ర స్థంభములు, నిగనిగలాడుచున్న నందీశ్వరుల దర్శించుకోవాలనే కుతూహలం మెండుగా నుండెను. పట్టుదలతో విజయలక్ష్మి కుటుంబమును తోడుజేసుకొని, ఆమె. నేను, పుష్పకుమారి, నాగేశ్వరరావును కారు సారధిగా చేసుకొని వెళ్ళితిమి.

నేను అంతకుముందు కొన్ని సంవత్సరాల క్రితమే రైతునాయకులు శ్రీగోరెపాటి వెంకటసుబ్బయ్య, నా పూర్వపు కార్యదర్శి శ్రీరామకృష్ణ పరమహంసతో కలిసి వెళ్ళియుంటిమి. అప్పుడా శిధిలాలు తారుమారుగా పడియుండడం చూచి, ప్రభుత్వానికి వ్రాసి తగినట్లు మ్యూజియపు రక్షణ, చారిత్రిక వరుస కుదింపుల చేయించగల్గితి. ఆకోట గర్భములో ఆ విస్తారమగు లోతైన ఆవరణలో, సూర్యుని చూస్తూ వెల్లకిలబడియున్న ఆ చిన్నికొండలంతటి ఆ నల్లరాతి కళాఖండాలుచూస్తూ భారతీదేవి ఆశ్చర్యచకితులైరి. పైన పడుతవేమో అన్నట్లుగా, అంతెత్తున నిల్పుకున్న ఆంధ్రుల ఔన్నత్యమునకు ప్రతిరూపముగాయున్న సింహద్వారములు చూచి "ఏమండీ రంగాజీ, సాంచీద్వారాలు గుర్తేగా! అలాగా, అంతగా, ఆవొంపులు లేకున్నా అంత సొంపుగా వున్నాయిగదా!" అన్నారు.

ఇదుగో, ప్రతాపరుద్రదేవుని శిరస్సు, ఎంత అందమైనవారో! ఆ గాంభీర్య మెంతని! ఆ గడ్డము ! ఆ ముక్కు!" అన్నా! ఐతే ఆతలపై కిరీటానికి బదులు, దేవునిరూపమిచ్చా రెందులకో అన్నారు. మనవారికి పిచ్చివున్నది. గుర్తులేదా "నా విష్ణుః పృథివీపతి" యని! అది చాలక, కాకతీయులు, వొరిస్సా గజపతులు, "దేవు"లనే పిలువబడేవారు. ఆ పురాణ వెర్రి మన ప్రజలకు కల్గించుటవల్లనే, ఏ విదేశీయులు రాజ్యపాలనంచే జిక్కించుకున్నా వారిని దేవులుగా, దేవతలుగా, విష్ణు మూర్తులుగా మనవారు భజించు పిచ్చిలో పడిపోయారు" అన్నారు. ఎట్లనో కాకతీయనాయకులు అర్థశతాబ్దిం పర్యంతమైనా, రాజులు లేకుండానే దేశాన్ని నిలుపుకోగల్గినారన్నా. చివరకు. కాపయ కుమారుడు, వినాయకదేవుగానే వ్యవహరించిరిగదా అన్నారు.

ఈ చిన్ని విగ్రహాలు, ఈ వరసలుదీరిన రౌతుల రాతి నరాలు చూడండి! గుఱ్ఱముపైన, కత్తులతో విజృంభించియున్న



స్త్రీ! ఎవ్వరనుకున్నారు అన్నా! మీ రుద్రమదేవేలెండి! ఇంకెవ్వరు లేరా అన్నది పుష్ప! ఆమె చెల్లెలే గణపాంబ? ఇద్దరు గణపతిదేవి కుమార్తెలేగదా! వొక్కరు వోరుగల్లులో, మరొక్కరు అమరావతినుండి రాజ్యాలు యేలినారు. యీనాటి యిందిరమ్మవలెనే! ఆనాడు రాణులు, యీనాడు ప్రజాపతి స్వామ్యంలో ప్రతినిధులైన మంత్రులు, ఇదే మచిది" అన్నారు.

ఇంత దుర్మార్గంగా అంతటి కోటను. పట్టణాన్ని ధ్వంసం చేశారే ఆ మహమ్మదీయ సైన్యాలు అన్నారు భారతీదేవి. రెండో ప్రపంచయుద్ధంలో. నాజీలు, రష్యాలో ఎన్నోపట్టణాలను అట్లే నేలమట్టం చేశారు. మిత్రమండలిమాత్రం, టోక్యోను, బర్లిన్ను కాల్చలేదా! ఇప్పుడీ అమెరికన్లు వియత్ కాంగులో యేమి చేస్తున్నారు?

యుద్ధాలలో రాక్షసులమైపోతాము. అందుకే అహింసా పరమో ధర్మమన్నారు, బుద్ధుడు గాంధీజీ!

ప్రతి నల్లరాయి ప్రాణంతో వున్నట్లనిపించింది. ప్రతి శిలాఖండం యేదో వీరగాథ మూగభాషలో పల్కుతున్నదా! ఆకోట ఆవరణలోకి వెళ్ళేసరికి, గణపతిదేవుని రాజ్యస్థాపనా కుశలత, రుద్రమదేవి రాజ్యనిర్వాహణ, ప్రతాపరుద్రుని సామ్రాజ్యశక్తి ప్రతిమట్టి పెళ్ళద్వారా వినపడుచున్నదా? కనపడుతున్నదా? ఎందులకా సామ్రాజ్యము ఆలాగా పోయింది. అంటున్నా! ఇప్పటివలెనే అప్పుడూ ప్రజానాయకులైనవారు పరస్పరంగా ద్వేషించుకున్నారు కాబోలు. అవినీతిపరులైరి. స్వధర్మచ్యుతులగుచుండిరి. మనవారీనాడు మహాత్ముని మరచుటలేదా? అంతటి కాంగ్రెసు యీనాడిట్లా హెచ్చు రాష్ట్రాలలో, పాతిక సంవత్సరాలకే వోడిపోయిందే! అన్నారు. వీరప్రతాపుడు, హెచ్చుతగ్గు కులాల వెర్రులపై దండెత్తి అందరికి సహపంక్తి భోజనాలేర్పరచిరి. "వీరపూజ"యే ఆయన వ్రతము. ఆయభివృద్ధిని

ఎదిరించేవారిని తోడుచేసుకొని. వారి విరోధులు ఢిల్లీ సుల్తానుచేరి కుట్రచేసిరి. మోసంతో కోటతలుపులు తెరచిరి. ప్రతాపరుద్రుని సజీవ ఖైదీగా యిచ్చివేసిరి! ఎంతటి దేశద్రోహము అన్నా!

ఇప్పుడూ కొందరు, రష్యావైపు, కొందరు అమెరికావైపు, మరొకొందరు చైనావైపు మన రాచకీయ పెత్తందారులలో మొగ్గే వారున్నారే! చరిత్రపాఠాలను అధికార వ్యామోహితులు మరుస్తూవుంటారండీ అన్నాడు నాగేశ్వరరావు.

రామప్ప దేవళానికి, మధ్యాహ్నపు భోజనాలకు అందుకున్నాం! పడుతున్న దొక దేవళం. పడిపోయింది మరొకటి! భూదేవితో యుద్ధంచేస్తూ, నిలిచేవున్నది పెద్దదేవళం! అవ్వి చిన్ని కొండల చెక్కడాలా, నల్లరాళ్లా! అంతంత ఆ చిత్తరులుతో అంత అల్లారుముద్దుగా అతికించబడివున్నవే! ఆ నెత్తిపై, మనవంక తమ గర్భములోని నవగ్రహాలనా, దశావతారాలనా, అంత అందంగా, సజీవంగా, ప్రతాపంగా రెక్కలున్న అప్సరసలా! బైట, చూరుచూరును పడిపోకుండా నిలబెట్టుచూ, అంత బరువుల, మోస్తున్న స్వర్గపు టందాల వెలిగ్రక్కుచున్న నిలువుటద్దాల నల్లభామినుల వైభవమా! శక్తి వెల్లువలా! విశ్వకర్మ సృష్టి సౌభాగ్యమా అనుకున్నాము, ఆ అచ్చంపు తెలుగు తోయజాక్షులజూచి! ఆ సోగమొగాలు, ఆ నిటారు రూపములు, ఆ సన్నని నడుములు, సాగుతున్న కాళ్ళు చేతులు ఆ శూరకత్తుల్లాంటి కనుబొమలు, తామర పుష్పాలకు అణుశక్తి అందిందా అనిపించే కళ్ళు, కొండలనైనా మోయగల ఆ కాళ్ళు, వ్రేళ్ళు, మోకాళ్ళు వుబికి వస్తున్న ఆ దేవతాస్వరూపాలా, ఎలాగా ఆ లావణ్యమును తమ వులులతో నల్లనల్ల శిలలనుండి వూదినారో అనిపించింది. ఆ వర్ణనలలో నేనువుంటే, ఆమె "అవునవును" అంటూ, మన తెలుగు విశ్వకర్మలు ఇంత శక్తిని యీ స్త్రీలకు అందించుటకు మాతృక ఆ రుద్రమదేవేనండీ అన్నారు "అన్నట్లు, తెలుగువెంక తుమ్మల కవీశ్వ



రులు నీవే, యీనాటి రుద్రమదేవన్నారమ్మా. కవులట్లానే అంటారులె. రాజ్యాధికారానికి ఆమడల దూరానవున్న మనమా రుద్రమదేవికి జోడు? ఆ యధికారం మిమ్ము వెదకుకుంటూవస్తే వద్దన్నది మీరేగా! ఏమో, నాకుమాత్రం మీరేచాలు అన్నా! ఐతే. మనం జయం పొందుతున్నామంటారా పార్లమెంటరీ అపోజిషన్ పార్టీగా పెరుగుటలో? పేరుకు మనదే పార్లమెంటుతో పెద్దపార్టీ! అపోజిషన్ లీడరు మీరే! కాని ఐదారు రాష్ట్ర ప్రభుత్వాల ముఖ్యమంత్రులు కాంగ్రెసేతరులు వచ్చినా, వొక్కరైనా, మన పార్టీలో చేరినారా? అధికారంలో అటు కాంగ్రెసువారికి, ఇటు కాంగ్రెసేతరులకు దూరస్థులమేగదా మనం. ఇంకెందుకు మనపార్టీ అన్నారు భారతీదేవి!

రైతుల రక్షించడానికన్నారు నాగేశ్వరరావు, పుష్ప! ఆపని 17 సవరణనుండి బీదరైతుల - సీలింగుకు లోపలివారిని - రక్షించడంతో పూర్తయినది. ఇంకా మనమేమి చేయగలం అన్నారు. లాండు రివిన్యూ తొలగించడమా? అదీ పూర్తి యగుచున్నది. ఇక మిగిలింది, గాంధేయ అపోజిషన్‌గావుండి శాంతియుతముగా సోషలిస్టు సమాజం నిర్మించడం, దీనజనాలకు దిక్కుదివాణం కల్గించడం. కాంగ్రెసేతర ముఖ్యమంత్రులిలా మనయందు విశ్వాసంపొందక మనతో, చేరక, తలతోకలేని భారతీయ క్రాంతి దళమును యేర్పరచుకోవడం అంటేఏమిటి? అటు రాజాజీ, యిటు మసం వారికి చాలమనేనా" ఆపైన ఆ బొంబాయివారి సహాయం మనకందుచున్నది గనుక, మనది పెట్టుబడిదారుల పార్టీ అనే అభాండం నెహ్రూగారే వేసిరి.

కాంగ్రెసులోమాత్రం, మరెందరో కల్గినవారున్నారే అన్నది పుష్ప! గొప్ప సరస్సులో నాల్గు నీటి మురికిబొట్లు! మనది చిన్నకొలను, వొక్క మట్టిచుక్కగూడా మలినంగా కన్పడుతుంది అన్నారు దేవి, రంగాజీ ఎంతచెప్పినా వినరండి. యీ మసానీ,

ఒక్కటే రొద వారి బొంబాయి ధోరణిలో అన్నాడు నాగేశ్వర రావు. పెట్టుబడిదారుల పెత్తనానికి మనమెప్పుడూ ఎదురేగా అన్నా.

అదే నేను రాజాజీకి పదేపదే చెప్పుతున్నానమ్మా? "ఏమి చేద్దాం, డెమోక్రేటికు ప్రతిపక్షాలన్నీ కలిసి పోవాలన్నావొప్పు కోకపోతిరి, మనం వారితోనే చేరిపోతామన్నాం! అదీ సాధ్యము కాదయ్యో అన్నారు రాజాజీ! మన పార్టీనే రద్దు చేసుకొన కూడదా అన్నా! ఆయన కది నచ్చలేదు. అంతట, కాంగ్రెసు మనం, యీ యస్ వి డి బృందాల కలయికతో, జాతీయ మంత్రి వర్గాలే శరణ్యమని పెద్దలతో చెప్పుచున్నానమ్మా!

ఈ రాచకీయ వాతావరణములో, మహాత్ముడే వుంటే, ఆమరణాంతపు నిరాహార దీక్ష పూనేవారేమో? మా లాంటివార మంతటి వ్రతాన్ననుష్ఠించగలమా? అప్పొజిషన్‌లో వుంటున్న మనలాంటివారు వేర్వేరు పార్టీలలో, మన ప్రత్యేక వ్యక్తిగత, గ్రూపుల ప్రతిష్టలకై పరస్పరంగా పోటీపడుకుంటూ, అధికారంలో వుంటూవున్న కాంగ్రెసును కట్టడి చేయలేక, దిక్కుజాలని ప్రజలను రక్షించనూ లేకపోవుట మహాత్మునికి యిష్టమగునా?

కనుక, అప్పొజిషన్‌లోని పార్టీలన్నీ వొక్కటై పోరాదా? అన్నారు భారతీదేవి! కమ్యూనిస్టులతో కూడా కలిసియా అన్నా! వారు కలిసి రారనుకుంటే, రైతాంగ వ్యతిరేక ధోరణిని వారు వదులు కోరనుకుంటే, మిగతావారైనా కలిసిపోరాదా అన్నారు. ఆయాలోచననే రాజాజీకి అందిస్తున్నానమ్మా! అసలు యీ ఆంగ్లో-అమెరికా పద్ధతి మనవారికి సరిపోదేమో!

ఆనాటి యస్. వి. డి. మంత్రివర్గాలు చెదరిపోతుండినవి. శాసనసభ్యులు పార్టీలను అతి సులువుగా, ఏ సిద్ధాంతాలకు గాక స్వంతలాభం, ధనలాభం కొరకై మార్చుకుంటూ, ప్రజలకు



రోత కల్గిస్తూవుండిరి. కాంగ్రెసువారు, అధికారమే అమృతముగా చూచుకొంటూ, అవినీతినే శిరసావహిస్తూవుండిరి, రష్యా, చైనాల వలె రక్తధారల రాచకీయము వంక పోకుండా గాంధిజీ అడుగు జాడలలో మనదేశపు ఆస్తిపరులు, అధికారులు, అన్నీ కల్గినవారు, దీన జనాలను రక్షించగల్గుదురా? తగినంత వేగంగా, ప్రేమగా! ఇలాగా, ఎన్నెన్నో ప్రశ్నలు మా హృదయాలలో ఆనాడు చెలరేగినవి. వొకరి నొకరం వుత్సాహపరచుకొన్నాం. వోదార్చు కున్నాం. దిట్టపరచుకున్నాం.

వొకేవొక తృప్తినాకు రంగాజీ! ఆరుశతాబ్దాలైనా ఎలాగా యీ కాకతీయ వీరులకు యీ శిలాఖండాలు స్మృతి చిహ్నాలుగా వుంటున్నవో, అటులే, మనం శాసనసభల్లో ప్రచురించిన ఆలోచనలన్నీ, దరిద్రనారాయణుని సేవించుటకే, పోషించుటకే రక్షించుటకే గదా? ఈ యస్. వి.డీలు పోవచ్చు, కాంగ్రెసే పోవచ్చు, మనం మాత్రం మహాత్ముని ధోరణిలో ప్రజాభ్యుదయం ఎవ్వరిని శోషింపజేయని వారికొరకే నిల్చితిమి, పల్కితిమి, పోరాడితిమి, అన్న సత్యం కాలంలో నిల్చివుంటుందిలే.

ఎంతటి నమ్మకమమ్మా నీది. అదే నాప్రక్కనున్న ధార్మిక శక్తి, ఆత్మవిశ్వాసానికి ఆధారము అంటూ, వారి చేతులందు కున్నా! పిమ్మట ఆ మాటలను రాజాజీకి అందించినా నాకునూ అట్లెఅనిపిస్తూవుంది! ఈ పార్టీలుచాలవు అని రాజాజీకి చెప్పినా. మీరనుకున్నట్లు జాతీయ ప్రభుత్వాలే శరణ్యమనిపిస్తుంది. రంగా అన్నారు ఆయన. ఆఫ్రికాలోని క్రొత్తరాజ్యాలవారు వొకే వొక జాతీయ ఫ్రంటుకిందే, తమ ట్రైబుల ప్రజాస్వామ్యం యేర్పరచు కుంటున్నారని చెప్పితి!

—:o:—

# వినయాశ్రమం - కావూరు

మేమిద్దరం కలిసి, వినయాశ్రమానికి వెళ్ళడం అదే తుదిసారి, ఆ 1972 సెప్టెంబరు 17వ తేదీన. ఆశ్రమ స్థాపకులలో ఒకరగు కీ॥ శే॥ శ్రీ తుమ్మల బసవయ్యగారి స్మారకార్థము జరుగు సభ కొరకై మంత్రి మూర్తిరాజుగారు గోభూమికి వచ్చిరి. మా ఆతిథ్యమును ఆ ప్రొద్దుట అందుకొనిరి. మేము శ్రీ కె. ఆదినారాయణమూర్తి, కొల్లూరు సర్పంచి, మా మనుమరాలు అనసూయ. భర్త కారునడుపగా, కావూరు వెళ్ళి స్మారక సభకు అందుకొంటిమి. అంతకు ముందొకరోజు నేను విజయవాడ నుండి గోభూమి చేరినాను.

భారతీదేవిని యే పొరబాటుననో వినయాశ్రమము వారు ప్రత్యేకంగా పిలువలేదు. నా పేరుననే ఆహ్వానము వచ్చినది. 1970 సంవత్సరపు ఆశ్రమ వుత్సవాలకు బసవయ్యగారి భార్య దేవిని ప్రత్యేకంగా అధ్యక్షత వహించమనిరి. ఆమె శ్రద్ధతో వెళ్ళి వచ్చిరి. నేనీ పరియాయం బైలుదేరుతూ, మీరుకూడా వస్తారా! కలిసి పోయివద్దాం, ఆ పుణ్యపురుషుడు యీ యెండాకాలంలోనే మనకిసాను వెనిగళ్ళ వెంకట సుబ్బయ్య రేపల్లెలో చనిపోతే స్మారక సభకై పోయి తిరిగివచ్చేప్పుడే. చూచివచ్చినా! ఎంతో ఆదరించిరి. తనకు జబ్బుగా వుంటుకూడా చెప్పరైరి. పదిహేను రోజులు కాకముందే బసవయ్యగారు స్వర్గీయులైరంటే ఆశ్చర్యం కలిగింది అన్నా. నాకూ ఎంతో దుఃఖం కల్గింది అన్నారు.



శ్రమజీవులు వారిద్దరు. సర్వము త్యాగముచేసిరి. మహాత్ముని పేరిట అంతటి దంపతులు ఎంత మందున్నారు. ఎచ్చట మళ్లా దొరుకుతారు. రాండి పోదాము అన్నా!

ఇంట్లోకి వెళ్ళి అన్నీసరి తిరిగివచ్చి. 'రమ్మంటారా' అన్నారు. అలాగే పోయివద్దాము అన్నా! తల సర్దుకొని. బొట్టు సరిజేసుకొని, కొన్ని ఫలాలు చేర్చుకొని, నాతో బయలుదేరిరి. దారి పొడుగునా, ఎన్నెన్నో చర్చించుకొన్నాం! బసవయ్య, దుర్గాంబలు ఆ దేశసేవా నిరతులు, బుద్ధభగవానుని బోధల జీర్ణించుకొన్న వారు, మహాత్ముని సాంఘిక, నైతిక సిద్ధాంతాలను అమలు పరచుటలో గుంటూరు, కృష్ణాలలో పేరుపొందిన రాచకీయ నాయకులు. శ్రీ సితారామశాస్త్రికి యీ దంపతులు అనుంగు శిష్యులు.

ఆలాంటివారు యెందరెందరో అప్పుడు వుండబట్టి, మన లాంటివారము అన్ని త్యాగాలు చేయడానికి పూనుకొన్నాము. ఇప్పుడీ పదుల మంత్రులలో యిద్దరైనా వున్నారా ఆలాంటి త్యాగులు అన్నారు. వొక్కరున్నారా అన్నారు ఆదినారాయణ మూర్తి.

త్యాగులు లేకున్నా! దేశభక్తులుండరాదా. అథమం లంచగొండులు కాని వారున్నారా? కుల పిశాచాన్ని జయింప చూచేవారున్నారా? అంటూ, స్వరము పెంచుతూ ఆయాసంగా పల్కుతున్నారు భారతీదేవి.

మనమెంత ఆరాటపడ్డా, రోజులు మారిపోయినై. నిష్పక్ష పాతంగా, ధర్మంగా, లంచాలనుకోరకుండా, సమర్థులైనవారు మంత్రులుగా వస్తే, యెంతబాగుండును అన్నా.

నేను, ప్రకాశంగారు తప్పుదారిన పడుచున్న మంత్రులపై విచారణ పెట్టమన్నాము, అప్పుడే (1949-50) గనుక జవహరులాలుగారు వొప్పుకుంటే, మంత్రులు దారిలో వుండడానికి అలవాటు పడేవారు.

ఆఖరుకు, మనమున్షీ గారు, మీరు రాజాజీ కోరినప్పుడైనా, డాక్టరు దేష్‌ముఖ్ సవాలు చేసినప్పుడైనా (1950-62) ఆమ్‌బడ్సుమన్ అన్నారే, ఆ విచారణాధికారి నేర్పరిస్తే యీనాడిట్లు యీ మంత్రులు లంచాల వ్యాపారంలో యింతగా సామర్థ్యము బొందుతారా!

ఎట్లానో "లోక్‌పాల్" (ఆమ్‌బడ్సుమను) వస్తారటలే! ఎప్పుడూ! మంత్రులంటె, పోలీసువాళ్ళు. ఆబ్‌కారీవాళ్ళు, రివిన్యూవాళ్ళూ యెట్లానో, ఫారెస్టువాళ్ళూ యెలాగో అలా అందరికి అసహ్యమై పోయిం తరువాతనా" విసుక్కున్నారు.

ఇప్పుడైనా, యీ మూర్తిరాజు, ఆ చల్లా సుబ్బారాయుడు సుబ్బారావులాంటి వారు మనకు తెలుస్తున్నంతవరకు ఖచ్చితమైన వారున్నారుగా అన్నా!

ఎరువుల పంపిణీలో చూడండి అన్నారు! డిమాన్‌స్ట్రేటర్లు, విలేజి డెవలెప్‌మెంటు ఆఫీసర్లు. వేలుపోసుకుంటున్నారు" అన్నారు మూర్తి! నిమ్మ, బత్తాయి చెట్లు పాడైపోతూవుంటే, చూచి, ఏ మందులు వేయాలో తెల్పండి అని వుత్తరం వ్రాస్తే మేస్త్రీ కూడా రాడు. పశువుతోక కేదో వుండు పడ్డది మందులువేయండి అని మావూరి పశువుల ఆస్పత్రికి పంపితే, దానికి యేమిలేదులే అన్నాడట. ఆ తరువాత రెండునెలలు అది పడ్డబాధ, మనకు ఖర్చులు ఎంతని.



ఇదంతా మారాలంటే, మనపిల్లలకు విద్యాలాయాలలోనే గాక, ప్రజల సంస్థల ద్వారాకూడా, మానవసేవ, దీనజనరక్షణ, త్యాగనిరతి, దేశభక్తి ప్రపూరిత ఐచ్చిక సేవలు చేయడం యెంత గొప్పయో, అవసరమో బోధించాలి. శాస్త్రీజీ, బసవయ్య, దుర్గాంబలాంటివారి జీవితాలువారికి ఆదర్శ ప్రాయమని తెలపాలి! అట్టి ప్రజాబంధువుల దారిలో తామునూ నడువాలని ప్రబోధించాలి. మంత్రులుగా రావడం ముఖ్యంగాదు, ధనం కూడబెట్టడం గాదు గొప్ప! తాము గొప్పగొప్ప దేశభక్తి ప్రపూరితమగు సేవావ్రతములను సాగించాలని నూరిపోయాలి. అలాగా తయారైతేనే, పిల్లలే పెద్దలై దేశాన్ని, సంఘాన్ని సేవించగలరు.

అది గ్రహించేగాబోలు స్వామి శీతారాం, కురుమద్దాలి పెద్దమ్మను వినయాశ్రమానికి పిలుచుకున్నారు. మనసంఘానికి నైతిక స్థాయి పెంచుకోవాలి. దేవునిపై భక్తితో మనుష్యులపై ప్రేమతో వుండేవారు కావాలండి యిప్పుడు! అందుకే మహాత్ముడు భజనలు చేయించేవారు. మనందరిచేత అన్నారు. అందుకే, నేను పుట్టపర్తి స్వామీజీ, రమణమహర్షి స్వామిశివానందలాంటివారు కావాలనేది.

దారిలో చందవోలు చూచాము. అదొకప్పుడు వెలనాటి చోళులకు ముఖ్యపట్టణము. దాని ప్రక్కనే అటువున్న భట్టిప్రోలు స్తూపం, ఇటుప్రక్కనున్న బుద్ధాంగ్రామము, పురాతనంగా యీ ప్రాంతమంతా బౌద్ధుల కాలవాలమని సూచిస్తూవుంది. కాలగతిని యీ పరగణా మహమ్మదీయులకు చేరిందని "ఖాజీపాలెం" గుర్తు చేస్తున్నది. ప్రక్కనేవున్న నిజాంపట్నంద్వారా, బ్రిటిషువారు వ్యాపారం చేస్తూ యీ రాష్ట్రాన్ని వశపరచుకున్నారట. ఈ గ్రామాలన్నిటిలో, భారతీదేవి, దుర్గాంబ, బసవయ్య ప్రభృతులు 1931లో, అందరు గ్రాండులో తిరుగుతూ, స్వరాజ్య సంపాదనకై

వీరనారీమణులను సంపాదించుకున్నారట. ఆరోజుల్లో మేము వో "శివం"లో వుంటిమండీ! ఎంతెంత ముత్తయిదువలు మమ్మ సత్కరించేవారు. ఎంతెంత త్యాగము చేయడానికి సిద్ధమైనారు, ఇంటిబయటికి రానివారెందరో, జైళ్ళకుపోవడానికి తయారైనారు.

ఆలాంటి త్యాగధోరణి, శక్తి తిరిగి మనకు కావాలి. ఎన్నికలలో యీ బీదజనాలు ఆలాంటి పట్టుదలతో యిందిర పార్టీకి వోట్లువేశారు. ఎంతగా ఆనాడు స్వరాజ్యం కోరుకున్నామో, అట్టి పట్టుదల, ఆశలే యీ బీదజనాలకు మాటల కతీతమైనట్లు కల్గినవి. అందుకే అలాగా వోటుచేశారు. మీరు కోరుకున్నట్లే తమ ఆశాజ్యోతులను ఆవిధంగా వెల్గించినారు. ఇదే మీ సందేశం కదా"అన్నారు.

తిరిగి ఆ సత్యాగ్రహ యుగానికి ఆమె మనస్సు కదలింది. ఆవేశంతో పల్కుతున్నారు. ఆరోజుల్లో — 1934-3౧ మహాత్ముడు గ్రామీణ పరిశ్రమల పోత్సహించడానికి అఖిలభారత సంస్థ నేర్పరచినారు. (A. I. V. I. A.) వెంటనే శాస్త్రిగారు గుంటూరుజిల్లా సంఘాన్ని స్థాపించినారు. పల్లెటూళ్ళలో తిరిగి వివిధచేతి పరిశ్రమలలో తయారగు వస్తువుల చేర్చినారు. ఎచ్చటెచ్చట ఏయే కులాల, వృత్తులవారు ఏయే వస్తువులను ఎంతేంత. ఎట్టెట్టి శక్తి, సామర్థ్యములతో, ఎంతెంతగా తయారు చేస్తున్నారో, శ్రీ శరణు రామస్వామిద్వారా రిపోర్టు తయారుచేసిరి. ఆవస్తువులను రెండెడ్ల బండ్ల మీద, పెట్టెలలో పెట్టించి, గ్రామాలలో అమ్ముకురమ్మన్నారు శాస్త్రీజీ! అమ్మడానికి బైలుదేరిరి మన బసవయ్య, నేతి వెంకటచలపతి, బి. ఏ. ఇంకెందరో అట్టి స్వాతంత్ర్యవీరులు, సుప్రసిద్ధ ప్రజాసేవకులు. వారికి జీతాలిచ్చిరా? బిరుదులా? వుద్యోగాలా!



మనంమాత్రం ఖద్దరు అమ్మలేదండీ యే కమీషన్ నుండి ఖర్చులు కోరకుండా! ఆలాగా సేవలు చేయాలనే వ్రతానుష్టానులు తగినంతమంది ఇప్పుడున్నారా? వుందురా? వుద్యోగాలిస్తూంటిమి. జీతాలు, భత్యాలు, వాహనాలు, బిరుదులుకూడా! ఇన్నికల్గి, తుదకు వారానికి ఆరురోజులు, రోజుకు ఏడుగంటలు దేశసేవచేయ రాదా? ఆఖరుకు ఉద్యోగధర్మమునైనా గుర్తించరాదా? విలేజి లెవెలువర్కరు అనే వారు గౌరవానికి భంగమని, విలేజి డెవలెప్మెంటు ఆఫీసరు అనాలట, జీతమేగాక, అలవెన్సులు కావాలంటున్నారట! ఈదాహము—పదవులకు, పెత్తనాలకు, డబ్బుకు, డాబుకు, ఇలా పెరిగిపోతున్నదే. మరో ధోరణిలో కూడా పెరుగుచున్నదిలే. మీరే చెప్పుచుండిరిగదా, రామకృష్ణ మిషన్, సత్యశాయిబాబాల సేవావ్రతముల గురించి అన్నా.

వారిని చూస్తే నాకేదోభయంకల్గి, అంతపెద్దగా మాట్లాడకండి! మనమెంత ఆయాసపడ్డా, యీ వ్యవహారాలు ఇలాగా జరిగిపోతూనే వుంటాయి! ఎల్లకాలం ఆ గాంధి-శాస్త్రి—బసవయ్య తపోధ్యానంలో ప్రజలు వుండగల్గుతారా? భూమిమీద — యీ బురదలో - తిరుగాడే యీ ప్రజలకంటె ఏదోకొంతగా పైకి మాత్రము లేవగల్గుతారులే!

మంత్రులు, అసెంబ్లీ సభ్యులుకూడా, లేవకపోతే ఎట్లా! ఇట్టివాళ్ళ కోసమేనా, మనమంతా, ఆ పిచ్చితల్లి దుర్గాంబ తన ఆభరణాలన్నీ, భూములన్నీ, తన సౌఖ్యాలనీ యిన్ని దశాబ్దాల పర్యంతం త్యాగంచేసింది. ఆ బసవయ్య అంతశక్తి యిసుక భూములలో ధారపోసింది. ఆస్వామి శీతారాం తన నిర్మాణశక్తినంతా, వారగా మహాత్ముని పాదాలవద్దవుంచింది అన్నారు. చేరుకున్నాం యీ వుద్రేకపు ఆలోచనలతో వినయాశ్రమానికి!

ఈ ఆశ్రమాన్ని మహాత్ములు 1933 డిశంబరు 23 తేదీన తెరచిరి అదేరోజున నిడుబ్రోలులో రామానీడు విద్యాలయాన్ని, కిసాన్ పబ్లికేషన్సును, రంగా గ్రంథాలయాన్ని ప్రారంభించిరి. భారతీ దేవిని ఆశీర్వదించిరి.

కొన్ని సంవత్సరాల పిమ్మట, ఆశ్రమములో, మా ఇద్దరి కొక కుటీరం యేర్పరచుకుందాం. ఎండాకాలం, దేశభక్తులగు, ప్రజాసేవకు జీవితాలర్పణ చేస్తున్న సోదర సోదరీమణుల మధ్య కొంతకాలం వుంటూ వుందామన్నా! కాని మేమూ ఆశ్రమంలో చేరక, అభిమానులుగా వుంటూ వుంటిమి.

ఆ పవిత్ర ఆశ్రమంలో ఆ నాయకద్వయం, స్వామి శీతారాం, బసవయ్య దేశసేవావ్రతంలో పండిరి. ఆసేవా వాతావరణంలో ఐక్యమైపోయిరి.

వారి సమాధులవద్ద పుష్పాల సర్పమణ చేసితిమి. వారి ఆత్మశాంతికై ప్రార్థించితిమి. సభలో ముందు నేను, చివరకు వారు మా పల్కులు అందించితిమి. ఎంత వుక్క! దాహం ఔతున్నది. నేనేమో స్వతంత్రించి అడిగి, అంత నీరు త్రాగినా! వారక్కే కూర్చుండినారు. పన్నెండుగంటలకు సభ ముగిసినది. అప్పుడు భోజనాల దగ్గర కూర్చున్నారు. అన్నం మింగుడుపడ లేదట, నాలుగు ముద్దలు తిని, అంతమజ్జిగ త్రాగిరి. వెంటనేవచ్చి, త్వరగా పోదామండి అన్నారు. మిసమిసమంటున్నది యెండ. ఎంతో ఆయాసం కల్గిస్తున్నది. ఇంకా కారు తయారుగా లేదా అంటున్నారు. మూర్తి త్వరితంగానే కారును స్టార్టుచేసిరి ఎవ్వరో ఏదో నాతో మాట్లాడుతున్నారు. ఈలోగా తాను దుర్గాంబగారికి అనునయింపు మాటలు చెప్పివచ్చి త్వరితంగా పోదామండీ అని నన్ను హెచ్చరించిరి కారులో కూర్చున్న తరువాత, నెమ్మదిగా చెప్పడం మొదలు



పెట్టిరి. వూపిరాడ లేదని, గుండె ఆగిపోతుందేమో అనిపించిందని, నీళ్ళు త్రాగడానికికూడా వోపిక లేనట్లయినదని! గోభూమి రావడంతోటే ఆమెను కొంచెంసేపు పరుండమన్నా! పాపం ఎంతబాధగా వుండెనో పక్కమీదవాలినారు. అర్థగంటసేపు విశ్రాంతి మెందినారు. ఆమూడో రోజున నేగదా, హార్టు అటాక్కు వచ్చింది. అలాగా తనకు తుదకు అందిన నైతిక, భౌతికశక్తిని కూడా దేశభక్తుల నారాధించుటకే వినియోగించగలిగిరి. వారి ధార్మిక జీవితమునకు అదొకకథన్యమగు లక్షణం. ఆ బసవయ్య స్మారక సభలో దేవి యిచ్చిన ఉపన్యాసమందలి కొన్ని ఘట్టాలను, వినయాశ్రమం వారొకరు దయతో పంపగా వాహినిలో ప్రచురించితిమి.

—:o:—

# త్రిసముద్ర సంగమం

పెద్దకారులో, జోరైన స్పీడుతో పోతున్నాము. సూర్యుడు మిరమిరలాడుతున్నాడు. ఐనా గడియారం చూచుకొంటున్నారు భారతీదేవి. అర్ధగంట గడిచింది. అటూ ఇటూ యిండ్లే! ప్రక్కన చిన్నచిన్నగావున్న పెరళ్ళల్లో, రెండు, నాల్గు, ఆరు కొబ్బరులు, అరటులు లేదా టపియోకా (కర్రపెండలం)లుంటూవున్నవి. "రోడ్డునకు అటు ఇటు నడుస్తూ వుంటారుగాని బిడ్డలుకూడా అడ్డంరారండీ అంటున్నా!" చూడు, రెండు మూడుఇండ్ల వరుస లేమైనా వొకదానివెంట మరొకటిగా వుండునేమో! హెచ్చుగా రోడ్డువెంటే! బస్తీ పూర్తి ఐనదా, మరోబస్తీ వచ్చిందా, లేక గ్రామమా?" అంటున్నా! అచ్చటచ్చట, ఓఫర్లాంగువరకు వొకమారు ఇటు, ఓమారు రెండువైపులా బయలు, పచ్చనివరిచేలు, ఆ ప్రక్కనే గుబురైన కొబ్బరితోటలు. "చూడు, సింహళంలో లాగానేవున్నవి"అంటున్నా! "అవునవును" అంటూనే మనస్సంతా పరధ్యానంగా వున్నారు.

గంట ఐనది. "టైము ఎంత?"అన్నారు. వెనుతిరిగి సూర్యుణ్ణి చూడాలిసి వస్తున్నది. "చేరగలమా?" అన్నారు.

"ఎందుకమ్మా అంత ఆతురత?" అన్నా! మా మాటలు విని ఆమె ఆతురత గమనించుకొన్న డ్రైవరు "ఫరవాలేదండి, సమయానికే చేరుతాము, రోడ్డులో సందడిలేదు. ఐతే పిల్లలు బళ్ళనుండి బైటికి వచ్చే సమయం వస్తూంది"అన్నాడు.



"కొంచెం మంచినీరు యి"మ్మన్నా! తినడానికి వోఅరటి పండు అన్నా!

ఆమె మనస్సు సూర్యునినుండి త్రిప్పుటకై! జరిగింది మరో అర్ధగంట "వస్తున్నదితే నాగర్‌కోయిల్" అన్నా! అచ్చట అంతకుముందు రైతాంగ ప్రచారము కొరకై వచ్చిన అనుభవాలు చెప్పుతున్నా! "ఇదుగిదుగో, యెంతమంది, యెంత చిన్నపిల్లలు, ఎలాగా వరుసలుదీరి. డిసిప్లినుతో, అటు ఇటేగాని రోడ్డు మధ్యానికి వస్తారేమో చూడండి!"అంటున్నా!

ఎంత వడిగాపోతున్నది మాకారు! అరవైమైళ్ళు అందుకుంటున్నదిలే!

"ఫరవాలేదండి! అందరు పిల్లలు గాదులే! చివరి పీరియడు క్లాసులు లేనివారే బైటికి వస్తున్నారు" అన్నాడు డ్రైవరు.

"ఎన్నిగంటలకు పొద్దు గూకుతుంది యీ ప్రాంతాన?"అని అడిగారు.

"త్రివేండ్రములో ముందే! ఐతే అక్కడో? ఇంకొంచెం సేపటికి చేరుతాముగా!" అన్నారు.

"ఏమండో, ఎప్పుడు మీరు ఆతురత పడుతుంటారు, నిదానించరాదా! అని నన్నే హెచ్చరిస్తూ వుంటారే. ఈవేళ యెందుకమ్మా, మీరే, చిన్నపిల్లలాగా ఇంత ఆందోళన పడుచున్నారు! అంతా లెక్కిస్తిమిగదా! ఖచ్చితంగా సమయానికే అందుకుంటాములే" అంటున్నా!

మెడ నటుత్రిప్పుతూ, ప్రతి ఐదు పదినిముషాల కొకమారు వెనుదిరుగుతూ, సూర్యుని డెంతగా పశ్చిమానికి వంగుతున్నాడో గమనిస్తూనే వున్నారు భారతీదేవి. నవ్వుతూ అన్నారు "నిజమే! ఈవేళ నేను చిన్నబిడ్డనే! ప్రతిదినము పూర్ణిమ గాదుగదా! ప్రతి పూర్ణిమకు ఇక్కడకురాలేను. వచ్చినా మీతో కలిసి

రాలేను. యింతమంచి పౌర్ణిమ రోజున, ఎన్నాళ్ళనుండో, చూడాలనుకుంటున్న యీ పుణ్య ప్రదేశము సమయానికి అందుకోవాలని వుండదా? మహాఐతే మరో పరియాయం రాలేమా?" నా చిన్నప్పటినుండి మన దేశం గురించి చెప్పుకుంటున్నప్పుడల్లా, హిమాలయం నుండి, యీ కన్యాకుమారి వరకమ్మా మన దేశం, అంటూ వుండేవారా! వివేకానందుని గురించి చదువుకొంటున్నప్పుడు, ఆయన ఈ కన్యాకుమారి వద్ద తపస్సు చేశారని చెప్పితిరి. ఈ కన్యాకుమారే మన దేశమాతకు అపరావతారంగా, విగ్రహస్వరూపం పొందిరంటిరి! ఈచోటే మూడు సంద్రాలు ప్రపంచంలో మరెచ్చటా లేనట్లేనా కలుస్తవంటిరి. అటు చంద్రుడు ఉదయిస్తూ వుంటే ఇటు సూర్యుడు అస్తమిస్తూ వుంటారని చెప్పిరి. ఈలాంటి దృశ్యం ఇంకెచ్చటా కలుగదంటిరి. అలాగా, నోరూరించి, మనస్సును ఉత్సాహపరచి ఇప్పుడు చిన్నమ్మాయి నౌతున్నానంటారా?" అన్నారు భారతీదేవి.

అందుకుంటున్నామన్నాడు మా డ్రైవరు. "కనపడడం లేదే, సముద్రమన్నారు" ఇది మిట్ట ఇంకా ఐదుఆరునిముషాలు ఆతర్వాత భూమి జారిపోతుంది సముద్రంలోకి! వస్తూంది వచ్చింది అదుగోనండి సముద్రం అన్నాను. అలాగా చేర్చినాము భారతీదేవిని ఆ త్రివేండ్రంనుండి, కన్యాకుమారికి ఎదురుగా కనబడ్డది బంగారు వెండి కాంతులతో గాంధీ మంటపం!

దిగినాము. కాళ్ళు ఆ సాగర జలాల్లో తడుపుకున్నాము. మంటపంలోకి పోదాము" అన్నా! "సూర్యాస్తమయమో?" అన్నారు. "ఫరవాలేదులే" అంటూ మంటపంలోకి వెళ్ళి, మహాత్ముని తలచుకొని ప్రార్థన చేసుకొని, తిరిగి వచ్చినాము. త్వరితంగా ఆ చివరివరకు కారులో వెళ్ళాము.

సరస వందలమంది నడిచిపోతున్నారు. తీర్థయాత్రపరులు.



మేము చేరినాము. పెనుగాలి, విసురైన సంద్రపు చల్లని గాలి! "గమనించారా?" అంటున్నా! వారి దృష్టి అంతా, ఆ దూరాన, వంగుచున్న, వెల్గుచున్న, నవ్వుచున్న సూర్యునిపైనే వుంది. వూపిరాడనంత త్వరితంగా ఆతురతతో నడుస్తున్నారు. చీర చెంగు అడ్డమగుచున్నది. ముంగురులు రేగిపోతున్నవి. మేము వస్తున్నామా లేదా అనే ధోరణి వున్నట్లు లేదు! అనుకుంటున్నా! "త్వరగా రండీ." అంటున్నారు.

చేరినాము. ఆచివరకు! ఇక ముందుకుపోతే సమంగా లేదు. రాళ్ళతో గూడినవంపు అచ్చట అందరం ఆగినాము. అప్పుడు గడియారం తిరిగి చూచుకొన్నాం. ఇంకా అర్థగంటసేపుండాలన్నా రెవ్వరో! ఫక్కున నవ్వుకున్నారు. ఆ చక్కని పలువరుస చూచుకుంటూ, సూర్యకాంతిలో, అలసటలో, సంద్రపుగాలి వీవనల మధ్య మెరుస్తున్న వారి మోము, ఎంతో అందంగా వున్నారని, ఆనందంగా, ఎంతో తృప్తితో వున్నారని గమనించి నేను మహదానందం బొందితిని.

వంగబోతున్నాడు ఆనాటి సూర్యుడు. నేనామెకు గుర్తు చేస్తున్నా! హిందూ మహాసంద్రములో, మేము చూస్తూవుండిన సూర్యాస్తమయాల సొగసులు! మధ్యధరాసముద్రములో, యిటలీవారి, మెలిస్సీనా ద్వీపములో, నిప్పులమధ్య వేగుచుండే రాగిరేకు లెట్లా ధగధగా మెరుస్తూ వుండునో, ఆకళ్ళు మిరుమిట్లు జెందించు దృశ్యములను గుర్తుచేసితి! "ఔనౌను, అట్లానే, మన తిరుమలను దూరాన్నుండి చూస్తుంటే, ఆ నెత్తిపై కొటగోడలాగా సూటిగా ఎదిగే ఆ మెట్రటి కొండగూడా అంత అందంగా వుంటుందిగదా" అన్నారు.

ఇంతలో గొల్లుమంటున్నారు. సూర్యుడు దిగుతున్నారు. సముద్ర జలాలు చల్లగా వుండునని మళ్ళా సందేహిస్తున్నారా? ఆగినారా! ముందుకు వెళ్ళుతున్నారు. అంటుకున్నారు! ఎవ్వరు,

ఎవ్వరిని! సంద్రమేనన్నా నేను. సూర్యుడే నన్నారు వారు. ఇద్దరు అందుకున్నారు. చేరుకున్నారు. పోయినాడు మింగివేసింది సంద్రం! ఏడి ఏడి! అట్లా కాంతులే ఆకసంపై నిల్చినవి. "అటు చూడండి" అంటున్న కేకల్లు, కోలాహలం తిరిగి చూచాం! వస్తున్నారు, వచ్చినారు, ఎక్కినారు. అంత కాంతిలేదు. ముందు 'భస్మమా, ఎండిపోయిన వెండి పళ్ళెమా! తెలుపెక్కిన వెండిబింబమా? అవును అదే చంద్రబింబము.

ఎంత అందం! మా కందరికీ యెంత ఆనందం!

అప్పుడు చూచినా వారిని! అంత ఆనందంతో, తృప్తితో ఆకసంవంక, అటు యిటూ చూస్తున్నారు. మాటలాడితే ఆలస్య మైపోవునే మోనన్నట్లు, నాచేతిని అందుకొని, కరస్పర్శ చేసిరి. ప్రక్కకే వచ్చి. నన్నానుకొన్నట్లే వుండిరి. ఆమె అలా ఆనంద పడుచుంటే, చిన్నపిల్లలాగా, ఎన్నేళ్ళ క్రితమో, మేమిద్దరం, ఆక్స ఫర్డు నదిలో బోటుపై ఆటలాడుకుంటూ వుండినప్పుడు పొందిన తృప్తి కల్గినది.

తిరిగి గాంధీ మంటపానికి వెళ్ళాము. ప్రక్కనేవున్న, వివేకా నందుని విగ్రహమును చూచుకొన్నాము ఆ నీళ్ళల్లోనుండి నల్లగా, ఎత్తుగా తాబేలువలె తేలుతున్నట్లున్న వివేకానంద "రాక్" మిట్టను చూచినాము.

ఆ రాతివద్దకు యీతలేస్తూ వెళ్ళారట. దానిమీద ఎప్పుడో కన్యాకుమారి దేవతగా "ఓం"కార తపస్సు చేసిరని, తానుకూడ దానిపై ప్రార్థనలు చేసుకున్నారటన్నా! ఎవ్వరు? యింకెవ్వరు? వివేకానందులే "పాపం, మనకే యీ కాలంలో యిన్ని భయాలే! అడ్డంకులే! యే క్రొత్త సేవాకార్యం ప్రారంభిం చాలన్నా! ఆనాడు ఆయన కెంత భయాందోళనలు కల్గెనో,



ఆ సముద్రాలన్నీ దాటిపోయి, షికాగోలో అంతర్జాతీయ మతాల సభలో పాల్గొన డానికి సాహసించడానికి అనుకుంటున్నారు.

"సూర్య చంద్రుల దర్శించితివి. వేకానందులను మన స్సులో నిల్పితిమి. ఇక కన్యాకుమారిని చూద్దాం" అన్నా!

దేవళంలోకి పోతుంటే, నన్ను చొక్కాలు వదలమన్నారు. లోపలికి చేరాము. ఎన్ని దీపాలు, ఎంతకాంతులు. ఓప్రక్క నిల్చినాము! చూడ గల్గుచున్నాము.

ఏమి చూచితిమి! పెండ్లికూతురు ఆభరణాలతో, పెండ్లి గంధముతో, ఎంత అందం! అందులోనే సిగ్గు ఆశ, ఆతురత తృప్తి! అచ్చంగా హైందవుల, భారతీయుల పెళ్ళికూతురే!

మాట్లాడరేమి! పెళ్ళికూతురు మాట్లాడుతుందా? నడువ రేమి!! అడిగితేతప్ప అడుగు వేస్తుందా? ఎత్తుగాలేరేమి? పెం నాడు ఎంతవారైనా తల వంచుకునే వుండురుగదా! మనవంక నిండుగా చూడరేమి! తూర్పు ఖండాల పెళ్ళికూతుళ్ళకు సిగ్గు హెచ్చుగాదా! యిలాగా మా మనస్సులు పల్కరించుకొంటున్నవి.

ఏడి, పెళ్ళికొడుకు. ఎంత సేపటికి రాడేమిటి! తెలియదా, సచీంద్రములోనే నిలబడి పోయారు, రారు! ఐతే పెళ్ళో? జరగదు. అందుకే యీమె కన్య! అయ్యో! లేదులే! యిదే మంచిది. పెళ్ళి ఐతే వారింటికి వెళ్ళిపోతారు. ఇప్పుడు ఎల్లప్పుడు మనకే, మన దేశములోనే వుందురు. అలాగా కన్యాకుమారిని యెత్తుకెళ్ళాలని, దొంగిలించాలని ఎందరెందరో, ఎన్నెన్ని దేశాలనుండో దండెత్తి వచ్చారు. ఎంతోకాలం బలవంత బ్రాహ్మణార్థం చేసుకున్నారు. మన మడిమాన్యాలు చెరిచారు. మన ఇళ్ళు నీళ్ళు మండించారు. కాని తుదకు వాళ్ళే వెళ్ళిపోయారు. మనకన్య, మనం, మన యీ మూడు సంద్రాల అలలతో ఆటాడుకుంటూ, ఆ పవిత్రహిమా లయమే మన కన్యకు కిరీటముగా నిల్పుకొని, మనుచున్నాము.

యిలాగా అనుకొంటూ "ఏ మమ్మా, యిక బైలు దేరుదామా?" అన్నా!

"ఉండండీ, తొందరెందుకూ!" అంటూ ఆ దేవిని, నా దేవి మనసులో పూజించుకుంటూ వుండినారు. హారతులు పూర్తి యగువరకు.

తిరిగి వస్తూ "భారతదేశాన్ని సౌభాగ్యంగా సుందరంగా, యివాళ చూడ గల్గినానండీ" అన్నారు.

ఆనాడు కాశ్మీరులో, శంకరాచార్య కొండపైకి ఎక్కినప్పుడు, మహోబ్రానుండి టిబెట్టుకు పోయే రోడ్డుపై నడచినప్పుడు, ఋషికేష్‌లో గంగాధారలు చేతిలో పట్టినప్పుడు త్రివేణిలో కన్పడని సరస్వతిని పట్టుకున్నప్పుడు నాగార్జున జలాలను అందినప్పుడు కూడా యింత తృప్తి బొందలేదు.

ఆ రాత్రి ప్రభుత్వ విశ్రాంతి గృహములో వుంటిమి. పండు వెన్నెలలో, సముద్రము ఘోషిస్తూ, పొంగుతూ మెరిసిపోతూ వుంది. చాలాసేపు వరండాలో కూర్చొని, సముద్రునితో యేమేమో చెప్పుకున్నాం. యూరపుసంద్రాల గూర్చి వాటిపై పెత్తనం చేసిన సామ్రాజ్య దేశస్తుల గూర్చి! జోగ్ జలపాతముల నిట్లే వెన్నెలలో చూచి ఆనందిస్తిమి. వాటికి రామ, లక్ష్మణ, సీతమ్మ పేరులట. ఐతే అచ్చట యీ సముద్రము లేదుగా!

అలనాడు ఈ సముద్రము మీదనేనా శ్రీరాములు వారధి కట్టినారట! హనుమంతులు, యిప్పటి విమానాలను మించిపోయినారా? తుదకావలి తట్టున ఆ మహా రావణాబ్రహ్మను సీతమ్మ ధిక్కరించిరే! ఐనా ఆమెను బలాత్కరించకుండా ఆ బ్రహ్మ వారి సతీత్వమును గౌరవించిరికదా? అలాంటప్పుడు మునీశ్వరుడైన వాల్మీకి కూడా అంత పక్షపాతంగా చిత్రించిరేమి? ఇంతకు



హనుమంతులను, కోతిగా చిత్రించటం, ఇప్పటివరకు మన మతస్థులు వారిని పూజిస్తూనే కోతిగానే చూచుకోవడం నాకేమాత్రం యిష్టం లేదని మరోమారు . రితో పల్కితిని! 'కవీశ్వరులుగదా!! అన్నారు. "గొబ్బెల్సు మాత్రం రెండో యుద్ధంలో యేమిచేశారు. 1856—57 భారత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామమును బ్రిటీషు వారుకూడా అంత అన్యాయంగానే చిత్రించారు గదా!" అన్నారు.

తెలతెల్ల వారుతూనే తయారైనాము తిరిగి యిటునుండి సూర్యుణ్ని అటువైపు చంద్రుణ్ణి చూచుకోడానికి! గుంపులే! అందరూ సంతోషంగా ఆ జనవరి చలిలో వున్నారు సూర్యుడెంత ఆలస్యంగా లేస్తారు? ముందుచుమ్మని, పిల్ల రోజాల రుచులతో తన దూతల పంపుతారు. తళుక్కు మంటూ వున్నది. అంతలో అందులో గాటమైన, రంగులు, ఇంతలో పొడుచుకొస్తున్నాడు, వెండితెరల మధ్యగా,అరుణ వస్త్రాలతో నవ్వుకుంటూ వస్తున్నాడు యీ సూర్యుడు. ప్రార్థనాసమయమైపోయింది హృదయం! పోతున్న వెలితిపడుచున్న చంద్రుణ్ని చూడరేమి" అన్నారు - భారతీదేవి! ఆయనకు వీడ్కోలు చెప్పుకున్నాము. వెండి వస్త్రాలతో వారుఅందుకున్నారు సముద్ర జలాలను.

ఆ జలాలే యిటు సూర్యుని అందించినవి. అటు చంద్రుని పంపించినవి. మధ్య మమ్ము రంజింపజేసినవి. ఆ యనుభవాలను ఎన్నో మారులు భారతీదేవి తలుచుకుంటూ వుండేవారు.

ఆ పిమ్మట మరో రెండు పరియాయములు నేను ఆ దృశ్యాలను అందుకొన్నా! కన్యాకుమారిని చూస్తూ, భారతమాతను, భారతీదేవిని హృదయములో పరామర్శ చేసుకున్నా!

1974 మార్చి 28 తేదీన తిరిగి వెళ్ళినా! ఈమారు, మా తమ్ములు వెంకటప్పయ్య, వారి కుమారులు నాగేశ్వరరావు, భారతీదేవి మనుమరాలు, నాగేశ్వరరావు భార్య విజయలక్ష్మితో కలసి!

ఆనాటివలెనే, మా తమ్ములు అమిత ఆతురత జెందుచుండిరి సూర్యాస్తమయం దర్శించుకోవాలని! మేము ఆ చివరిగుట్ట చేరుసరికే, మేఘాలలో దాగొన్నాడు సూర్యుడు. ఓర్పుతో వుంటిమి. ఇంతలో చల్లగా కొంచెం కొంచెం వెలికి వస్తున్నాడు. పైకి వచ్చేసరికి "చూడండి. అందరూ, ఈ సూర్యుణ్ణే ఆనాడు వివేకానంద స్వామి పూజించి అమెరికా వెళ్ళాడు భారతదేశపు సువార్తను ప్రపంచానికి అందించినది ఈ సూర్యభగవానుని ప్రభావం వలనే!" అంటున్నారు మా తమ్ములు.

ఆ రాత్రి వివేకానందపురంలో బసచేసినాము. మరునాడు ప్రొద్దున, ప్రత్యేకంగా, వివేకానందపురంవారు నడుపుచున్న లాంచిలో వివేకానంద కొండపైకి వెళ్ళినాము. అంతా రెండు ఫర్లాంగుల సముద్రపుటలలమీద.

ఆ పైన ఎంతో అందముగా నిర్మించినారు "ఓం" కారమనే "శ్రీపాదము"పై, పురాతన, శివాలయ ధోరణిలో మందిరము. దాని కెదురుగా, వివేకానంద కంచు విగ్రహ మంటపము దాని ప్రక్క మనస్సు, హృదయం వుల్లాసం బొంది ఆత్మసంపద అందిస్తున్న ప్రార్థనా మందిరం, అం దేవిగ్రహం లేకుండా, ఓంకార అక్షరదీపం అమర్చినారు ఇవ్వి చూచుకోడానికే మా తమ్ములు ఎంతో కాల నుండి ధ్యానం చేస్తూ వుండినారు. ఆ వివేకానంద కాంస్య విగ్రహం వుత్తేజకరంగా వున్నది. మా తమ్ములకు గొప్ప తృప్తి కల్గింది.

నేనూ భారతీదేవి యీ యాత్ర చేసినప్పటికి (1959) యీ నిర్మాణముల వార్త లుండినవి కొంత విరాళములు కూడా పంప



గల్గితిమి. 1974లో వివేకానంద గుట్ట ప్రాభవము, మందిరం, విగ్రహం దర్శించు భాగ్యము బొందితిమి.

ఆ 1939లో బర్మా యాత్రలో, రంగూనులో రామకృష్ణ మిషన్ వారి ఆస్పత్రి చూచి, అలాంటి సేవా ధోరణి అత్యవసర మన్నారు భారతీదేవి. 1952లో ఆ మిషను వారికే కరవు నివారణకై తాము జమచేసిన లక్షలాది విరాళములు అందించిరి. ఇప్పుడీ నాడు శ్రీ స్వామి రనడే యేర్పరుస్తూవున్న, వివేకానంద కొండ మెమోరియల్ సేవాదళ ప్రణాళిక తెలుసుకొని, యెంతగా ఆనంద పడేవారో! లక్షమంది గృహస్థాశ్రమములో వుంటూనే, సంఘ సేవ, మానవసేవ చేయుటకు కంకణధారులైన, వివేకానంద ముద్రితులను తయారు చేయుటకు యీనాటి యీ కన్యాకుమారి వివేకానందాశ్రమం పూనుకొన్నది. ఇది శుభదాయకం.

ఈ తలంపులతో త్రివేణీ, త్రిసంద్రముల కలయికవద్దనే, భారతీదేవిచే పవిత్రములైన మట్టి రేణువులను, నిడుబ్రోలునుండి భద్రముగా తెచ్చి, అర్పించగల్గితిని. ఆనాడు మహాత్ముని రేణువులను అందుకొన్న త్రివేణియే, వారి పుత్రికయైన భారతీదేవిని కూడా స్వీకరించిరి. మన త్రివేణులే మన స్వర్గాలు. అందులో చేరిరి, బాపుజీ, భారతీదేవి.

—:o:—

# స్వర్గారోహణం

## బాపూజీ అప్పుడు 1948

4, విండ్సన్ ప్లేస్, న్యూఢిల్లీ,
31-1-48

నా ప్రియమైన భారతీ,

పత్రికల్లో చదివితివా? లేక, రేడియోమీద విన్నవారు వచ్చి చెప్పిరా? ఎంతటి దారుణానుభవము :

Foreign Affairs Committee లో 5.30 లకు నిన్న కలుసుకొంటిమి. నాల్గు నిముషాలలో పండిట్ నెహ్రూకు టెలిఫోను వచ్చెను. మరొక నిముషములో ఆయన తిరిగివచ్చి, గాంధీజీని షూట్ చేసిరట, గాయాలు బలంగా వున్నాయట, అని చెప్పిరి. వెంటనే అందరం కారులలో బయలుదేరితిమి. బిర్లా యింటికిచేరి, జనులను సర్ది, గేటువారల దాటి, లోపలికి పోవుసరికి, మహాత్ముని కళ్ళు పూర్తిగా మూసుకుపోతూ వుండినవి.

నిర్విణ్ణులమైతిమి. డాక్టర్లు, మందులు, వగైరా సాయమేది? అవసరం మాత్రం యేది? నాల్గు అడుగుల దూరంలో నుండియే, షూటుచేసినాడట. దెబ్బ తగలడంతోటే. రెండు చేతులెత్తి దణ్ణంపెట్టి, హేరామ్ అన్నారట, అంతే, తిరిగి కళ్ళు తెరవలేదు. అర్థగంటలో ప్రాణం పోయింది. రామకోటి వ్రాసే వారి కలా హేరామ్, అనే అదృష్టము కల్గునా? మేము 20 మందిమి చేరితిమి.



ఢిల్లీ లోని గాంధిమహాత్ముని సమాధివద్ద శ్రద్ధాంజలి ఘటిస్తున్న భారతీదేవిజీ (1958)
(ఎడమనుంచి కుడికి) :- శ్రీమతి పుష్పకుమారి, శ్రీమతి భారతీదేవి, శ్రీ రంగాజీ, శ్రీ పి. ఆర్. పరుచూరి.

ఆ పిల్లలు, మహాత్ముని 'గీతా పాఠముల' ప్రార్థన చేయుచుండిరి వారి దుఃఖమేమనిచెప్పాలి? ఇనా పండితులు, సర్దారు, మేము ఓర్చుకుంటూ వుంటిమి. మాకంతా తల దిమ్మెక్కినట్లేయుండెను. దేవదాసు వచ్చెను, లక్ష్మితో! మహాత్ముని దగ్గరకు వెళ్ళెను. అంతటితో దుఃఖము ఆపుకోలేక, మొగాన్ని ముద్దాడు తున్నాడా అన్నట్లు వాలి. 'బాపూ' అంటూ యేడ్చెను. అందరం యేడ్చే. పట్టుకోలేక పోతిమి.

కొంత సేపటికి తేరుకున్నాము.

ఐతే, చనిపోయినారా? నిజంగానేనా? మొన్న 24 నుండి 26 వరకూ మాతో కూర్చొని వుండెనే? 26 వ తేదీన తన ఆశయాలేవో, జనుల కేలాంటి పంచాయతీపాలనం రావలెనో చెప్పుచుండిరే? ఆ 26 తేదీననె స్నానపు గదినుండి, తన పరుపువరకు, నా భుజముపై చేయివేసి, తాను నడచివెళ్ళి నన్నాశీర్వదించెనే? హైదరాబాదు గురించి, కాంగ్రెసు కాన్‌స్టిట్యూషను గురించి నాతో ముచ్చటించిరే?

క్రిందటి 26 సంవత్సరాలనుంచి నా ఆలోచనా ప్రపంచమందు దివ్యజ్యోతిలాగా వెల్గుచుండిన మహాత్ముడొక తుపాకికి లొంగిపోవునా? అంతటి బ్రిటీషు ప్రభుత్వమునకు లొంగలేదే? యిట్లా ఎన్నో ఆలోచనలు పరుగులెత్తు తుండినాయి?

ఏదో! వేదన. దాంతో ప్రార్థన! ఏమని? తిరిగి ఆయన రావాలని, ప్రాణం పొందాలని? కళ్ళు తెరవాలని? ఆయన ప్రేమ వాహినుల ఆహ్వానించుకుంటూ, ఆయన ఆశీస్సుల పొందుచూ. దేశానికింత బలమిచ్చుచున్న యీ పండితుడు, సర్దారు లేమను కొంటున్నారో!



శ్రీ నాగేశ్వరరావు, విజయలక్ష్మిగార్ల కుమార్తె చిరంజీవి భారతీదేవి పుట్టినరోజుపండుగ (2-10 68) నాడు గండికోట రిజర్వాయరువద్ద విహారయాత్ర సల్పుతూ - శ్రీమతి భారతీదేవి, రంగాజీ, విజయలక్ష్మి, చిరంజీవి రమ, చిరంజీవి భారతీదేవి, చిరంజీవి పుష్పకుమారి (భారతీరంగా మేనగోడలు)

ఎట్టకేలకు ఆ గది వదలితిమి. అయిపోయిందనుకున్నాము. ఐనా ఆ ఇల్లు వదలగలమా? రాత్రి 8 గంటలకు బైటికి వచ్చితిని. రేడియో కేదో చెప్పితి. మరొక్కరితో మాట్లాడాలనిపిస్తుందా?

యీ దినం 10-30కి అక్కడికి చేరినాను. ఆ పూలపాన్పుపై వస్తూన్న 'బాపు'ను చూచుకుంటిని. ఆ ప్రజా బాహుళ్యపు కోలాహలములో - విషాద వాహినిలో 2-30వరకు నడుస్తూ, ఇండియా గేటు చేరితి, ఎట్లనో. స్పీకరు మవలంకరు సహాయంతో రాజఘాటు చేరుకున్నాం. ఆ మంటల చూడగలనా! నడుం బ్రద్దలై పోతున్నది. యిక ఆగలేక యింటికి వచ్చితి, బాపూజీ ఆత్మశాంతికై ప్రార్థిస్తున్నాను. యిక ముందెవ్వరివద్దకు మనోబలం కొరకై ఆత్మ శక్తికై వెళ్ళుతాము? ఎవ్వరిక అంత ప్రేమతో ఆదరించుతారు? దేశానికి దీపమేది? యిదే బాధ జవహరుకు.

నీవెంత బాధపడుచున్నావో అనే భయం కలదు. ఐతే, ధైర్యస్థురాలవుగదా? మన హృదయాల్లో బాపూజీని నిల్పుకున్నాము. పూజించుకుంటాము. మన 'బాపూ'ను మన ద్వారా మన ప్రజలకు అందించుకుంటూ వుండగలములే.

ప్రేమ, రంగ

## దేవీజీ యిప్పుడు 1972

### గోభూమిలో సెప్టెంబరు 29న

దేవీజీ ఎల్లప్పుడూ తన వ్యవసాయపు పనులూ, ఇతర వ్యవహారాలూ చూచుకొంటూ వీలున్నప్పుడు విశ్రమించే ప్రక్కమీదకు - నేటి సాయంత్రం నేను నా "నడక" పూర్తి చేసుకొని వచ్చి — ఆరుంబావు గంటలకు చేరితిని.



మెడలమీద కొంచెం నెప్పిగా వున్నదంటిని. ఆమె తన పనులమీద వంట యింటిలోనికి, హాలులోనికి వస్తూ పోతూ, పని వారితో మాట్లాడుతూ తిరుగాడు తున్నారు.

నా మెడలమీద అమృతాంజనం రాచిరి భుజాలను సవరించిరి. పడక ప్రక్కనే వున్న ఢిల్లీ పేము బుట్టమీద కొంచెంసేపు కూర్చొని మాట్లాడిరి.

ఇంతలో ఎవరో వచ్చిరి. వారితో వ్యవసాయపు పనుల చర్చలు, చర్చిస్తూనే వస్తూపోతూ నన్ను పలకరిస్తూనే వున్నారు. ఆమె అట్లు తిరుగుతున్నప్పుడు నా పాదాలు ఆమెకు కొంచెంగా తగులుచున్నవి. అయినా పలుమారులు అలాగా స్పృశించడం తనకు ఇష్టమైనట్లే నాకుమాత్రం అదొక మహదానందం.

అసలు ఆమె కావాలనే నా పాదాలను పరామర్శ చేస్తున్నారా! - అంతటి దేవీ...! అని నేను ఆలోచిస్తున్నాను. అందువల్లనే నేను పాదాలను ముడుచుకోలేదు. ఈ పాదస్పర్శ అనుభవం తనకు తెలియకనే - తుదిగా కుతిగా జరుపుకొన్న అనుభవంగా — చిత్రంగా జరిగిపోయింది.

... ... ... ...

ఆ రాత్రి బైట, వంటగదికి దగ్గిరగా తనకు బాధలేకుండా భోజనం వడ్డించమన్నా.

ఒప్పుకోలేదు. శ్రమ అనుకోకుండా శ్రమతో ప్రక్కనున్న టేబులు మీదనే పళ్ళాలుపెట్టిరి. యిప్పటి యట్లే నాతో కూర్చొని భుజించిరి. ఎన్నో విషయాలు మాట్లాడిరి. ఎన్నో ఆలోచనలు తెల్పిరి.

నేనిక పైకి వెళ్ళేవేళ అయినది. సంవత్సరంనుండి మెట్లెక్కడం దిగడం సాధ్యంకాక, దేవీజీ పైకి రావడమే లేదు.

మెట్లు ఎక్కుతున్నాను. దారిలో - వారు వెల్గించిన దీపమునకు - ఎప్పటివలెనే వందనం చేసితిని. తలుపువరకు దేవిజీ నా వెంట వచ్చిరి.

గుమ్మంవద్ద వెనుదిరిగి - వారివంక చిరునవ్వుతో చూచినాను. ఆమెకూడ మందహాసము చేసిరి.

"విశ్రాంతి తీసుకోండి. చదువు ఇప్పుడొద్దు" అన్నారు. వారి చుబుకము అందుకొంటిని. చెక్కిలి నవరించితిని. ఆమె 'చిన్నతనపుచేష్ట' యన్నట్లుండిరి.

ఆమె స్వరూపమే, ఆ చిరునవ్వే, ఆ అనురాగ స్పర్శయే నాకొక గొప్ప తృప్తి, శక్తి అందించగల్గినవి. ఒకసారి నా భుజంపై చేయివేసి, తదుపరి 'తలుపు వేస్తా''ననిరి.

తలుపు వేసుకొనిరి.

తలుపు మూసుకొన్నది.

నేను వారినే తలుచుకొంటూ అడుగు వేసినాను.

ఇకనట్లు వారు పరామర్శించుటకు అదే చివరి మాట అని...ఆ తెల్లవారు వరకు తెలియదుగదా!!!

□ □ □

గుంటూరు హాస్పిటల్‌లో... సెప్టెంబరు 26

"ఇన్ని గంటలు ఇలా నావద్ద కూర్చుంటూంటే ఎలా? మీకు బాధ"అన్నారు దేవిజీ.

అయినా నేను దగ్గరుంటే ఆమె కెంతో తృప్తియే!

నేను ఆప్యాయంగా ఆమె భుజాలు, వీపు, మోము, ఫాలము. జుట్టు సవరిస్తూవుంటే - ఎంతో తృప్తిగా వుండేవారు!



ఆమె అటుతిరిగి పరున్నప్పుడు - నేను నెమ్మదిగా తన వీపు, భుజాలు సవరిస్తూవుంటే-వెంటనే ఆ స్పర్శనుబట్టి నేనేనని గుర్తించేవారు, తృప్తిగా నిట్టూర్చేవారు.

—ఆమె చేయెత్తిరి.

ఎందుకో అనుకున్నా — ముందుకు వంగినాను. నాకొరకేనని, నాచెక్కిలి స్పృశించే సరికి తెలిసింది!

మెల్లగా, చల్లని కదలికతో, నులివెచ్చని తన వ్రేళ్ళతో నా చెక్కిలి నిమిరిరి. నా గడ్డమును అందుకొనిరి. ముక్కును తాకిరి.

నాకేమో ఆ మూర్తి అంతా నన్ను ఆవరించినట్లు అదొక స్వప్నం, మైకం! అమృతం, బలం, ప్రాణం. ధ్యానం అందినవి!

ఆమె కళ్ళలోనికి చూచితిని. ఎంతటిప్రాణం! ఎంతప్రేమ! ఎంత సంతోషం! తృప్తి!

ఆ స్పర్శ, ఆ చూపు, ఆ తృప్తి నాకు దైవలీలగా, జగన్మోహన కరంగా మేల్కొలుపుగా తోచినది.

నెమ్మదిగా ఆ బంగారు చేతిని అందుకొని, నిమురుకొని, దించి, తిరిగి మంచముపై భద్రంగా ఆచేతిని తనకే అర్పించితిని! దేవునకు అర్పించుచున్నానని అప్పుడు తెలుసుకొనలేకపోయితినే!!!

—ఆ స్పర్శ, బుజ్జగింపు. లాలింపుల చిరుచూపులు-నాకెంతో మహద్భాగ్యమును అందించిరి.

క్షమ, దయ, ప్రేమ, తృప్తి, ఆశీస్సు, ఆ చిన్ని స్పర్శ ద్వారా పొంది ఆనందించితిమి!

మనదారి మంచిదే...

అది దైవనిర్ణయమే...

మనము ప్రజలకొరకే నిల్చితిమి.

దానినే ధ్యానించితిమి.

.............................

మన మిద్దరం ఒక్కటే!

మధ్య కలిగినవన్నీ మరచితిమి!

మనలను మనం నమ్ముకున్నాం!

.............................'ప్రేమించుకున్నాం'

మనకిదే ప్రాణం.

నాతోనే వున్నారు మీరు.

మీతోనే వున్నాను నేను.

మీకు దిక్కు దేవుడు...

...నేను వుంటాను."

అన్నారా దేవీజీ?

అన్నారని, - అనుకున్నారని - చూచినారని, ఆశీర్వదించినారని...అనిపించింది...

□ □ □

విషఘడియలలో...

సెప్టెంబరు 27 ప్రొద్దుట: ప్రక్కనేవున్న నన్ను పిలిచిరి. ఏమైనదోనను భయంతో వెనురిగినాను.

పాల గ్లాసు చూపించిరి.

నన్ను ఆమెకు ఆ పాలను అందించమన్నారనుకున్నా...

ఆమె నావంక చూచి "తీసుకోండి." అన్నారు. మీరు తీసుకోండి.



"నాకెందుకు?" అంటిని.

ఆమె నావంకే చూస్తూ "మధ్యాహ్నం వరకూ ఉండవద్దా' కొంత బలమిస్తుంది. తీసుకోండి'అనిరి.

వారి వద్దనె కూర్చుని – ఆమెనే చూస్తూ - నవ్వుకుంటూ ఆమె హృదయం, ఆప్యాయత తలుచుకుంటూ - త్రాగితి!!!

ఇక ఇదే ఆనాటికి నాకు ఆహారం, ఆమె ద్వారా, ఆమె సమ్ముఖాన, అట్లు ప్రేమదృష్టులలో...అదే దేవుని ప్రసాదం – ఆమెద్వారా నాకు అందినది...

"కొంచెం విశ్రాంతి తీసుకోండి అన్నా, వెలుపలికి వెళ్ళుతూ.

శ్రీ ఉమామహేశ్వరరావును పిల్చుకొని లోపలికి తీసుకొస్తున్నాను మరోక్షణంలోనే

అంతలో...

డాక్టర్లు...నర్సులు - సరసర లోపలికి వస్తున్నారు. మేమూ లోపలికి చేరాము.

దేవీజీ——

దిండునుండి జారిపోయి వుండిరి.

ఊపిరి అందడంలేదనిపించింది.

నాడి చూచిరి!

ఆక్సిజన్ అందించిరి.

కళ్ళు... తెరవడంలేదు.

ఇక...

పోతున్నారు సెకండ్లలో...

ఇ. సి. జి. వంక ఆత్రుతగా చూస్తున్నారు – ఎందరో డాక్టర్లు. హృదయాన్ని స్పందింపజేయాలని ప్రయత్నాలు చేస్తున్నారు. నిముసము గడిచింది. నా దేవిని అలా కదలించుతున్నారే!

రావడంలేదు – ప్రాణం!

గుండె కదలిందా?...ఏమో!!

ఆమె పోరాదనుకుంటున్నాను.

ప్రార్థనలు చేసుకుంటున్నాను. వీభూతి పాదాలకు రాస్తున్నా. ఏదో ఆశ నిరాశలో ఆశ!

డాక్టర్ల సపర్యలు, ప్రయత్నాలు. ఆ మెషీన్లలోని మెరుపులు చూస్తూంటే – దేవీజీ తిరిగి వస్తారనిపిస్తుంది.

డాక్టర్ల దేవి వదనాలు......చూస్తూంటే ఆశలు పోతున్నాయి...... పోయినాయి.

ఇక మనదేవి

మన తల్లి

నా భారతి...లేదు!

ఎగిరిపోయినారు...మరలి రా వీలులేని లోకాలకు ఎగిరి ఎగిరిపోయినారు

కాలము, ఆలోచనలు, భావనలు....సర్వం ఆగిపోయినవి.

□ □ □

# భారతీదేవికి నివేదనం

## AGONY AND SOLACE

### అనే గ్రంథముగురించిన అనుభవాలు

(పోస్టుకార్డు వారి గుప్తధనం)

అయిదు దశాబ్దాల సుదీర్ఘ ప్రజాసేవా జీవితంలో ఆచార్య రంగాజీకి ఏందరో సహచరులు, అనుచరులు, శిష్యులు, ప్రశిష్యులు ప్రపంచవ్యాప్తంగా ఉన్నారు. ఆయన సిద్ధాంతాలలో మనసా, వాచా, కర్మణా విశ్వాసంగలవారు ఆదరణతో, ప్రేమతో, భక్తితో, ఆరాధనతో ఆయనకు లేఖలు వ్రాస్తుంటారు. వివిధ జాతీయ, అంతర్జాతీయ సమస్యలీ లేఖలలో ప్రస్తావనకు వస్తాయి. కోట్ల కొల్లలుగా పరిష్కారమార్గాల్లు సూచితమౌతాయి. సలహాకోసం ఎందరెందరో ఆయనను కోరుతూవుంటారు. వివిధదేశాధీశులకు, ప్రజాసేవకులకు, కార్మిక కర్షకనాయకులకు ఆయన సలహాలిచ్చి మార్గదర్శకులైన సందర్భాలెన్నో! కేంద్రరాష్ట్రప్రభుత్వాలకు వేర్వేరు సందర్భాలలో రంగాజీ అందించిన సూచనలెన్నెన్నో కొన్నిటిని ప్రత్యక్షంగా, మరికొన్నిటిని పరోక్షంగా ప్రభుత్వాలు అమలు జరుపుకొన్నాయి. ప్రభుత్వాధినేతలు తప్పు పథకాలను వేసుకొన్నప్పుడు, అనాలోచితంగా ప్రవర్తించనున్నప్పుడు ఆయన వెంటనే హెచ్చరికలు చేస్తారు. మంచిపని ఆలోచనలోనికి వచ్చి

నప్పుడు తక్షణం వారికి తెలియజేస్తారు. ప్రభుత్వాలు మంచి ముందడుగు వేసినప్పుడు వాటిని అభినందిస్తారు.

ఇదంతా ఒక లేఖావాహిని ఉత్తర ప్రత్యుత్తర భారతం. దీన్ని చదివితే వివిధనాయకుల, ప్రజాసేవకుల అభిప్రాయాలు - వాటి మార్పిడులు; సూచనలు - వాటి విశేషాలు; కార్యక్రమాలు వాటి తీరుతెన్నులు; నూత్న సంస్కరణలు - ఉన్నతాదర్శాలు.... అన్నీ, ఇవన్నీ అద్దంలో చూచినంతటి స్పష్టంగా యీ పుస్తకములో కనుపిస్తాయి.

ఒకానొక సందర్భంలో వెల్లూరు జైలులోవున్న రంగాజీకి మహాత్ముడు స్వహస్తంతో వ్రాసినలేఖ, పూర్వాపరాలు - రంగాజీపట్ల మహాత్మునికిగల గొప్ప ఆశకు, ఆదరణకు, గౌరవానికి ప్రతిబింబం. అభిప్రాయ ప్రకటనలో సూటిగా చూసుకుపోవటం; నమ్మినదానిని ఢంకా బజాయించి చెప్పడం — మొదలయిన మహోన్నత విశిష్టగుణ విలసితునిగా తనను తాను రూపొందించుకొన్న మహానాయకుని, యథార్థ ప్రజాసేవకుని నిండురూపం మనకీ గ్రంథంలో సాక్షాత్కరిస్తుంది. ఈ రూపం విశ్వరూపమై గత కొలది దశాబ్దాలలో ప్రపంచ వ్యాప్తంగా జరిగిన సామ్రాజ్యవాద, వలస తత్త్వ వ్యతిరేక మహోద్యమాన్ని, దానికీ దంపతులు అందించిన దోహదాన్నీ చిత్రీకరించి, ప్రదర్శిస్తుంది.

ఇది దేవిజీ నిక్షిప్తం చేసిన గుప్తధనం! ఈ లేఖల పరంపర తన హృదయపేటికలో ఆమె భద్రపరచుకొన్నది. ఇది మానవజాతి పరిణామ చరిత్రలో కొంత — ముఖ్యమైన భాగంగా భాసిల్లుతుందని ఆమె భవిష్యద్దర్శనం చేసుకొన్నది. తన మధుర స్మృతులకు తోడుగా ఈ లేఖావళినికూడ దేవిజీ రంగాజీకి ప్రసాదించింది. కనుక ఈ గ్రంథ మాయిల్లాలికే 27-9-'74న, వారి స్మృత్యర్థంగా విజయవాడ, రంగానగరంలో గృహరూపంబొందిన



“భారతీ కుటీరంలో” నివేదితమైనది, యిది రంగాజీ తూలికచే దేవీజీ చిత్రించిన చరిత్ర పుష్పం.

— దివ్యప్రభాకర్, వాహిని సంపాదకులు.

దేవునితో చేరిపోయిన భారతీదేవీ, నీకివే మా ప్రేమ పూరిత పూజలు.

1971లో “ఇంకెంతకాలం, యీ కాగితాలకట్టలు, వుత్తరాల సరాలను భద్రపరుస్తూ వుండగలను? చదలు, చీములు, ఎలుకలు, దుమ్ము తినేస్తున్నవి. ఎన్నోసారులు దులుపుతున్నా, ప్రతి పర్యాయం ఎన్నెన్నో కాగితాలు పాడైపోతుంటే, దుఃఖం వస్తుంటుంది. ఎలాగో తీరిక చేసుకొని అప్పుడప్పుడు కొన్నింటిని దేశ, విదేశ వ్యవహారాలు, మిత్రులకు చెందినవిగా జూచి, కట్టలు కట్టుతున్నా! రైతాంగ వుద్యమము గురించిన కాగితాలు వేరుచేస్తున్నా ఈ శ్రమ భరింపజాలం. కనుక వీటిని తిరిగి చూచుకొని, వుపయోగమైన వాటినల్లా చేర్చి, వీలుంటే పుస్తకంగా తయారు చేయండి” అన్నారు.

“అర్థశతాబ్దము నుండి యీ రైతుకూలీ, తదితర శ్రామిక జనాలకై మన శక్తికొలది, మన ఆశయాల ననుసరించి సేవలు చేస్తున్నాము. త్యాగాలెన్నిటినో చేసినాము. బాధలనెన్నిటినో ఆశాభంగములు మరెన్నిటినో భరించితిమి. మన జీవితధోరణి, ఆశయాలు ధర్మమైనవి. మన కృషిఅంతా శ్రమజీవులు, ధర్మజీవులకేగదా! ఎలాగా, ఎంతెంతగా, ఎందరెందరి సహాయము స్నేహితము, ప్రోత్సాహములతో మనం శ్రమించితిమో ఈ వుత్తరలు, స్టేటుమెంట్లు తెల్పగలవు. మనం సంపాదించుకొన్నది ప్రజాసేవలేగదా. ఈ చరిత్రను యీనాటి, ముందు తరాలవారికి అందించడం మంచిది” అన్నారు,

నాకెంతో ఆనందం కల్గినది, నా దేవికి మా జీవితక్రమము వా వ్రతములందు ఏవిధమైన నిరుత్సాహము లేదులే ఎంతోతృప్తి

వుండిన ప్రజావుద్యమాల ననుసరించి, వుత్తరాలను కట్టివుంచిరి. వాటిపైన ఏయే వుద్యమాలలో, ఎవరెవ్వరు ప్రముఖంగా మాతో కలిసి వుండిరో, వివరాలు వ్రాసివుంచిన 'నోట్సు' చూచుకొంటిని. కొన్ని కట్టలమీద, ఏయే తేదీలలో అలాగా సవిర్శనంగా పరీక్షించిరో ఉదహరించిరి

అన్నికట్టలు ఒక్కచోటలేవు, క్రమంగా అందుకొంటూ వుంటిని, వీలైనంతవరకు, శ్రీ కావూరి సుబ్బారావుచేత, టైపు చేయిస్తూ వుంటిని.

ఇంతలో, బంగళాదేశపు స్వాతంత్ర్య సమరం వచ్చె! ఇద్దరికి అది ఎంతో ఉల్లాసం కల్గించినది. క్రమంగా కోటిమంది బెంగాలీ నిర్వాసులు భారతదేశానికి తలదాచుకోటానికి రావడం పాకిస్తాను సైన్యాలు పదుల వేలమంది స్వాతంత్ర్య ప్రియుల హింసించడం, వీరుల చంపటం, ఆ మరణకాండ – మా హృదయాలను ఎంతో తొందర పరుస్తూ వుండెను, ఆ 1930-45 భారత స్వాతంత్ర్య సంగ్రామం అనుభవాలు జ్ఞప్తికి తెస్తూ. ఆ బెంగాలీ ప్రజల బాధలు పదేపదే ఆందోళన పరుస్తూ వుండెను.

"అటులేగదా, ఆఫ్రికా దేశాల ప్రజలు, యిటు ఇండోనీషియా, మలేషియా. బర్మాప్రజలు స్వతంత్రమునకై పోరాడిరి. ప్రాణాలు అర్పించిరి. రకై గూడా మనం ఆందోళన చేసితిమే! సంస్థల నేర్పరచితిమే। ప్రపంచయాత్రలు చేసితిమే। మన యీ రికార్డులు వున్నవే! అందుకే వాటిని ప్రచురించమ టున్నాను" అనిరి. బంగళాదేశపు ఆ 1971 డిశంబరు 15వ తేదీ, మన ఆగస్టు 15 లాగా, పవిత్రమైనదనుకున్నాము.

ఇంతలో 1972 సెప్టెంబరు వచ్చినది. వినయాశ్రమానికి యిద్దరం 17వ తేదీన వెళ్ళితిమి. గాంధీయ సిద్ధపురుషులు, స్వామి సీతారాం, తుమ్మల బసవయ్యగార్లకు జోహారు లందించితిమి.



20–9–72లో స్వర్గీయులైన శ్రీ యెర్నేని సుబ్రమణ్యం ఆనాడు అచ్చట మాతో కలిసివుండిరి. అప్పడే దేవీజీ గుండెదడ ప్రారంభమైనదంటిరి: నా కెంతో భయం కల్గినది. గోభూమికి రాగానే, ఆ రికార్డుల గురించి తిరిగి జ్ఞప్తికి తెచ్చితిరి. ప్రతిదినం మరెంతో శ్రద్ధ ఆపనికే చేస్తూవుంటూవుంటే నాతో చేరి ప్రతిదినం కాఫీ తీసుకొంటూ, కొంచెం తలనొప్పిగా వున్నదంటిరి. 21వ తేదీన ప్రొద్దుటే పది గంటలప్పుడు ఆ పుస్తకపు పనిమీద వుంటూ ఉండగానే, కబురంపితిరి, లోపలికి రమ్మని! ఇంతలో, గుండెకే ఆపద వస్తున్నదే! 27 వరకు డాక్టర్ల మాటల మీదనే ప్రాణాలు నిల్పుకొంటిమి. 27న స్వర్గారోహణమే జరిగె.

అప్పటినుండి ఇప్పటివరకు, దేవిజీ ఆజ్ఞను పాటిస్తున్నాము. స్థానిక కాలేజీ లెక్చరర్లు శ్రీ అమరయ్య. ఉమామహేశ్వరరావు, శివరామకృష్ణయ్య, సుబ్బారావు, శెక్రటరీ కావూరి సుబ్బారావు, ఈ గ్రంథమును తయారుచేయుటలో హృదయపూర్వకంగా సహకరిస్తూవున్నారు. మిగిలిన రికార్డుల కొరకై, దేవీజీ పెట్టెలలో వెదుకుతూ వుండగా, ఎచ్చటో అతి భద్రంగా వో చిన్నపెట్టె అడుగున ముఖమల్ సంచి వున్నది. అందేమివుండునబ్బా? పెద్ద డబ్బులా? మాకెక్కడివి! ఆమె గాజులు, తాళిబొట్టు గొలుసు, పోగులు, ఆనాడే అందించిరే? భద్రంగా తెరచితి. అదొకకార్డు. మాసిపోయింది. కందివున్నది. వెలికితీసితి. ఓహో. అది మహాత్మగాంధి వ్రాసిన కార్డు. దానిపై వెల్లూరు జైలు అధికారుల దస్కతులు, పోస్టుముద్ర, సేవాగ్రాంనుంచి బయలుదేరింది. ఆయనే స్వయంగా వ్రాసిరి. వుత్తరమేనా! అడ్రెసుకూడా స్వహస్తముతోనే! వుత్తరంచివర 'బాపు'అన్నారు. ఆపైన "యం.కె.గాంధి" అని లిఖించిరి. అబ్బ! ఎంతటి నిధి! అంతటి పవిత్రమైన, ఖరీదుల కందని, దైవ ప్రేరితమైన వుత్తరమని ఆమె గ్రహించిరి. అందుకే అంతగా, భద్రపరచిరి. ఇప్పుడదే Agony and Solace అనే ఈనాటి పుస్తకానికి. తన గ్రంధానికి తలమానిక మగుచున్నది.

ఆ పవిత్రమైన పోస్టు కార్డుకొక ప్రత్యేక ప్రాశస్త్యము. చరిత్ర కలదని వారికి ప్రత్యేకంగా తెలుసు,

1940లో, నేను బ్రిటిషువారి యింటర్న్‌మెంటు ఆర్డరును ధిక్కరించి, జైలుకు వెళ్ళగా, జాతీయ ఉద్యమములో ఆనాడు మహాత్మాగాంధి, సుబాస్‌బాబుల మధ్య చెలరేగిన వివాదములో తన్ను కాదని సుబాష్‌కే తోడగుచుంటినని, తన చెంతనున్న వర్కింగు కమిటీసభ్యులు చెప్పుచున్న వైరుధ్యపు మాటలవల్ల భ్రమపడి, గాంధీజీ నాపై కోపము పొందిరి. "జైలునుండి వెలికి వచ్చి, యింటర్న్‌మెంటులో వుండవలసిందే" నన్నారు. అదెంతో అన్యాయమన్నాం! ఆంధ్రలోనేగాక దేశమంతటా, దేవిజీ, స్వామి సహజానంద సరస్వతి, సుభాష్‌బోసు ప్రభృతులెంతో ఆందోళన చేసిరి. ప్రముఖ యెడిటరు పోతెను జోసెఫ్ "రంగాయెడల అంత అన్యాయమా?" అన్నారు. ప్రకాశం నన్ను బలపరచిరి. తుదకు గాంధీజీ తన ధోరణిని మార్చుకొనిరి. మందసా కాల్పుల కేసు ప్రభుత్వం తెస్తే "డిఫెన్సు" పెట్టమని సలహా చెప్పిరి, తిరిగి తానే తన ప్రేమామృతం ప్రకటిస్తూ వ్రాసిన, శాంతి సందేశమే ఆపోస్టు కార్డు. అందుకే అది ఆమెకు అంత ప్రాణప్రదమైనది. తనకు అది విజయపత్రము. అందుకే అంత భద్రంగా దానిని దాచుకొనిరి.

ఈ విజయపత్రము నాకు దొరికినప్పుడు, దేవిజీ యే యీ గోభూమిలో వుండివుంటె, ఎంతటి వుత్సవం. ఎలాంటి వుల్లాసం అనుభవించుకోగలెవారమో ఊహించతరమా! సంవత్సర పర్యంతం ఆంధ్రోద్యమము ప్రజాబాహుళ్యపు ఆందోళనగా అందరిని - ప్రెస్సువారిని - మమ్ము ఆవరించుకొన్నది. అయినా అందరం శ్రద్ధతో కృషిచేస్తూనే వున్నాము. ఇప్పటికి 625 పేజీల పుస్తకమైనది. ఐనా తృప్తిలేదు. ఢిల్లీలో ఎన్నో మారులు మకాములు మారుస్తున్నప్పుడు, రాష్ట్రకాంగ్రెసును యితరులు ఆక్రమించుకొన్నప్పుడు, మరెన్నో ఒడుదుడుకులు మా జీవిత సంలిల్లో



అభిమానం కలుగుతూవుండేది అటుల తెలుసుకొన్నప్పుడు! ఓపిక జేస్తూ రికార్డులను పరీక్షించడం మొదలు పెట్టితిని. ఎంతో ఆశ్చర్య చకితుడనై పోయినా. ఆమె అప్పటికే. వేర్వేరుగా, మేము సాగిస్తూ కల్గుచున్నప్పుడు, ఎన్నెన్నో రికార్డులు పోయినవే! దేవీజీయే యెటులో నిల్పుకొన్నవే ఇప్పుడు అందనవి. అవ్వి ఐనా 1936నుండి. వీటితోనే యింత పుస్తకమైనది. ఇదంతా దేవీజీ ప్రసాదమేగదా! 1923-36 మధ్య రికార్డులు లేనేలేవు. ఇప్పుడీ పుస్తకం చదువుకుంటే ప్రపంచమందలి సామ్రాజ్య శక్తుల నెంతగా ఎదిరించితిమో, జయం సాధించితిమో, కొన్ని తరాలవరకు స్వరాజ్యము కనుచూపు మేరలో వుండదనుకొన్న ఆఫ్రికా దేశాల స్వతంత్రముకై ఆశించి, పోరాడుతూ, స్వతంత్రవీరుల బలపరచితిమో. వారందరీనాడు స్వతంత్రులగుటచూచి ఆనందించితిమో అందులో మేమెంతెంతగా సహకరించితిమో, కళ్ళకు కట్టినట్లున్నది. ఇదంతా జరుగునని, అవసరమని, మనదేశీయులకు శుభమని మేమిద్దరం విశ్వసించితిమి. సాధించితిమనే తృప్తి భారతీదేవినొందిరి. ప్రపంచమందలి స్వాతంత్ర్య వుద్యమాల బలపరచుటలో నాల్గు దశాబ్దాల తరబడి మాతో సహకరిస్తూవుండిన డైనాస్టాకుగారిని ఆక్సుఫర్డ్‌లో ప్రథమంగా 1926లో కలిసిరి. నిడుబ్రోలుకు రప్పించుకొనిరి. ఢిల్లీలో పలుమారులు అతిధులుగా ఆహ్వానించుకొనిరి. అటులే వెనుకబడిన తరగతులు, హరిజనులు - వ్యవసాయకూలీలు రైతులు, తదితర శ్రామికులు 1971 ఎన్నికలో ధైర్యంచేసి తెంపుగా, పట్టుదలగా, "బీదతనం పోగొట్టుటె" ప్రప్రథమ రాజకీయ, ఆర్థిక, జాతీయధ్యేయంగా వుండాలని తీర్మానించితే అబ్బ అర్ధశతాబ్దినుండి మనం యేదారిలో, యే ఆశయాలతో ఆశలతో, శ్రమిస్తూ వున్నామో, ఆ ధోరణిలో శ్రమజీవులరాచకీయ పెత్తనం కావాలనుకోగల్గినారనే తృప్తి, ఆనందం, బొంది

తిమి. అట్టి ఆశయ ఆశల ధోరణి తమజీవితపు నడకగా నిల్పుకొనిరి. జీవించిరి. కనుకనే మా ఉభయుల జీవిత లక్ష్యముల నిరూపించగల్గునవి యీ రికార్డులని వారు నమ్మిరి. అందుకే వీటిని భద్రపరచిరి. ఆశ్చర్యమేమంటే తాను ఎప్పుడెప్పుడు వీటిని చదివి, చేర్చి, కూర్చిరో, తానువాటితో చేర్చిన నోట్సులో వ్రాసి, సంతకంచేసి వుంచిరి కొన్ని దస్తాలలోవున్న వుత్తరాలగురించి, "దేశీయ రాజకీయాలలో అతి ముఖ్యమైనవి. అంతర్జాతీయ వ్యవహారాలలో ప్రముఖమైనవి. రంగాజీ విదేశ ప్రచారములలో పొందిన ప్రత్యేక అనుభవాల కాగితాలున్నవి." అంటూ వ్రాసి "వీటిని రంగాజీ జాగ్రత్తగా చూచుకోవా"లనికూడా వ్రాసిపెట్టిరి. వారింతగా పండితులకే అందగల్గు శ్రమ, శ్రద్ధ చూపెట్టిరే అని నేను తెలుసుకుంటున్నప్పుడు నేను పొందిన ఆనందం, ఆశ్చర్యము వర్ణింపతరమా? ఇంతటి శ్రద్ధవారిది. అంతటి విశ్వాసం వారికి నేచేయుచున్న సేవా వ్యవహారములందు. జీవిత పర్యంతం నాతో సాంగత్యం. సంసారంచేస్తూ, నేను కౌగిలించుకొన్న పీడిత ప్రజాసేవావ్రతాన్ని, మానవ లోకకళ్యాణ కాంక్షను, తానుకూడా అంత ప్రాణప్రదంగా చూచుకొన్నారు, కనుకనే ఈ రికార్డు లభద్రపరచిరి. ప్రకటించమనిరి. అదే తన తుదికోరికగా నా కందించిరి. ఆమెదే యీ గ్రంథము. ఆమె జీవిత ఆశయాలనే యీ గ్రంథము కొంతవరకు ప్రతిబింబించుచున్నది. అందుకే యీ గ్రంథాన్ని ఆమెకే అర్పణచేస్తున్నా, ఇదివరకు యెన్నో గ్రంథాలను భారతీదేవిజీకి అంకిత మొనర్చినా! ఐతే పండితులు, తత్వవేత్తలు, కవులు, దేవిజీకి అందిన సోదరులలో అత్యంత ప్రియపాత్రులగు డాక్టరు సత్యనారాయణ ప్రచురించిన "బాపూజీ ఆశీస్సులు" వారికెంతో ఆనందమిచ్చినది. ఇప్పుడు శ్రీ అమరయ్య, ఉమామహేష్ శివరామయ్య, సుబ్బారావు, ద్వయం, సాంబశివరావు, నాగేష్, రాజన్న, ప్రసాదులు అందించే యీ గ్రంథము వారికి గొప్ప తృప్తి కల్గించునని నా విశ్వాసము.



రెండు సంవత్సరములైనది దేవిజీ సర్వమయునిలోజేరి. ఆ సర్వాంతర్యామిలో పరమాణువై, కణమైయున్న భారతీదేవి ఆశించిన ప్రజాస్వామ్యపు, రైతుకూలీ కళాకారులు, బుద్ధిజీవుల స్వాతంత్ర్యం. సుఖం, శుభం కాంక్షించుచున్నారు. హృదయపూర్వకంగా మా దంపతుల ప్రజాసేవా వ్రతమును ఆమె నాతోవుంటూనే వున్నారనే విశ్వాసముతో సాగిస్తున్నా. ప్రపంచరైతాంగపు ఆశయాలు **(Credo of World Pesantry)** 500 పేజీలు ఆత్మకథ **(Fight for Freedom)** 620 పేజీలు దేవిజీ ప్రోత్సాహం, పట్టుదలవల్ల వ్రాసినవే! **Credo** కు శ్రీ ఉమామహేశ్వరరావు, విశ్వనాథం, రత్తయ్య సహకరించిరి. ఆత్మకథ రచనలో తానే మోడైరి. ఇవ్వేగాక వారికి బాగా నచ్చిన గ్రంథం రైతు–సహకార వ్యవసాయం **(Peasant Cooperative Farming)** రచనలో ప్రధానపాత్ర శ్రీ పరుచూరి పిచ్చేశ్వరరావుది. ఇందరు దేవిపై, నాపైగల ప్రేమాభిమానాలవల్లనే అంతగా శ్రమించిరి. ఈ గ్రంథాల రచనకు, ప్రచురణలో భారతీదేవిజీదే ప్రముఖపాత్ర! ఎన్నో పర్యాయములు అంటూ వుండేవారు; "అలాగా అన్నిసారులు యీ రాష్ట్రాలలోని వర్కరుల మధ్య బైలుదేరు వివాదాల తీర్పుటకై సంచారంచేస్తూ, శక్తి ధారబోసేబదులు ఈ లాంటి గ్రంథాలు రచిస్తే మంచిదిగదా"అని. ప్రచురించేవారుండవద్దా అని నేను అంటే, "ఎన్నిటికో నేను డబ్బు అందించడంలేదా? మీరు ఎన్నో అవసరాలు తీర్చుకోకనే ఉండడంలేదా? పుస్తకాల ప్రచురణకే అందులో సగాన్ని ధారబోద్దాము" అనేవారు. ఆలాంటి, అట్టి ఆ భారతీదేవిజీదే యీ పుస్తకం ఇదే నా నివేదనం ఈనాడు.

మాకు శిరోధార్యమైన, ప్రాణప్రదమైన "ప్రపంచ రైతుల్లారా-ఏకంకండి" అనే నినాదాన్ని ఈ 1974 కు నలభై దేశాల

కమ్యూనిష్టులైన రైతు ఉద్యమ నాయకులు అందుకున్నారు. విప్లవ రైతాంగం అనే గ్రంథాన్ని తెలుగులో అందించిన శ్రీ విజయరాజ కుమార్ కు అటులే "సహకార వ్యవసాయం"ను తెలుగులో అందించిన శ్రీ సాంబశివరావు, రామకోటయ్యకు పద్య గుచ్ఛము నందించిన కళా ప్రపూర్ణులు, సోదరులకు మేమెంతో కృతజ్ఞులము.

ఈ వ్రతానుష్టానములో, సహకరిస్తున్న సోదర సోదరీమణు లందరికి యిద్దరితరఫున వందనము లర్పిస్తున్నా!

మరో రెండు పుస్తకాలు—యీమారు తెలుగులో - తయారైనవి. దేవిజీ దివ్యస్మృతులు, వీరమాత ప్రబోధాలు!! ఈ ప్రయత్నము దైవసంకల్పము! ఆ రచనలు సాగిస్తూవుండడ మొక తపస్సయినది! ఢిల్లీలో వుంటూ వారిని తలుచుకొంటూ లేఖలు వ్రాయునప్పటికంటె, హెచ్చు తృప్తిగా అత్యంత సన్నిహితంగా ఆమె నా పర్యంకమందేయున్నట్లుగా, వారితో సల్లాపములాడుచూ వుండ గల్గితిని. ఇదియొక దివ్య అనుభూతి. ఇందుకు ఆమెకే కృతజ్ఞుడను. మమ్మిద్దర్ని ప్రేమించు మిత్రులు, రైతు గోరెపాటి ద్వయమునకు అత్యంత కృతజ్ఞులము.

---



# భారతీదేవి రంగా

డాక్టరు చిట్టూరు సత్యనారాయణ, M S మద్రాసు

## స్వాతంత్ర్య సమరయోధులు

భారత భారతీ, సంస్కృతీ భారతి
భారతీదేవి రంగా,
రంగా పూలతోట అయితే
దానిలోని "ఎర్రగులాబి" భారతి!
రంగా పద్మమైతే
దానిలోని కేసరం భారతి!
రంగా రైతుఉద్యమ సముద్రంలో
రత్నాద్వీపం భారతి!
ఆ ఉద్యమాలకీ త్యాగాలకీ
రంగా జీవమైతే
వాని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు భారతి!
ఆమె అతని జీవం
జీవనాళంలోని "జవం"
రంగా భారతీ సూర్యచంద్రులు
భారత స్వాతంత్ర్య సమరమనే
సముద్రం మథించినపుడు
ఎక్కడోచిందిన అమృతబిందువుల గ్రోలి
అమరులైరి
రాహుకేతువులు ఎన్ని కాట్లు వేసినా
వారికాంతి తరుగదు
నీతి నిజాయితీ ఆదర్శయుతం
వారి "సహ జీవనం" అద్భుతం!
కాలమనే ప్రవాహంలో
ఎన్నో కథలు కలిసిపోతాయి

కాని మీ కథ చాలా పొద్దది
మీ కథ చాలా సున్నితమైనది
మరచిపోలేని మీ చరిత్రను
చిన్నగొంతుతో నిర్మలంగా పాడాలి
అది వీణాస్వనం
ఎంచేతనంటే-
అందులో అహంభావంలేదు
"వినయమే ఉట్టిపడుతూంటుంది,
అతిధి అభ్యాగతులకు
ఆతిధ్యమిచ్చే దీదేశం
నూరుమంది రంగా శిష్యులు
అర్ధరాత్రి వచ్చినా
అన్నపూర్ణలా పంచభక్ష్యాలు
పంచి, తినిపించేది భారతి!
స్వాతంత్ర్యోద్యమానికి
జీవశక్తినంతా అర్పించింది
ధనం, బలం-యింకా శరీరారోగ్యం-
జయిళ్ళల్లో క్రుమ్గి!
ఆమె అడగలేదు నాకిదికావాలని
"మంత్రి పదవి నాకెందుకు?
గౌరవించవలసినవారిని గౌరవించండి"
అన్నది—ఆ తల్లి, త్యాగవల్లి!
ఆమె నిర్మలమైన సత్యాగ్రహం
అచంచలమైన అహింసాదీక్ష
ఎవరినైనా ముగ్ధుల్ని చేస్తాయి.
బాబూజీ అన్నారు
"ఓయీ రంగా! ఈ భారతి
యిక నా కూతురు" అని!
ఆయనకెంత నచ్చింది



ఆమెలోని నిర్మలత్వం!
భారతీ!
ఏ'యిజాలతో'నూ నీకు సంబంధంలేదు
అన్ని "నిజాల"లోనూ నీకు చోటుంది.
అందం అంటే ప్రాణం
కవితంటే నీకిష్టం
బొమ్మ అంటే నీకు ప్రేమ
కళకు మారుపేరు నీవు.
దేశాన్ని స్వర్గమయం చేయాలని
ఎంతో తపించావు?
ఎంతో కష్టించావు?
గోవుల్ని పెంచావు.
గోపాలకుల్ని పోషించావు.
గోభూమిని ప్రేమించావు
నీవు మహిళాలోకానికి మకుటానివి!
కిరీటంలోని శిరోమణివి!
నీవు నిత్య సర్వలక్ష్మి
మంగళమూర్తివి!
నీ ఆదర్శాలకు జై!

—

కవిరాజు, కళాప్రపూర్ణ

కొండవీటి వెంకటకవి

జగముద్ధరింపగా మగడు సాగినవేళనే ధైర్యమిచ్చిన యశోధరవు నీవ
నిజదేశ దాస్యబంధముల త్రెంపెడివేళ ప్రగ్గని రాణిరుద్రమవు నీవ
బరిమీద మాతాడు పగలు మార్కొనువేళ
జంకుగొంకెరుగని ఝూన్సి వీవ

పతి పదాబ్జములె సద్గతికూర్చు నను వేళ భవ్యయౌ కస్తూరిబాయి వీవ
భారతీదేవి! నీవ మాభారతాంబ వనుచుబుధులెల్ల నీగొప్పతనముపొగడ
వెలుకబాఱెను నేడు మాతెలుగునాడు

వందన శతమ్ము గొమ్ము దీవనల నిమ్ము,

ఆచార్యరంగ నీయాంతర్యము నెఱింగి మసలు కొన్నాడమ్మ నిసువుకీతి
మాతృభావముచూపి మరియాదలందించి

యుత్సాహమందె నీ యువతరమ్ము

ఈవె భారతివి వేఱేవారులేరంచు పొగడికల్ పచరించె బుధగణమ్ము
నిఱుపేద జనులకై చెఱసాలలో మ్రగ్గి నిలచితీవని మెచ్చె నిఖిలజగము
పుట్టినింటను మెట్టినయట్టి యింట నవధులే లేని సత్కీర్తి నందితీవు
వినిపించితివి వేనవేలసత్సభలలోగాంధీసుహోదయ గాథలెల్ల
పలికించితివి మూగవడ్డ గొంతులువిప్పి కోటిపికాలు గోట మీటినట్లు
తిలకించితివి దేశ దేశాలలో గల వెలలేని తులలేని లలితకళల
మఱిగిపోతివి జాతిమత భేదములతోడ తడబాటుచెందు సోదరులగాంచి
పట్టనిలువున నీఱయి నిలువనీడ కట్టగుడ్డయు లేని సంఘముల నరసి
యెంత ఘూర్ణిల్లినదో నీ హృదంతరమ్ము

దయను గైకొమ్ము మా యశ్రుతర్పణమ్ము.

పండుముత్తైదువుగ భర్తపదములగడ నసువులర్పించిధన్యాత్మవైతివమ్మ!

అభినవ తిక్కన, కళాప్రపూర్ణ

**తుమ్మల సీతారామమూర్తి**

భారతీదేవి యన వీరపత్నీ యనఁగ వీరనారీమతల్లి నాఁ బేరుగన్న
వెలఁదిగద, తెల్గుజాతి గర్వింపఁదగిన మగువకద,

యీమె నెప్పాట మఱవఁగలము.

ఒక్క త్యాగముచే ముక్తిచిక్కుఁగాని జన్మములచేతసిరిచేత సంతుచేతఁ
జిక్కదని పెద్దవిశ్వసించిన వివేక ధన్య భారతి రంగాకుఁ దగిన పొలఁతి

**పండిత గొఱ్ఱెపాటి వెంకటసుబ్బయ్య**

స్త్రీపురుష సాయుజ్యములోనే, పూర్ణజీవనసంస్కృతి వున్నది. శివుడు కేవలం పురుషుడుగాడు. అర్ధనారీశ్వరుడు, లోక సంగ్రహార్థం పురుషునిపౌరుషం, స్త్రీ ఔదార్యముల కలయికయే అర్ధనారీశ్వరత్వం.

ఆచార్య రంగా, భారతీదేవి యిరువురు దేశసేవ చేసినవారే. వారొనర్చిన సేవలనుగూర్చి గాక ముఖ్యంగా వారి పవిత్ర దాంపత్యాన్ని గూర్చియే సంస్మరిద్దాము.

ఆ దంపతుల పరస్పర ప్రేమకంటే, ఒండొరులపై వారి సంస్కృతీ ప్రభావం అధికం.

దేవి ఆయన సృష్టి, ఆచార్యుడు ఆమె పోషితుడు. ఆయన అధికంగా భావాంబర విశ్రుతవిహారి వాటనాచరణలో పెట్టుట కామె తన సహజ వివేకము తో సలహాలనిస్తూ ఉండేది. ఒకప్పుడు రాజాజీ ఇలా అన్నాడు "రంగాగారు యిండను. భారతీదేవి గార్డుగా పనిచేస్తుంది."

ఆమె ఎచ్చట ఏ కరువుకాటకాలు వచ్చినా, కన్నతల్లివలె పరితపించేది. ఆమె మందసా కిసాన్ బాధితులకు, గోదావరి వరదబాధితులకు, రాయలసీమ కాటక నివారణకు శక్తివంచనలేని కృషిగావించింది. రైతాంగ విద్యాలయంలోని యువకులను ఈ ఆచార్యుడేమాత్రం కసరినా, ఆమె అవ్యాజవాత్సల్యంతో కోపాన్నిచల్లార్చేది. రైతాంగ విద్యార్థులంతా ఆమెను మాతృమూర్తిగా ఆరాధించేవారు.

ఆమె కార్యకలాపాలూ, సమిష్టి నిర్వహణ చాతుర్యమూ, అందరికి సలహాలిస్తూ అందరికంటే అధికంగా రాణించే నిర్వహణశక్తి, ధీశక్తి ఆమెకు సహజ సిద్ధములు. సేవ, త్యాగం, ధైర్యము, సత్సాంప్రదాయము, దీక్షా, దక్షత తెలుగు నేలయందంతటా సుపరిచితములు. గృహిణిగాచూపు నేర్పు, అంతకంటె అధికంగా, అతిథి అభ్యాగతుల యెడ ఆమెచూపు ప్రేమ గౌరవములు అందరికి విదితమే.

ఆమెనుండి నేర్వవలసిన విషయములెన్నో మరి! ఆచార్యునితో అన్నిటా సహకరించి ఐక్యత నొందుటలోనే ఆమె ఉదాత్త లక్షణం గోచరిస్తుంది. రంగాగారి నామెభర్తగా మాత్రమేగాక, ఆచార్యునిగా నాయకునిగా, ఆయన ఉన్నతియే తన వున్నతిగా భావించి సేవించింది.

రంగాగారునూ అల్లే త్రికరణశుద్ధిగా ఆమెను ప్రేమించి హిందూ ఆదర్శ దాంపత్య జీవితమునకు ఒక ప్రతీకగా నిల్చారు.

దేవి సంగతులను యిష్టాగోష్ఠులలోనేగాక, బహిరంగ సభల లోను, సందర్భానుసారంగా, ముచ్చటిస్తూ ఉంటారు రంగాగారు.

బహుకాలం క్రిందట గొట్టిపాటి బ్రహ్మయ్య, రంగాగార్లు కలసి మద్రాసు వెళ్ళారు. అప్పట్లో అచ్చట మనుష్యులు లాగుడురిక్షాలు లాగేవారు. రిక్షాను పిలుతునా? అని బ్రహ్మయ్యగారన్నప్పుడు రంగా గారు అది భారతీదేవికి అయిష్టం నేను దానిపై కూర్చోను అని సమాధాన మిచ్చారు.

ఆయన జీవితచరిత్ర వ్రాసి దానిని భారతీదేవికి అంకితమిచ్చాను. అందుకు శ్రీ రంగాగారిలా వ్రాశారునాకు "దేవిజీకి తన్ను ఇంతగా పొగడుట యిష్టముకాదు. అందువల్లనే వారికి ఇంతటి గ్రంథము అంకితమిచ్చినందున కొంతబాధ కల్గినదని నాకు చెప్పిరి. నాకేమో చాల తృప్తియని చెప్పితి. ఆమె హృదయము గంభీరము నవనీతము."

మానవుడు ఏమి చేశాడనిగాక ఏమిగా మారినాడని గ్రహించి గౌరవించాలి. అన్ని విషయాల్లోను సహకరించే అర్ధాంగి భారతీదేవి కావటం ఆచార్యుని అదృష్టం. ఆచార్యునివంటి భర్తను పొందటం దేవి సుకృతం. వారిద్దరూ, గ్రామీణుల భాగ్యమే తమ భాగ్యముగా భావించి పనిచేయటం మన భాగ్యం. గార్హస్థ్య జీవన పరిమితులను మించి సేవారంగములో అంకితమైన పవిత్ర దాంపత్యముల సంస్మరణలు కొన్ని ఈ సందర్భములో చేయవలసి యున్నది. శ్రీ వీరేశలింగం, రాజ్యలక్ష్మమ్మగార్లు, శ్రీ వున్నవ దంపతులు శ్రీ కోటిరెడ్డి దంపతులు, శ్రీ దర్శి చెంచయ్య దంపతుల దాంపత్యములు ఆదర్శములూ, వందనీయములూ.

"మీరు నిరంతర సంచారులు, నా మరణవార్తను వినడమేగాని అవసానకాలమందు మీరు ఉండరేమో" అంటూవుండేది భారతీదేవి. అలా జరగకుండా, ఆమె ఆచార్యుని సన్నిధిని అస్తమించడం, ఒక విధంగా అదృష్టమే.





# దేవిజీ జీవితంలోని ముఖ్యఘట్టాలు

| | |
|---|---|
| జననం | 1908 |
| శారదానికేతన్‌లో విద్యాభ్యాసం | 1923 |
| రంగాజీతో పరిణయం | 1924 |
| విద్యోదయ పబ్లిక్ స్కూలు [మద్రాసు]లో విద్యాభ్యాసం | 1925 |
| ఆక్స్‌ఫర్డ్ [ఇంగ్లండ్] విశ్వవిద్యాలయానికి చెందిన రస్కిన్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో విద్యాభ్యాసం | 1925–1926 |
| వేదాంత జిజ్ఞాసతో "జీవిత విధానంపై హిందూ దృక్పథం" అనే అంశంపై డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ ఉపన్యాసాలందు శ్రద్ధ | 1926 |
| సత్యాగ్రహోద్యమ ప్రవేశం | 1930 |
| అస్పృశ్యతా నివారణ ప్రచారానికై భజన సమాజ స్థాపన | 1931 |
| కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరి జిల్లాల్లో సహాయ నిరాకరణోద్యమ నిర్వహణం | 1931–1932 |
| మహిళాసత్యాగ్రహ నిర్వహణ, ఒక సం॥రం జైలు రు. 500 జరిమానా | 1932 |
| కారాగారవాసం | 1932–1933 |
| భూమిశిస్తు పునర్వ్యవస్థీకరణ వ్యతిరేకోద్యమం | 1933–1935 |
| మహాత్ముడు విడుదలై రాక | 1934 |
| కేంద్ర శాసనసభ ఎన్నికల్లో పాల్గొనుట: ప్రచారం | 1934 |
| అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యురాలుగా భారత్ కిసాన్ సమ్మేళన్ సభ్యురాలుగా ఎన్నిక | 1935 |
| జిల్లాబోర్డు సభ్యురాలుగా ఏకగ్రీవంగా ఎన్నిక: ఆంధ్రమహిళా రాజకీయ సంస్థ వార్షికోత్సవ ప్రారంభోపన్యాసం | 1936 |
| రంగాజీతోపాటు వివిధ రాష్ట్రాల పర్యటన | 1936,37,38,39 |

ఆంధ్రకిసాన్ కాంగ్రెస్" ఉపాధ్యక్షురాలుగా ఎన్నిక, ఆలిండియా
కిసాన్ కాంగ్రెస్; ఉపకార్యదర్శి ఆంధ్రకిసాన్ కాంగ్రెస్
అధ్యక్షపదవి, సెప్టెంబరు 1940
అఖిలభారత కిసాన్ కాంగ్రెసు అధ్యక్ష పదవికి ఎన్నిక, నవంబరు 940
గోదావరి వరద బాధితుల సహాయార్థం. మందసా కిసాన్
బాధితుల పోషణార్థం విశేషమైన కృషి — 1940–1941
రాయలసీమ క్షామబాధితుల సహాయార్థం అపూర్వమైన కృషి 1941–1942
రైతాంగ విద్యాలయ నిర్వహణ ఇడుపులపాడు 1940
చెన్నూరు 1941
స్త్రీల తరపున రైతాంగ విద్యాలయ నిర్వహణ 1945
రాయలసీమ క్షామ పరిస్థితుల పరిశీలనకై పర్యటన 1952
పొదుపుఉద్యమ ప్రచారము కాశ్మీరు పర్యటన 1953
ఘంటసాలలో ఆంధ్రరాష్ట్ర మహిళాసంఘసమావేశ ప్రారంభోపన్యాసం 1954
భారతకిసాన్ సమ్మేళన్‌కు మరల అధ్యక్షురాలిగా ఎన్నిక 1954
నాగార్జునుని కొండవద్ద వస్తుప్రదర్శన శాలకు సలహాలు 1956
రంగాజితో పాటు దక్షిణాపథ పర్యటన 1958

... ... మరికొన్ని

గోదావరి వరద బాధితుల రక్షణ సంఘాధ్యక్షురాలుగా పనిచేశారు. 1941
చేబ్రోలులో ఆంధ్ర మహిళల రాజకీయ పాఠశాలలలో ఉపన్యసించారు 1944
పలనాడు తాలూకా రైతుల మహాసభను ప్రారంభించారు. 1947
చిత్తూరుజిల్లాలో జరిగిన రైతాంగ విద్యాలయంలో ఉపన్యాసాలిచ్చారు. 1947
కృష్ణాజిల్లా చల్లపల్లిలో జరిగిన ఆంధ్ర రైతాంగ విద్యాలయంలో
ఉపన్యసించారు. 1951
రాయలసీమలో బ్రహ్మాండమైన క్షామమేర్పడి నప్పుడు రాయలసీమ
జిల్లాలన్నీ తిరిగారు. పలనాటి సీమలో పర్యటించారు. సర్కారు
జిల్లాలలో పర్యటించి వేలాది బస్తాల ధాన్యాన్ని, బట్టలను,
ధనాన్ని రాయలసీమకు పంపారు. 1952



అఖిలభారత భారత స్త్రీల పొదుపు సంఘ సభ్యులైరి. (మితవ్యయము,
చిన్ని చిన్ని పొదుపులద్వారా స్త్రీల ఆర్థిక స్వయం సహాయతను
పెంచుటకై) 1953–55
శాసనమండలికి ఎన్నికైరి. 1958
రాష్ట్ర "క్యాబినెట్టు"లో చేరమని రాష్ట్ర నాయకులు, కేంద్రంనుండి
ఆహ్వానములు వస్తున్నా అంగీకరించరైరి.
తిరుత్తనిలో జరిగిన ఆంధ్ర రైతాంగ విద్యాలయంలో ఉపన్యసించారు. 1954
రాష్ట్ర ప్లానింగు కమిటీ సభ్యులుగా ఎన్నికైరి. 1958
కాంగ్రెసువారి, రైతాంగ వ్యతిరేక సహకార వ్యవసాయ పథకంపై
నిరసనగా కాంగ్రెసునుండి రాజీనామా చేసిరి. 1959
రైతాంగ రక్షణోద్యమమందు సంచారము-17 వ సవరణ బిల్లును
వ్యతిరేకించిరి. చిలకలూరిపేట, కంకటపాలెం రైతాంగ విద్యా
లయములలో పాల్గొనిరి. 1960-65
రాజాజీ హైదరాబాదు వచ్చినప్పుడు స్త్రీలసభకు అధ్యక్షులు 1960
చిత్తూరులో పార్లమెంటు పై ఎలక్షన్‌లో తీవ్రంగా ప్రచారము చేసి
రంగాజీ విజయానికి తోడ్పడిరి. 1962
రైతాంగముపై అదనపు భూమిశిస్తు భారం వేస్తున్న బిల్లుపై
రైతు రక్షణయాత్ర హైదరాబాదుకు నాయకత్వము వహించిరి. 1962
శాసనమండలిలో, 17 వ సవరణను ఎదిరిస్తూ చరిత్రాత్మమగు
మహోపన్యాసము చేసిరి. 1965
ఋషీకేశ్‌లో ఆంధ్ర ఆశ్రమము, ఆగ్రా, హరిద్వారము, ఫతేపూర్
సిక్రీ, ఉత్తర హిందూస్థాన ప్రదేశాలను చివరిసారి సందర్శించారు. 1966
శాసనమండలిలో బడ్జెటులో రైతులు: కూలీలపై వేయబడుచున్న శిస్తు
బాధల నెదురిస్తూ గణనీయమగు వుపన్యాసాలు చేసిరి. వ్యవసాయ
కూలీల రక్షణకై కనీసపు కూలీ, జీతాలు కావాలని, వుద్యోగావకాశాలు
పెంచాలని పదే పదే ఘోషించారు. 1958_68

నవంబరులో చిత్తూరులో రంగాజీ జన్మదినోత్సవంలో పాల్గొన్నారు 1963

డాక్టర్ మూల్పూరి రంగయ్య, చుక్కమ్మగార్ల సంస్మరణలో పాల్గొనిరి 1969

అప్పికట్లలో, మహిళా సాంస్కృతిక సభలను ప్రారంభించిరి. 1965

శ్రీకాకుళంలో, పార్లమెంటరీ బై ఎలక్షనులో రంగాజీ విజయముకై
బహుళ ప్రచారం చేసిరి 1967

అలసవిల్లి సూర్యదేవాలయం శ్రీకాకుళం, వరంగలు, వరంగల్లుకోట
శ్రీముఖ్య రామప్పదేవాలయం, పుట్టపర్తి, ఋషికేశ్‌లో శివానందయోగి
ముమ్మిడివరం బాలయోగి సందర్శన 1969–71

నిడుబ్రోలులోని శ్రీ బుచ్చినాయుడు కాలేజీ కమిటీ సభ్యులు, 1956–71

విజయవాడలోని "గాంధీకొండ" సంస్థల శాశ్వత సభ్యురాలు. 1970

"కస్తూరిబా" స్మారక సంఘ సభ్యురాలు. 1969–71

గురజాలలో గిరిజన, హరిజన విద్యార్థుల సభను ప్రారంభించిరి. 1970

కావూరులో వినయాశ్రమ రజతోత్సవములను ప్రారంభించిరి. 1970

ఆద్య ప్రజాసేవకులు శ్రీ కావూరి వెంకయ్య, కొండా పార్వతి,
కాలేజి సంస్థాపకులు బుచ్చినాయుడు, గొర్రెపాటి వెంకట సుబ్బయ్య
మూల్పూరు చుక్కమ్మ, యాడ్లపగంటి వెంకటరత్నమాంబలకు
జరుపబడిన సన్మానసభలలో ప్రముఖపాత్ర వహించిరి. 1956

అబ్దుల్ గఫూర్‌ఖాన్ గారిని విజయవాడలో కలుసుకొన్నారు. 1970

ఆగష్టు 15 గుంటూరులో స్వతంత్రయోధుల సన్మానసభలో పాల్గొనిరి. 1972

నిడుబ్రోలు రామినీడు విద్యాలయంలో గోపదేవ్‌గారు నిర్వహించిన
గోష్ఠిలో పాల్గొన్నారు. 1971

కూచిపూడిలో జరిగిన మహిళాసంఘ వార్షికోత్సవంలో పాల్గొన్నారు. 1972

ఒంగోలు పార్లమెంటు నియోజక వర్గంలో అభ్యర్థిగా ప్రచారం 1971

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ ట్రస్టు ధర్మకర్తగా ఎన్నిక 1972

సెప్టెంబరు 17వ తేదీన వినయాశ్రమం శ్రీ సాధు బసవయ్యగారి
సంస్మరణ సభలో ఉపన్యసించారు. అదే అంత్యోపన్యాసంగా
పరిణమించింది. 1972